శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

## తొమ్మిదవ ప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మచే రచియింపఁబడినది.





చెన్నపురి:

'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1928

# ధన్యవాదము.

—^—

మహాశయులారా!

శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బ్రొమ్మిదవ ప్రకరణమును బాఠకుల కందీయఁగల్గితిని. ఇఁక రెండు ప్రకరణములతోఁ గృష్ణావతారతత్త్వమును బూర్తిచేయఁ దలంచినాఁడను. ఇప్పటికే ద్రవ్యవిషయము దుర్భరముగా నున్నది. ఐన నెట్లో శ్రీకృష్ణపరమాత్మయనుగ్రహమున నేవిధముననో సాగించుచున్నాఁడను. ఇంతదనుకనైన నిర్విఘ్నముగా సాగుటకు మ. రా. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి కరుణయే కారణము. కొందఱు భక్తులు భగవత్కార్యమును గొనసాగింప నడుముకట్టుకొని సాయపడుచునే యున్నవారు. వారి పవిత్రనామధేయములు వెల్లడించుటకుఁ దగినతా విది కాదు. ముందుముందు నాకృతజ్ఞతను జూపుకొందును. ఈతొమ్మిదవప్రకరణమున శ్రీకృష్ణమూర్తి తనపరమేశ్వరత్వమును బహువిధముల వెల్లడించును. ఇందు యశోదకు నందునకు జ్ఞానోపదేశము చేయుట, దుర్వాసుఁడు శ్రీకృష్ణమహిమమును బార్వతిమూలమున నెఱుంగుట, నరకాసురవధము, సత్యభామను బహుప్రకారముల ననునయించుట, నారదశ్రీకృష్ణసంవాదము, శ్రీహరి శంకరు నారాధించి వరములం బొందుట, పారిజాతాపహరణము, భానుమతీరక్షణము సాగర

విహారము, రుక్మిణీశ్రీకృష్ణులసరసాలాపములు, రాజసూయపరీక్ష ణము ; శిశుపాలదంతవక్త్రులవిముక్తి లోనగుకథలు ముఖ్యములు. రుక్మిణీశ్రీకృష్ణసరసాలాపములఘట్టమున నావ్రాసినభావము చక్కఁగాఁ బరిశీలింపఁదగిది.

శ్రీకృష్ణమూర్తి పారిజాతాపహరణసమయమున శంకరు నారాధించి వినుతించినట్లు హరివంశమునఁ గలదు. ఎన్నితావులనో పురాణములయం దిట్టిఘట్టములు కలవు. శంకరు నారాధించినంతమాత్రమున శ్రీకృష్ణమూర్తి శంకరునికంటె నల్పుఁడని భావించుట యజ్ఞానము. శ్రీహరిని శంకరుఁ డర్చించినట్లు గలతావులంగాంచి హరికంటె హరుఁ డల్పుఁడని తలంచుటయు సరసము కాదు. ఈయిర్వురలో నొక్కరినే నమ్మవలయును. తన్మయమే బ్రహ్మాండజాలమని తలంపవలయును. కాని యితరదైవముల దూషింపరాదు. తనవలెనే శంకరాదుల నారాధించువారు కలరని తలంచినచో నట్టిభావము కలుగదని నాయాశయము. జయవిజయులకుఁగలశాప మీప్రకరణమునఁ దొలఁగినది. వారు మరల భగవత్కరుణైకపాత్రులై భగవద్దాస్యమున మెలఁగిరనుటయే శుభవార్త. ఆయాయితావుల నావ్రాయునభిప్రాయములు సర్వమతసమ్మతములే యైనను స్వల్పవిషయముల నితరమతములకుఁ బ్రతికూలముగాఁ దోఁపవచ్చును. కాని సమష్టిదృష్టి నాలోకించిన నట్టిభావము తొలఁగును. భక్తి యందఱకు నుండఁదగినదియే. గమ్యస్థాన మెల్లరకు నొక్కటియే. కాని

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించుపుణ్యపురుషులు.

---

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, వి. పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్.
,, కొమూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ, బి. ఎల్.
,, బి. పి. దేవరాజులునాయుండుగారు, బి. ఏ., బి. ఎల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, కస్తూరి సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వెంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వెంకటేశముశ్రేష్ఠిగారు.
,, మల్లిముక్కొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, బి. శేషగిరిరావుగారు.

మ. రా. శ్రీ. శ్రీకంఠము నరసింహారావుగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయడుగారు.
,, శాత్రపాటి చలపతిరావుగారు.
,, బొందలకుంట వేంకటనారాయణరావుగారు.
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పప్పు సీతారామయ్యగారు, ఎమ్. ఏ.
,, మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు.
,, సగరం గురురావుగారు, బీ. ఏ.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు.
,, గజరాంపల్లి రామచంద్రరావుగారు.
,, సూర్యవంశము వేంకటసుబ్బరావుగారు.
,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారిపల్లె.
,, మాకము జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట.
,, మద్దిరాల చెంచయ్యశ్రేష్ఠిగారు, నందిమండలము.
,, యన్. రంగారెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్, డిస్ట్రిక్టుబోర్డు, ప్రెసిడెంటు.

క మ లా పు ర ము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.
,, రాణువ ఫణిరావుగారు.
,, హానుమగుత్తి చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిఫ్, హానుమగుత్తి.

## వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశెట్టిగారు.
,, తంగటూరు చెన్నయ్యశెట్టిగారు. [శెట్టిగారు.
,, పంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుడు సుబ్బయ్య
,, పోతేపల్లి వెంగన్నశెట్టిగారు, ఆరణిపోతేపల్లి సుబ్బయ్య
శెట్టిగారు.

## ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లమునూరయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, ఏ. శ్రీనివాసులునాయుడుగారు.
,, శంకరరామాగి సుబ్బరావుగారు, నిడుజువ్వి.

## పులివెందుల.

మ. రా. శ్రీ. మద్దాల బోగాదిశెట్టిగారు, వేములకొత్తపల్లి. [పల్లి
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుడు సుబ్బయ్యశెట్టిగారు, వేం
,, పుల్లగూర వేంకటశేషయ్యశెట్టిగారు, వేంపల్లి.
,, కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు.
,, లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయ గారి కొత్తపల్లి.
,, వడ్లగుంట అశ్వత్థయ్యగారు, వేంపల్లి.
,, వద్దిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల. [గారు, చాగలేరు.
,, ఘంటసాల చిన్నసుబ్బయ్యకుమారుడు వేంకటసుబ్బయ్య
,, స్వామిధర్మారెడ్డిగారు, పాపాయపల్లె, బిమ్ములమడుగు తాలూకా.

## ప్రొద్దుటూరు.

మ. రా. శ్రీ. కొప్పరపు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, వంగిపురము శ్రీనివాసాచార్యులుగారు, ప్లీడరు.
,, నారాయణము రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజరు.
,, ఉప్పలూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు.
,, ఆర్. గోవిందరావుగారు బి. ఏ., తహసీల్దారు.
,, సి. యస్. కృష్ణమాచార్యులుగారు, బి. ఏ., బి, ఎల్.

## రాజంపేట.

మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, యమ్. యల్. సి. నెందలూరు.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
,, పిడతల చిన్న వేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, తంగుటూరు.
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె.
,, ఏచూరు. చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
,, పుట్టా నాగసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చిట్టివేలు.
,, గాలా వేంకటరెడ్డిగారు, పాటూరుగ్రామమునసిఫు.

## సిద్ధవటము.

మ. రా. శ్రీ. చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి గ్రామమునసిఫ్.
,, గోపవరము గోపాలరెడ్డిగారు, గోపవరము. గ్రామమునిసిఫ్.
,, యూబాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లి.

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠ రావుపేట.

,, రేవులూరు సిద్ధయ్యశ్రేష్ఠిగారు, కస్తూరివారిపల్లె.

,, చిన్నబయ్యన్నగారిలక్ష్మన్నగారు, ఎల్లదొడ్డిపల్లె.

,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.

,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివీడు.

,, పుల్లగూర బాలసుబ్బరాయప్పకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురము మండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. కరణము కృష్ణరావుగారు, చేదనపల్లి.

,, శ్రీరాముచెమ్మయ్యశ్రేష్ఠిగారు. ,,

,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు, నక్కలపల్లి.

,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె.

,, ఈడిగి అంజనప్పగారు, చేవినపల్లి.

,, బి. నారాయణరావుగారు, బ్యాడిగెర, మడకశిరతాలూకా.

,, దొంతి భీమయ్యగారు, హిందూపురము.

,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు.

,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.

,, సేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు.

,, గోరంట్ల వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.

,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.

,, పాచ్చిశెట్టి ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు.

## అనంతపురము.

మ. రా. శ్రీ. వెలమహూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు.
,, హట్టి శివరావుగారు, ప్లీడరు.
,, ఫులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.
,, జి. భద్రయ్యశ్రేష్ఠిగారు.
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు.
,, బి. వేంకటప్పగారు.
,, ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిఫ్.
,, వి. ఓబుళేశప్పగారు.
,, కొమారుపల్లె వేంకటరావుగారు, అనుంపల్లె.
,, రాచర్ల తిప్పయ్యగారు, బెళుగుప్ప.

## గుత్తి.

మ. రా. శ్రీ. యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్.
,, వై. శేషప్పగారు, ప్లీడరు.
,, వై. కొండలరావుగారు.
,, సి. సుందరరామయ్యగారు, మునిసిపుకోర్టు.
,, ఆర్కాటు గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, కోవూరు వేంకటరావుగారు, పెన్షనర్.
,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ. ప్లీడరు.
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల.
,, జంబులపాడు పెద్దవేంకటప్పగారు. ధర్మపురి.
,, కాన్గోవి, కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు. (ఇప్పటినివాసము. అవుకు.)
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

మ. రా. శ్రీ. శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దర్ జమీందారు గారు, ఏలూరు.
,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు.
,, గిరిగె మాణిక్యముగారు.
,, ఏ. యస్. స్వామిగారు.
,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణము, పెద్దపట్ట[ణము.
,, పెన్మెరెడ్డి రామరావుగారు, కైకవరము.

విశాఖపట్టణమండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటఅప్పారావుగారు జమీందారులు, బొంతలకోడూరు.

గంజాముమండలము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

నెల్లూరుమండలము.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణయ్యగారు, నెల్లూరు.
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు.
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహాస్వామిశ్రేష్ఠిగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.
,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, పెన్నబద్వేలు.
,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయుడుగారు, ఎనమదలగ్రామ మునిసిపు, తూర్పుకంభంపాడు.
,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, వేంకటగిరి.

చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యస్. నరసింహాచార్యులుగారు, బి. ఏ, బి. ఎల్.
,, కత్తా. జోగయ్యగారు.
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీధి.

# విషయసూచిక.

## అనంతపురము.

మ. రా. శ్రీ. వెలమకూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు.
,, హట్టి శివరావుగారు, ప్లీడరు.
,, ఫులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.
,, జి. భద్రయ్యశ్రేష్ఠిగారు.
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు.
,, బి. వేంకటప్పగారు.
,, ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిఫ్.
,, వి. ఓబుళేశప్పగారు.
,, కొమారుపల్లె వేంకటరావుగారు, అనుంపల్లె.
,, రాచర్లతిప్పయ్యగారు, బెళుగుప్ప.

## గుత్తి.

మ. రా. శ్రీ. యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్.
,, వై. శేషప్పగారు, ప్లీడరు.
,, వై. కొండలరావుగారు.
,, సి. సుందరరామయ్యగారు, మునిసిపుకోర్టు.
,, ఆర్కాటు గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, కోవూరు వేంకటరావుగారు, పెన్‌షనర్.
,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ. ప్లీడరు.
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల.
,, జింబులపాడు పెద్దవేంకటప్పగారు. ధర్మపురి.
,, కాన్గోటి, కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు.
(ఇప్పటినివాసము అవుకు.)
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.

## బళ్లారిమండలము.

మ. రా. శ్రీ. పట్టా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘ కార్యదర్శులు.
,, రావుసాహేబు, జే. పాపయ్యశ్రేష్ఠిగారు.
,, అయ్యగారిబుస్సెట్టిగారు.
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

## కందనూలు మండలము.

మ. రా. శ్రీ. ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు, నంద్యాల.
,, అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ.
,, గాడిచెర్ల వెంకోబరావుగారు, ఆవుకు.

## గుంటూరు మండలము.

మ. రా. శ్రీ. అన్నాప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., బి. ఇ. డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయర్ గారు.
,, మారుటూరు పుండరీకాక్షుడుగారు, పట్టిచెరుకూరు.
,, పూరే కోదండరామయ్యగారు, నరసారావుపేట.

## కృష్ణామండలము.

మ. రా. శ్రీ. నండూరు వీరభద్రరాయశర్మగారు, నూజివీడు.
,, గానుగపెంట నాగినారాయణరావుగారు, మాజేరు.
,, పోలవరపు శోభనాద్రిగారు, చోరగుడి. [వరము.
,, కందిమళ్ల సీతారామరావు బహద్దర్, జమీందారుగారు గన్న
,, చోరగుడి చిన్న వేంకటప్పయ్యగారు, గన్నవరము.
,, సుంకర వేంకటరత్నముగారు, నూజివీడు.
,, గానుగపాటి వేంకటరామయ్యగారు, నాగవరంపాడు.

## గోదావరిమండలము.

మ. రా. శ్రీ. పి. యం. శ్రీనివాసయ్యంగారు, బి. ఏ., యమ్. ఎల్. డిస్ట్రిక్టుమునిసిపు, కాకినాడ.
,, కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.

మ. రా. శ్రీ. శ్రీరాజామంత్రిప్రగడ భుజంగరావుబహద్దర్ జమీందారు గారు, ఏలూరు.
,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బావిరాజుగారు.
,, గిరిగె మాణిక్యముగారు.
,, ఏ. యస్. స్వామిగారు. [ణము.
,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణము, పెద్దపట్ట
,, పెన్మెరెడ్డి రామరావుగారు, కైకవరము.

విశాఖపట్టణమండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటఅప్పారావుగారు జమీందారులు, బొంతలకోడూరు.

గంజాముమండలము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

నెల్లూరుమండలము.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణయ్యగారు, నెల్లూరు.
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు.
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామిశ్రేష్ఠిగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కల్లూరు.
,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, పెన్నబద్వేలు.
,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయుడుగారు, ఎనమదలగ్రామ మునిసిపు, తూర్పుకంభంపాడు.
,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, వేంకటగిరి.

చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యన్. నరసింహాచార్యులుగారు, బి. ఏ, బి. ఎల్.
,, కల్లా. జోగయ్యగారు.
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీథి.

# విషయసూచిక.

శ్రీః.

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## తొ మ్మి ద వ ప్ర క ర ణ ము.

శ్లో. ఆలోలలోచనవిలోకితకేళిధారా
నీరాజితాగ్రసరణేః కరుణాంబురాశేః,
ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూరై
రాకర్ణయామి మణినూపురశింజితాని. ౩౯

కిమివ శృణుమః కస్య బ్రూమః కథం కృతమాశయా
కథయత కథం ధన్యా మన్యామహో హృదయేశయం,
మధురమధురస్మేరాకారే మనోనయనోత్సవే
కృపణకృపణా కృష్ణే తృష్ణా చిరం బత లంబతే. ౪౧

బహుళజలదచ్ఛాయాచోరం విలాసభరాలసం
మదశిఖిశిఖాలీలోత్తంసం మనోజ్ఞముఖాంబుజమ్,
కమపి కరుణాపాంగోదగ్రప్రసన్నజగజ్జడం
మధురిమపరీపాకోద్రేకం వయం మృగయామహే. ౪౨

లీలాననాంబుజమధీరముదీక్షమాణం
నర్మాణి వేణువివరేషు నివేశయంతమ్,

డోలాయమాననయనం నయనాభిరామం
దేవం కదా ను దయితం వ్యతిలోకయిష్యే. ౪౯

లగ్నం ముహూర్తమపి లంపటసంప్రదాయి
లేఖావిలేఖనరసజ్ఞమనోజ్ఞవేషమ్,
లజ్జామృదుస్మిత మధుస్నపితాధరాంశు
రాకేందులాలితముఖేందుముకుందబాల్యమ్. ౫౦

(శ్రీకృష్ణకర్ణామృతము ౧. ఆశ్వాసము.)

సత్యాన్వేషణతత్పరత్వమునను భక్తిభావమున నలంకృతులగు నోమహాశయులారా! శ్రీకృష్ణావతారతత్త్వమున నెనిమిదవప్రకరణమున శ్రీకృష్ణపరమాత్మ యొనరించిన యత్యద్భుతకార్యములను దెలుపుగాథలం బఠించితిరి. కృతకృత్యులరైతిరి ఆప్రకరణమున కద్భుతశక్తిప్రదర్శన మనుపేరు సార్థకమని మీకే తోఁచును. రామకృష్ణులు కరవీరాదినగరముల కరిగి జరాసంధాదులతోఁ బోరి వారిం బాఱఁదోలి మధురానగరమున కరుదెంచుటయు, నందు బలరాముఁడు యమునానది నాకర్షించుటయు, ద్వారకానగరము నిర్మించుటయు, నందుఁగల తీర్థరాజమహాత్మ్యములు మధురానివాసుల ద్వారకకుం జేర్చుట బలరామవివాహము నను గాథలు ప్రధానములు. రుక్మిణీకల్యాణము ప్రప్రధానము. ఆవివాహమహోత్సవమును గన్నులారఁ గాంచఁ బార్వతీప్రభృతిసాధ్వీమతల్లు లరుదెంచి యాశీర్వదించుట మిగుల శ్లాఘ్యము. అందలి రహస్యార్థము పరికింపఁదగినది. భీష్మకుఁడు రుక్మిణిని శ్రీకృష్ణునకుఁ గన్యాదానము చేయుఘట్టము సర్వదా స్మరింపఁదగినది. ఇందలి పురాణకథాభేదము. లేకాంత

ముగఁ గూరుచుండి, ధ్యానింపఁ దగినవి. అప్పుడే యందలివిశేషములు గోచరించును. రుక్మిణీకల్యాణఘట్టమున బహుభంగులఁ బురాణములు కల్పించినభావములు మంతవ్యములు. సామాన్యదృష్టికి గోచరింపఁజాలవు. బుద్ధిమంతులునిష్పక్షపాతముగఁ బరిశీలించిననే గోచరింపఁగలవు. ఒక్కదానికింకొక్కటి విభిన్నముగాఁ గనఁబడునుగాని తత్త్వము తెలిసికొనఁ బ్రయత్నించిన నెంతో సంతోషము కలుగును. ప్రద్యుమ్నచరిత్రమున ననేకరహస్యార్థములు గలవు. స్యమంతకోపాఖ్యానము నీతిసాగరమే యనక తప్పదు. దానింబఠించి తద్గతార్థమును గ్రహించి దాని నాచారమున నభ్యసింతురేని యట్టివారల కీలోకప్రవృత్తియే పురుషార్థచతుష్టయము నీఁజాలునని నానమ్మకము. ఈప్రకరణమును బఠించునపుడు భగవద్భక్తి సాయపడిననేగాని యందలి నీతులు మనోగతములు కానేరవు. పురాణభేదములమాత్రము తెల్పుచుఁ బరిహాసము చేయువారల కిహపరసుఖములు గలుగవనుటకన్న విశేషించి పెంచి వ్రాయఁబూనఁజాలను. "తుష్యతు దుర్జనః" అన్నన్యాయము కలదుకదా? రుక్మిణీదేవి తనవివాహప్రయత్నమును శ్రీహరి కెఱిఁగింప నొక బ్రాహ్మణోత్తమునిం బంపెనన్నభాగము గలభాగవతకథను, ఆభాగమే స్మరింపని యితరపురాణకథను జక్కఁగాఁ బరిశీలించినఁగాని మనస్సందేహములు తొలంగవు. త్వరపడి యాక్షేపింపరాదు. అది మహాపాతకము. కొందఱు తోఁచినట్లెల్ల నాక్షేపింతురుగాని తమరావిషయమున నెంతమాత్రము కృషిసల్పితిమని యాలోచించుకొనరు. అందులకై వారి నాక్షేపింపరాదు. వారికిఁ గర్మసిద్ధాంతము సుంతయుఁ దెలియదు. భక్తి వాక్కులనుండి బయలు

వెడలుచుండును కాని మనోరంగమున నాట్యమాడుచుండదు. ఈవిషయములు వారివాదమును విన్నయంతనే సాధుజనులకు గోచరించును. గోపికాలోలుఁడు శ్రీకృష్ణుఁ డనువాదనము చేయుచు జారత్వ మాపరమేశ్వరునం దారోపించువారలతో వాదించుట యవివేకము. ఎంతచెప్పినను వారి కది సరిపడదు. దుష్కర్మము పాశములఁ దగిలించి లాగుచుండ వారికి భగవచ్చరిత్రామృతమును గ్రోలుభాగ్య మేరీతిఁ గల్గును? కావున వారివాదముల వినకుండుట బుద్ధిమంతులలక్షణము. అట్టివారలే కొంతకాలమున కించుకభక్తి యంకురింపఁగాఁ దమయపరాధముల నెఱుంగఁజాలుదురు. వారప్పు డితరుల నట్టిపిడివాదము చేయువారిని దూషించి లాభములేదని భావింతురు. భక్తి కుదురకయున్న నేదియు సరిపడినట్లు తోఁపదు. కావున భక్తి గల్గునట్లు చేసికొనవలయు. దానికిఁ బ్రథమసోపానము సత్సహవాసము. అది పురాకృతపుణ్యకర్మఫలము. అది లభించిన నన్నియు లభించినట్లే.

ఈకాలమున భక్తుఁడుకానివాఁడు లేఁడనవలయును. అందఱు భక్తులే, అందఱు వేదాంతులే.

శ్లో. "అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః,
ఏక ఏవ గురుస్సోఽయం శిష్యహృత్తాపహారకః."

అన్నట్లు శిష్యోద్ధారణక్షములు దొరకుట యరుదు. ధన మార్జించి వనితాసంగతి మెలంగువారెల్ల వేదాంతము నుపన్యసింతురు. ఉపదేశింతురు. శిష్యులం గూర్చుకొందురు. వేషములు వేయుదురు. అట్టివారిసంగతి యనర్థదాయకముకదా. అట్టివారి పలుకులకుఁ జలింపక సద్గురువును సంపాదించుకొనవలయు. సద్గు

రువును సంపాదించుకొనుట యనఁగా భక్తిభావమున భగవంతు నారాధించుటయే. దాన సద్గురువు తనంతట తానే తోఁచును. మహర్షులు దేవతలు పరిపక్వజీవులకొఱకు వేచియుందురు. ఏక్షణమున నంతరాత్మ పరిశుద్ధమగునో యపుడే సద్గురువు భగవత్ప్రేరణమునవచ్చి తత్త్వము నుపదేశించి కృతకృత్యునిం జేసిపోవును. దీనికి మూలకారణము భక్తి. అది సుకృతకర్మమునఁ గుదురును. సజ్జనసాంగత్యమున నట్టి సత్కార్యానుష్ఠానము చేయు నాసక్తి కుదురును. ఇట్లు పరంపరాసంబంధమున నన్నియు ననుబంధములుగ నుండును. విధియెఱుంగనివారు భగవన్నామ సంకీర్తనము చేయుంజేయ. మది భక్తి యంకురించును. పిదప నన్నియుఁ గుదురును. నామసంకీర్తనముకూడఁ జేయఁజాలనిచో నుత్తమమార్గమే దొరకదు.

సద్గృహమున నివసింపవలయుననియు, శుభముల నొడఁగూర్చువృక్షములను లతలను బోషింపవలయుననియు, నిషిద్ధ వృక్షలతలను గృహమునఁ బెంచరాదనియూ నెనిమిదవప్రకరణమునఁ జదివియుందురు. చెట్లవలనఁ దీఁగెలవలన మేలుగాని కీడుగాని కలదా యని ప్రశ్నింపఁబూనకుఁడు. అది మిగులఁ బొరపాటు. వృక్షముల నాశ్రయించి దేవత లుందురు. లతల నాశ్రయించి సిద్ధు లుందురు.

శ్రు. "యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః,
  యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః."

అని యజుర్వేదము చాటుచున్నది. దుష్టదేవతాశ్రయము లగువృక్షములు దుష్టతరువు లనంబడు. శుభఫలదదేవతా

శ్రయములగు తరువులు శుభభూరుహము లనంబడును. సూక్ష్మ దృష్టింబరికించువారల కా దేవతారూపములుగోచరించును. పనస చెట్టును సమాశ్రయించి పితృదేవతలు కొందఱుందురు. పనస చెట్టు నింటికిఁ దూర్పుభాగమున నునిచి పెంచుచుఁ బూజించు చుండినఁ బితరులు తృప్తులగుదురు. దాన వంశాభివృద్ధియగు. ఇట్లు గృహమున కేయేదిక్కుల నేయేవృక్షము లుండవల యునో దానిచే నేయేశుభఫలములు కలుగునో చెప్పఁబడినది. దానిం బరిశీలింపఁదగును. ఒక్కొక్కలతను ఒక్కొక్కనక్షత్ర వారములు గలిసినపుడు పూజించి ప్రార్థించితెచ్చిన నెన్నియో ఫలములు గలుగు. అట్టివిశ్వాసము లేకపోవుటంబట్టి యాఫల ముల నందఁజాలకయున్నారము. మనుష్యులకంటె వృక్షములు భగవత్కళ విశేషించికలవని నాయనుభవమునఁ జెప్పంగలను. సిద్ధార్థుఁ డెందును సందియములు తొలంగక యుండఁగా నశ్వ త్థవృక్షముక్రిందఁ గూరుచుండి ధ్యానింపఁగా నాకాలమహిమ మమున నాకస్మికముగాఁ దనమనోవాంఛఁ దీర్చునూహ తోఁచిన దని యతఁడే వ్రాసెను. అశ్వత్థము త్రిమూర్తిసమాశ్రయమని పురాణములు ఘోషించెడిని. ఇట్లే మఱికొన్నివృక్షముల నాశ్ర యించిన దేవతలఁ బురాణములు పేర్కొనుచున్నవి. ఈ కారణముననే పచ్చిమ్రాఁకుల ఛేదింపరాదనియు, నాకార్య ముపపాతకములలోఁ జేరినదనియు స్మృతులు ఘోషించెడిని.

శ్లో. "ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణామవపాతనమ్."

(మనుస్మృతి ౧౧. అ. ౬౫.)

"ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్ఛతమ్,

గుల్మవల్లీ లతానాం చ పుష్పితానాం చ వీరుధామ్."
(మను. ౧౧. అ. ౧౪౨.)

"వ్యా. ఫలదానామామ్రాదివృక్షాణాం గుల్మానాం కుబ్జకాదీనాం వల్లీనాం గుడూచ్యాదీనాం లతానాం వృక్షశాఖాసక్తానాం పుష్పితానాం చ వీరుధాం కూశ్మాండాదీనాం ప్రత్యేకం ఛేదనే పాపప్రమోచనార్థం సవిత్ర్యాదిబుక్శతం జపనీయమ్. ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణా మవపాతనమిత్యాదే రుపపాతకమధ్యే పఠితస్య గురుప్రాయశ్చిత్తాభిధానాత్. ఇదం ఫలవృక్షాదిచ్ఛేదనే లఘుప్రాయశ్చిత్తమ్ సకృదబుద్ధిపూర్వకవిషయే వేదితవ్యమ్." అని కుల్లూకభట్టు.

క్షుద్రజంతువధప్రాయశ్చిత్తమునకంటె ఫలవృక్షచ్ఛేదనమున నధికప్రాయశ్చిత్తము చెప్పఁబడినది. ఏలయనఁగా వృక్షముల నాశ్రయించి దేవత లుందురుకాన వాని ఛేదించిన దేవతానివాసచ్ఛేదము చేసినట్లగునని యేకదా. ఇట్లు మానవులకుఁ బరమోపకారము చేయువృక్షములను బూజింప మహాఫలము కలుగుననుట కేమిసందియము లుండును? ఇట్టి యనేకవిషయము లెనిమిదవప్రకరణమునఁ గన్పట్టెడిని.

భగవంతునికథలు కొన్నితావుల నిరర్థకములుగ సామాన్యదృష్టికిం దోఁచుచుండవచ్చును. భగవంతుఁ డొనర్చు కొన్ని కార్యము లసంగతములుగఁ దోఁచును. దానికిం గారణము భక్తిశూన్య మనుటయే. వేఱొకకారణ మూహింప శక్యము కాకున్నది. సకలబ్రహ్మాండముల నిర్మించి యొక్కభూతము నేని నిరుపయోగమగుదానిని నిర్మింపని యాపరాత్పరునిచరిత్రమున

నొక్కకొన్ని నిరర్థకము లనుట కేవలబుద్ధిమాంద్యమున నేగాక వేఱేముండును? ఏకార్యము సాధింపఁబూనియో, ఏనీతిని దెలుపఁబూనియో, మఱెందులకో భగవంతుఁడొకవిలాసమును జూపును. దాననే ప్రాణియో తరించును. తప్పదు. దాని నెఱుంగునంతజ్ఞానము మనకు లేదేయని విచారించుటకు బదులుగ నాక్షేపింతుము. ఇంతకంటెఁ బొరపాటు వేఱొకటి కలదా! ధీరోదాత్తుఁ డగునొకనాయకుఁడు చేయుకార్య మెందులకో తెలిసికొనఁజాలని మనము బ్రహ్మాదుల నిర్మించిన పరమాత్మ కార్యములఁ బరిశీలింపఁజాలుదుమా. ఇట్లూహింపక మనకుంగల యత్యల్పజ్ఞానలేశంబున భగవల్లీలాఫలముల నూహింపఁబూనుట యుట్టికెగురఁజాలనివారు స్వర్గమున కెగురఁ బ్రయత్నించినట్లగునుగదా. ఇద్దానికంటె నిరర్థక కార్యము వేఱొకటి కలదా యని ప్రశ్నించెదను. సమాధానము శిరఃకంపము చేయుటకన్న వేఱెద్దియు రాదని నేనెఱుంగుదును. కావున నల్పజ్ఞులు తమకుం దోఁచిన కుత్సితభావములంగొని భగవత్కార్యములు నిరర్థకములని వాదించి నాలుక నపవిత్రముగాఁ జేయఁబూనక భగవద్గుణంబుల నెఱుంగఁజాలకపోతిమికదా యని చింతించుచు సర్వాపరాధముల క్షమింపుమా యని పరాత్పరుం బ్రార్థించుచు మావంటియజ్ఞులకు నీనామసంకీర్తనము చేయుభాగ్యము లభింపఁ జేయుమా యని మొఱపెట్టుకొనుట యుత్తమమని నొక్కి పల్కుచున్నాఁడను. ఊరకూరక పాపమున కొడిగట్టుకొను టేల! మనయం దశక్తిత్వ మారోపించుకొనుట యుత్తమము. అది భక్తునిలక్షణ మగును. భగవంతు నెదనిల్పి సర్వశక్తియుక్తునిగా ధ్యానించుచు నశక్తుఁడనగు నన్నుఁ గాపాడుమాయని కోరుట

తప్పుగాదు. దాన, శ్రీహరి కరుణాతరంగితాంతరంగుఁ డగును. కాపాడును. సంసారసాగరమునుండి యుద్ధరించును.

శ్లో. "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః."
(గీతా. ౯-అ. ౩౪.)

అను నీగీతావాక్యము పై భావమునే సూచించుచున్నది.

శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢానిమాయయా.
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్."
(గీతా. ౧౮ అ.)

అను నీగీతావచనములు పైయర్థమును దృఢపఱచుచున్నవి.

ఇట్టియెడ నొకశంక కొందఱకుం గలుగవచ్చును. భక్తి సమానమైనప్పుడు ఎల్లరకును భగవదనుగ్రహము సమానమగునని యీ శ్రీకృష్ణావతారతత్త్వమునందే పెక్కుపర్యాయములు వ్రాయఁబడినదికదా. అప్పుడు జాతిమతాచారము లేల భిన్నములుగా నుండవలయునో తెలియకున్నదని కొందఱాక్షేపింతురు. సమాధానమేమనియుఁ బ్రశ్నింతురు. కాని వారు చక్కఁగా గ్రంథములఁ బఠించి వానియర్థమును గ్రహించినవారు కారు. కావుననే జాతిమతస్వరూపములు వారికెఱుక పడకున్నయవి. అందువలననే యీశంకలు వారికింగల్గిన వనక తప్పకున్నది. సమాధాన మిట్లుగా వారు గ్రహింపందగు. భగవంతుఁడు లోకాతీతుఁడు. భగవంతునిదృష్టికి బ్రహ్మాండము

లన్నియు నొక్కవిధముగఁ గన్పడును. బ్రహ్మాండాంతర్భూతులకు భగవంతుఁ డొక్కరీతిగాఁ గన్పడఁడు. ఇందలిజీవులెల్లఁ గర్మబద్ధులు. భగవంతుఁడు కర్మబద్ధుఁడు కాఁడు. కాంచనఘటమందును, మృత్కుంభమునందును సూర్యతేజస్సొక్కరీతిగా వ్యాపించును. కాని జనులనేత్రముల కొకరీతిగా నాతేజస్సు పాత్రద్వయమునఁ గన్పడదు ఒకటి నిర్మలముగను, వేఱొకటి మలినముగను గన్పడును. అట్లే యెల్లప్రాణు లొక్కరీతిఁ గర్మముల నాచరించినవికావు. వివిధవిధకర్మముల నాచరించినవి. కావున నాయాప్రాణు లాచరింపఁదగుధర్మములు వేఱువేఱుగ నుండక తప్పదు. ఎల్లజంతువుల కాహారము సమానముకాదు కాని తృప్తి సమానముగ నుండవచ్చును. అది యుండిన నుత్తమమధ్యమాధమాహారపదార్థము లొక్కరీతిగా నగపడును. అట్లే భక్తి సమతఁ గాంచునేని జాతిభేదములఁ బాటింపక భగవత్కృప యొక్కరీతిగాఁ గల్గును. బ్రాహ్మణాదిజాతులకు ధర్మములు ప్రత్యేకముగ నేర్పడినవి. వాని నాచరించినచో ఫలము సమానమె. పదార్థములు వేఱుగనున్నను క్షున్నివృత్తి నొక్కవిధముగా నాయాయిప్రాణుల కాయాహారభేదములు కల్పించును. ఆవిధముగ జాతిధర్మములు విధిప్రకారమనుష్ఠితము లయ్యెనేని ఫలముల సమముగఁ గల్పించును. బ్రాహ్మణాదివర్ణత్రయమునఁ జేరినవారు యజ్ఞముల నాచరించిన నెట్టిఫలముల గాంతురో శూద్రుఁడు ఖలయజ్ఞము నాచరించినఁ దత్తుల్యఫలమును గాంచునని స్మృతులు ఘోషించుచున్నవి. కర్మము లేల సమానములు కాఁగూడ దనునది యుక్తియుక్తమగు ప్రశ్నము కాదు. ప్రాణికోటికిఁ దారతమ్యము లేకపోదు.

అందఱు ధనవంతు లేలకాఁగూడదన్నప్రశ్న మెట్టిదో యిదియు నట్టిదియే. నాల్గుజాతులవారికి వేఱువేఱు ధర్మములు నిర్ణయింపఁబడినదని శ్రీకృష్ణపరమాత్మయే గీతాశాస్త్రమునందుఁ జెప్పియున్నాఁడు.

శ్లో. "బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧
స్వేస్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. ౪౫
యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం,
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. ౪౬
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. ౪౮
అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి." ౪౯
(గీతా. ౧౮ అ.)

భాష్యమ్. "బ్రాహ్మణాశ్చ క్షత్రియాశ్చ విశశ్చ బ్రాహ్మణక్షత్రియవిశః తేషాం బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ. శూద్రాణామసమాసకరణమేకజాతిత్వే సతి. వేదానధికారాత్. హేపరంతప కర్మాణి ప్రవిభక్తాని. ఇతరేతరవిభాగేన వ్యవస్థాపితాని. కేన? స్వభావప్రభవైర్గుణైః స్వభావః ఈశ్వరస్య ప్రకృతిః. త్రిగుణాత్మికా మాయా సా ప్రభవః యేషాం గుణానాం తే

స్వభావప్రభవాః తైః శమాదీని కర్మాణి ప్రవిభక్తాని. బ్రాహ్మణాదీనాం. అథవా బ్రాహ్మణస్వభావస్య సత్త్వగుణః ప్రభవః కారణం. తథా క్షత్రియస్వభావస్య సత్త్వోపసర్జనం. రజః ప్రభవః. వైశ్యస్వభావస్య తమ ఉపసర్జనం. రజః ప్రభవః. శూద్రస్వభావస్య రజః ఉపసర్జనం. తమః ప్రభవః. ప్రశాంత్యైశ్వర్యేహామూఢతాస్వభావదర్శనాత్. చతుర్ణాం. అథవా జన్మాంతరకృతసంస్కారః. ప్రాణినాం వర్తమానజన్మని స్వకార్యాభిముఖత్వేనాభివ్యక్తస్వభావః. స ప్రభవో యేషాం గుణానాం తే స్వభావప్రభవా గుణాః గుణప్రాదుర్భావస్య నిష్కారణత్వానుపపత్తేః. స్వభావః కారణమితి చ కారణవిశేషోపాదానం. ఏవం స్వభావప్రభవైః ప్రకృతిభవైః సత్వరజస్తమోభిర్గుణైః స్వకార్యానురూపేణ శమాదీని కర్మాణి ప్రవిభక్తాని.” అని శంకరాచార్యులు.

బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులకు జన్మసంస్కారవశమునఁబుట్టినగుణములనాధారము చేసికొని వేఱువేఱుకర్మములు విభజింపఁబడినవి. తమతమకర్మముల నాచరింప నభిరుచికలిగినవాఁడు కర్మఫలములఁ బొందును. స్వకర్మాసక్తిగలవాని కెట్లు సిద్ధికల్గునో యావిషయమును దెల్పెదను. వినుము. ఏభగవంతుని వలన భూతముల ప్రవృత్తి కలుగుచున్నదో ఎవ్వఁడీప్రపంచమునందంతట నిండియున్నాఁడో స్వకర్మమున నాభగవంతు నారాధించినమానవుఁడు తత్ఫలమును బొందును. ఇతరులకుఁ జెందినధర్మములను యథావిధిగాఁ జేయుటకంటె విగుణమే యైనను దనకర్మము నాచరించుట యుత్తమము. స్వభావనియతకర్మ[illegible] నాచరించువాఁడు పాపములం బొందఁడు. తనకు

సహజమగుకర్మము దోషయుతమైనను విడువరాదు. సర్వధర్మములు పొగచే నగ్ని యావరింపఁబడియుండునట్లు దోషములచే నావరింపఁ బడియున్నవి. ఇట్లు దోషయుతములగు కర్మముల నాచరించిన జ్ఞాన మేలాగు కలుగునన్నశంక యర్జునునకుం కల్గునేమో యని శ్రీకృష్ణపరమాత్మ మరలఁ జెప్పుచున్నాఁడు. దేనియందును సంగములేనిబుద్ధిగలిగి యహంకారమును వదలి ఫలము ననుభవించువాంఛలను గోరకయుండువాఁడు సన్న్యాసమువలన నన్నికర్మముల వదలుట యనుసత్వసిద్ధిని బొందును. అనఁగా నాయాయిజాతులకుఁ గర్మములు గుణముల ననుసరించి విధింపఁబడినవనియు, వాని నాచరింపవలయుననియు, నితరులకుఁ జెప్పినకర్మముల నాచరించిన మేలులేదనియుఁ, దనకర్మమునే యాచరింపవలయుఁగాని యితరకర్మముల నాచరింపరాదనియు, దాన నిహపరములు లేవనియు, నెవ్వఁడుగాని తాఁజేయుకర్మముల నాచరించి వానిఫలములను గోరకయుండవలయుననియు దాన జ్ఞానము కలుగుననియు సారము.

ఆర్యులార ! చూచితిరా. సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణపరమాత్మ బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులకు వేఱువేఱుకర్మములు విధింపఁబడియున్నవనియొ. వాని నాచరించిన ఫలము కలదనియొ. ఆఫలములనుగోరక యనఁగా భగవదర్పణముచేసిన జ్ఞానసిద్ధియగునని నొక్కిచెప్పెను. ఇట్లుండఁగా జాతుల కిన్నికర్మములు వేఱువేఱుగా నుండనేలయన్నఁ జెప్పవలసిన దేమికలదు. జాతిభేదములు వలదనువారికిఁ బ్రపంచతత్త్వమే తెలియదు. ఏసృష్టియందు, నేభూఖండమునందును భేదములు లేకుండ నుండ వీలులేదు. ఈ శబ్దము మఱొకభాషయందు వేఱొకశబ్ద

ముగనుండును గాని జాతిభేదములు లేకుండనుండదు. ఉపన్యాస వేదికలపై జాతిభేదము లేకపోవును గాని యాచరణమునందు మాత్రము కలదు. సర్వమానవసోదరత్వ ముండకతప్ప దను వారికి లోకజ్ఞానము చాలతక్కువ యనక తప్పదు. అది శక్యమా యని వారాలోచించినవారు కారు. భగవంతునిదృష్టి కది సరిపడును. తక్కినమానవకోటిలో నొక రుందురో లేదో సంశయమే. కావున సాగని కార్యములు. సంగతములు కాని యూహాలు పన్ని యాకాశమును జుట్టి చంకలోఁ బెట్టుకొన ప్రయత్నింపక జాతిభేదములు కలిగియుండక తప్పదు. కర్మముల నెల్ల వారొక్కరీతిగాఁ జేయఁజాలరనియు నమ్మి సదాచారములఁ బాటింపక యుండవలయు నన్న దురూహాలు మాని యితర జాతులవారిని నిందింపక మతముల నాక్షేపింపక యందఱకు గమ్యస్థాన మొక్కటియే యని యూహించి మార్గములు పెక్కులు గలవనియు, నేమార్గమునఁ బోవ నెవరికి సమ్మత మగునో దాని నాశ్రయించి వారు ప్రవర్తించునపు డూరక దూఱక భగవత్తత్త్వము నెఱుంగఁగోరుచుఁ దన్నామసంకీర్త నము చేయుచుఁ, దత్కృత్యములఁ జదువుచు, దన్మహిమాతి శయమును స్మరించుచుఁ, దత్పాదారవిందముల ధ్యానిం చుచు భగవత్కరుణకుఁ బాత్రులు కావలయును. దీనికి మించిన మార్గము వేఱొక్కటి కానరాదు. కువాదములఁ జేసి పరమతముల దూషించి పాపముకట్టుకొనుట తనమేలు తాఁ బాడుచేసికొనినట్టి దగును. కావున నట్టిపనికిఁ బూనరాదు. అశక్తత్వమును దనయం దారోపించుకొనుట యపరాధము కాదు. శరణ్యము భగవత్పాదారవిందద్వంద్వ మనుటకంటె వేఱొక్క

మాట నోటఁబలుక వీలులేదు. సర్వపాపములఁ దొలఁగించి సత్కార్యాచరణమున నన్నుఁబురికొలుపుమాయని పరాత్పరుం బ్రార్థింపవలయును. దుర్మతములు ప్రతిక్షణమున నీటిబుగ్గలవలెఁ బెచ్చుపెరుగుచున్న యిక్కాలమున భగవన్నామసంకీర్తనము చేయుటయే యుత్తమము. నిరపాయము. సకలశుభావహము. ఇఁకఁ దడవుచేయక శ్రీకృష్ణపరబ్రహ్మము చేసిన యద్భుతకార్యములఁ దెలుపుకథలం బఠింపుఁడు. తొలుదొలుతఁ దన్నామమహిమమును ధ్యానింపుఁడు. భగవద్భక్తులలో నగ్రగణ్యుఁడగు శ్రీలీలాశుకులవాగమృతమనంజను శ్రీకృష్ణకర్ణామృతమునందలి యొక్కశ్లోకమును బఠించి తదర్థమును దెలిసికొని యందుఁ బ్రతిపాద్యమగురూపమును మనఃఫలకమున నుండఁ జేయుఁడు.

శ్లో. "ఆనమ్రామసితభ్రువోరుపచితామక్షీణపక్ష్మాంకురే [తే,
ష్వాలోలామనురాగిణోర్నయనయోరార్ద్రాం మృదౌజల్పి
ఆతామ్రామధరామృతే మదకలామమ్లానవంశీరవే
ష్వాశాస్తే మమ లోచనం వ్రజశిశోర్మూర్తిం జగన్మోహినీమ్.

శ్లో. తత్కైశోరం తచ్చ వక్త్రారవిందం
తత్కారుణ్యం తే చ లీలాకటాక్షాః,
తత్సౌందర్యం సాచ మందస్మితశ్రీ
స్సత్యం సత్యం దుర్లభం దైవతేషు." ॥౨॥

(౧. ఆశ్వాసము.)

మహానుభావులారా! ఇందుఁ బ్రతిపాదింపఁబడినమూర్తి యీప్రకరణమున ధ్యానింపఁదగినది. ఈమూర్తియే యీప్రకరణమునందుఁ గార్యము లొనరించును. కావుననే తన్మూర్తిని

ధ్యానించుట యుత్తమము. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు. కుమతులదుర్వాదలేశములకు మనస్సునఁ జోటు నునుపకుఁడు. అది మనస్సును స్థిరతఁగాంచక యుండఁజేయంజాలును. పాప పంకక్షాళనము భగవన్నామామృతసరస్సునఁ జేసికొనినఁగాని తదీయానుపమాన వేదాంతవేద్యదివ్యచరిత్రము సుగమముగా బోధపడదు. దానికై ప్రయత్నింపుఁడు. ఇన్ని మాఁటలు నొక్కి చెప్పనేల? అనిమాత్రము ప్రశ్నింపకుఁడు. పునఃపునః కరణమున నొకయద్భుతశక్తి కలదు. "మనసి విచింతయ వారమ్ వారమ్" అని శ్రీశంకరభగవద్పాదాచార్యులుగారు తెలిపియేయున్నారు. దుశ్చింతల మఱువవలయును. సచ్చింతలఁ బలుసారులు స్మరింప వలయు. స్మరణమున మనస్సు నిర్మలమగును. దాన భక్తి పాదు కొనును. అందున భగవత్కథాశ్రవణాదరణము పుట్టును. అదియే పూర్వజన్మసుకృతఫలము. అదియే ముక్తిమార్గమును జూపించినదీపము. తదాశ్రయణము మన కావశ్యము కదా. కావున నేకాగ్రమనస్కులరై భగవచ్చరిత్రమును వినుఁడు.

### శ్రీకృష్ణుఁడు యశోదానందులకు జ్ఞానము నుపదేశించుట.

*మహాశయులారా! రుక్మిణీకల్యాణానంతరము సత్యభామాద్యష్టభార్యలం గూడి శ్రీహరి తనయనిర్వచనీయ మహి

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ౧౧౦ వ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగఁదగు. ఇందు రాధాప్రస్తావము కలదే. మరల రాధ యేల వచ్చెనని భయంపడకుఁడు. కథ విని దీనియందలిసారమును బరిశీలింపుఁడు. శతవర్షవిచ్ఛేదము బాహ్యదృష్టికే గాని రాధామాధవులకు నెడఁబాటు గలదా. ఈకథ రుక్మిణీవివాహానంతరమే వ్రాయఁబడినది. సందర్భానుసారముగా నట మఱికొన్ని కథలను వ్రాసితిని. ఇపుడిది యీచోట వ్రాయుంచున్నాఁడను. ఏల యిట్టి ప్రమాదమని చెదరకుఁడు.

మము నెల్లవారు తమకుఁ దోఁచినచందమునఁ గొనియాడుచుండఁగా బ్రహ్మాదులుతనతత్త్వమెఱుంగఁజాలక కలవిలపాటొందుచుండఁగా నుపనిషత్తులు “నేతి నేతి” యని తమయశక్తతను దెలుపుకొనుచుండఁగా మహర్షులు తనపాదారవిందముల మనఃపీఠముల నిడుకొని ధ్యానించుచుండఁగాఁ దనయోగమాయ యగు శ్రీరాధాదేవి సదా ప్రచ్ఛన్నవేషమునఁ గొలుచుచుండఁగాఁ దత్కళలగు రుక్మిణీప్రభృతులు భయభక్తులఁ దన్నెడఁబాయక సేవించుచుండఁగాఁ దనపరబ్రహ్మత్వమును దేటపఱచుచు ద్వారకానగరముననే యున్నటు లెల్లరకుఁ దెలుపుచు సర్వత్ర తనకళ వ్యాపించియుండఁగాఁ దనసగుణబ్రహ్మత్వమునకానందమందుచు నుండెను. కొంతకాల మిట్లుసాగెను.

ఒక్కనాఁడు నందుఁడు సానందుఁడై యశోదంగూడి శ్రీకృష్ణునిచెంతకుఁ బోయి పితృపూజారతుఁడగు తనయునిం గాంచెను. పట్టరానియానందము భక్తియు మల్లడిగొన శ్రీహరి లేచి యెదురుచని పూజించి యుచితాసనములఁ గూరుచుండఁ బెట్టి తదనుమతిఁ దానును గూరుచుండెను. అత్తఱి యశోద తనచిన్నికుమారునిం గాంచి తనయజ్ఞానమునకు నించుక వగచుచుఁ బరతత్త్వమను మతిపాలయ నిట్లు పలికెను. శ్రీకృష్ణా! మాధవా! నీతండ్రి యగునందునకు జ్ఞానము నింతకుముందే మధురానగరమున నుపదేశించితివి. కరుణాశరధివి. తల్లినని భావించునాకు నించుకజ్ఞానము నుపదేశింపుము. నన్నుద్ధరింపుము. భూభార మడంప నవతరించితివి. నే నీసంసారసాగరము భయంకరమని వినుచుండియు నిందుఁబడి గట్టుగానక తల్లడిల్లుచున్నాను. ఇట్టినన్నుద్ధరించుట నీకుఁ దగును. మాయామయు

కదా నీప్రకృతి. సంసారసాగరమున కది తరణియగు. నీవు కర్ణ ధారుఁడవు. (ఓడనడపువాఁడవు) భక్తుల నుద్ధరింపఁ గంకణము కట్టుకొన్నవాఁడవు. కరుణాస్వరూపుఁడవు. కృష్ణా ! దీనురాల నగునన్ను జ్ఞానోపదేశమునఁ గాపాడుమా యని ప్రార్థించెను.

శ్రీ పురుషోత్తముఁ డామాటలకుఁ బకపక నవ్వెను. జ్ఞానులలో జ్ఞాని. గురువులలో గురువు. కావున నిట్లుపలికెను. జననీ ! జ్ఞానము ముప్విధంబులుగ విభజింపఁబడినది. సిద్ధియో గాత్మకమని, విషయాత్మకమని, భక్త్యాత్మకంబని వానిపేరులు. అందు భక్త్యాత్మకజ్ఞాన ముత్తమము. అది మద్దాస్యకారణంబై శుభప్రదంబుగనుండు. సర్వవేదసమ్మతజ్ఞాన మైదువిధములుగ నుండు. అందును భక్త్యాత్మకమే పరమంబని యెఱుంగుము. దానిని వివరించెద. ఆలకింపుము. క్షుత్పిపాసాదుల ఖండించి చిత్తమును సర్వదా శోధించుచు నాడీసంశోధనము గావించుచు షట్చక్రభేదన మొనరించుచు శక్తికుండలీయుక్తుఁడగు నీశ్వరుని ధ్యానింపవలయు. పిదప నింద్రియముల నిరోధించుచు లోభాదిగుణముల నున్మూలింపవలయు. మూలాధారస్వాధిష్ఠాన మణిపూరానాహత విశుద్ధాజ్ఞానామకములగు నాఱుచక్రములు ప్రసిద్ధములు. ఇది స్త్రీలకు దుర్బోధములు. మూర్ఖుల కెఱుంగఁ దరముకానివి. పూర్వోక్తరీతి నొనరించినఁ గల్గునది యోగా త్మకజ్ఞానము. సిద్ధులు దీనిని సాధించి యీప్సితంబులం బడయు దురు. సర్వజంతువులకు సాధారణముగ నెఱుంగఁ దగినది కటికలదు. దానిని సజ్జనులు సేవింతురు. అది నాయిచ్ఛాధీన గనుండు. సిద్ధులకు సిద్ధ్యాత్మకజ్ఞానము సర్వకర్మములయందు నియా - అజ్ఞానము ముప్పదినాలుగు విషయములను సా

ధించి తెలిసికొనఁదగినదై యుండు. అది మోక్షాత్మకజ్ఞానమనం బడు. అది కేవలము క్తిసాధనంబై యుండునని యెఱుంగుము. నివృత్తిమార్గారూఢ జ్ఞానమును భక్తులు వాంఛింపరు. వారు భక్త్యాత్మకజ్ఞానము నే కోరుదురు. ఆజ్ఞానమును నీకు రాధాదేవి యుపదేశించును. ఆమెయందు మనుష్యకాంత యనుభావమును వదలుము. ఆమెయాజ్ఞను దలఁదాల్పుము. నేను నందునకుఁ దెల్పిన జ్ఞానము నే నీకు రాధ ప్రసాదింపఁగలదు. జననీ! నందునిం గూడి నందవ్రజమున కరుగుము. అని వినయమునఁ బలికి యామెను సమ్మతింపఁజేసి తా నంతఃపురమున కరిగెను.

శ్రీకృష్ణానుమతిని యశోదంగూడి నందుఁడు గోకులంబున నొకభాగమై విలసిల్లు కదళీవనమున కరిగెను. అందు నిద్రించియున్న రాధం గాంచెను. ఆమె యెవ్వనితోడను మాట లాడదు. శుక్లవస్త్రమును ధరించియుండెను. నిరాహారవ్రత మూనియుండెను. కావునఁ గృశోదరియై యుండెను. జలముల నడుమ జలజాతములు పూచియుండ వానిపరిమళము నలుదెసల గుబాళించుచుండ నచ్చో నిర్మింపఁబడిన శయ్యయందుఁ బరుండి యుండెను. పెదవులు వాడియుండెను. నయనారవిందములనుండి యశ్రుజలములు ధారగాఁ బ్రవహించుచుండెను. మూర్ఛిల్లి నట్లుండెను. పరమాత్మయగు శ్రీకృష్ణుని పాదారవిందములను ధ్యానించుచుండెను. బాహ్యజ్ఞాన మామెయందించుకంతయుఁ బొడకట్టదయ్యెను. శ్రీకృష్ణునందే మనస్సునిలిపియుండెను. తన ప్రాణనాథుని పాదారవిందముల ధ్యానమునఁ గాంచుచు సుస్మిత మొనరించుచుండెను. నవ్వున దంతము లించుక యగపడుచుం డెను. అందుఁ దోఁచిన స్వప్నమునఁ గాంతుని చెంతఁ జేరి దుఃఖిం

చెను. శ్వేతచామరములందాల్చి సఖీజనము సేవించుచుండెను. గోపికాసహస్రము లాపరదేవిని దివానిశములు కాచుచుండిరి. కొందఱు జాగరూకలై వేత్రహస్తలై ద్వారములఁ గావలియుండిరి. సప్తద్వారములయందుఁ బ్రాంగణములయందును వారుండిరి. ఆరాధాదేవిం గాంచి నందుఁడు యశోదయు విస్మయంబునొందిరి. నందుఁ డాలోకమాతకు సాష్టాంగనమస్కార మొనరించెను. భయభక్తుల నాయశోదయుఁ బతివలె నమస్కరించెను.

వారిట్లు నమస్కరింపఁగనే క్షణకాలమున మేల్కాంచి విషయజ్ఞానమును వదలి యెదుట నాదంపతు లుంటఁజూచి సాదరముగ నిట్లు ప్రశ్నించెను. చెలికత్తియలనడుమ నందేయుండి యీరాధ యిట్లు భాషించెను. ఆర్యా ? ఏల యిందువచ్చితివి ? నాతోడ నేకార్యము ముచ్చటింప వాంఛ నీకుంగలదు? ఇపుడు నాకు విషయజ్ఞానములేదు. పశుభూతు లగునరుల నేఁ జూడనొల్లను. *జలము, స్థలము, పగలు, రాత్రి, స్త్రీ, పురుషుఁడు, షండుఁడు అనుభేదములఁ బాటించి నేఁజూడను. భేదదృష్టినాకిపుడు లేదు. అని రాధాదేవి పలుక నందుఁడు విస్మయమునొందెను. యశోద భీతయై సంభాషించునిమిత్తము చెంతకరిగెను. రాధా సమీపమున నిలుచుండ శ్రుతిమధురముగా నిట్లు సంభాషింపఁ దొడంగెను. గోపికలాదంపతులకు నుచితాసనముల నిడిరి. అమ్మా ! రాధా ! చేతననొందుము. నిన్ను రక్షించుకొనుము. ప్రాణనాథుని శుభసమయమునఁ జూడఁగలవు. ఆశుభదినము

*కిం జలం వా స్థలం కిం వా కిం వా నక్తం దినం క్షణం, స్త్రీయం [illegible] బం వా నాహం జానామి భేదకమ్. అని మూలము. న చ వేం వ[illegible]జ్ఞానం న జానామి నరం పశుమ్. అనియుం దీనికి ముందు కలదు.

రాగలదు. చింతిల్లకుము. నీవలన నీవిశ్వము పవిత్రమైనది. కులము ధన్యమైనది. ఈగోపికలు మహాపుణ్యముచేసిరి. కావున నే నీపాదారవిందముల సేవించుభాగ్యము గలవారలైరి. తీర్థరాజమువలెఁ బవిత్రమగు నీకీర్తిని లోకములు గానముచేయుచున్నవి. అది నిరుపమానశుభదాయకమని పొగడుచున్నవి. నాల్గువేదములు, పురాణములన్నియు నీకీర్తినే తెలుపుచున్నవి. బుద్ధిస్వరూపిణివగు నోరాధా! నేను యశోదను. ఈయన నందుఁడు. నన్ను విజ్ఞానముగలదానినిగా నొనరింపుము. నీవు వృషభానుపుత్రికవు. నన్ను గుఱుతింపుము. సువ్రతురాలా! మేమిరువురము ద్వారకానగరముననున్న శ్రీకృష్ణునిసన్నిధానమునుండి హరి పనుపఁగా నీచెంత కరుగుదెంచితిమి. మంగళవృత్తాంతము నొక్కదానిం జెప్పెద. ఆలకింపుము. చక్రి మంగళమం దిమిడియున్నది. సమీపకాలమున శ్రీహరి దర్శింపఁగలవు. చేతననొందుము. ఇపుడు భక్త్యాత్మకపరమమంగళజ్ఞానము నుపదేశించి నన్ను ధన్యంజేయుము. నీభర్త యుపదేశమున మేమిరువురము నీచెంతకువచ్చితిమి. ముహూర్తకాలమునకు శ్రీహరియు రాఁగలఁడు. శ్రీదామునిశాపముక్తి యచిరకాలమునఁ గాఁగలదు. అని యీవిధమున యశోదపలుక వాని నాలకించి శ్రీకృష్ణానుజ్ఞను స్మరించి శ్రీకృష్ణనామసంకీర్తనద్వారమునుండివచ్చిన శుభ మిది యని గ్రహించి స్మృతిని జక్కఁగాఁదెచ్చుకొని శ్రీకృష్ణుని ధ్యానించి శాంతచిత్తయై లౌకికభక్తిపరమోత్తమనుగాన దానిం జెప్పఁబూనెను.

## రాధిక యశోదకు భక్తిజ్ఞానము నుపదేశించుట.

*యశోదా! ఆలకింపుము. జ్ఞానాత్మకుఁడు భగవంతుఁడు. అపరాత్పరుఁడు బ్రహ్మేశశేషపూజితుఁడు. అట్టి శ్రీకృష్ణుఁడు నీ కుపదేశింపక నామూలమున నీ కుపదేశింపఁబూనెను. ఇచ్చటికిం బొమ్మని నిన్ను నందునితోడఁ బంపెను. ఆయనచేతఁ దెలుపఁబడక పంపినందులకు సంతోషము. నేనేమి యుపదేశింతును? ఆమహాత్ము నభిప్రాయము నెఱుంగఁజాలుదునా? వేదములు మహానుభావులగుమునులు తద్భావార్థము నెఱుంగఁజాలరన స్త్రీజాతిం బుట్టి మనోబలములేక మూఢురాలనగు నేను జెప్పఁజాలుదునా? వాస్తవమున నేను జ్ఞానతత్పరురాలను. అపరమేశ్వరు నెడఁబాయుటచే సదా హతచేతననై యున్నదానను. అట్టి నేనేమి యుపదేశింపఁగలను? పంచవిధజ్ఞానంబులయందు భక్త్యాత్మకజ్ఞానం బుత్తమము. తదాజ్ఞ మీఱఁజాలను. కావున వచియించెదను. ఆలకింపుము. పవిత్రచిత్తురాలా! యశోదా! శ్రీకృష్ణవరమున భయము వాసియుండుము. గోలోకంబునుండి వచ్చి యొందో యొకకులమున జన్మించితివి. కావున సర్వమును బరిత్యజించి పరమేశ్వరు సేవింపుము. కృష్ణమూర్తి పుత్త్రుఁడను బుద్ధిని వదలుము. బ్రహ్మమనుబుద్ధిని నిలుపుము. నశ్వరమగు నీసంసారమునంతయుఁ బరిత్యజింపుము. భారతవర్షము పుణ్యక్షేత్రము. అందు బృందావనము రమ్యతమము. అందలి యమున-లముల మునుంగుము. త్రిలోకపుణ్యనదీస్నానపుణ్యము చు. అందు భక్తిసమాహితచిత్తవై యష్టదళపద్మమును

*ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నూట పదునొకండవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినదని యూహింపవలయు.

నిర్మింపుము. దానిని స్నిగ్ధచందనమున నిర్మింపుము. గర్గాచార్య ప్రోక్తధ్యానమును బరిశుద్ధమనస్కవై ధ్యానింపుము. పరాత్పరు నానందమయుని సానందవై పూజింపుము. తత్పదముం బొందుము. కర్మము నికృంతనముచేసి పితృశతములంగూడి గోలోకము నొందుము. విష్ణుభక్తులతో భాషింపుము. అగ్ని జ్వాలంబడుట మేలు. ఇతరులతో మాటలాడుట పాడిగాదు. భక్తుఁడు హరిపంజరమునే వాంఛించును. ముండ్లపై నివసించుట మేలు. విషభక్షణము మేలు. కాని హరిభక్తివిహీనుల సంగతి మాత్రము మంచిదిగాదు అది నాశకారణము. భక్తిహీనుఁడు తా నశించును అంతియకాక బుద్ధిభేదమును గల్పించి యితరులఁ బాడుచేయును. భక్తివృక్షమునంకురము భక్తసంగమునఁ బెరుగును. హరికథాలాపామృతసేచనమున వృద్ధియగును. అభక్తాలాపదీపాగ్నిజ్వాలావేశముచేతను భక్తివృక్షాంకురము శుష్కించును. భక్తిసంగమున నాప్యాయితమగును. కావున భక్తుఁడుకానిమూర్ఖుని సహవాససంభాషణములఁ బట్టుదలంబూని వదలుము. కాలసర్పమును గాంచి మనుజుఁ డెట్లు భీతిచేఁ బరుగిడునో యట్టుల భక్తునిగాంచినపుడు సాధువులు బెదరుదురు. యశోదాదేవీ! ప్రయత్నపూర్వముగ నీ కుమారుఁ డనఁబడు నీశ్వరుని రామ నారాయ ణానంత ముకుంద మధుసూదన కృష్ణ కేశవ కంసారి హరి వైకుంఠ వామన నామంబులఁ బదునొకండింట భగవంతుని ధ్యానించి నమస్కరింపుము. ఈనామముల జపింపుము. నిన్నాశ్రయించినవారలచే జపింపఁజేయుము. సకలజన్మపాతకములు నశించు.

## ఏకాదశనామ నిర్వచనము: రామనామము.

రాశబ్దము విశ్వవచనము. మశబ్ద మీశ్వరవాచకము. విశ్వముల కీశ్వరుండగుట రాముఁడనంబడు. రమాదేవింగూడి యానందించునుగాన రాముఁ డనఁబడు నని పెద్దలు కొంద అందురు. రామతత్త్వమునెఱింగిన కొందఱువిద్వాంసులు రమాదేవికి విహారస్థానముగాన రాముఁ డనంబడునందురు. రాశబ్దము లక్ష్మీవచనమనియు, మశబ్ద మీశ్వరవాచకమనియుఁ గావున లక్ష్మీపతి పరమగతి రాముఁ డనఁబడునని మఱికొందఱు చెప్పుదురు. భగవద్దివ్యనామసహస్రజపమున లభించుపుణ్యము రామనామోచ్చారణమాత్రమున లభించును.

## నారాయణనామము.

నారశబ్దము సారూప్యముక్తివచనము. అవి యయనము గాఁగలవాఁడు కాన నారాయణుఁ డనంబడును. కృతపాపులు నారశబ్దవచనులు. అయనమన గమనము కృతపాపులు గమనము చేయఁదగుచోటు. గావున నారాయణుఁ డనఁబడునని కొంద అందురు ఒక్కమాఱు నారాయణనామము నుచ్చరించిన పురుషుఁడు చిరజన్మసంపాదితపాపనిర్ముక్తుఁ డగుటయ కాక గంగాదిసర్వతీర్థస్నానజనితమహాపుణ్యమును బొందును. ఇది నిశ్చితము. నారమనఁగా మోక్షము. అయనమనఁగా జ్ఞాన మీప్సితము పుణ్యమునగు. ఆరెండింటిజ్ఞాన మెవనినుండికలుగునో యాప్రభువు నారాయణుఁ డనఁబడును.

## అనంతనామము.

ఏభగవంతునకు నంతము లేదని చతుర్వేదములు, పురాణ

ములు, శాస్త్రములు ఘోషించుచున్నవో యాకారణమున ననంతుఁ డను పేరు కల్గెను.

### ముకుందనామము.

ముకుశబ్దము మోక్షవాచకము. దాని ననుగ్రహించు వాఁడు గావున ముకుందుఁ డనంబరఁగు. ముకుశబ్దము భక్తిరస ప్రేమవచనము. ఇది వేదసమ్మతార్థము. భక్తుల కా భక్తిరస ప్రేమము నొసంగువాఁడు కావున ముకుందుఁడన నొప్పునని కొందఱందురు.

### మధుసూదననామము.

మధుదానవుని సంహరించెనుగాన మధుసూదనుఁ డన భగవంతుఁ డొప్పును. కొందఱు పెద్దలు వేదార్థములఁ బరిశీలించి వేఱొక యర్థము నీనామమునకుఁ జెప్పుదురు. మధుశబ్దము నపుంసకలింగము. ఇప్పపూవులనుండి తీసినమద్యమున కర్థము. ఇది సామాన్యార్థము. విశేషార్థము కర్మమని. అది శుభాశుభ రూపముగనుండును. భక్తులు చేయుకర్మమునకు సదనము భగవంతుఁడు కాన మధుసూదనుఁ డనఁబడు. పరిణామావస్థ యందశుభమును గల్గించునదియు, నాది మధురముగా నుండు నదియు మధువనంబడు. భ్రాంతులగువా రొనరించుకర్మములు, నట్టిదానిని దొలఁగించి శుభకర్మములఁ జేయ ననుగ్రహించు వాఁడు కావున, మధుసూదనుఁడని చెప్పఁబడునని కొందఱు మహాత్ములు చెప్పుదురు.

### కృష్ణనామము.

కృషి యనుశబ్దము పరమానంద మనునర్థమును దెలుపును. ణకారము తద్దాస్యకర్మమును దెలుపును. ఆ రెండింటిని

ప్రసాదించుభగవంతుఁడు కావునఁ గృష్ణనామమునఁ గీర్తింపఁబడును. కోటిజన్మార్జితపాపమునందును, క్లేశమునందును గృషిశబ్దము వర్తించు. ణకారము నిర్వాణ మనునర్థమునందు వర్తించును. భక్తుల కట్టిపాపమును క్లేశమును దొలఁగించి సంతోషము నిచ్చువాఁడు గావునఁ గృష్ణుఁ డనంబడునని మఱి కొందఱందురు. దివ్యనామసహస్రములు మూఁడుమాఱులు జపించిన నేపుణ్యముకల్గునో యది కృష్ణనామము నొకమాఱుచ్చరించినఁ గలుగును. కృష్ణనామమునకంటె నుత్కృష్ట నామము భూతభవిష్యత్కాలముల లేదు. సర్వనామోత్కృష్ట నామమని కృష్ణనామమును వేదవేత్తలు పలుకుదురు. గోపకుల ప్రసూతవగునో యశోదా! కృష్ణా కృష్ణా యని నిత్య మెవ్వరాభగవంతుని స్మరింతురో జలమును భేదించుకొని కమలము పైకివచ్చినట్లు నరకమునుండి యాజనుఁడు భగవంతునికరుణచే వచ్చును. కృష్ణా యనుపరమశుభనామ మేభక్తునివాక్కునందు వర్తించునో మహాపాతకకోటు లాతనినుండి వెడలి భస్మములగును. కృష్ణనామజపఫలము అశ్వమేధసహస్రఫలాధికము. తత్ఫలమునఁ గలుగుజన్మమునకంటె నుత్కృష్టతరముగుజన్మము కల్గును. ఆజన్మమున నాతఁడు భక్తశ్రేష్ఠుండగు. సర్వయజ్ఞములు, లక్షలకొలంది వ్రతములు, సర్వతీర్థస్నానములు, నిరశనవ్రత నియత తపస్సులు, వేదపాఠసహస్రములు, భూప్రదక్షిణశతములు చేసిన నే పుణ్యఫలముగలుగునో యది శ్రీకృష్ణనామజప పుణ్యఫలషోడశాంశమునకు సరిరాదు. పైనుదాహరింపఁబడిన సత్కార్యములుచేసినచోఁ జిరకాలము స్వర్గవాసము లభించును. కృష్ణనామజపము చేయువానికి శ్రీహరిపదము లభించును.

### కేశవనామము.

కిం శబ్దము జలమనునర్థమును, సర్వదేహమనునర్థమును, దెలుపును. అధిశయనముగాఁగలవాఁడు; కావున, భగవంతుఁడు కేశవుఁ డనఁబడునని వైదికులందఱు పల్కుదురు.

### కంసారినామము.

కంసశబ్దము పాతకమందును, విఘ్నమునందును, శోకమును, దానవునియందును వర్తించును. వానినెల్ల నాశము చేయువాఁడు గావున దైవము కంసారి యనంబడును.

### హరినామము.

విశ్వములను రుద్రరూపమున సంహరించును. భక్తుల పాపములను ధ్వంసము చేయును. కావున హరినామము చెల్లును.

బ్రహ్మస్వరూపిణియై మూలప్రకృతియని, యీశ్వరి యనియు, నారాయణియనియు, విష్ణుమాయయనియు, సనాతని యనియు, మహాలక్ష్మీస్వరూపయనియు, వేదమాతయనియు, సరస్వతియనియు, రాధయనియు, వసుంధరయనియు, గంగాదేవి యనియుఁ జెప్పంబడు మాదేవికి ధవుఁడుగాన మాధవుఁ డనంబడును. బ్రహ్మేశశేషప్రభృతిదేవతలచే నమస్కరింపఁదగినట్టియు, ధ్యానింపఁదగినట్టియు, సనకాదిమహానుభావులచే ధ్యానింపఁబడునట్టియు నవనీతచోరుఁ డనఁబడు శ్రీకృష్ణుని భజింపుము. పరమేశ్వరుఁడు వేదపురాణములచే నిరూపింపఁబడినవాఁడు. పాలు, పెరుగు, ఘృతము, నవనీతము, తక్రము ననునవి యెక్కడ? వానిని దొంగిలించు టన నెక్కడ? యశోదా! పరబ్రహ్మము నీచేఁ జిక్కి కట్టివేయఁబడు టెక్కడ? యోగులచేత, సిద్ధులచేత, మునీంద్రులచేత, భక్తసంఘముల

చేత, యోగులచేతను బద్ధుఁడుకాని పరాత్పరుఁడు నీచేత ఱోలు నడుమకట్టి వేయఁబడెననుట విచిత్రము. తల్లి! కుమారుఁడను భ్రాంతి వదలుము. ప్రేమముచేతను, భక్తిచేతను, స్తవములచేతను, పూజావిశేషములచేతను భగవంతుని శ్రీకృష్ణుని సేవింపుము. హృదయారవిందమున నిలిచి యీశ్వరుఁడై వెలయు కృష్ణుని ధ్యానముచేతఁ బ్రయత్నపూర్వకముగా నారాధింపుము. జననీ! యశోదా! నీమదిఁ గల్గువాంఛకుఁ దగినవరమును గోరుము. దాని నొసంగెదను. దేవతలకునుగూడ దుర్లభమైన నొసంగెదను.

అని రాధ పలుకఁగా యశోద సంతోషమున నిట్లు పలికెను. లోకజననీ! రాధా! శ్రీహరియందు నిశ్చలభక్తియుఁ దద్దాస్యమునుగలుగ ననుగ్రహింపుము. మఱియు నీనామవ్యుత్పత్తి నెఱిఁగింపుము. ఇదియ నావాంఛితము. అన విని రాధిక యిట్లు పలికెను.

రాధానామవ్యుత్పత్తి.

యశోదా! శ్రీహరియందు నీకు నిశ్చలభక్తి కుదురుఁగాక. దుర్లభమగుతద్దాస్యము లభించుఁగాక. నానామవ్యుత్పత్తిని దెల్పెద. ఆలకింపుము. చాలదినములక్రింద భాండీరవనమున వటవిటపిమూలమున నందుఁడు నన్నుం గాంచెను. వ్రజేశుఁడు నన్ను నిర్బంధపూర్వకముగా నడిగెను. ఆతని కెఱింగించియుంటిని; మరలఁ జెప్పెద. అవధరింపుము. నేనే రాధికను. రాపాణకామినిని నేనే. రాపాణుఁడు శ్రీహర్యంశసంభూతుఁడు. పార్షదప్రవరుఁడు. రాశబ్దము మహావిష్ణువాచకము. ఎవనిలోమములందు విశ్వములుండునో యతఁడే

మహావిష్ణువు. విశ్వప్రాణులయందును, విశ్వములందును ధా శబ్దము ధాత్రీయనుమాతృవాచకము. విశ్వప్రాణులకు విశ్వములకు ధాత్రిని. మాతను నేనే. మూలప్రకృతియన్న నీశ్వరియన్న నేనే. కావున రాధానామము నాకుఁ బ్రసిద్ధమైనది. హరిచేతను, బండితులచేతను, దేవతలచేతను నాకీనామము పెట్టఁబడినది. అట్టి నేను సుదామునిశాపమున నిపుడు వృషభాను తనూజనైతిని. నాకు నూఱువత్సరముల శ్రీహరితోఁటి విరహము కల్గును. వృషభానుఁడు గోలోకమున శ్రీకృష్ణపార్షదప్రవరుఁడు. పితృదేవతలకు మానసపుత్రిక యగు కలావతి నాతల్లి. నాతల్లియుఁ నేను నయోనిసంభూతలము. మరల మిమ్మందఱిఁగూడి గోలోకమునకుం బోవుదును. అనిపలికి మఱియు రాధాదేవి యిట్లు పలికెను.

యశోదా! నీ వడిగిన విషయములకు బదులిడితిని. నీవింక వ్రజమున కరుగుము. జ్ఞానియు, నీకు స్వామియు నగు నందునిం గూడియుండుము. నాకీమాటలవలన శ్రీకృష్ణధ్యానమున కవకాశము కలిగినది. ధ్యానభంగము మనుజులకు మహాపాపమును గల్గించును. అనిపలికి రాధాదేవి నిమీలితనేత్రయై శ్రీకృష్ణపరబ్రహ్మపాదపంకజములనాత్మహృదయారవిందపీఠమున నిలిపి ధ్యానయోగమునూనెను. యశోదయు నందుఁడును దదుపదేశమునఁ గడుంగడుభక్తి యలరఁగా నావాక్యములనే స్మరించుచు ధ్యానభంగము చేయరాదని తలంచి యాచోటు వాసి వ్రజమునకుంబోయిరి. రాధాసఖీజనము తమకార్యములయం దప్రమత్తలై యుండిరి.

ఆర్యమహాశయులారా! శ్రీకృష్ణమూర్తిని యశోద జ్ఞాన ముపదేశింపుమని కోరుటయు, భగవంతుఁ డందుల కిడిన యుత్తరము, రాధామందిరమునకు యశోద నందుంగూడి పోవుటయు, నందు రాధాస్థితియు, నామె యశోదకు భక్తియోగము నుపదేశించుటయు ననునీకథలుగల యీభాగమును బఠించితిరికదా. దీనిసారము నించుక యాలకింపుఁడు. ఇందు ననేక విచిత్రతరవిషయములు గలవు. కొన్నింటినిమాత్రమే తెలిపెదను.

శ్లో. "మాముద్ధర మహాభాగ ధరోద్ధరణ కారణ
భవాబ్ధితరణే భీమే భీతాం చ పతితా మపి,
మాయామయీ సా ప్రకృతిర్భవాబ్ధితరణే తరిః.
త్వమేవ కర్ణధారశ్చ భక్తోత్తీర్ణ కృపామయ."

అని యశోద కుమారుని గాంచి ప్రార్థించెను. అంతియగాక,

శ్లో. "జ్ఞానం చ భవతా దత్తం పిత్రే నందాయ మాధవ,
మాం చాపి మాతరం వత్స కృపాం కురు కృపానిధే."

అనియుఁ బ్రార్థించెను. ఇది లోకస్వభావవిరుద్ధముకదా యని ప్రశ్నింపరాదు. యశోదకుఁ దొలుత నీజ్ఞానము కలుగక పోయెను. కావున హరినందునకు మాత్రమే యుపదేశించెను. రుక్మిణీకల్యాణానంతరము భగవంతుని యమానుషశక్తి పరిస్ఫుటముగాఁ దెలియరాఁగా మనస్సు పరిపక్వమయ్యెను. అత్తఱిఁ గృష్ణుఁడు తనకు కుమారుఁడుమాత్రమే కాఁడు. తన్నుద్ధరించువాఁడని స్ఫురించెను. ఏక్షణమున నాజ్ఞాన ముద యప్పుడే భగవంతుని బ్రార్థించెను. ఇంతకాల మేల

కలుగలేదనరాదు. తొలుదొలుత నీజ్ఞాన మామెకుఁ గలిగినను, భగవంతుఁడు దాని మఱుగుపఱచుచువచ్చెను. తనమాయచే నామె నాచ్ఛాదించెను. ఇపుడు తాఁజేయుకార్యములు ఎల్ల రకుఁ దెలియందగినది. కావునఁ దాఁగప్పిన మాయనించుక సడలించెను. భగవంతుఁడు తనంతన సడలింపకపోయిన నామాయను బోలఁగింప నేరికిఁ దరముకాదు ఈవిషయమును శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు,

శ్లో. "అవిద్యానామంత స్తిమిరమిహిరద్వీపనగరీ
జడానాం చైతన్య స్తబకమకరందస్రుతిఝరీ,
దరిద్రాణాం చింతామణిగుణనికాజన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రామురరిపువరాహస్య భవతి."

అను సౌందర్యలహరీశ్లోకమును స్పష్టపఱచిరి. భగవద్గీతాశాస్త్రమునందును,

శ్లో. "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మే తాం తరంతి తే."

అని శ్లోకముద్వారా శ్రీకృష్ణమూర్తి తేటపఱచెను.

అనఁగా నామాయ దాఁట నెవ్వరికే నశక్యము. ఎవరు నన్నే యాశ్రయింతురో వారీమాయను దాఁటుదురు. ఇద్దాని భావ మేమనఁగా, పరమేశ్వరా! ఈమాయను దరించు నుపాయము నాకుం దోఁపకున్నది. పురుషప్రయత్నమున నిది సాధింపఁబడుకార్యముకాదు. శరణాగతుఁడను, మాయను దరించు నుపాయము నీవే కరుణింపవలయు. అనఁగాఁ దదనుగ్రహపాత్రునిగాఁజేసి పిదప నీచెంతకుఁ జేర్చుకొనుముని కదా. ఎవరు భగ

వంతు నాశ్రయింతురో వారు మాయను బోద్రోచికొని హరి పదమునకుఁ బోవుదురని కొందఱందురు. అది పాటింపఁ దగు మాటకాదు. ఏలయనఁగా నెవరు భగవంతునిఁ బ్రార్థింతురో వారెల్లఁ దుచ్ఛముగా నీమాయను పోషొమ్మని పోద్రోచుకొని పోవఁజాలుదురేని భగవంతుని నోట "దైవీ ఏషా గుణమయీ మమ మాయా దురత్యయా" అను పదములు వెడలవు. 'దురత్యయా' అనఁగా "దుఃఖేనాత్యయః అతిక్రమణం యస్యాస్సా" అని కదా శ్రీకృష్ణా యన్నంతమాత్రమున మాయ పటాపంచలై పోవుచో దురత్యయా యేలాగగును? అపుడు మమ మాయా యని కృష్ణుఁడు చెప్పుట యంత సరసముకాదు.

తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్.

అని కదా లోకాచారము కలదు. దీనిసార మిద్ది. తొలుదొలుత భగవన్మాయ యగుప్రకృతిని (ఇచ్ఛాశక్తిని) నుపాసించి తల్లీ! నన్నీ సంసారబంధమునుండి తొలఁగించి భగవత్పదమునఁ జేర్పుమా యని ప్రార్థించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడై యత్తఱి నాదేవి యొసంగిన జ్ఞానలవమున నీసంసారము తుచ్ఛమనుజ్ఞానము దృఢముకాఁగా భగవత్పద మొందుసని భావము. ఈయర్థము నే భగవంతుఁడు గీతాశాస్త్రమునందు వ్యక్తపఱచెను. వినుఁడు.

శ్లో. "సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. 2
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్. 3

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. ౯
మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే." ౧౦

(౯. అధ్యా.)

పై నాభావము నీశ్లోకములు దృఢపఱచుచున్నవి. ప్రకృతిని మనుష్యప్రయత్నమున దాఁటరాదనియేకదా భగవంతుని భావము. "మామేవ యే ప్రపద్యంతే" అనఁగా నన్నే యెవఁడు నమ్మియుండునో. నన్నే యను నవస్థ భగవంతున కెపుడుకలుగును? సగుణత్వమునందేకదా. ప్రకృతిని దా నాశ్రయించియున్నవాఁడు దానిని దుచ్ఛమని పలుకునా? నాయాజ్ఞచే నీబ్రహ్మాండజాలములఁ బుట్టించుచున్నదని పల్కెనుకదా. కావునఁ దొలుదొలుతఁ బ్రకృతి నాశ్రయించి తత్కారణకుం బాత్రుఁడు కావలయునని యే భగవంతునిభావము. ఇఁక యశోదావిషయము నకు వత్తును. భగవత్సంగమున నించుక జ్ఞాన మెప్పుడుకలిగినదో యపుడే యామెకుఁ గుమారుఁ డనుబుద్ధి తొలఁగెను. సంసారసాగరతారకుఁ డనునూహ కలిగెను. అట్టి దృష్టియందు భేదబుద్ధి నశింపకమానదు. ఆభేదబుద్ధి పోఁగానే పరిపక్వచిత్తురాలని భగవంతునకుఁ దోఁచును. వారికి నుత్తమమార్గమును జూపుటయే భగవంతునిపని. కావున యశోదప్రశ్నము నాలకించి శ్రీహరి యించుక జ్ఞానమును దెలిపి రాధికను దలంచి యామెద్వారా యశోద కుపదేశింపఁ దలంచుకొనియెను. ఏలయనఁగా, రాధిక యెవ్వతయో యని భావించుచున్నది. ఆమె ప్రకృతియని యెఱింగినఁగాని యీయామె తరింపఁజాలదు. ప్రకృతి నుపాసింపక

పోయిన నన్నుఁ జేరుట దుస్తరము. నా యిచ్ఛాశక్తి నెఱుంగ యున్న నన్నెఱుంగనట్లే యని తలపోసి తల్లీ! రాధకడకుం బోవ నియె. ఆదంపతు లట్లేపోయిరి. రాధికస్థితిని దిలకించిరి. విస్మయం పడిరి.

అత్తరుణమున రాధిక బాహ్యప్రపంచజ్ఞానములేక కృష్ణ పదాంబుజధ్యాననిరతయై మహానందము నొందుచు నది యతిశ యింప నానందబాష్పములు ధారలుగాఁ గాఱుచుండఁగాఁ దద నుభవమున మైమఱచుచుండెను. అట్టిధ్యానమునందు బాష్ప ములు స్రవించునా యని విచారింపఁబనిలేదు. భర్తృహరి వైరాగ్యశతకమునందు.

శ్లో. "ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రు కణా౯ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః."

అని స్పష్టపఱచియున్నాఁడు. అట్టి రాధికాదర్శనమున వారిద్దఱు కృతకృత్యులైరి. ఆ రాధిక ప్రసన్నవదనయై

శ్లో. "న చ మే విషయజ్ఞానం న జానామి నరం పశుమ్."

అని పల్కెను. హరిభక్తివిహీనుఁడు పశుతుల్యుఁడని యామెభావము. ఈమాటచేతనే ఓయశోదా! శ్రీకృష్ణుఁడు నాకుమాఱుఁడని భావించి సర్వలోకారాధ్యుఁడు పరబ్రహ్మమని తలంపక ప్రేమమున నాదరించుచున్నదానవే. ఇట్టి నీకంటె నర పశువుకలదా యని స్వాభిప్రాయము నుపదేశించెను. ఆవల భక్తి —గము నుపదేశించెను. అందుఁ దొలుత హరిభక్తులు కాని వారిసంగతి వర్జింపవలయుననియె. ఇంకొకవిశేషము కలదు.

శ్లో. "సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహిత్వమ్,
నిర్మోహిత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః."

అని శంకరభగవత్పాదాచార్యులుగారుపలికినట్లు సత్సాంగత్యము కోరఁదగినది. అది సర్వశుభములఁ గల్గించును. సజ్జనులనఁగా భక్తిగలవారు. దైవభక్తిగలవారని భావము. ఇట హరిశబ్దము భగవద్వాచకము భగవద్భక్తిచే నహంకారము నశించు. దానిచే సర్వజనసమారాధనమున బుద్ధిపొడమును. దాన భగవద్దాస్యము గల్గును. దాన దుర్విషయములు తొలఁగును. దాన ధ్యానయోగము కుదురును. దాన భగవత్కారుణకుఁ బాత్రుఁడగుభాగ్యము కల్గును. దాన ముక్తి కరతలామలకముగ నుండును. ఇట్లు పరంపరాసంబంధమున నాలోచింపఁగా భగవత్కారుణకుఁ బాత్రుఁడగుటకుఁ దొలిసోపానము సత్సహవాసమే యనవలయు. దానిని మానిన గత్యంతర మగపడదు. దుస్సహవాసమున దుర్విషయములయందు బుద్ధిపొడమును. కావుననే పెద్దలనుభవమున నెఱింగిన దుస్సహవాసము వదలవలయు ననుమాటను గట్టిగఁ జెప్పిరి.

కొంద ఱిప్పట్టున నొకప్రశ్నము చేయుదురు. సత్సహవాసమున దురాత్ములు పవిత్రులు కావలయునుగదా. సజ్జనులు మూర్ఖుల దగ్గరకే రానీయకున్న నిఁక వారు తరించుటెట్లు? అని. ఈప్రశ్నముచేయువారి కించుక లోకజ్ఞానము తక్కువ యనక తప్పదు. ఎవఁడు పరిపూర్ణ భక్తిజ్ఞానము కలవాఁడో ఆమహాత్ముఁడెందున్నను వానిమనస్సు చలించదు. అపరిపూర్ణ భక్తిజ్ఞానులు తొలుదొలుతఁ బరిపూర్ణజ్ఞానుల సహవాసము చేయుచుండవలయు. స్థిరము కాంచనిభక్తి దుస్సహవాసమున మలినమగు.

కావున నట్టివారు తొలుదొలుత హరిభక్తులతోడనే మెలంగు చుండవలయు. దానఁ దమమదుల నంకురించినభక్తిలత యించుక సాగును. సాగుచున్న కొలందిని దళములు కనఁబడుచుండును. సంపూర్ణశోభతోఁ బ్రకాశించునపుడు దానిశక్తివలన నెందరో బాగుపడుదురు. అది యంకురించినవెంటనే దాని నలపిన నది వృద్ధి యెట్లు కానేరదో యట్లే దుస్సహావాసము తొలుతఁ బనికిరాదని పూర్వమహర్షులు నొక్కి వక్కాణించిరని యెఱుంగవలయు.

పిదప రాధిక యశోదకుఁ దెలిపినది భగవన్నామజపము. పదునొకండు నామములను దెలిపెను. ఈనామములు జపించు చుండిన భగవత్కరుణ తనంతట తానే కలుగునని తెలిపెను. స్తుతిపాఠములను జెప్పక నామజపము నేల యుపదేశించెనని యొకశంక కొందఱకుఁ గలుగునేమో దానింగూర్చి నాలుగు మాటలు వ్రాసెదను. చంచలాత్ములకు స్తుతిపాఠము లుపదేశింప వలయు. అవి పారాయణము చేయుచుండునపుడు వర్ణోచ్చార ణాదులచే బుద్ధి చలించుచునే యుండును. ఆపారాయణమహి మమునఁ గొంతకాలమునకు బుద్ధి యించుక పరిపక్వదశకు వచ్చును. జపమనఁగా మనస్సునుపాస్యదేవతాపాదారవింద ము యందో తన్మూర్తివిశేషమునందో నిలిపి చేయువర్ణోచ్చార ణము. ఇది మానసికమే యుత్తమోత్తమమని శాస్త్రములు సిద్ధాంతము చేయుచున్నవి. కావుననే శ్రీకృష్ణపరమాత్మ గీతాశాస్త్రమునందు.

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః."

(౧౦ అ. ౨౫.)

అని స్పష్టముగాఁ దెలిపిరి. అనఁగాఁ బంచమహాయజ్ఞములు. అగ్నిష్టోమాదు లనేకవిధములగు యజ్ఞము లుండఁగా జపయజ్ఞమే నేనని తెలుపుటకుఁ గారణ మీజపయజ్ఞమున భూతహింసాదులు లేవని, ప్రాయశ్చిత్తాదులు లేవని, పరులను యాచింప నవసరములేదని, ఇతరులసహాయ మక్కఱలేదని, కేవలమనశ్శుద్ధియే ప్రధానమని, అదికుదిరిన నన్నియు ఫలించు ననియేకదా. కావున నామపారాయణమునకంటె నామజప ముత్తమోత్తమమని శాస్త్రకర్తలభావము. మనోనిగ్రహమున కన్న వేఱొకవాంఛనీయపదార్థ మేదియుండును ? అట్టిదానికి మూలాధారము జపము. కావున నది నాస్వరూపమని భగవంతుఁడు తెలిపెను. అన్నియు భగవత్స్వరూపములే. కానిభక్తుల కేది పరమోపకారకమో యద్దానిఁ దెలుపుట పరమాత్మునకు విధి. కావనే యామాటను దెలిపి తక్కినవి భగవత్స్వరూపములు కావనుశంక కలుగునేమో యని హరియే యూహించి,

శ్లో. "యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున,
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్."
(౧౦ అ. ౩౯ శ్లో.)

అని యర్జునునిశంకను దొలఁగించెను. కావున దేనియందు భక్తులఁ గడతేర్చుశక్తి యధికముగా నుండునో యది నాస్వరూపమనుట భక్తులపయింగల కరుణాతిరేకమునఁ గదాయని మనము గ్రహింపవలయు. కావుననే రాధిక భగవన్నామము పారాయణముచేయుటకంటె జపముచేయుట యుత్తమమని యాదేశించెనని మనము గ్రహింపవలయు. దాన బంధములు దొలఁగు. నివృత్తిమార్గము కనఁబడుచుండును. మనశ్చాంచల్య

మును ద్రోలఁగింపునదికదా జపయజ్ఞము. కావున నితరులసాయము గోరక భగవత్కరుణను గల్గించు జపయజ్ఞమును జేయుటకంటె నీకలికాలమున వేఱొకయజ్ఞము పనికిరాదు. కావున భక్తులెల్లరు భగవన్నామజపపరాయణులు కావలయును. ఇదియే రాధికోపదేశసారము. తక్కినవిషయము లనేకము లీయుపాఖ్యానమునఁ గలవు. వానియందలిసారమును బెక్కుతావుల నీవఱకే వ్రాయఁబడినది. కావునఁ దర్వాతిభగవత్కథను వ్రాయఁ బ్రయత్నింతును. దానిం జిత్తగింపుఁడు.

## దుర్వాసుఁడు ద్వారకకుం బోయి కృష్ణమాహాత్మ్యముం గాంచుట.

* యశోదయు నందుఁడు రాధికోపదేశమునుబొంది వ్రజమునకుఁ బోయినపిదపఁ గొన్నిదినములు శ్రీకృష్ణమూర్తి భార్యలంగూడి మానుషానందము ననుభవించువానిచందమున ద్వారకయందుండెను. తన యవతారఫలము గల్గించుట కదను దొరకదయ్యెను. కర్మానుసారము జీవుల కాయాయిఫలములు గలుగుచుండునుగాని కోరినపుడెల్లఁ గలుగవుకదా. ఏయేజీవుల కేయేకర్మఫలముల నేయేరూపముల నీవలయునో యాదేవదేవుఁ డెఱుంగును. కావుననే వానికై వేచియుండెను. ద్వారకానగరవాసులెల్ల హాయిగానుండిరి. కాని భగవంతుఁ డేయే కార్యములు చేయఁబూనునని యొక్కరును దలంపఁజాలరైరి. ప్రతిదినము శ్రీకృష్ణసందర్శనానందసుఖమునుమాత్రము యథేష్టముగా ననుభవించుచుండిరి. దానికిమించిన దేదియు నుండదు

---

ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ౧౧౨ అధ్యాయమునందు ముప్పది తొమ్మిదవశ్లోకము మొదలుగా గ్రహింపఁబడినది.

గాని యపుడు వా రనుభవించుసుఖము శాశ్వతము మాత్రము కాదు. ఏలన భగవంతుని కీరూప మెంతకాలమో యుండదు. కావునఁ దేజోరూపమున నీశ్వరు నుపాసించినచో నేయానందము కలుగునో యది శాశ్వతమైనది. అదియే మహాత్ములయందు విశేషముగానుండును. ఆతేజ స్సెందు విశేషించి యుండునో ఆచోటు గౌరవార్హము. మహర్షులయం దాతేజస్సు విశేషించి యుండును. గావుననే బ్రహ్మతేజోవిరాజితులన్న విఖ్యాతి మహర్షులకుం గల్గెను. దేహపోషణమున నాతేజస్సు లభింపదు. వాసనావస్తువులచేఁ దనువును గై చేసికొనిన లభింపదు. మణిభూషణముల నలంకరించుకొనిన నాతేజస్సు రాదు. భగవదారాధనమును నొక్కమహాకార్యముననే యది లభించును.

శ్లో. "గతం తిరశ్చీనమనూరుసారథేః
ప్రసిద్ధమూర్ధ్వజ్వలనం హవిర్భుజః,
పతత్యధో ధామవిసారి సర్వతః
కిమేతదిత్యాకులమీక్షితం జనైః."

అని మాఘకవి నారదమునియాగమనమును వర్ణించెను. అపూర్వతేజోరాశికదా భగవంతుఁడు. ఆరాశియే భగవంతుని రూపమని యెవ రెఱుంగుదురో దాని నెవరుపాసింతురో వారే ధన్యులు. కృతార్థులు. దానిసామాన్యు లెఱుంగఁజాలరు. భగవంతుఁడు తమకంటె సుందరాకారుఁడను భావమే ద్వారకానగరవాసులకుఁ గల్గినదికాని యింకొక్కభావము కలుగలేదు. ఆయానందమే బ్రహ్మానందమని వారూహించిరి. వారియోగ్యతకుం దగినయట్లు శ్రీహరి ప్రవర్తించుచు నానందపరవశులను గాఁజేయుచుఁ దాను నానందించుచున్నట్లుండెను. కాని యాము

హాత్మునిదృష్టి యీయానందమందు లేదు. దుష్టశిక్షణశిష్టరక్షణ రూపకార్యమునం దాతురతం బూనియుండెను. ఆయాలోచనకుం బరిమితి నిర్ణయింప బ్రహ్మాదులకే దరముకాదన నిక నస్మాదృశులకుం దరమా. అట్టి మానుషాల్పతమానందపల్వలమున విహరించుచు నాచోటం బరమేశ్వరుండుండెను.

ఒక్కనాఁడు దూర్వాసుఁడు శిష్యప్రశిష్యులంగూడి ద్వారకానగరమున శ్రీహరి దర్శించుకుతూహలమున నరుగుదెంచెను. తలఁచుగాం బురాణములయందుం గోటిసంఖ్య వాడంబడుచుండును. అది సముదాయవాచకమని గ్రహింపవలయును. ఆమునీంద్రు నిరాక నెఱింగి రాజగు నుగ్రసేనుఁడు సపుత్త్రుఁడు సపురోహితుఁడై వసుదేవవాసుదేవులు నక్రూరాదులు దన్నుంగూడిరాఁగా నెదురుచని యాతిథేయసత్కృతుల నాచరించి తోడ్కొనిపోయి సౌధమున నునిచి షోడశోపచారములం బరితుష్టునిం గావించి నమస్కరించెను. వేలువేలుగ వారికెల్ల శుభాశిషంబుల నొసంగి యామునికి నేకాంతయనం బరఁగు కన్యక నొసంగెను. ముక్తామాణిక్యహారాదిరత్నముల నాశుభకాలమున యౌతకమిచ్చెను. దివ్యహర్మ్యముననుండం బ్రార్థించెను. ఆదివ్యమందిరమున నారామామణింగూడి యీముని సుఖముగా నుండెను. అది యప్పటి కమ్మునికి శుభాశ్రయముగం గనంబడియెను. కొలందిదినములు సాగంగా నొకనాం దుర్వాసుఁడు తనచేతస్సునందుం జక్కంగ నాలోచించి శ్రీహరి మహిమమును దెలిసికొనంగోరి భార్యాభిష్టకము చెంత నెవ్వాఁడో చూతమని పయనము చేసెను.

శ్రీకృష్ణుఁ డొక్క హర్మ్యమునందు రమ్యపర్యంకంబునఁ బురాణము చెప్పుచుండ వినుచుండెను. ఆపురాణశ్రవణమున నెక్కుడు శ్రద్ధ వహించి యుండెను. ఒక్క సౌధప్రాంగణంబున నొక మహోత్సవప్రయత్నము చేయించుచు నాయా సేవకులకు నాయాయి కార్యములను జేయ నాజ్ఞయిడుచుండెను. సత్యభామా సౌధమునఁ బ్రాణేశ్వరి దివ్యతాంబూల మొసంగుచుండ హాయిగా మాటలాడుచుండెను. వేఱొక్క ప్రాసాదమున రత్నమయతల్పంబునందు శ్వేతచామరముం దాల్చి రుక్మిణీదేవి విసరుచుండ నామెతో విలాసముగ మాటలాడుచుండెను. మఱియొక సదనంబునఁ గాళింది పాదపద్మములఁ దనమృదుతమకరసరసిజముల నొత్తుచుండ నుండెను. ఇట్లు శ్రీహరి భార్యలయిండ్లయం దొక్కమాఱు వారివాంఛలం దీర్చుచుండ దుర్వాసుఁడు పోయిపోయి చూచి సంభాషించెను. తన దివ్యదృష్టిం బరికించెను. ఒక్కతరుణమున నన్నితావుల నొక్కరీతిగా నుండుటం గాంచెను. అద్భుతరసమున మునింగి యామౌని నిశ్చేష్టుఁడయ్యెను. సకలబ్రహ్మాండనాయకుఁ డగు శ్రీకృష్ణమూర్తిని రుక్మిణీమందిరముననుండఁగఁ జూచి యిట్లు వినుతించెను. అత్తఱి సుధర్మాస్థానమున విద్వజ్జనగోష్ఠి భగవంతుఁడుండెను.

జగన్నాయకా ! సర్వమును జయించినవాఁడవు. దుష్టజనులను బీడించు వాఁడవు. సర్వాత్మకుఁడవు. సర్వ జగద్బీజభూతుఁడవు. నిర్గుణుఁడవు. నిరీహుఁడవు. నిర్లిప్తుఁడవు. నిరంజనుఁడవు. భక్తానుగ్రహార్థ మవతరించితివి. సత్య మేకదా నీస్వరూపము. సనాతనుఁడవు. స్వరూపము నీకిదియిష్టమని యిదనిష్టమని చెప్ప శక్యము కాదు. ప్రతిదినము క్రొత్తవాఁడవగు

చుండుదువు. బ్రహ్మాదివందితపాదారవిందద్వంద్వుఁడవు. లక్ష్మీదేవి నీపాదసరోజముల సేవించి ధన్యురాలయ్యెను. బ్రహ్మజ్యోతి యనుపేరు నీకుంజెల్లు. నీమహిమ యిట్టిదని నిర్వచింప శక్యము కాదు. నీగుణరూపములు వేదములనుండియే తెలిసికొనందగు. మహాకాశమువలె మాననీయుఁడవు పరమాత్మవన నీవే. ఇట్టి నీకు నమస్కరించుచున్నాఁడను. అని మనస్సుచే వినుతించి శ్రీహరి యదియెఱింగి స్మితింప సాష్టాంగనమస్కారము లొనరించి శ్రీహరియెదుట నిలువంబడియెను. ఆదుర్వాసుం గాంచి జగన్నాయకుఁడు హితము సత్యము పురాతనము నగునర్థము కల్గునట్లుగా నిట్లు పలికెను. ఆపలుకులయర్థము వేదవిదితము. జ్ఞానస్వరూపము. సర్వసజ్జనసమ్మతము నయియుండెను.

ఓ బ్రహ్మమునీ! భయంపడకుము. నీవు శివాంశజనితుఁడవు జ్ఞానమున నన్నెఱుంగనట్లు పలుకుచున్నాఁడవు. వినఁదెలిపెదను. అవహితుఁడవుకమ్ము సర్వమును బుట్టించువాఁడను నేనే. నావలననే యీబ్రహ్మాండకుటుంబము సాగుచున్నది. సర్వప్రాణులకు నేనాత్మస్వరూపుఁడను. నాకళ లేనిచో జీవకోటులన్నియు శవము లనంబడఁగలవు. నాకళ తనువునుండి వెడలఁగా సర్వశక్తులంగూడి ప్రాణములు వెడలును. నేనొక్కఁడనయ్యు వేలువేలురూపముల ననేకజాతులుగా నగుచుందును. ఎవఁడు భుజించునో వానికిఁ దృప్తియగుచుండును. ఇతరులకు దానఁ దృప్తికాదు. పరిపూర్ణుఁడను. గోలోకమున రాసమండలమున విహరించుచుందును. నాప్రకృతి యగురాధిక శ్రీదాముని శాపమున నన్నుఁ జూడఁజాలకున్నది. జీవకోటులన్నియుఁ దదంశమున నుప్పతిల్లును. కానఁ దత్కళాలేశములే యగును.

రుక్మిణీమందిరమున నొకయంశము, తక్కినభార్యలయిండ్లయం దొకకళయు నాదియుండును. *కొన్ని తావుల మదంశము కొన్ని తావుల నాయంశమున నొక్కభాగముండును. మఱికొన్ని దేహములందుఁ గళొకలాంశముకూడ నుండును. ప్రతిమల యందు నిర్లేపయని యెఱుంగుము. అనిపలికి శ్రీహరి తనయంతః పురమునకుంబోయెను. దుర్వాసుఁడు తనప్రియురాలిని వదలి శ్రీహరినిగూర్చి తప మొనరింపఁబోయెను.

మహామతులారా! ఈ గాథయం దొకయద్భుతము కలదు. తత్సారము నవధరింపుఁడు. దుర్వాసుఁడనుముని భగవం తుని దర్శింపఁగోరి వచ్చెను. ద్వారకానగరమున నుగ్రసేనుఁడు ప్రభువుగా భగవదనుజ్ఞ నుండెను. ఆతఁడు సపరివారుఁడై యందు బలరాముఁడు శ్రీకృష్ణుఁడు నుండఁగా నెదుర్కొని గారవించి తెచ్చి విడిదిని జూపెను. ఈశ్వరప్రేరణమున నమ్మునికి రత్నములను సమర్పించుచు నొకరత్నాకరత్నము నొసంగెను. గృహస్థునకుఁ దగినమందిరము నిచ్చెను. ముని యాకన్నియం బెండ్లియాడి యామందిరమున నుండెను కొలఁదిదినము లాముని తదానందము ననుభవించుచుండెను. తర్వాత భగవం తుని బరీక్షింప నెంచెను. ఒక్కొక్కభార్యమందిరమున నామెతో ముదమలర మాటలాడుచున్నట్లు గాంచెను. తన యజ్ఞానమునకు రోసి భగవంతుని వినుతించెను. ఇందద్భుత మేమనఁగా దుర్వాసున కించుక యహంకారము కలదు. అదియుండుదాఁక జ్ఞానము నిర్మలమునం దగదు. కావున నాతని చిత్తవృత్తిఁ దానెఱింగియుఁ బరీక్షింపఁగోరెను. కన్య నిచ్చె,

* కలాకలాంశాః కుత్రాపి ప్రతిమాసు చ దేహిషు = అని మూలము.

నట్లుగ్రసేనునకు బుద్ధి పుట్టించెను. అతఁడొసఁగెను. ముని యీ బంధము నాకేల యనుకొనక యిచ్చినదే చాలునని గ్రహించి పెండ్లియాడెను. కొలఁది కాలమున కీతపఃఫలముగా జ్ఞాన ముదయించెను. భగవంతుని ధ్యానించి సర్వాంతర్యామిగా నెఱింగి యీ యజ్ఞానమునుండి ముక్తుఁడయ్యెను. ముని శ్రీకృష్ణుని వినుతించినపిదప శ్రీహరి ముని కొక్కవిషయము నుపదేశించెను. అందుఁ గొన్నితావుల నాయంశము నిలుచు ననియుః గొన్నితావులఁ గళమాత్రము నిలుచుననియు నింకను గొన్నితావుల నందించుక భాగముమాత్ర మేయందుఁగన్పట్టెడిని.

శ్లో. "నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦
యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్." ౪౧.

(గీతా. ౧౦ అ.)

అని గీతాశాస్త్రము తెలుపుచున్నది. భగవత్కళ లేనిదికూడఁ గలదా యని ప్రశ్నింపరాదు. ఏలనఁగా భగవంతుఁడే గీతయం దుపదేశించెను. ఏయేవస్తువు తేజోవంతమైనదో యది యెల్ల నాయంశసంభూతమని తెలియుమా యనియె. ఏది యల్పప్రకాశముకలదో అది కలాసంభూతమని తెలియవలయు. అనఁగా నేజీవుఁడు సత్కార్యానుష్ఠానమున నెక్కుడు పుణ్యమార్జించెనో యతనియందు భగవదంశ మెక్కుడుగనుండునని దీనిభావము. దేవాలయములయందుఁ గూరుచుండి జపముచేసినఁ ద్వరగ మంత్రసిద్ధియగు ననఁగా భావమేమి ? భగవత్కళ యందధికముగ నుండునుగాన నాచోటు పరమపవిత్రమనియు, నందుఁ

గూరుచుండిన నాస్థలమహిమమున మనస్సు నిలుకడం గాంచి దుర్విషయములవంకకుం బ్రవహింపక యుండుననియు, దాన మంత్రాధిదేవతపై భక్తి యెక్కుడుగఁ గుదురుననియు భావము. ఇట్లే నదులు సరస్సులు తీర్థములు కాశ్యాదిపుణ్యక్షేత్రములు తపోయోగ్యములని మనవారు పల్కిరి. కొందఱు యాత్రవలన నేమిలాభము గలదు ? గంగాస్నానమున దేహము మాఱునా యని వెఱ్ఱివెఱ్ఱిప్రశ్నముల వేయుచుందురు. వారికి భక్తి కుదురక యిట్టి ప్రశ్నములు తోఁచిన వనవలయు. భగవదంశ మెందెక్కుడుగ విలసిల్లునో యెందు భగవద్భక్తులు వెక్కురుందురో యెందు సాధువులు చిరకాలము నివసించి తపస్సు చేసిరో యాయాయి తావులు పరమపవిత్రములు. అందు నివసించి చేసిన యల్పతపస్సు కూడ నధికఫలం బొసంగును. పాషాణముల యందుఁ గొన్ని ప్రకాశవిహీనములుగ నుండు. కొన్ని యల్ప ప్రకాశములుగ నుండు. ఇంకఁ గొన్ని యధికప్రకాశముగలవిగా నుండు. రత్నము లట్టివే కదా. తేజస్సెందున్న నది భగవదంశమే. అయ్యది కలతావు పవిత్రమే. పాషాణమయమగు విగ్రహము వరములొసంగునా యనఁగూడదు. దానిని భావించు భక్తుని మనశ్శక్తియే ఫలము నొసంగును. ధ్యానమున కదియు నొక సాధనము. సర్వగతునిగా భగవంతుని జూచువారల కట్టి వానితో నక్కఱయుండదు గాని సామాన్యుల కట్టివి నిరుప యుక్తము లనరాదు.

శ్లో. "సందర్శ్యాత్ర శిలాం శిలామయగృహే
సాక్షాదయం శ్రీహరి

ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్
సంసేవ్యమానస్త్వితి,
ఉక్తాం దేవలకస్యవా చ మధికం
విశ్వస్య సంసేవతే
త్వర్థం తత్త్వమసీతి వేదగదితం
నో విశ్వసత్యల్పధీః"

అన్న శంకరభగవత్పాదాచార్యోక్తి వ్యర్థముకదా యని ప్రశ్నింతురేమో. యట్లనుగరాదు. నిర్గుణపరబ్రహ్మతత్త్వ మెఱింగినవారి కివి యక్కఱలేదు. కాని యందఱట్టివారు కారు. కావునఁ గొందఱ కివి పనికివచ్చును. ఈకర్మసిద్ధాంతమును నమ్మియే యత్యుత్తమమని యెఱింగియే మనపూర్వులు దేవాలయములఁ గట్టించిరి. పుణ్యతీర్థముల నేర్పఱచిరి. లోకాను గ్రహార్థమేకాని స్వోపయోగార్థముకాదు. ఆరహస్యమెఱుంగకయే కొంద ఱాక్షేపింతురు. జ్ఞానశూన్యులు వేదాంతార్థములం దెలుపఁబూనుటంజేసి యిట్టిపాట్లు జనులకుం గలుగుచుండు. నిరీహులు మాటలాడినను జెల్లునుగాని యీషణాత్రయ బద్ధులు మాటలాడినఁ జెల్లవు. వారు లోకవంచకు లనఁబడుదురు. ధనము సంపాదింపఁగోరి కామాతురులై కొందఱు వేదాంత వాక్యములు నాలుగు నేర్చుకొని లోకుల కుపదేశించుచుఁ దమవాంఛలఁ దీర్చుకొనుచుందురు. అట్టివంచకులచెంతకుం బోరాదు. వారిమాటల నాలకింపరాదు. పెద్దలగువారు తమ్మాశ్రయించినవారికే యుపదేశింతురు. ద్రవ్యమును గోరరు. అట్టి వారినే యాశ్రయింపవలయును. స్వానుభవముగలవారిపల్కులు వినఁదగినవి. వంచకుల వంచకములంబోలె భావించి దూరముగ

నుండఁ బొఱిఁదోలవలయును. బహువిధకర్మముల నొనరించిన వారి కాయాయిపద్ధతుల నేర్పఱచియున్నారు. వానిని వారాశ్రయింపవలయును. హెచ్చుపద్ధతుల నాశ్రయింప వారికి యోగ్యతలేదు. బలవంతముగా వారి కాపద్ధతుల నవలంబింపుఁడని పలుకరాదు. కావున భగవన్నిర్మితమార్గము లన్నియు నొక్కరికే పనికిరాకున్నను వాని కర్హులు కలరని నమ్మి వారి నాక్షేపింపక వారివారిమార్గముల వారనుసరించుచుండఁగా వారికి నుత్సాహమును గల్పింపవలయు. అంతియకాని నిరుత్సాహము కలుగునట్లు చేయరాదు. ఇట్టి నీతులం దెల్పు నీచరిత్రమును బఠించి మదిని బదిలము చేసికొనుఁడు. ఇఁక దర్వాతికథ నాలకింపుఁడు.

## దుర్వాసునకుఁ బార్వతి శ్రీకృష్ణమహిమమును దెలుపుట.

* శ్రీహరి యుపదేశముంగొని దుర్వాసుఁడు శిష్యప్రశిష్యులంగూడి ద్వారకానగరమును వదలి కైలాసమున శ్రీపరమశివునిదర్శింపఁ గోరి పోయెను. అందుఁ బరశంకరుఁడు పార్వతింగూడి మహర్షులు పాదారవిందముల భజింపఁగా వటవిటపిమూలమున నుండెను. దుర్వాసుఁడు భక్తిపరాక్రాంతస్వాంతుఁడై పార్వతీపరమేశ్వరులకు వందన మాచరించెను. సశిష్యుఁడై యిట్లు వినుతించెను. ద్వారకానగరమున జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిపెను. తనతపస్తత్వమును వైరాగ్యమును గుఱించి పలికెను. ఆముని శంకరునకిట్లు తనవృత్తాంతమును దెలుపుచుండఁగాఁ బార్వతి నవ్వి మునింగాంచి యిట్లు

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నూటపదుమూఁడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని తెలియవలయును.

పలికెను. ఆవాక్యము సత్యము హితము నై యుండెను. పరమ శివుఁ డాలకించుచుండెను.

మునీంద్రా! ధర్మతత్త్వము నెఱుంగఁజాలవు. కాని నిన్ను ధర్మిష్ఠునిగా భావింతువు సంతానహీనురాలగు సుదతిని వదలి తపస్సొనరింప నెచటికిఁ బోవుదువు ? సంతానహీనయై వయస్సుగలిగి కులమున సమానురాలై పతివ్రతయునగు భార్యను బరిత్యజించి సన్న్యాసియైనను, బ్రహ్మచర్యవ్రత మూని నను, యతిత్వ మంగీకరించినను, వాణిజ్యాభిలాషఁగాంచినను, ప్రవాసమందుఁ జిరకాలమెవ్వాఁడుండునో వాఁడు తీర్థమునం దున్నను, దపస్సొనరించినను, మోక్షార్థియై జన్మమును బవిత్రము చేసికొనఁ బూనినను, వాని కందేదియుసిద్ధింపక పోవుటయేగాక ధర్మహానియు సంభవించును. ఆభార్యకష్టమే శాపరూపముగాఁ బరిణమింప నరకమునఁబడును. పరలోకసుఖ మాత్యక్తవ్రతు నకుం గలుగదు. ఈలోకమునందు యశోహానియుఁ గల్గును. అని మున్ను బ్రహ్మయే పలికెను. కావున నో బ్రాహ్మణుఁడా ద్వారకానగరమున కరుగుము. స్వధర్మమును రక్షింపుము. ఏకాంతశయను నీయంగన నాయంశమున జన్మించినది. కావునఁ జక్కఁగాఁ బాలింపుము. శంకరునిపాదారవిందము సనకాదుల కేని దుర్లభము. శ్రీహరిపాదారవింద మట్టిదియే. భక్తజన సుర తరువరమగు హరిపాదసరసిజములఁ బరిత్యజించి తపస్సుచేయ నెచ్చటికింబోవుదువు? మనోహరామృతమును ద్రోసివైచి పంకిల జలపానముచేయఁబూనుట యెట్టిదో యీనీప్రయత్నమట్టిది. శ్రీకృష్ణచరణసరోజముల స్వప్నమునందైనను ఏ మానవుఁడు జపించునో శతజన్మకృతపాపములఁ దొలఁగించుకొనఁజాలును.

ఇందుల కావంతయేని శంకలేదు. అట్టిభక్తుఁడు బాల్య కౌమార యౌవన వార్ధకములయందుఁ గామముననొండె నకామముననొండెఁ జేసినపాతకములెల్ల భస్మీభూతములగును. భారత వర్షమున నెవఁడు శ్రీకృష్ణచరణకమలముల దర్శించునో వాఁడే పూజ్యుఁడు, జీవన్ముక్తుఁడునగు. సకలతీర్థములే శ్రీహరిపాదస్పర్శమునఁ బవిత్రములగునో యట్టిశ్రీకృష్ణుని దర్శించువానిపాపములు కోటిజన్మములనుండి రాశిగానున్నను నశించుటకొక చిత్రమా. అదియే వ్రతము. అదియే తపస్సు. అదియే సత్యము. అదియే పుణ్యము. అదియే సర్వదేవతాపూజనము. శ్రీకృష్ణసేవ జన్మఖండనము. సఫలము. శ్రీకృష్ణభక్తివిహీనుఁ డగుబ్రాహ్మణుఁడు వేదపారగుఁడైనను సత్సంగముగలవాఁడైనను భక్తుఁడైన నాభక్తినశించునని యెఱుంగుము. శ్రీకృష్ణనైవేద్యాన్నము నెవఁడు భుజించునో వాఁడే సద్బ్రాహ్మణుఁడు. వహ్నివాయువులకంటెఁ బరిశుద్ధుఁడు. ముల్లోకములఁ బవిత్రీకరింపఁజాలును. అట్టిశ్రీకృష్ణపరబ్రహ్మమును వదలి తపస్సుచేయ నెందుఁబోయెదవు. ? శ్రీహరిస్మరణమున సర్వతపఃఫలమును గలుగును. ఏకారణమునఁ బరమాత్మయగు శ్రీకృష్ణునందు భక్తికుదురున ట్లెగురువు శిష్యునకుపదేశింపఁడో యాగురువు పరమశత్రువగును. ఆతనిజన్మము నిష్ఫలము.

అని యిట్లు పార్వతీదేవి శ్రీకృష్ణమాహాత్మ్యము నుపదేశింప విని పరమశివుఁడు ప్రేమవిహ్వలుఁడై యామెనుమెచ్చుకొనియెను. మునియుఁ బులకాంచితసర్వాంగుఁడై యాపరదేవతను మిగుల స్తుతించి యాయాదిమదంపతులకు మ్రొక్కి శ్రీకృష్ణపాదపద్మములఁ బలుమాఱులు స్మరించుచు మరల

ద్వారకానగరమున కరిగెను. అందు వేంచేసియున్న శ్రీహరిం గాంచి పలుభంగుల వినుతించి యేకాంతంబుం జూడఁగోరి యామె యింటికింబోయెను. ఆమెయుఁ బతిరాకకలరి పూజింప నందుండి మనోహరుఁడై కాలముగడపుచుండెను. శ్రీకృష్ణమూర్తియుఁ బార్వతియుపదేశమును మదినెఱింగియు నెఱుంగనట్లుండి భవిష్యత్కాలగతుల నాలోచించుచుండెను.

ఆర్యమహాశయులారా! ఇందొక్కవిశేషముకలదు గాని దానింగూర్చి యీవఱకే వ్రాసితిని. కాన మరల వ్రాయఁబూనక నాలుగుమాటలు వ్రాసి వేఱొకకథ వ్రాయఁ బూనెదను. శ్రీకృష్ణమహిమము నెఱుంగఁగోరి దుర్వాసుఁడు కైలాసమున కరిగెను. పార్వతీపరమేశ్వరులం గాంచి నమస్కరించి వినుతించెను. శంకరుఁడూరకయుండఁగాఁ బార్వతి సుస్మితమొప్ప మునికిఁ గర్తవ్యమును దెలిపెను. ఏల? అనఁగాఁ బ్రకృతి సృష్టి పాలనములయందలి రహస్యములఁ దెలుపును. ముక్తిదాత భగవంతుఁడు కావునఁ దన్మార్గమును శంకరుఁడు తెలుపును. సంసారమునుండి వెడలు భాగ్య మామునికింకను రాలేదు. కాన శివుఁ డూరకుండెను. ప్రవృత్తిమార్గము శివురాణి యనఁబడుశక్తియే తెలిపెను దుర్వాసుఁడిపుడు భక్తుఁడు. సేవ్యసేవక మర్యాద లెఱుఁగుటయే భక్తిలక్షణము. దీనినే. శ్రీవైష్ణవులు శరణాగతియందురు. ప్రపత్తియనియుఁ గొందఱందురు. అట్టిస్థితియందున్న జీవుఁడు తాఁ జేయవలసినపనుల నన్నింటిని జేయవలయును. కర్మఫలములను గోరరాదు. ముక్తిగోరుట వాంఛ కాదా రాదు. దుర్వాసుఁడిపుడు వివాహితుఁడు. గృహస్థునకు పూజాదులు విధివిహితములు. వానినివదలి రాఁదగదు.

అందును గోరికసిద్ధించుకొనుటకే తపస్సునకు వచ్చినవాఁడుకదా.
గృహస్థునువిహితకర్మముల మానరాదనిశ్రుతి ఘోషించుచున్నది.

"కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ంసమాః,
ఏవంత్వయినాన్యథేతోఽ స్తి నకర్మలిప్యతేనరే." అ మంత్రము.

(ఈశావాస్యోపనిషత్తు.)

రహస్యనివృత్తికారుఁడు రామచంద్రపండితుఁడు

శ్లో. "నిష్కామకర్మాణితుయావదాయు
స్త్వమిచ్ఛకర్తుం కిల యన్ముముక్షుః
ఏవం తవ స్యాన్నఫలేనలేపో
న చిత్తశుద్ధా వితరః ప్రకారః."

అని తెలిపియున్నాఁడు. భగవద్గీతాశాస్త్రమునందును

శ్లో. "యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. ౫
ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. ౬

(౧౮ అధ్యాయము.)

"ఏతాన్యపి కర్మాణి ముముక్షోః కర్తవ్యాని. ఇతి అపి
శబ్దస్యార్థః" అని శంకరభాష్యము.

అనఁగా నిత్యకర్మములు తప్పక చేయఁదగినవే. కాని ఫలా
పేక్షం బూనిచేసిన బంధవిముక్తి కానేరదని భావము.

ఈ భావము మదినునుచుకొనియే పార్వతి మునికి భార్యను
వదలరాదని యాజ్ఞాపించెను. భగవంతునికరుణఁగోరి తపస్సు
చేయ నిచటికేలవచ్చితివి? ద్వారకయందే శ్రీహరియున్నవాఁడు

కదా. అని వివరించెను. దానవాముని తనయజ్ఞతకు సిగ్గుపడి మరలిపోయెను. సర్వవ్యాపియగుభగవంతు నారాధించుటకు హిమవంతమున కేలరావలయునని పార్వతిభావము. సర్వగతుని గా ధ్యానించునంతటి మనోదృఢత్వము లేకయే యామునివచ్చెను. పార్వతి హితోపదేశమువలన నజ్ఞానాంధకారము వదలి పోవఁగా మరలి ద్వారకకే పోయెను తపోనియమములుకూడ నందఱ కొక్కప్రకారముగనుండవు. యోగ్యతానుసారమే యవియుఁ జెప్పఁబడినవి. సర్వాంతర్యామిగాఁ బరమాత్మను జూచువారికి క్షేత్రమహిమములతో బనిలేదు. భూశుద్ధి మొదలగు యోగాంగముల ననుసరింపఁబనిలేదు. అట్టివిధుల ననుసరింపఁదగువారు కొందఱు కలరు. నిర్మలచిత్తుఁడు వాని ననుసరింపఁ బనియుండదు.

శ్లో. "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథావర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧
(గీత. ౬. అధ్యా.)

అని శ్రీకృష్ణమూర్తియే గీతాశాస్త్రమునందు బోధించెను. సర్వభూతాంతర్యామిగా భగవంతుని, సర్వభూతములను దదాత్మమయములుగా నెవఁడు చూచునో యతఁడు సమదర్శనుఁ డనఁబడును. అట్టివానికి క్షేత్రప్రభావములతోఁ బని యేలయనఁగాఁ బూర్వజన్మకృతయోగసాధనమున మనో

దార్ఢ్యము కుదిరినది. కావున మరల నాకృషిచేయ నక్కఱలేదని యీవిషయమునుండి మన మెఱుంగవలయును. తీర్థయాత్రాదులు యోగమునఁ గృషిచేయని చంచలాత్మకులకనియు, నదిలేని వారల కవి యక్కఱలేదనియు, నట్టివారుచేసిన లోకులకు మార్గముచూపుటకే యనియు మనమెఱుంగవలయును. ఇట్టి యనేక విషయముల నీకథ మనకు బోధించుచున్నది. కథను జదువునపుడు గ్రహింపఁ దగువిషయము లిట్టివియేకాని కథలో నున్నవర్ణనాంశములు కావు. కావున భక్తిభావమున భగవచ్చరిత్రమును బఠించి యాగాథ యేవిషయమును దెలుపునో దాని నెఱింగి భగవత్కారుణకుం బాత్రులు కావలయును. ఇంకఁ బార్వతి కథ నాలకింపుఁడు.

ఆర్యులారా! శ్రీకృష్ణమూర్తి యర్జునుంగూడి ఖాండవదహనాదికార్యము లొనరించినకథలు వ్రాయవలసినచోటి దియే. ఆ బెడదలో దిగుటకునునుపే సత్యభామాసహితుఁడై ద్వారకానగరమునుండి నరకాసురాదుల వధింపఁ బయనముచేసినకథలను వ్రాసి యవ్వల వానివ్రాయుట లెస్సయని తోఁచినది. కావున నిట వాని వ్రాసెదను. ప్రక్రమభంగమేయని పరితాపము గనఁబఱుపఁబూనక యాలకింపుఁడు. భగవద్గుణానుకీర్తనమునకుఁ బూర్వాపరవైషమ్యములు బాధకములుగావు. వానినే ప్రధానములుగాఁ బాటించువారు కొందఱుందురు. కాని వారికిఁగథమాత్రమే కాలక్షేపమునకుఁ గావలయును. పూర్వాపరవైషమ్యముల నన్వేషించుట భక్తులలక్షణము కాదు. పామరులవ్వానింగాంచి యందేమో తప్పుండునని నెమకి తమబుద్ధియత్యల్పము కాన దానికిం దోఁచినవాని నాక్షేపించుచుఁ దమ

దుష్పాండిత్యమును వెల్లడించుకొనుచుందురు. అట్టివి భక్తుల కేల? భగవన్నామసంకీర్తనము తచ్చరిత్రపారాయణము, తద్గుణగణపరికీర్తనజనితానందానుభవము ననునివియే భక్తులకుం గావలయునవి. కాఁబట్టి మీయభ్యనుజ్ఞ వేఁడి యారంభించెదను. ఒక్క తడవ శ్రీకృష్ణనామపారాయణ మీ శ్లోకరూపమునఁ జేయుఁడు.

శ్లో. "విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం
విశ్వాసస్తబకితచేతసాం జనానామ్,
పశ్యామః ప్రతినవకాంతికందళార్ద్రం
పశ్యామః పథి పథిశైశవం మురారేః." ౫౬

శ్లో. పాదౌపాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ
పాణీవేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియౌ
బాహూదోహదభాజనం మృగదృశాంమాధుర్యధారాగిరౌ
వక్త్రంవాగ్విభవాతిలంఘితమహో బాలం కిమేతన్మహః." ౫౭

(శ్రీకృష్ణకర్ణామృతము ౧. అ.)

## నరకాసురవధవర్ణనము.

* శ్రీహరి రుక్మిణీప్రభృత్యష్టభార్యలంగూడి ద్వారకా

* ఈకథ బ్రహ్మపురాణము తొంబదిమూఁడవ యధ్యాయము నుండియుం హరివంశవిష్ణుపర్వము నలుబదిమూఁడవ యధ్యాయమునుండియుం శ్రీభాగవతము దశమస్కంధము నేఁబదితొమ్మిదవ యధ్యాయమునుండియుం, విష్ణుపురాణము పంచమాంశము ఇరువదితొమ్మిదవ యధ్యాయము నుండియుం గ్రహింపఁబడినదని యెఱుంగునది.

నగరంబున సుఖంబుండి తనచేయఁదగు మహోత్తరభూభార హరణకార్యమునుగూర్చి యాలోచించుచుండెను. సమయ మాసన్నమగుచున్నదని యాలోచించుచుండెను. ఇంతలో నొక విశేషము భూలోకమున సాగెను. అదియే నరకాసురచరిత్రము. కన్నులు మూసి తెఱచునంతలో బ్రహ్మాండములు పెక్కు సారులు జనించినశించును. అట్టిపరమేశ్వరుఁడు మదినాలోచించి నంతన యక్కార్యము సాగకయుండునా. శ్రీహరి రుక్మిణిని పరి ణయమాడి ద్వారకానగరమును జేరినవార్త చెవిసోఁకినప్పటి నుండి నరకాసురుఁడు బహుభంగుల లోకమున కపకారము చేయుచుండెను. సాధువులొనరించులోకోపకారకార్యములకు సదావిఘ్నములు తాఁజేయుచు నితరులచేఁ జేయించుచు నుండెను. వాని కాతరుణమున వెఱ్ఱియెత్తినట్లుండెను. సర్వదా సాధువుల బాధించుటయే వానికిం బనిగానుండెను.

"అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే."

అన్నసూక్తి యక్కాలమునఁ జక్కఁగాఁ దగియుండెను. అత్తఱి వాని పేరువిన్న దేవతలు విశేషించి భయంపడుచుండిరి. అందును దేవేంద్రునకుఁ గల్గిన సాధ్వసము వచింప శక్యము కానిది. వాఁడపుడు మూర్తీభవించిన పౌరుషమో యన్నట్లుం డెను. మునులు వానిపేరుస్మరించి వడఁకుచుండిరి నిత్యకర్మాను ష్ఠానతత్పరత యాభీతిముందఱ నిలువఁజాలకుండెను. వాఁడును మునులసత్కర్మములు సాగకుండఁజేయుటకే బద్ధకంకణుఁడై యుండెను. త్వష్టకూఁతును గ్రహించి కశేరుస్థానమునకుంబోయి దానినాక్రమించెను. త్వష్టృపుత్రిక పదునాల్గువత్సరములుదాఁటి

పదునేనువత్సరములు మించనిప్రాయము కలదిగానుండెను. ఆమెం బరిగ్రహించి గర్వమున విజృంభించుచు నిట్లు పలికెను. తన్వంగీ! నేను ప్రాగ్జ్యోతిషపురాధిపతిని. నాపేరు నరకాసురుఁ డందురు. దేవ మనుష్యలోకములయందును, సాగరములయందు నెన్నిరత్నములుగలవో వానినెల్ల నావశమునను న్నవానింగాఁ దలంపుము. దైత్యదానవులు తిరిగితిరిగి సర్వరత్నములను దెచ్చి నాకిచ్చుచుందురు. ఉత్తమరత్నములు నమూల్యవస్త్రములు నాయధీనములు. వానినెల్ల నీవనుభవింపుము. అనిపలికి యామెం గూడి స్వేచ్ఛమైఁదిరుగుచు గంధర్వకన్యకలఁ జెఱపట్టెను. దేవతాకాంతల బాధించెను. మానుషకన్యకలఁ బరిగ్రహించెను. అచ్చరలఁ గైవసము చేసికొనియెను. పదునాఱువేల నూఱుమంది స్త్రీలను స్వాధీనమున నునుచుకొనియెను. అందుఁ గొందఱేకవేణీధరలై సతీమార్గావలంబినులై యుండిరి. నరకునకు లోఁబడినవారు కారు. వారినెల్లఁ గారాగారమున నునిచెను. అట్టివారికి మణిపర్వతమున నొక నగరవరమును నిర్మించి యందుంచెను. అలకానగరమును బాధించునపుడు వాని కించుకంతయుఁ జింత కలుగలేదు. మురాసురుఁడు వానికి చెలికాఁడు. ఆమురదానవునకుఁ బదుగురు కొమరులుగలరు. వారెల్లరాక్షసప్రవరులు. వారీ నరకాసురుని సేవించుచు సహాయులుగ నుండిరి. ఇన్నిసాయము లుండుటంబట్టి యానరకాసురుఁడు తమోగుణరాశియై వరప్రభావదృప్తుఁడై యేరిని లక్ష్యము చేయకయుండెను. ఏకాలమునఁ గాని యెట్టి ఘోరరాక్షసులును జేయనట్టి ఘోరకార్యము లీ నరకాసురుఁడు చేయుచున్నాఁడేయని యెల్లరును జెప్పుకొన

పాగిరి. ఇట్టి ఘోరాసురుఁడు పుట్టలేదు, పుట్టనుబోఁడు, పుట్టిన వారిలో లేఁడనువార్త లోకమునఁ బ్రబలెను.

ఒకానొకదినమున నరకాసురుఁడు ఇంద్రజననియగు నదితికి లోకాతీతకాంతిసమన్వితములగు కుండలము కలవని వినెను. వానిని గ్రహింపఁగోరి యమరావతికింజని యామెనదలించివాని బలిమిమై లాగుకొనిపోయెను. ప్రాణములతో నుండనిచ్చినదే చాలునని యింద్రాదులు సంతసిల్లిరి. కాని వానినెదిరింపఁజాలక పాఱిపోయి ప్రాణములఁగాపాడుకొనిరి. ఆనరకాసురుని భూదేవి ప్రసవించెను. ప్రాగ్జోతిషమనునగర మాతనికి నివాసముగనుండెను. సంగరముల దుర్మదులగుదానవులు నల్వురుద్వారపాలకులాతనికడఁజేరిరి. గ్రీవుఁడు, నిసుందుఁడు, పంచనదుఁడు, మురుఁడునని వారిపేరులు. నరకాసురునకుఁ బెక్కుమంది భార్యలు, వారికిం బెక్కుమంది కుమారులు గలరు. వారెల్ల భూమినావరింప సమర్థులు. ఒక్కొక్కతఱి సురపురమునవరోధించును. వేఱొకతఱి దిక్పాలకులనగరముల నడ్డగించును. వేఱొకతరుణమునఁ బాతాళమును నిరోధించును. పుణ్యాత్ముల బాధించుటే వానిపని. వానికడ విరూపులగు రాక్షసులు పెక్కుమంది కలరు. వారిం గాంచినంతన భయంపడి కొందఱు ప్రాణముల విడుతురు.

ఆమహాసురుని వధించుటకే శంఖచక్రగదాసివిభూషితకరుండై పురుషోత్తముం డావిర్భవించెను. ఆమహాత్మునకు దేవకీవసుదేవులు తల్లిదండ్రులైరి. ఆ తేజోరాశికి నివాసము ద్వారకానగరమయ్యెను. అందున్న పరాత్పరుని సేవించి యోగీంద్రులు కృతార్థులగుదురు. ఇది దేవతానిర్మితనగరము. ఇంద్రనగరమునకంటె సౌందర్యాదుల ద్వారకానగరము మించినది.

సాగరమధ్యమున నలరుచుఁ బర్వతపంచకమున విభాసమానమై కాంచనతోరణాన్వితమై యానగరవరము విలసిల్లును. ఆనగరమునకు దాశార్హీ నామముగలదు. వృష్ణ్యంధకాదులు ద్వారకానగరమున నివసించి రామకృష్ణులంగూడి లోకరక్షణదక్షులై యుండిరి. శ్రీహరియు నందుండి లోకమును రక్షించుచుండఁగా నొకనాఁడు వాయువు దివ్యగంధోపేతంబై వీచెను. వెంటనే యంబరమునుండి పుష్పవృష్టి గురిసెను. కిలకిలాశబ్దము వినఁబడియెను. దివ్యకాంతి ప్రకాశించెను. ఆతేజస్సు విచిత్రముగ నెల్లరకుందోఁచెను. ఒక్కముహూర్తకాలమునకు భూమియం దది వ్యాపించెను. ఆతేజోమధ్యభాగమునందుఁ బాండురగజపతి కనఁబడెను. దానిపై దేవమౌనిగణోపేతుఁడై వాసవుఁడు తోఁచెను.

ఇంద్రుఁడని యెఱింగి బలరామకృష్ణులు నుగ్రసేనుఁడు వృష్ణ్యంధకాదులంగూడి యెదుర్కొని యథార్హముగఁ బూజించిరి. ఇంద్రుఁడును గజమునుండి దిగి వారియాతిథేయములను గైకొని శ్రీకృష్ణు నాలింగనమున గౌరవించి బలదేవుని బరిరంభణమున సంతసింపఁజేసి యాహుకుని (ఉగ్రసేనుని) రాజుగావున యథార్హముగఁ గొనియాడి వారి ననుసరించి యున్నవారినెల్ల నుచితరీతి బహూకరించి తక్కినవారిని వయఃపరిమితి ననుసరించి వివిధవిధుల సంతసింపంజేసి రామకృష్ణసందర్శితాసనమునఁ గూరుచుండెను. ఎల్లరుఁ దమతమపీఠముల నుపవిష్టులైరి. స్వవిభూషణరత్నకాంతులచే నాసభను వెలుగొందఁజేయుచు [illegible]్యాదిపూజను గ్రహించెను. అన్యోన్యకుశలప్రశ్నానంతరము మహాతేజుఁ డగునింద్రుఁడు తనసోదరుఁ డనువిఖ్యాతి నొక

ప్పుడు కాంచిన శ్రీకృష్ణుని వీక్షించి యిట్లు పలికెను. నిజ కరకమలమున శ్రీకృష్ణునిచుబుకము పుణుకుచు సాంత్వన పూర్వకముగ నిట్లు పలికెను. మధుసూదనా! దేవకీనందనా నాయాగమనకారణమును వినుము. నీవమిత్రకర్శనుఁడవు. కావున నిన్నుఁ జూడవచ్చితిని. నిర్భీతుఁడు నరకుఁ డనుపేరి వాఁడు విరించివరసంచయదృప్తుఁడై సురలతల్లి యగునదితి కుండలములఁ దనచేతితో నూడలాగి కొనిపోయెను. ఇఁక మా కనవరతము విప్రియమునే చేయుచుండువాఁడు. మహర్షులకు వాఁడుకల్గించుబన్నములఁదెలుప శక్యముకాదు. వానిని దేవాంతకునిగా భావించి పాపపూరుషుఁడని వధింపుము. ఈగరుత్మంతుఁ డాతఁడుండునగరమునకుం గొంపోవఁగలఁడు. కామగమనుఁడు కావున నిన్నటఁ జేర్చును. అంతరిక్షమార్గమునఁ గొంపోవఁ గలవాఁ డీవైనతేయుఁడే. నరకాసురుఁడు మతేభూతముల చేత నవధ్యుఁడనుట నిక్కము. భూతనయుఁడు. అట్టివాని సంహరింపఁ ద్వరపడుటుత్తమము. పాపాత్ముఁడుకావున వానిని వదలరాదు. వాని వధించి త్వరగా రావలయును. జనార్దనా! ఎన్నివేలమందినో కన్యకలనుదెచ్చి యింటనుంచినాఁడు. మా తల్లి కుండలములఁ గైకొనుటమాత్రముకాదు. వరుణదేవుని ఛత్రమును గైకొనెను. మందరాద్రియందలరారు మణిమయ శృంగమును బెకలించితెచ్చెను ఊరకుందమన్న నుండవీలులేదు. ఇపుడీ యైరావతమును గోరుచున్నవాఁడని వింటిని. ఆమాట విన్నప్పటినుండి నాపరితాపమునకు నూహింపఁగాఁ బరిమాణము కానరాదు. కావుననే నిన్నుదర్శింప వచ్చితిని. కావున నావచి

యించినదంతయు సత్యముగనుండునని నమ్మి చేయఁదగిన కార్యము నొనరింపుము. అని యింద్రుఁ డూరకుండెను.

శ్రీకృష్ణుఁ డాయింద్రుని ప్రార్థనల నాలకించి నరకాసురు వధించుటే యపుడుత్తమకార్యమని భావించెను. వెంటనే యింద్రునికరము నిజకరసరసిజమున గ్రహించి దేవనాయకా! భీతిల్లకుము. వానివధించి నీకుందు మాన్పెద. ఇఁక వాఁడీరూప మున నుండఁడని నమ్ముమని యింద్రునూఱడిల్లఁజేసెను. మహేంద్రునకు విశ్వాసముగలుగఁ బ్రతినచేసెను. అతఁడాశపథమును విని యెంతయు సంతసిల్లి నరకాసురబాధ తప్పినదని భావించెను. ఆతరుణమున శ్రీహరియుండుహర్మ్యము సత్యభామాంతఃపురము. అందే కొలువుచేయుచుంట శ్రీహరియలవాటు. గరుడారూఢుఁడై పయనముచేయ నిశ్చయించుకొన్న శ్రీకృష్ణుఁడు తొలుత నింద్రునిబొమ్మని చెప్పెను. సెలవంది యింద్రుఁ డమరావతి కరిగెను. హరియు నూహించి మున్నుతాను నీయను మతినొందియే నీకొడుకు వధింతునని తాభూదేవికొసంగియున్న వరమును స్మరించి సత్యభామ భూమ్యంశసంభూతురాలుగావున నామెంగూడియే యుద్ధమునకరుగు టుత్తమమని నిశ్చయించి సత్యభామనుగూడి గరుడారూఢుండై పయనము సాగించెను. ఈయర్థముగల శ్రీభాగవతశ్లోకముంజూడుఁడు.

శ్లో. "సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ"

వ్యా. "తదా తస్యాః కౌతుకాయ తయా భార్యయా సహ యయావితి. యద్వా. త్వదనుజ్ఞయైవ త్వత్పుత్రం హనిష్యామీతి ఇతిహాసోక్తం భూమ్యై వరం దత్తం, సత్యం కర్తుం సత్యభామాయా భూమ్యంశత్వాత్తయా సహ యయావితి." అని

శ్రీధరాచార్యులు, సభార్యః అన్నమూలమున కింతభావము గలదని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ఇఁక నీమూలలేశమునకు మహాకవి పోతనగారు. సత్యభామ హరిప్రయాణమెఱిఁగి యిట్లు ప్రార్థించెనని వ్రాసిరి. ఆపద్యముఁలం జూడుఁడు.

శా. "దేవా నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు చూడఁగోరుదుఁ గదా ప్రాణేశ! మన్నించి న
న్నీ వెంటంగొనిపొమ్ము నేఁడు కరుణన్ నేఁ జూచి యే తెంచి నీ
దేవీసంహతికెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్.

వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె.

సీ. సమదపుష్పంధయ ఝుంకారములుఁ గావు
భీషణకుంభీంద్ర బృంహితములు
వాయునిర్గతపద్మ వనరేణువులు గావు
తురగలింఖాముఖో ద్ధూతరజము
లాకీర్ణజలతరంగాసారములు గావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంససారస కాసారములు గావు
దనుజేంద్రసైన్యకదంబకములు

తే. కమల కహ్లార కుసుమ సంఘములు గావు
చటులరిపుశూలఖడ్గాది సాధనములు
కన్య నీవేడ రణరంగ గమనమేడ
వత్తు వేగమ నిలువుము వలదు వలదు.

వ. అనినం బ్రియునకుఁ బ్రియంబు జనియింప నగ్గఱి.

ఉ. దానవులైననేమి మఱి దైత్యసమూహములైననేమి నీ
మానితబాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక నీ

తో నరుచెంతునంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె నమ్మానిని దన్ను భర్తబహుమానపురస్సరదృష్టిఁ జూడఁగన్."

అని యింత పెంచి వ్రాసిరి. సత్యభామ ప్రార్థించుటయు, హరి యామెభావము నెఱుంగఁగోరి రణరంగమునఁ గలకష్టములం దెలుపుటయు, నామాటలకు జంకక తనపైఁగల విశ్వాసమును దెలుపుపలుకుల నామెపలుకుటయు ననునివి సమయానుకూలముగ బాగుగనేయున్నవనక తప్పదు. మూలమునందుఁ గాని వ్యాఖ్యయందుఁగాని యీభావమే లేదు. వ్యాఖ్యయందుఁగల కారణములు చక్కఁగానున్నవి. వానినైనఁ గైకొనకపోవుట యించుక చింతగల్గింపక మానదు. ఈఘట్టమున నే పురాణముగాని యీభావమును దెలుపలేదు.

ప్రతస్థే గరుడేనాథ సత్యభామాసహాయవాన్. (హరివంశము.)
సత్యభామాం సమారోప్య యయౌ ప్రాగ్జ్యోతిషం పురమ్.
(బ్రహ్మపురాణము.)

విష్ణుపురాణమున బ్రహ్మపురాణమునఁగల శ్లోకములే యుండునుగాన నందునిట్లే యున్నది.

ఇట్లు సత్యభామను గరుడునిపైఁ గూరుచుండఁబెట్టుకొని పయనము సాగించెను. సేనాధీశు లెవ్వరుభగవంతుని యనుజ్ఞ లేకున్నఁ బోవరాదని యూరకుండిరి. గరుడారూఢుఁడై కృష్ణమూర్తియు, నైరావతము నెక్కి హరిహయుఁడును జనుచుఁ గ్రిందుగఁ బైననుండ వత్యద్భుతముగఁ జూపట్టిరి. ప్రాగ్జ్యోతిష నగరమును ముట్టడింపనరుగు నుపేంద్రుని, నాతనిం బురికొల్పి వచ్చుచున్న శతమఖుని గంధర్వాదిదేవతాభేదములు వినుతిం

చిరి. విజయముగల్గుంగాక యని కోరిరి. కొలఁదిముహూర్త ములకిరువురు నదృశ్యులైరి. గరుడుఁడరుగుచుండఁ దత్పక్ష విక్షేపసంజాతవాతము ప్రతిలోమగతి వీచెను. దాన నాకుల తంగాంచిన మేఘములు భయంకరముగ గర్జిల్లినవి. ప్రాగ్జ్యోతిష నగరము గిరిదుర్గముగాన రథముపైఁ బోవక హరి గరుడా రూఢుఁడై పోయిపోయి కొలఁదిగడియలకే యానగరమును దిలకించెను. దూరమునుండియే దానింగాంచి యచ్చెరువందెను. ఆనగరము సామాన్యజనులకగమ్యమని దానింగాంచినవా రూహింపకమానరు. దానిచెంతనే నగరమును గాపాడనియమించిన చతురంగబలముల హరి కనుంగొనియెను. మురదానవుఁ డానగ రమును గాపాడనెన్నియో మాయోపాయములు పన్నియుం డెను. ఏశత్రువులుగాని యేయుపాయమునఁగాని దానిచెంతకేఁ బోవఁజాలరు. దానిచుట్టు మురదానవనిర్మిత శత్రుమృత్యుకర షట్సహస్రపాశములు గలవు. వానింగాంచినపుడు, శ్రీహరి మది నొకవింత పొడుకొనియెను.

అత్తఱి శ్రీకృష్ణుఁడు గరుడునిపై శంఖచక్రాద్యాయుధ ములందాల్చి పీతవస్త్రమలరారఁ గన్నులపండువుగా నుండెను. చతుర్భుజుఁడై యపుడుండెను. వనమాల యురమునఁ గనుల పండువుగా నుండెను. శ్రీవత్సచిహ్నమందే వెలుగొందుచుం డెను. చిరత్నరత్నకిరీట మెంతయో మనోహరముగనుండెను. సూర్యతేజస్సు భగవత్తేజస్సుకడ నదృశ్యమగునట్లుండెను. పీతాంబర మాహరినీలతనువున నొప్పుచుండఁగా విద్యుత్సహి తాభ్రమువలె నొప్పుచుండెను. హరిజ్యాలతికఁ గోటికెక్కించి మీటిన నొకశబ్ద ముప్పతిల్లి యశనినిస్వనమును గ్రిందు

చేయుచుండెను. ఆధ్వని మురదానవుఁడు వినియెను. సాక్షాత్తుగ విష్ణువే యుద్ధముచేయవచ్చెనని యతఁడెఱింగెను. దానఁ ద్విగుణీకృతక్రోధుఁడయ్యెను. దాన నాతనికన్ను లెఱ్ఱవడియెను. ఆ త్తఱిఁ గాలాంతకునివలె వాఁడు చూడనయ్యెను. వాఁడు జలముల శయనించియుండువాఁడు. పంచశిరములతనికిఁగలవు. సకలమాయాకోవిదుఁడని వానికిం బ్రసిద్ధిగలదు. కావున వాని జోలికెవ్వఁడేని పోవకుండెను. ఆదానవుఁడు జలములనుండి లేచి యావులించి శ్రీహరి మార్గ్గాన వచ్చుచుండెను. వాఁడు వచ్చి తన్నెదిరించులోపల శ్రీకృష్ణమూర్తి గదత్రిప్పివైచి పర్వతదుర్గములఁ జక్కాడి తీవ్రనారాచములం బ్రయోగించి శస్త్రదుర్గముల నిర్మూలించి సుదర్శనమును వైచి, వాయుజలాగ్నిదుర్గముల, నామమాత్రావశిష్టములుగాఁజేసి యసిచే మురాసురప్రహితపాశంబులఁ దుత్తునియలుగాఁ జేసెను. మఱియు గదాఘాతములఁ బ్రాకారములఁ జూర్ణములు గావించి నగరరక్షకయంత్రసాధనములఁ బటాపంచలు గావించి దానవుల మానసములు వడఁకునట్లు శంఖమొత్తెను.

ఆపాంచజన్యనాదము మఱింత తన్నుఁగలఁత నొందింపఁగా మురదానవుండు వడివడిం జనుదెంచి కరమున శక్తియను నాయుధము మెఱయఁగా హరిని సమీపించి సింహనాదమొనరించుచు, వజ్రకాంచనవిభూషితయగు నాశక్త్యాయుధమును, బ్రయోగించెను. అంబరమున మండుచువచ్చు మహోల్కవలె వచ్చుచున్న శక్తిం దిలకించి కాంచనచేలుఁడు సుస్మితాననుండై కాంచనపుంఖంబగు నొకశరంబును గోదండంబునఁ జేర్చి యాకర్ణముగ లాగి ప్రయోగించి యాక్షురప్రమునఁ దాని రెండుగా

ఖండించెను. ఆరెండుతునియలును మరల వచ్చుచుండఁగా నైదుశరములవైచి చూర్ణములుగా నొనరించెను. శక్తిహీలివోవ మురదనుజుఁడు క్రోధతామ్రాక్షుఁడై మహత్తరగదాయుధమును గైకొని హరిపై విసరివైచెను. ఇంద్రకార్ముకనిస్సృతంబగు వజ్రముంబోలె ఘోరారావంబు గావించుచు నదియడరెను. హరి యాకర్ణముక్తంబగు నర్ధచంద్రసాయకంబున గదను నడుమఁ దునియలుగావింప బంగరుపూలచే నలంకృతయగునాగద శకలాకృతులతో ధరఁబడిరెను. ఇట్లు మురాసురుఁడువైచిన యాయుధముల నవలీలఁ ద్రుంచుచుఁ గొంతతడవు పోరాడి వానియాయుఃపరిమాణము ముగిసెనని యెఱింగి యొక్క భల్లంబున వానిశిరస్సు ఛేదించెను. వానిమాయాపాశములు వానితోడన తెగిరెను.

మురదానవుంబొలియించి సింహనాదముచేయు హరిం బరికించి యింతంతనరానియాగ్రహంబునఁ దత్తనయులు పితృవధసంజనితమన్యువులై శతమన్యుసోదరు మర్దింపనుమకట్టి *తామ్రుఁడు, అంతరిక్షుఁడు, శ్రవణుఁడు, విభావసువు, వసువు, నభస్వంతుఁడు, అరుణుఁడునను మురతనయులలోఁ బ్రధానులు సకలాస్త్రసంభృతహస్తులై తమసేనాపతియగు పీఠదానవుని

* మురదానవపుత్రులు పదిమందియని హరివంశమున "మురోశ్చైవ దశాత్మజాః, నైబుతాశ్చ యథాముఖ్యాః పాలయంత ఉపాసతే" అని కలదు. శ్రీభాగవతమునందు "తస్యాత్మజాస్సప్త పితుర్వధాతురాః ప్రతిక్రియామర్షజుషస్సముద్యతాః" అని కలదు. బ్రహ్మపురాణమునందు. "మురస్య తనయాన్ సప్తసహస్రాణి తతోహరిః" అని కలదు. కావున సప్తతనయులు ప్రసిద్ధులు, తక్కుంగలవార ప్రసిద్ధులని యన్వయించితినని యెఱుంగునది.

బురస్కరించుకొని నరకాసురుఁడు తమ్ముమఱింత పురికొలుపఁగా హరిం దాఁకి తమయాయుధములనెల్ల నొక్కమొగిం బ్రయోగించిరి. బహునామముల బహువిధాకృతుల వచ్చు నాతీవ్రాయుధములం గాంచి హరి మోమునవ్వొలయ నిశితాంబకములఁ దిలప్రమాణశకలములుగ నొనరించెను. ఇఁక వీరి నీయిలనుండ నీరాదని శార్ఙ్గచాపంబున బాణమ్ములుగూర్చి కొందఱకంఠంబులు, కొందఱబాహువులు, కొందఱపాదంబులు ఖండించి యందఱ యమసదనంబున కనిపెను. మఱియుఁ దన్నుమార్కొన నేతెంచిన నరకాసురబలములఁ బరిమార్చెను. నగరము చెంతకుఁబోవు నంతలోఁ దన్నుమార్కొనవచ్చు నిసుందునిం గాంచెను. వాఁడు వాహినీపరివృతుఁడై హయగ్రీవుఁడు వెంట రాఁగా ననదృశ పరాక్రమవంతులగు దానవులు పెక్కండ్రు కొలుచుచుండ వచ్చుచుండెను. అందు నిసుందుఁడు దివ్యకాంచనరథమెక్కి యరిదురాసదంబగు కార్ముకంబుచే నందివచ్చుచు నగరాభిముఖుఁడై యరుదెంచి మురవైరిఁగాంచి కినుకమ్మైఁ బదినారాచంబుల వైచెను. హరియు డెబ్బదియమ్ముల వాని నొంచెను. మఱియు నిసుందుఁ డడరించునంబకములఁ దనచెంత జేరకయుండ నడుమనే తుత్తునియలు గావించెను. అంతట నాతనిసైనికులు హరిఁజుట్టుముట్టిరి. ఒక్కొక్కరును బెక్కమ్ము లడరించి హరిం గానరాకుండఁజేసిరి. భగవంతుఁడా దానవులఁజంప గోపమూనెను. దివ్యమగుపర్జన్యాస్త్రమును గరంబునఁదాల్చి తచ్ఛక్తి శరవర్షంబుం గురియించి వారినెల్లఁ బైఁబడకుండఁజేసెను. ఆపర్జన్యాస్త్రము బహుశరములం గల్పింపంజాలునదికాని నొక్కొక్కని నైదైదు బాణములఁ గప్పి కలంచెను. మర్మంబుల భేదించెను. దాన వారట నిలువఁ

జాలక నలుదెసలకుఁ బరుగిడిరి. ఆఘోరాహవముఁ జూడనోడి భానుఁడు వెలుంగఁడయ్యె. ఆకాశ మదృశ్యమయ్యె. దిక్కులు కనఁబడకపోయెను. అట్టితన సేనలపాటు జూచి నిసుందుఁ డాగ్రహించి తీవ్రమార్గణముల హరినాచ్ఛాదించెను. వానియాటోపము నిలుపంబూని హరిసావిత్రాస్త్రమును గరమునఁ గీలించెను. దానిచే నిసుందప్రహితబాణముల శకలములుగా నొనరించెను. మరల వాని నానాశరములఁగప్పెను. వానిసితచ్ఛత్రము నొక్కయమ్మునను, రథమును మూఁడుబాణములను, నాల్గుగుఱ్ఱముల నాలుగుబాణములను, సారథినైదుబాణంబులను, ధ్వజమునొక్కమ్మునను, వానితనవు నొక్కకత్తివాతియమ్మునను నొప్పించి వాని శిరస్సు నొకభల్లమునఁ గూల్చెను. నిసుందుఁడు మృతినొందినంతనే యతనిసుతుఁడు సహస్రవర్షములు దేవతలతోఁ బోరాడినమహావీరుఁడు హయగ్రీవుఁడు తండ్రిపాటుఁగాంచి క్రోధకలుషాత్ముఁడై పౌరుషమలర నొక్కబృహచ్ఛిలనుబట్టి యూచి వైచెను. ఆశిల శైలమును మించియుండెను. దానింగాంచి శ్రీహరి పర్జన్యాస్త్రమున నేడుతునకలుగా ఖండించెను. అది దానవుని గుండెలవియ నిలఁబడియెను. అంత నాయిరుపురకు దేవదానవయుద్ధోపమానయుద్ధము సాగెను. అది క్రమక్రమముగా ఘోరమై ఘోరతరమై ఘోరతమమయ్యెను గరుడారూఢుఁడై శ్రీహరిశార్ఙ్గకోదండము కేలనంది ఘోరసాయకంబులు ప్రయోగించుచుఁ జూడనైన నలవిగాకయుండెను. హయగ్రీవునకుఁ బ్రాపైతత్సైనికులు హరి నానాప్రహారణంబుల నొప్పించిరి. కాని వాని సరకుసేయక హరి వారినెల్ల నొవ్వనేసెను. కొంతతడవు కాఁగా నింక వీరితోఁ బోరాడుచుఁ గాలము పుచ్చనేల యని

చక్రమునఁ గొందఱును, శరవర్షమునఁ గొందఱును సంయమఃపురి మున కనిపెను. అత్తఱి శ్రీకృష్ణప్రహితనారాచములు మేఘవర్ష ములఁ బోలియుండెను. కృష్ణబాణార్దితులై దానవులు కొందఱు రక్తసిక్తాంగులై పుష్పించినపలాశవృక్షంబులంబోలెఁ జూపట్టిరి. క్షణకాలమునకుఁ దద్బలములెల్ల నానాదిక్కులకుఁ బరుగిడిరి. తనసేనలపాటుగాంచి హయగ్రీవుఁడు క్రోధతామ్రాక్షుఁడై వాయువేగమున హరిపైనడరెను. చెంతనున్న యొకవనస్పతిని లాగిపట్టుకొని గిరదిరఁద్రిప్పుచుఁ బరుగెత్తివచ్చి హరిపై విసరి వైచెను. అవృక్షవేగమునఁ గలిగినమహాస్వనమొక్కఁడు మహా త్తరమై చెలరేఁగెను. హరి దానిరాకఁగాంచి సహస్రబాణ ములఁ బ్రయోగించి నడుమఁ దునకలుగావించెను. మఱియొక మహతవహాసన్నిభబాణమున నారక్కసుని హృదయమును భేదించెను. తనయపారతేజములరార నాదానవుని మరల నొప్పింప వాఁడు విగతాసుఁడయ్యెను. వానిసేనలు హతశేషులు భీతులై పాఱిపోయిరి.

ఇవ్విధమున నామురారి హయగ్రీవదానవునిఁ దత్సేనలఁ బొలియించి ప్రాగ్జ్యోతిషనగరంబున కరిగెను. హయగ్రీవుఁడు పంచశిరుఁడు. పంచనదుఁడనియు నతనికి నామాంతరము కలదు. వాఁడు చావఁగనే త్రోవలో శ్రీహరిని మార్కొని పోరాడు వారెవ్వరు లేకుండిరి. ప్రాగ్జ్యోతిషనగరము చెంత కరిగి హరి పాంచజన్యముఁబూరించెను. ఆధ్వని దిక్కులఁబిక్కటిల్లఁజేసెను. ముల్లోకముల నదినిండి నరకాసురుహృదయవిదారణ మొనరిం చెను. అదరిపడి నరకాసురుఁడు క్రోధరక్తాక్షుఁడై లోహమయ ములగు నెనిమిదిచక్రములుగలిగి త్రినల్వప్రతిమంబైన తనరాము

నరదంబునెక్కి పయనమయ్యెను. అది రత్నకాంచనచిత్రాఢ్యము. వేదికాభోగవిస్తరము. దానియందు వజ్రధ్వజ మలరారుచుండెను. కాంచనతోరణ మందుఁ గనఁబడుచుండెను. ధ్వజదండము హేమమయమగుట వింతగొలుపుచుండెను. వైడూర్యమణినిర్మిత కూబర మారథమునఁ గనఁబడుట యచ్చెరువు చూచువారలకుఁ దోఁచుచుండెను. వేయిగుఱ్ఱము లారథము నాకర్షింపఁగానది కదలును. వానిఁగాంచినంతనే శత్రురథములు భయంపడుచుండుట యలవాటు. దానినెక్క నిర్మింపఁబడిన సోపానములు విచిత్రరీతిగానుండెను. ఆరథమధ్యభాగమున నొప్పు నానరకదానవవీరుఁడు సంధ్యాకాలముతోఁగూడినభాస్కరునివలెఁ గానఁబడుచుండెను. ఆరథమున నానావిధామోఘయుద్ధసాధనములమర్పఁబడియుండెను. బంగారుపూవు లాస్యందనమునఁ గనఁబడుచుండెను. వజ్రమయరథమధ్యభాగము చంద్రవర్ణమైదుర్నిరీక్ష్యముగ నుండెను. దానిపైనున్న నరకాసురుఁడు మహాతేజుఁడు. కిరీటాంగదముల నతఁడు వెలుంగుచు రెండవమహేంద్రుఁడా యన్నట్లుండెను. శ్రవణముల రెంటను దివ్యకుండలములు వెలుగొందుచుండెను. ఆతనింగూడి ధూమ్రవర్ణులు మహాకాయులు రక్తాక్షులు వికృతాననులు నానావిధవర్ణకవచధారులు నగు దైత్యదానవు లాహవదోహలమున వచ్చుచుండిరి. కొందఱందు ఖడ్గచర్మములధరించియుండిరి. కొందఱు తూణీరధనుస్సులఁ దాల్చియుండిరి. కొందఱు శక్తిసముజ్వలత్కరులునైయుండిరి. కొందఱు శూలహస్తులు. వారిరథములు నాగములు హయములు భూతలమును జలింపఁజేయుచుండెను. నానావిధాయుధముల ధరించివారెల్లఁ బ్రాగ్జ్యోతిషనగరమునుండి వెడలిరి.

ఆదానవ దైతేయరాక్షసగణంబులంగూడి నరకాసురుఁడు కాలునివలె నొప్పుచు బయలువెడలెను. వాద్యధ్వనులు విశేషించి మ్రోఁగుచుండెను. ఆనినదము జీమూతగర్జితమును మించియుండెను. వారెల్ల శ్రీహరి యేభాగముననుండెనో యాభాగమునకే పరుగిడిరి. ఒక్కుమ్మొగిని వారెల్ల గరుడు నావరించి యుద్ధముచేయ నుంకించిరి. శరవర్షమున నాతని ముంచిరి. శక్తి, శూల, తోమర, ప్రాస, గదాద్యాయుధముల నొప్పించిరి. శరవృష్టిని గురియించిరి. ఆబాణములచే నంబరతల మాచ్ఛాదింపఁబడియెను.

నీలమేఘసంకాశశరీరుఁడగు శ్రీకృష్ణమూర్తియు శార్ఙ్గచాపమును గేలనందుకొని నారిమీటెను. ఆధనుష్టంకారధ్వని ఘనగర్జితమును మీటి యంబరమును బ్రతిధ్వనింపఁజేసెను. అంత జనార్దనుఁడు పరబలార్దనపరుండై బాణముల వెడలించుచుఁ బూర్వాపరకాలప్రహితబాణముల కంతరను కానరాకుండఁ గ్రమక్రమప్రవర్ధితవేగంబున దానవుల నొంచెను. దాని కోర్వఁజాలక యాబలంబు కాలికిబుద్ధిచెప్పెను. సేనలుపరుగిడఁగాఁ గొండలపిండు విడంబించు వేదండముల గరుత్మంతుఁడు నిజపక్షవిక్షేపసంజాతవాతములను నఖములను భిన్నాంగములను జేసెను. చావఁగా మిగిలినవి నగరమును బ్రవేశించెను. కాని యొక్కఁడైన నందు నిలువఁజాలకయుండెను. *సైన్యములు పరు

* హరి నరకాసురులకు సాగినయుద్ధమునందు హరివంశ శ్రీభాగవతముల కించుక భేదము కనఁబడియెను. ఆయుద్ధప్రహరణములవిషయమున నే భేదముగాని ముఖ్యాంశమున నన్నిపురాణము లేకరీతిగనే యున్నవని యెఱుంగునది.

గెత్తుటయు గజబలములు నశించుటయుఁ గాంచి నరకాసురుఁడు క్రోధోజ్జ్వలితనేత్రుఁ డయ్యెను. ఆతనియప్పటి యాకారము సర్వభూతభయంకరముగా నుండెను. కావున వాఁడు శ్రీకృష్ణుని జయించి గరుడుని బొలియించినఁగాని యీయవమానము పోవదని తలంచి హరిని మార్కొనియెను. ఆసంగరము మధుదానవ మాధవులకు సాగినసంగరమువలెఁ జూపట్టెను. అప్పటియాకృతి వర్షాకాలమేఘమువలె నుండెను. వానికరమున నలరారు చాపము శక్రచాపము ననుకరించుచుండెను. నరకదనుజుఁడు కరమునఁ జాపముంబట్టి బాణముల సంధింపఁ గాంచి హరియు శార్ఙ్గచాపమున నారాచములఁ గూర్పసాగెను. దివ్యమగు నొక్కయస్త్రమరివోసి నరకస్యందనమును బడలువడం జేసెను. నరకుఁడును మహోత్తమాస్త్రమును వైచి తనసామర్థ్యమును హరికిఁ దెలిపెను. దనుజప్రహితదివ్యాస్త్రము వజ్రనిస్ఫూర్జితాకారమై పరుగిడి తన్నునొంప రాఁగాంచి కేశవుఁ డాననమున సుస్మితము నాట్యమాడుచుండఁగా సుదర్శనమున దానిం దుత్తునియలుగాఁజేసెను. అంత నూరకుండక పరమేశ్వరుఁడు వాని రథమును ధ్వజమును గుఱ్ఱములను సారథిని నొక్కొక్కటిఁ బదేసిబాణముల నొప్పించెను. దివ్యసాయకంబొక్కఁడు నారిం గూరిచి యాతనికవచమును దునియవైచి ధరఁబడఁజేసెను. విముక్తకవచుఁడై కుబుసమువదలిన భుజంగముభంగి నాయసురుఁడు కడుఁజూడనద్భుతాకారుండై కనఁబడియెను. హతాశ్వసారథిరథుఁడైనను దనుజుఁడు పాఱిపోవక క్రోధాగ్ని యినుమడింపఁగా శూలాయుధమును జేనందెను. అది లోహమయము. అగ్నిజ్వాలా మాలికలం గ్రక్కుచుండునది. దృఢతరసారము.

దానింజూచినంతనే సామాన్యులు యమదండముగా భావించి ప్రాణములు వదలుదురు. ఇంద్రాశనితుల్యమనుట కేశంకలు నుండవు. అది హేమపుష్పభూషితము. అట్టిశూలమునే వాఁడు నమ్మి యెట్టియుద్ధములనైనఁ దనకది జయమొసంగునని చెప్పుచుండువాఁడు. కావున హరినిగాంచి దీనఁబొలియునన్న విశ్వాసమున దానిం ద్రిప్పివైచెను. తన్నుఁజంపనడరు నాశూలాయుధమునుగాంచి శ్రీపరమేశ్వరుఁ డొక్కక్షురప్రమున రెండుగా ఖండించెను. నడుమనే యది రెండు తుండెములుగా ధరఁదొరఁగెను. పిదప నొక్కముహూర్త మాయిరువురు హెచ్చుతగ్గులు నిర్ణయింపనలవికాని యట్లు పోరాడిరి. చూపఱ కక్కజమును భీతిని గల్గింపఁ జాలియుండెను. ముహూర్తము దాఁటగనే యాతనియాయువంత మొందుట నెఱింగి భగవంతుఁ డాతనికి ముక్తి నొసంగుసమయము సమీపించెఁగదాయని తలంచి సుదర్శనమును జేనంది యాతనిశిరస్సునకు దేహమునకుంగల సంబంధమును భేదింపుమాయని పంచెను. చక్రము శ్రీకృష్ణప్రేరితమై చని తదిచ్ఛానుసారముగా నరకాసురుని కంఠదేహములకుంగల సంబంధమును ద్రెంచెను. దాన వానిశరీరము ధరపై నొరగెను. వజ్రసమాఘాతపతితక్షితిధరవితత శృంగముంబోలి యతని తనువు క్షితిఁబడియె. సర్వాభరణాలంకృతమగు నాతనిదేహము ధరణింబడియు గైరికపర్వతమా యనుసంశయమును గలిగించుచుండెను. అపుడు నరకాసురపక్షమువారు హాహాకారములు చేసిరి. దేవర్షులు సాధునాదముల జయమును దెలిపిరి సురలు శ్రీహరిపైఁ బూలవానలఁ గురియించిరి. ముకుందుని మహాకార్యమును గొనియాడిరి.

ఆర్యులారా! నరకాసురవధకథ పూర్తియయ్యె. శ్రీ భాగవతవిష్ణుబ్రహ్మపురాణములు హరివంశము ననువీనియందే యీకథ గలదు. కాని యిందెందును సత్యభామ నరకాసురునితో యుద్ధముచేసినట్లు కానరాదు. పోనీ యుద్ధముచేసినట్లు లేకున్న నాప్రయత్నమైనను జేసినట్లు కానరాదు. భాగవతముం బరికింపుఁడు.

శ్లో. "దృష్ట్వా సభార్యం గరుడోపరిస్థితం
సూర్యోపవిష్టాత్సతటిద్ఘనం యథా,
కృష్ణం సతస్మై వ్యసృజచ్ఛతఘ్నీం
యోధాశ్చ సర్వే యుగపత్స్మవివ్యధుః. ౧౫

తద్భౌమసైన్యం భగవాన్ గదాగ్రజో
విచిత్రవాజై ర్నిశితైశ్శిలీముఖైః,
నికృత్తబాహూరుశిరోధివిగ్రహం
చకార తత్రైవ హతాశ్వకుంజరమ్. ౧౬

యాని యోధైః ప్రయుక్తాని శస్త్రాస్త్రాణి కురూద్వహ
హరిస్తాన్యచ్ఛినత్తీక్ష్ణైశ్శరై రేకైకశస్త్రిభిః.
ఊహ్యమానస్సుపర్ణేన పక్షాభ్యాం నిఘ్నతా గజాన్. ౧౭
గరుత్మతా హన్యమానాస్తుండపక్షనఖైర్గజాః,
పురమేవావిశన్నార్తా నరకో యుధ్యయుధ్యత. ౧౮
దృష్ట్వా విద్రావితం సైన్యం గరుడేనార్దితం స్వకం,
తం భౌమః ప్రాహరచ్ఛక్త్యా వజ్రఃప్రతిహతో యతః. ౧౯
నాకంపత తయా విద్ధో మాలాహత ఇవ ద్విపః,
శూలం భౌమోచ్యుతం హంతు మాదదే వితథోద్యమః.

తద్విసర్గాత్పూర్వమేవ నరకస్య శిరో హరిః,
అపాహరద్గజస్థస్య చక్రేణ క్షురనేమినా." ౨౧

శ్రీభాగవతమున నీఘట్టమున, 'సభార్యో గరుడారూఢః' అని మూఁడవశ్లోకమునందును, 'దృష్ట్వా సభార్యం గరుడోపరి స్థితమ్' అని పదునైదవ శ్లోకమునందును దప్ప భార్యప్రస్తావమే లేదు. హరివంశమునందును,

శ్లో. "తతస్సహైవ శక్రేణ శంఖచక్రగదాసిభృత్,
ప్రతస్థే గరుడేనాథ సత్యభామాసహాయవాన్." ౩౯

అనిమాత్రమే కలదు. బ్రహ్మపురాణమునందును,

శ్లో. "సంచింతితముపారుహ్య గరుడం గగనేచరమ్,
సత్యభామాం సమారోప్య యయౌ ప్రాగ్జ్యోతిషంపురమ్."

అని కనఁబడుచున్నది. వీనియందెందుఁగాని నాపరిశీలించి నంతదనుక నీభాగముల సత్యభామయుద్ధము చేసినట్లుగాని యుద్ధము చేయుచుండఁ బ్రాణేశా! నిన్నుఁ జూడఁగోరెద ననిరైన సత్యభామకోరినట్లుగాని కానరాదు. ఇంకొక్కతావున నీయుద్ధ మీ గ్రంథములనుండ రాదుకదా. ఒక్కముక్కయైనఁ గృష్ణానుమతి నొందియో పట్టుపట్టి హరిసమ్మతించునట్లు జేసియో సత్యభామ యుద్ధము చేసినట్లు భాగవతమున లేకుండఁగా, మహాకవి పోతన యేటికో పెంచి యీవిషయమునఁ గవితాధోరణి విశేషించి కనఁబఱచిరి. ఆపద్యములు రత్నములే. కాని మూలవిరుద్ధములు. ఐన వ్రాసెదను.

వ. "కనికరంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక ... లోఁచి సంభ్రమంబున.

శా. వేణింజొల్లెము పెట్టి సంఘటిత నీ♦వీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీ♦చీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁదుఱిమి శుం♦భద్వీరసంరంభయై
యేణీలోచన లేచినిల్చెఁ దనప్రా♦ణేశాగ్రభాగంబునన్.

క. జన్యంబుల దనుజుల దా
ర్జన్యము లుడుపంగఁ గోరి ♦ చను దెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా
జన్యశ్రేష్ఠుండు సరస♦సల్లాపములన్.

క. లేమా దనుజుల గెలువఁగ
లేమా నీవేలకడఁగి♦ లేచితి విటు రా
లే మాను మాన వేని
లేమా విల్లందుకొనుము ♦ లీలం గేలన్.

... ... ... ... ...

సీ. సౌవర్ణకంకణ ♦ ఝణఝణత్కారంబు
శింజినీరవముతోఁ ♦ జెలిమి చేయఁ
దాటంకమణిగణ ♦ ధగధగదీప్తులు
గండమండలరుచిఁ ♦ గప్పుకొనఁగ
ధవళతరాపాంగ ♦ ధళధళరోచులు
బాణజాలప్రభా♦పటలినడఁప
శరపాతఘుమఘుమ ♦ శబ్దంబు పరిపంథి
సైనికకలకల ♦ స్వనము నడుప
తే. వీరశృంగారభయరౌద్ర♦విస్మయములు
కలిసి భామిని యయ్యెనో ♦ కాక యనఁగ

నిషువుఁదొడుగుట తివుచుట ♦ యేయుటెల్ల
నెఱుఁగరాకుండ ననిచేసె ♦ నిందువదన.

మ. పరుఁజూచున్ వరుఁజూచు నొంపనలరిం ♦ పన్ రోషరాగో
దయా, విరతభ్రూకృటిమందహాసములతో ♦ వీరంబు శృం
గారమున్, జరగం గన్నులఁ గెంపుసొంపుఁ బరఁగం ♦ జండాస్త్ర
సందోహమున్, సరసాలోకసమూహమున్ నెఱపుచుం ♦ జం
ద్రాస్య హేలాగతిన్.

...        ...        ...        ...

సీ. బొమ్మపెండ్లిండ్లకుఁ ♦ బోనొల్లనను బాల
రణరంగమున కెట్లు ♦ రాఁదలంచె
మగవారిఁ గనినఁ దా ♦ మఱుఁగుఁ జేరెడునింతి
పగవారిఁ గెల్వ నే ♦ పగిదిఁ జూచెఁ
బసిఁడియుయ్యెలలెక్క ♦ భయమందు భీరువు
ఖగపతిస్కంధమే ♦ కడిఁది నెక్కె
సఖులకోలాహల ♦ స్వనములోర్వనికన్య
పటహాభాంకృతుల ♦ కెబ్బంగి నోర్చె
ఆ. నీలకంఠములకు ♦ నృత్యంబుగఱపుచు
నలసితలఁగిపోవు ♦ నలరుఁబోఁడి
యేవిధమున నుండె ♦ నెలమి నాలీఢాది
మానములను రిపుల ♦ మానమడఁప.

సీ. వీణెఁ జక్కఁగఁ బట్టు ♦ వెఱవెఱుంగనికొమ్మ
బాణాసనం బెట్లు ♦ పట్టనేర్చె
మ్రోఁకునఁ దీఁగెఁ గూ ♦ ర్పంగ నేరనిలేమ
గుణము నే క్రియ ధనుః ♦ కోటిఁ గూర్చె

సరవిముత్యముఁ గ్రువ్వఁ ♦ జాలనియబలయే
నిపుణత సంధించె ♦ నిశితశరముఁ
జిలుకకుఁబద్యంబుఁ ♦ జెప్ప నేరనితన్వి
యస్త్రమంత్రము లెన్నఁ ♦ డభ్యసించెఁ
ఆ. బలుకుమనినఁ బెక్కు ♦ పలుకనిముగదయే
గతినొనర్చెసింహ ♦ గర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగ♦దభిరామగుణధామ
చారుసత్యభామ ♦ సత్యభామ.

... ... ... .... ...

సీ. రాకేందుబింబమై ♦ రవిబింబమైయొప్పు
నీరజాతేక్షణ ♦ నెమ్మొగంబు
కందర్పకేతువై ♦ ఘనధూమకేతువై
యలరుఁబూఁబోఁడి చే♦లాంచలంబు
భావజుపరిధియై ♦ ప్రళయార్కుపరిధియై
మెఱయునాకృష్టమై ♦ మెలఁతచాప
మమృతప్రవాహమై ♦ యనలసందోహమై
తనరారు నింతిసం♦దర్శనంబు
ఆ. హర్షదాయియై మ♦హారోషదాయియై
పరఁగుముద్దరాలి ♦ బాణవృష్టి
వారికి నరికిఁజూడ ♦ నందంద శృంగార
వీరరసములోలి ♦ విస్తరిల్లె."

అనియిట్టు లెన్నియో పద్యరత్నము లమర్పఁబడినవి.
మూలమున నించుకంతయు నాధారములేని యీఘట్టమునఁ.

బెంచి వ్రాయుటయే కాక కల్పించి వ్రాయునంత యావశ్యక మేమో తెలియఁజాలక యున్నాఁడను.

శ్రీభాగవతమున నద్వైతమతము ననుసరించిన వ్యాఖ్యానమున లేదు గాని యితరమతములవారి వ్యాఖ్యయందైన నించుక చిహ్నముగలదాయని పరికించినను గానరాదు.

"సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషపురం యయౌ."

అనుదానికి విశిష్టాద్వైతమతానుసారము వ్రాయఁబడిన వీరరాఘవీయవ్యాఖ్యయం దిట్లున్నది.

వ్యా "తదా తస్యాః కౌతుకాయ త్తయా భార్యయా సహ యయావితి. యద్వా త్వదనుజ్ఞయైవ త్వత్సుతం హనిష్యామీతీతిహాసేనోక్తం భూమ్యై వరందత్తం. సత్యాపయితుం సత్యభామాయా భూమ్యంశత్వా త్తయా సహ యయావితి. యద్వా నారదానీతపారిజాతైకకుసుమే రుక్మిణ్యై దత్తే సతి కుపితాం సత్యభామాం సాంత్వయితుంతుభ్యం పారిజాతతరుమేవ దాస్యామీతి ప్రతిశ్రుతమితి హరివంశే ప్రసిద్ధం తదర్థం తాం నీతివానితి." అని.

వీరరాఘవీయవ్యాఖ్యయందును ఆభావము కానరాదు. సత్యభామను బిలుచుకొనిపోయినాఁడు కావున నామెయుద్ధము చేసినట్లు కల్పించిన బాగుండునని కల్పించినట్లు తోఁచెడిని. హరివంశమును దెనిఁగించుచుఁ బ్రబంధపరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రగడ యీకథను గల్పించెను. దాని నించుకఁ బరికింపుఁడు.

శా. "వీరంబాడు దనంబు నొందె నసఁగాఁ విక్రాంతి శారీరల
క్ష్మీ రేఖం బచరించెనాఁగ ధృతియుఁ శ్రీణాకృతిం జెందె వా

ధీరోదాత్త పతిప్రియాచరణభ • క్తిప్రౌఢ యాతన్వి దాఁ
ప్రారంభించె మహారణక్రియకునా • ప్రత్యర్థితో నుక్కునన్."

అను నీమొదలగు మతికొన్నిపద్యముల నెఱ్ఱాప్రగడ హరివంశము నుత్తరభాగమున నాల్గవయాశ్వాసమున వ్రాసిరి. శ్రీహరి నరకాసురుని ప్రేటులకు మూర్ఛిల్లి తెలివిరాఁగా, సత్యభామంగాంచి నేను డస్సితిని నీవించుక సంగరక్రీడ సల్పుమని, తానే చాపంబందిచ్చినట్లు కూడ నున్నది. ఆమె తన్ను నొప్పింపఁగా నరకాసురుం డాగ్రహింపక సహాసవిస్మయమదప్రకటాననుండై బాణములు వైచుచు,

క. "తోడనచనుఁగవయొక్కట
నేడమ్ములఁ బార్శ్వయుగ్మ • మెసఁగుకరయుగం
బాడఁగ నాటిట నేసినఁ
జేడియ యించుకయు లెక్క • చేయక యలుకన్."

అనియు వ్రాయఁబడినది. హరివంశవిష్ణుపర్వమున నలువదిమూఁడవయధ్యాయమున నీయుద్ధవిషయముకలదు. అందొక్కమాటయైనను గానరాదు నరకాసురునితో నించుకయు నాయాసపడక పోరుచున్న సత్యభామంగాంచి శ్రీకృష్ణుఁ డానంద పరవశుండై,

క. "తనయలుతనేవళం బొకఁ
డనుకూలతఁ గేలఁబుచ్చి • యాసతియలుతఁ
వనరుహలోచనుఁడిడి లో
చనపారణచేసెఁ దత్ప్రి • సాదనదృష్టిన్."

అనియింతతో నాయుద్ధవర్ణనముముగింపఁబడినది. ఇట్లు హరివంశమునఁగల్పింపఁబడినకథాచమత్కారమునకు మూదమంది

నాచనసోమనాథకవితల్లజుఁడును దనయుత్తరహరివంశమున నీ
కథనే యించుక దానినిమించునట్లు వ్రాయఁగోరి,

సీ. "తంత్రీవినోదంబు ♦ తడవుసైఁపనివ్రేళ్లు
గొనయంబు తెగలపైఁ ♦ గోరికనుట
యుద్ధంబుపిడిముట్టు ♦ నలయుపాణితలంబు
లస్తకంబిఱియింప ♦ లావుకలిమి
చెలికత్తెనొత్తిలి ♦ పిలువలేనియెలుంగు
సింహనాదంబుచేఁ ♦ జెదరకునికి
ప్రమదనర్తనకేళిఁ ♦ బలురమింపనిపదం
బైదుబాణంబుల ♦ గలఁతఁబడమి

తే. సోయగపుఁజిత్రరూపంబుఁ ♦ జూచుచోట
వేసరువిలోచనంబులు ♦ వికృతదైత్య
లక్ష్యమీక్షించుటయు మొక్క ♦ లంపుఁదెంపు
గైకొనియె సత్యభామ సం♦ గ్రామసీమ.

మ. అరిఁజూచున్ హరిఁజూచు సూచకములై ♦ యందంద మం
దారకేసర మాలామకరంద బిందు సలిల♦స్యందంబు లందం
బులై, తోరుఁగం బయ్యెద కొంగొకింత తొలఁగం♦దోర్దో
శ్శరాసారమున్, దరహాసామృతపూరమున్ గురియుచుం ♦
దన్వంగి కేళీగతిన్."

అని వ్రాసి తనసర్వతోముఖపాండిత్యమును గనఁబఱచెను. వీరిద్దఱి కల్పనలకంటె మిన్నఁగనుండవలయునన్న యూహ కలుగఁగా మహాకవిపోతనగారు మఱింతసొగసుగాఁ బద్యములఁ బొందుపఱచిరి. అందును నాచనసోమనాథుని సీసపద్యము నుదాహరణముగాఁ బరిగ్రహించి "బొమ్మపెండ్లిండ్లకు, వీణెఁ

జక్కఁగఁబట్టు" నను రెండు సీసపద్యములు వ్రాసిరి. "అరిఁ జూచుఁ హరిఁ జూచు" ననుపద్యమునకు దానును "పరుఁ జూచుఁ వరుఁ జూచు" ననుపద్యమును సురుచిరపదరత్నములం గూర్చి చదువరులకుఁ గాన్కపెట్టిరి. ఇట్లు లీకవిత్రయ మొకరి మించి యొకరు పద్యములఁ గల్పించి తమపాండిత్యమును గాన్పింపఁజేసిరి. పోతన పైయిర్వురికంటెఁ దరువాతివాఁడగుట నాపద్యములకంటె మిన్నగ నుండఁగల్పించుటయు నవి యించుక వానికంటె నందముగా నుండుటయుఁ జిత్రము కాదు. అట్లున్నవని యంగీకరింపక తప్పదు. కాని యిందొక్కదోషము నాబుద్ధికిం దోఁచెడిని. అది నాయజ్ఞానమునఁ గావచ్చు. వాని యందలి బాగోగులు పాఠకులకు వదలెదను.

శ్రీహరి సత్యభామ నీ సంగరమునకుం బిలుచుకొనిపోనేల? అనుప్రశ్నము రాఁగా సమాధాన మిరుతెఱంగుల నుండునని వ్యాఖ్యాతలు తెల్పిరి. భూదేవి వరమడుగ నీయనుమతింగొనియే లోకకంటకుఁడగు నీకొడుకును వధింతునని మున్నే వరమిచ్చెను. భూమ్యంశసంభూతురాలు సత్యభామకావున నామెం బిలుచుకొనిపోయెను. నారదానీతపారిజాతకుసుమమును రుక్మిణి కొసంగెను. దాన సత్యభామ కాగ్రహము కలిగెను. దానిం దొలఁగించి ప్రియపత్నియగు సత్యభామ కానందమును గూర్పనెంచి రుక్మిణికొక్కకుసుమము నిచ్చితినని కదా నీకాగ్రహ ముదయించెను. నీయింట దేవలోకమునుండి పారిజాతవృక్షమునే తెచ్చి నాటెదనని వాగ్దానము చేసెనుగాన నాకార్యముఁగూడఁ జేయవచ్చునని యనఁగా నరకునిం జంపి యతనికడనున్నకుండలము లదితివి కనుక వానింగొంపోయి

మరల నదితి కొసంగి పారిజాతవృక్షమును సత్యభామచూచు చుండఁ దెచ్చి యామెయింట నునుపవచ్చునన్నయూహా కలుగఁగా నాసత్యభామను బిలుచుకొనిపోయెను. అను నీరెండు కారణములు సకారణములుగఁ గల్పింపఁబడినవి. ఈయూహాలు రెండును గాకున్న రుక్మిణిం బిలుచుకొనిపోవక సత్యను బిలుచు కొనిపోవ హేతువు కన్పడదు. రుక్మిణికంటెఁ బ్రియురాలు సత్యయని కల్పించుటయు న్యాయము కాదు. పారిజాతకుసుమమును రుక్మిణికిచ్చుట సత్యభామకంటె రుక్మిణి తనప్రీతికిం బాత్రురాలనియుం గాదు. భగవంతునకు శ్రీదేవియొక్కతెయె భార్య. ఆమెయే శ్రీకృష్ణావతారమునఁ బెక్కురూపముల నవతరించెను. ఇందొకరు తక్కువ. ఒక రెక్కువ అన వలనుపడదు. రుక్మిణిగృహమున నుండినపు డదిదొరకుట నామెకిచ్చెను. సత్యభామకు దాన నాగ్రహముకలుగ దానిని మాన్పుట రసికుఁడగు నాథునకు సహజధర్మము కాన నీకేల యాగ్రహము. వృక్షమునే తెచ్చి నీ యింటనుంతును వలసినన్నిపూల ధరింతువు లేయని యట్లు చేసెను. దీనిచే రుక్మిణికన్న సత్య మిన్నయనిపలుక నవకాశము లేదు. కాని తానన్నమాటను సార్థకము చేయఁబూని సత్యభామను బిలుచుకొనిపోయె ననుట సమంజసమనక తప్పదు. నరకాసురవధానంతర మదితికుండలముల నర్పింప సురపురికేగు నుగాన నీమెకోరికయుఁ దీర్చినట్లగునని తోడ్కొనిపోయెనన్న యూహా మంచిదికాదని యెవ్వరనఁగలరు ? ఇట్టిమంచియూహాకు విరుద్ధముగా సత్యభామ యుద్ధము చేయుట పాడిగాదు. సత్య భూదేవియంశమున నవతరించినది. అనఁగా భూదేవి. శ్రీదేవియు భూదేవియు విష్ణుపత్నులు కారా. అట్టి సత్యభామ

నరకాసురునితో నన(గా( దనకొడుకుతో యుద్ధముచేయుట న్యాయవిరుద్ధము కాదా. భూదేవి భగవంతుని( బ్రార్థించుచు

శ్లో. "దత్తస్త్వయైవ గోవింద త్వయైవ వినిపాతితః,
యథేచ్ఛసి తథా క్రీడ బాలః క్రీడనకైరివ."

(హరివంశము.)

అని పలికినట్లున్నది. కావున భూదేవి తనకొడుకు మారొ(ని యుద్ధముచేసినట్లుకల్పించుట యంత సమంజసముగా నాయల్పమతికిం దో(పలేదు. తానొసంగినవరమును గాపాడుటకై భూదేవియగు సత్యభామను దోడుకొనిపోవుట న్యాయమే కాని యామెచే యుద్ధము చేయించినట్లు పురాణమున నించుకంతయు లేనిదానిని గొనితెచ్చుకొనుట యంతగా మంచిది కాదేమోయని నాకుందో(చెను. ఇది యసంగతమని సాధువులకుందో(చిన మన్నింతురుగాక. మహాకవుల నాక్షేపించితి నని తలంప(జనదు. ఇట్టిప్రశ్నములు చేసి యితరు లాక్షేపింతురు కదా. భక్తిభావమున కించుకలోపము కలుగునేమో యన్న సందియమున వ్రాసితినిగాని వేఱొకకారణమున( గాదని భక్తులూహింతురుగాక. ఇంక నీవిషయమున( బెంచి వ్రాయుట యుచితముకాదని దానివదలుచు( గథాభాగమును వ్రాసెదను.

## భూదేవి శ్రీకృష్ణుని నుతించుట.

నరకాసురు(డు విగతజీవు(డు కా(గానే భూదేవత స్త్రీరూపమున( బొడసూపి పుండరీకాక్షుని జిరకాలమునకు వినుతింప( గల్గితినన్నప్రమదము, పుత్త్రమృతివ్యసనము తన్ను సంభ్రమింప( జేయుచుండ నరకాసురు( డేయేపదార్థము లమూ

ల్యములని యింద్రాదుల జయించి పడసెనో యట్టివానిం దీసి కొనివచ్చెను. అదితికడకుం బోయి చెవులు మెలివెట్టి తెచ్చిన కుండలములు గలవు. అవి పుటముపెట్టిన బంగారురత్నములతో నలరారును. అవి ముల్లోకములయం దసమానములు. వానిని భగవంతున కర్పించెను. వైజయంతి యనుమాలను, వరుణదేవుని జావఁదన్ని తెచ్చిన శ్వేతచ్ఛత్రము నొకయనర్ఘమణిని గానుకవెట్టెను. వాని నాశ్రీకృష్ణపాదసరోజములకడ నునిచి సకల బ్రహ్మాండనాయకుఁడు, దేవీదేవవరార్చితుఁడునగు నామహాత్ము నిట్లునుతింపసాగెను. భక్తిరసమున నాభూదేవి చిత్తము మునిఁగియుండెను.

* దేవదేవేశ్వరా! శంఖచక్రగదాధరా! భక్తులయిష్టానురూపముగా రూపముల ధరింతువు. పరమాత్మవు. ఇట్టినీకు నమస్కారము. పంకజనాభుఁడవు. పంకజమాలాధారివి. పంకజ

---

భూమికృతశ్రీకృష్ణస్తుతిః.

* శ్లో. నమస్తే దేవదేవేశ శంఖచక్రగదాధర, భక్తేచ్ఛోపాత్తరూపాయ పరమాత్మన్నమోస్తుతే. ౧. నమః పంకజనాభాయ నమః పంకజమాలినే, నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రియే. ౨. నమో భగవతే తుభ్యం వాసుదేవాయ విష్ణవే, పురుషాయాదిబీజాయ పూర్ణబోధాయ తే నమః. ౩. అజాయ జనయిత్రేస్య బ్రహ్మణేఽనంతశక్తయే, పరావరాత్మన్ భూతాత్మన్ పరమాత్మన్ నమోఽస్తుతే. ౪. త్వం వై సిసృక్షూరజ ఉత్కటం ప్రభో తమోనిరోధాయ బిభర్ష్యసంవృతః, స్థానాయ సత్వం జగతో జగత్పతే కాలః ప్రధానం పురుషో భవాన్ పరః. ౫. అహం పయో జ్యోతి — నభో మాత్రాణి దేవా మన ఇంద్రియాణి చ, కర్తామహానిత్యఖిలం చరాచరం త్వయ్యద్వితీయే భగవన్నయం భ్రమః. ౬.

నేత్రుఁడవు. పంకజపాదుఁడవు. వాసుదేవుఁడవు. విష్ణువవు. పురుషుఁడవు. ఆదిబీజుఁడవు. పూర్ణబోధస్వరూపుఁడవు. ఇట్టివిశ్వేశ్వరునకు నీకు నతులు. నీకుఁ బుట్టుక లేదు. కాని బ్రహ్మాండజనకుఁడవు. నీశక్తియనంతము. పరాపరాత్మవు. భూతాత్మవు. పరమాత్మవు. ఇట్టినీకు వందనములు. రజోగుణమున సృష్టికర్తవగుదువు. సత్వగుణమునఁ బరిపాలకుఁడ వగుదువు. తమోగుణమునఁ బ్రపంచమును సంహారింతువు. కాలము నీస్వరూపము ప్రధానపురుషుఁడవు. సర్వోత్కృష్టుఁడవు నీవే. ఇట్టినీకు నమస్కారములు. నాప్రభృతులగు పంచభూతములు, పంచతన్మాత్రములు, మనస్సు, ఇంద్రియములు, సృష్టికారణములనుట కేవలభ్రాంతి. అద్వితీయుఁడవగునీవుండఁగా నితరమేదియు నేదానికిని గారణము కాఁజాలదు. అని వినుతించి మఱియు నిట్లు ప్రార్థించెను. గోవిందా! ఈనరకుఁడు నీచేతనే యొసఁగఁబడినవాఁడు. నీచేతనే చంపఁబడియెను. నీకేవిధముగా విహరింపవలయునని తోఁచునో యట్లే విహరింపుము. బాలుఁ డాటవస్తువులతో నాడుకొనలేదా. మహాత్మా! సర్వకర్తవగు నీకు నమస్కారములు. జగన్నాయకా! మున్ను నేను జలములమునింగినతఱిసూకరమూర్తివై యుద్ధరించితివి. వీఁడు నీస్పర్శమునఁగలిగినవాఁడు. ఈతఁ డజ్ఞానదోషమునఁ దెచ్చినకుండలములను గ్రహింపుము. ఈతనిసంతతిం బాలింపుము. నాభారమును దొలఁగించుటకే నాప్రార్థనముననే యీలోకమున కరుదెంచితివి ప్రసాదసుముఖుఁడ వగుము. నీవే కర్తవు. దానిని మార్పను సమర్థుఁడవు నీవే సంహరించువాఁడవునీవే. నీవేమో యవ్యయుఁడవు. జగత్స్వరూపుఁడ వగునిన్ను నేనేమని వినుతింపఁ

గలను! సర్వవ్యాపివి. వ్యాప్యుఁడవు. క్రియాస్వరూపుఁడవు. కర్తవు. కార్యము నీవే. సర్వభూతాత్మభూతాత్మవని పిలువఁబడు వాఁడవు నీవే. ఇట్టి నిన్ను నేను వినుతింపఁ జాలుదునా. కొందఱు నిన్నుఁ బరమాత్మవందురు. కొందఱు ఆత్మయందురు. భూతాత్మయని మఱికొంద ఱందురు. నిన్ను నుతింప శక్యము కాదనఁగా నిఁక నుతించు టెట్లు? నరకాసురకృతాపరాధమును క్షమింపుము. ఆయపరాధపాపప్రాయశ్చిత్తముగ నేనాతనయుఁడు నీచేఁ దెగిఱెను. దానితో నాదోషము పోయెను. మహాను భావా! ఈనీపాదములకడ నుండుబాలుఁడు నరకపుత్త్రుఁడు. భయమున నీశరణుఁ జొచ్చినవాఁడు. నీవు ప్రపన్నార్తిహరుఁడవు. కావున వీనిం బాలింపుము. నీకరసరసిజమును వీనిశిరస్సుపై నునుపుము. అది వీనిసకలకల్మషాపహంబ యగు.

అని యిట్లు భూదేవి పలుభంగులఁ బ్రార్థింపఁగా తదీయ భక్తికి మెచ్చి ఆమెకోరినచందంబున నభయం బొసంగెను. సకల విధముల సమృద్ధమగు నరకాసురునిసౌధమును బ్రవేశించెను. అందుఁ బదాఱువేలు రాజకన్యక లుండిరి. వారినెల్ల నరకుఁడు తనప్రతాపమున రాజులజయించి బలవంతముగాఁ దెచ్చెను. వారినెల్లఁ గనుంగొనఁగా శ్రీకృష్ణునిమృదుతమస్వాంతము వింత మార్పునొందెను. వారెల్ల భగవంతుఁడగు శ్రీహరి యాతఁడే పతియగుగాకయని కోరిరి. వారిచిత్తములఁగలయుత్తలంపాటు శ్రీకృష్ణుఁ డెఱింగెను. ఆవల నరకునికోశాగారమును బ్రవేశించి యక్షయంబగుధనరాశిం గాంచెను. వివిధరత్నములందుఁ గొండ లపిండునాఁగనఁబడిఱెను. నవరత్నములఁ బొదిగిచేయించియున్న యాభరణములఁ గనుఁగొనిఱెను. శయనములు మహార్హములు.

సింహాసనము లనంతములు. హిరణ్యదండమున మిగుల మనోహరమై చంద్రునివలెఁ గాంతివిలసిల్లుచు వర్షించుచున్న మేఘమువలెఁ బ్రకాశమును గురియించుచు నున్నయొకఛత్రవర్యమును గాంచెను. అది నరకాసురునిచే మున్ను వరుణునోడించి తేఁబడినది. మఱియు నరకాసురునికోశాగారంబున నున్నరత్నములం గాంచినపుడు దిక్పాలకులగృహములయందుఁ గాని యితరరాజులసదనంబులందుఁ గాని యింకరత్నములే యుండవనితోఁచెను. నిసుందహయగ్రీవాదిదానవులతోడ నరకదానవుఁడు చావఁగా నాతని యంతఃపురమునుండియుఁ గోశగృహమునుండియు సకలరత్నములను దానవులే కొనివచ్చి శ్రీకృష్ణునిమ్రోల రాశిగాఁ బోసిరి. ఆదానవులే ధనమువృద్ధిచేయఁ గంకణము కట్టుకొని యుండిరి. అట్టివారే రాజునశింపఁగనే ప్రాణభీతి నారత్నముల శ్రీహరి కర్పించిరి. మఱియు నందేయేరత్నములు మహార్హములో వాని నేర్చికూర్చి భగవత్పాదారవిందములకడ సమర్పించిరి. అంత వారిట్లు ప్రార్థించిరి.

శ్రీకృష్ణా! మహాత్మా! ఈరత్నము లమూల్యములు. వివిధనామములఁ బ్రసిద్ధికెక్కినవి నరకదానవుఁడు దిక్పాలకులు లోనగు వారినోడించి తెచ్చెను. మఱియు మాతంగములు కలవు. అవియు నిట్లే తేఁబడినవి. వానియంకుశములు ప్రవాళచిత్రితములు. తోమరాదు లన్నియు మణిచిత్రితములే కాని సామాన్యములు కావు. పతాకలుకూడ రత్ననిర్మితములు. నరకాసురుఁడు సంపాదించిన యేనుఁగు లిరువదివేలు. కరేణువులు నలువదివేలు. ఇవియన్నియు రత్నభూషణముల నలంకరింపఁబడునవియే. భూలోకమునఁగల యాయాయి తావులనుండి యుత్త

మాశ్వములు పదునెనిమిదివేలు తెప్పింపఁబడినవి. శ్రీకృష్ణా! గోవులు వలయు నేని సంఖ్యఁ దెలిపిన నన్నింటిని దెచ్చి నిల్పెదము. అసంఖ్యలుగా నొక్కొక్క తావునఁ గలవు. పెక్కు తావుల ధేనుకోటులు పెంపఁబడుచున్నది. ఆవికములగు శయనము లాసనములు గలవు. వలయునన్ని కొనిపోవచ్చును. కనువిందుఁ గూర్చు వివిధజాతిపక్షులు పెంపఁబడియున్నవి. ఇంతియకాక ముల్లోకములయందు నేయేయమూల్యపదార్థములు గలవో యవియెల్ల నిందుండును అందుఁ గోరినపదార్థముల నెల్ల ద్వారకానగరంబునకుఁ జేర్తుము అనుజ్ఞ యిమ్ము.

*ఇట్టు లాదానవులు విన్నవింప శ్రీహరి యందుల కంగీకరించి యందుత్తమములగువానిం గొన్నింటిని బరీక్షించి వారిమూలముననే ద్వారకానగరంబునకుఁ జేర్పించెను. పిదప వారుణచ్ఛత్త్రమును దానే యెత్తి గరుడునిపై నునిచెను. అదిహిరణ్యవృష్టినిగురియించుచునది. విమలరత్నప్రభాభాసురము. అద్దాని ధరించి గరుడుఁడు మఱింతసంతసంబున వెలింగెను. మేఘము గరుడరూపమును దాల్చినట్లే యపుడుండెను. అంత నరకాసుర పుత్త్రునిం బిల్చి భయంపడకుమా యని యభయప్రదానమున

* రాజకన్యలకు శిబికాదులయం దుపవిష్టలనుగాఁ జేయఁబంచి కమనీయాంబరాభరణము లొసంగి ద్వారకాపురికిం బంపెనని భాగవతమునందుఁ గలదు. నరకకింకరులచే వారినెల్లఁ బంపించెనని బ్రహ్మపురాణమునఁ జెప్పఁబడెను. హరివంశమున నించుమించుగా నీవిషయమిట్లే తెలుపఁబడినది. విష్ణుపురాణము బ్రహ్మపురాణమే యనవలయుం. ఇటనుండి కథ భాగవతమునఁ గలదానికంటె మార్పు నొందినది. హరివంశానుసారముగ వ్రాయఁబడువనియుం దెలియఁగునది.

నాతని నాదరించి రాజ్యమును బూజ్యభంగిఁ బాలింపుమా యని హెచ్చరించి భూదేవివాంఛితమును తీర్చి యందుండి కదలి మణిపర్వతమునకుఁ బోయెను. శ్రీకృష్ణుఁ డానగవరమును సమీపింపఁగాఁ బావనవాతపోతములు చల్లగా వీచెను. రత్నములు తమనిర్మలకాంతులచే దివాకరు నాచ్ఛాదించి భగవంతుని సేవించెను. అందుఁ దోలుదోలుత వైదూర్యరత్నముల హారి దర్శించెను. అందుఁదోరణములు పతాకలు లోనగువానిచే నలంకృతంబగు ద్వారమొక్కండు కన్నులపండువుగ నుండెను. ఇంచుక పరికింప నట్టివి పెక్కు లుండెను. శిఖరములు మనోహారరత్నాఢ్యములుగా నుండెను. వానింజూడఁగా నాపర్వతము మెఱపుఁదీఁగెలంగూడిన వర్షాకాలమేఘమువలెఁ గానఁ బడియెను.

* అందుఁ బ్రాసాదములు పెక్కుగలవు. అవి హేమచిత్రితవితానముల నలంకృతములు. ఆగృహములయందుఁ బుటముపెట్టిన బంగరురంగుగల దేహములుగలిగి వెలయు గంధర్వకాంతలు దేవకన్యకలు నుండిరి. నరకాసురుఁడు వారిం గొని వచ్చి యాపర్వతకందరములఁ జెఱనుంచెను. వారిని గాపాడ వీరభటులు వేలకొలఁదిగ నుండిరి. వారెల్ల నరకాసురునిచేఁ జెఱఁ బెట్టఁబడిరని యెఱుంగవలయు. వారెల్ల స్వర్గతుల్యమగు

---

* త్రివిష్టపసమే దేశే తిష్ఠంతీరపరాజితాః, నిర్విశంత్యో యథా దేవ్యః సుఖిన్యః కామవర్జితాః. ఏకవేణీధరాస్సర్వాః ... మేకవేణీధరాః స్త్రియః, సర్వాః కాషాయవాసిన్యః సర్వాశ్చ నియతేంద్రియాః. వ్రతోపవాసతన్వంగ్యః కాంక్షత్యః కృష్ణదర్శనమ్, సమేత్య యదుసింహస్య సర్వాశ్చక్రుః కృతాంజలీన్. అ॥ హరివంశము.

నామణిపర్వతమున దివ్యసౌధముల నుంచఁబడిరి. అంతఃపుర కాంతలవలె నుండఁదగినచోటనే యుండిరి. వారిసుఖమునకు గొఱంత లేకుండెను. అట్లయ్యును వారెల్లఁ గామవర్జితలై యుండిరి. ఒక్కజడగా వారికురులు పెనుచుకొనియుండెను. ఆయంగనామణులందఱుఁ గాషాయవసనములనే ధరించి యుండిరి. ఇంద్రియముల నిచ్ఛానుసారము పోనీయక వానిని లోఁబఱచుకొనియుండిరి. వ్రతములాచరించి యార్తత్రాణపరాయణుని దర్శింపఁగోరుచు నుపవాసములఁ గామమును జయించుచుఁ దనువులు శుష్కింపఁగా వెలవెలపోవుచుండిరి. సర్వదా శ్రీకృష్ణదర్శనమును గోరుచుఁ బ్రాణముల నిలుపుకొనియుండిరి. అట్టిసురనారీమణులా మహాబాహుని దర్శనము కాఁగానే యొక్కసారి యంజలిబంధముల నర్పించిరి. నరకాసురుఁడు, మురహాయగ్రీవులు, నిసుందుఁడు లోనగువారు మృతినొందునట్లు తెలుపఁబడఁగా శ్రీకృష్ణపరమాత్మను జుట్టుకొని నిలువంబడిరి. *వారిని రక్షించుచున్న వృద్ధవీరభటులెల్ల నందనందనుని యాగమనము నెఱింగి వయస్సుచెల్లినవారు కావునఁ జేతులొగ్గి నమస్కరించిరి. వారి నూఱడిల్లంజేసి శ్రీహరి యాదివిజకాంతామణుల నాదరంబునం గాంచి భీతిమాన్పెను. వారికెల్ల నామహాత్ముఁడే రక్షకుఁడన్న భావ మొక్కపర్యాయము కల్గెను. ఇంద్రునినే కాంచి యంతకంటె సుందరాకారుఁడు త్రిజగంబులలేఁడన్న యాశయముగలవారు కావున నాకాంతామతల్లికలా శ్రీహరి ముఖచంద్రుని దర్శించి ముదితేంద్రియలై మహాహర్షమున

*యేచాసాం రక్షిణో వృద్ధా దానవా యదునన్దనమ్, కృతాంజలిపుటాస్సర్వే ప్రణిపేతు ర్వయోఽధికాః. అని హరివంశము.

నోలలాడుచు నిట్లు ప్రార్థించిరి. మహానుభావా! మున్ను వాయు దేవుఁడు కష్టములపాలగు మమ్ముంగాంచి కరుణించి యిట్లు పలికెను. సర్వభూతాభిప్రాయవిదుఁడగు నారదమహర్షియు నిట్లు పలికెను. ఆర్తలగు నోకామినులారా! శంఖచక్రగదాసిధారి యగు నారాయణమూర్తి శ్రీమహావిష్ణుమూర్తి భూపుత్త్రుఁడగు నరకాసురుం బొలియించి మిమ్ము భరించును. రక్షించువాఁడు కాఁగలఁడు. అంతదనుక మీకీకష్టములు తప్పవు అని శ్రీకృష్ణా! వారుచెప్పినట్లే నేఁడు మాకష్టములు గట్టెక్కుకాలముగాన నరిందముఁడ వగునీవు దర్శన మొసంగితివి. మహాత్ముఁడ వగు నీసందర్శనమున మావాంఛలు సఫలములే యైనవి.

అని యాపురంధ్రీమణులు పలుకఁగా భగవంతుఁడు వారి నెల్ల నూఱడిల్లంజేసి వారితో సంభాషించెను. * మర్యాద యుట్టిపడునట్లు గౌరవించెను. కింకరుల కెల్ల వారి నుచితస్థానములఁ జేర్పుఁడని యాజ్ఞాపించెను. వాయువేగమునఁ బోనేర్చిన కింకరులు వేనవేలు తదాజ్ఞ మాళులం దాల్చి శిబికలయందు వారింగూరుచుండఁజేసి కొనిపోవుచుండ వారిగతివిశేషసంజనిత ధ్వని మహత్తరముగఁ గనఁబడియెను. అపర్వత రాజశిఖరము పరమపూజ్యము. నిర్మలభానుశీతాంశుకిరణసమానకాంతివిరాజితము. మణికాంచననిర్మితతోరణములందుఁ గలవు. సకలపక్షివిశేషము లందు నివసించును. మాతంగము లందుండును. హరిణములు విచ్చలవిడి నందుఁ దిరుగుచు భీతిలేక యుండును సరీసృపములందు నివసించును. సకలర్తు ఫలసమృద్ధము లగువృక్ష

* యథార్హతః పూజయిత్వా సమాభాష్యచ కేశవః, యానైః కింకర సంయుక్తై రువాహ మధుసూదనః. అని హరివంశము.

విశేషము లాపర్వతమూర్ధమునఁ గ్రిక్కిరిసియుండును. శాఖామృగవిశేషము లామహీరుహశాఖలఁ గ్రీడించుచుండును. గండశిలలందుఁ గనంబడుచుండును. శిలాఫలకము లుపవసింప నర్హములుగా నందుఁ బెక్కులుండును. వరాహాదిమృగవిశేషము లందు నించుకయేని భీతిని గల్గింపక తిరుగుచుండును. కావున నే యాశిఖరము కోరఁదగినది. మృగబృందవిలోడితం బగునా శిఖరమును గొనిపోవ భగవంతుఁ డూహించెను. పరమేశ్వరుని బల మింతయని తెలుప శక్యముకాదుకదా. కావున దానిం బెకలించుట యత్యల్పకార్యమని తలంచి పక్షిరాజోపరిభాగమున నునిచెను. భగవంతునిసంకల్పమే కార్యరూపముగా నగును గదా! మణిపర్వతశృంగమునుసత్యభామా శ్రీకృష్ణులను గరుడుఁ డత్రమంబున వహించెను. అది యొకవిలాసముగా నాపతత్రినాయకునకుం దోఁచెను. తనపక్షములఁ గదలించెను. ఆవాతము శృంగమున వ్యాపించెను. ఆచప్పుడు దిగ్విదిక్కుల బోరుకొలిపెను. పర్వతాగ్రముకదలెను. అందలివృక్షము లల్లలనాడసాగెను. మఱియు నాగాలికి మహామేఘములు తూలెను. కొన్ని మేఘములు శకలములై యందందుఁ గనఁబడసాగెను. ఆపక్షిరాజు శ్రీకృష్ణునభిప్రాయ మెఱింగి యాపర్వతప్రదేశము నతిక్రమించిచంద్రసూర్యులు సంచరించు మార్గమునుమీఱి సుమేరుపర్వతము చేరంబోయెను. ఆనగోత్తమము దేవగంధర్వనిరంతరసంసేవితము. అందు దేవతలవిశ్రాంతిభవనము లనేకసంఖ్య లుండును. వానినెల్ల నాదరంబున భగవంతుఁడు చూచెను. మఱియు విశ్వేదేవతలయు సాధ్యచారణులయు దివ్యహర్మ్యములం గాంచెను.

వానినెల్లం గాంచి యచ్చెరువందుసత్యభామకుఁ దెలుపుచు వాని నతిక్రమించి దేవలోకమునకుం బోయెను.

మహాశయులారా! దీనితరువాతికథ పారిజాతాపహరణము. దానికి ముందు నారదముని యరుదెంచి పారిజాతప్రసూనము నిచ్చుటయు, వానిని రుక్మిణి కిచ్చుటలో నగుచరిత్రముల వ్రాయ వలసియుండును. కాన ముందా చరిత్రమును వ్రాసి పిదప నీకథను స్పృశించి, కథను సాంతముగా సాగించెదను. నరకాసుర వధ విషయమున నాలుగుమాటలు వ్రాయక మాననయితి కాదు. కనుక వాని నవధరింపుఁడు. ఇందు విశేషాంశములు పెక్కులు గలవు. వానినెల్ల దడవక యుచితరీతి మెలంగెదను.

శ్లో. "లోకానామంతకృత్కాలః కాలోఽన్యః కలనాత్మకః
సద్విధా స్థూలసూక్ష్మత్వా న్మూర్తశ్చామూర్తఉచ్యతే."

అనున్యాయము ననుసరించి కాలమే పరబ్రహ్మస్వరూపము. అది నిరాకారమయ్యు సాకారమువలె నగపడుచుండును. అవిభక్తముకదా. కావునఁ గాలరూపుఁడగుభగవంతుఁడు తానరూపుఁడయ్యు సరూపుఁడై యనాముఁడయ్యు సనాముఁడై నిర్వికారుఁడయ్యు సవికారుఁడై ప్రపంచమును సాగించుచుండును. ఈవిషయమును గీతయందు

శ్లో. "కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32
తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,

మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" 33

(౧౧. అధ్యా)

"ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్"

(౧౦. అ. ౩౦ శ్లో.)

అని శ్రీకృష్ణభగవానులే వచించెను. కాలస్వరూపుఁడగుపరమేశ్వరుఁడు లోకములు సృజింపఁ దలంపుఁగొని సృజించును పాలించును. సంహరించును. ఈమూఁడుకార్యములు చేయనతఁడొక్కఁడే. ఆయొక్కరూపమే మూఁడురూపములుగాఁ గనంబడి బ్రహ్మ విష్ణు రుద్రనామములఁ దాల్చును. ఇది సర్వశాస్త్రసమ్మతము. సర్వసుమతసమ్మతము. సర్వమహర్షిసమ్మతము. ఆకాలమే కర్మాధీనముగ ఫలముల నొసంగును. కర్మఫలములను జంతువు తదుచితతనువును దాల్చి యనుభవించును. ఆకర్మఫలానుభవము ముగియునంతదనుక నెవ్వఁ డేమియుఁ జేయంజాలఁడు. తుదకు భగవంతుఁ డేమియుం జేయందలంపఁడు చేయఁజాలం డనిమాత్ర మనరాదు. "కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః పరమేశ్వరః" అన్నసూక్తి సత్యముకదా. కావునఁ దనయానతిఁ దామీఱఁడు. కర్మఫలముల ననుభవించుదనుకఁ జూచుచుండును.

శ్లో. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన,
మాకర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి. ౪౭
కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్." ౫౧

(గీత. ౨. అధ్యా.)

శ్లో. "యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాంతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. ౧౪
రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫
కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసఃఫలమ్." ౧౬

(గీత. ౧౪. అధ్యా.)

అను గీతావచనములంబట్టి కర్మఫలములను గోరరాదనియుఁ గర్మముల మానక చేయవలయుననియు నెవరు కర్మఫలములఁ ద్యజంచి కర్మముల నీశ్వరార్పణబుద్ధిచేఁ జేయుదురో వారెల్ల ననామయమగుపదము నొందుదురనియుఁ దేలెడిని. మఱియు నాకర్మములు సాత్త్వికరాజసతామసభేదముల ముత్త్రివిధములుగ నుండుననియుఁ దత్ఫలములు తదనురూపములుగా నుండుననియును స్పష్టమగు.

ఎవరు దుష్కర్మములఁ జేయుదురో వారాఫలానుభవమునకుఁ దగినరూపమును దాల్చి వాని ననుభవించుచుండ నితరులు పరితాపపడవలయునే కాని వాని ననుభవింపకయుండఁ జేయఁజాలరు. సత్కర్మములు నట్లే యనవలయును. నరకాసురుఁడేయే కాంతలఁ జెఱఁబెట్టెనో వారు దుష్కర్మముల నాచరించిరి. ఇతరులనిర్బంధించుట లోనుగాఁగలవి దుష్కర్మములలోఁ జేరినవి. వానిఫలములను వా రనుభవించిరి. ఆకర్మ మెంతకాలమనుభవింపఁదగునో యది పూర్తికాఁగా భగవంతుఁడు దర్శనమిచ్చెను. తత్ఫలము పూర్తికాకమును పీకాంతలదుఃఖము భగవంతున కెఱుకపడకయుండునా. తెలిసి యేల రాలేదు? ఫలాను

భవకాలము మిగిలియున్నందున ననవలయు. నరకాసురుఁడు అదితికుండలముల నెంతకాలము ధరించుభాగ్యము గలవాఁడో అంతకాల మనుభవించెను. అదితి కుండలములుఁ గొనిపోయిన పుడే యేల కృష్ణమూర్తితోఁ జెప్పఁడయ్యెను? వానిభాగ్య క్షయ మగుకాల మపుడు కానందున ననవలయునేకాని వేఱొక మాట పలుక వలనుపడదు. నరకాసురునకు భూలోకవాసము పూర్తియగుతరుణము సమీపింపఁగా నింద్రుని వానికర్మమే పురికొలిపెను. అన్ని కార్యములుచక్కఁగా నెఱవేఱెను. ఎవఁడు కాని కర్మమును మీఱఁజాలఁడనియు దాని ఫలమును గోరక భగవదర్పణముగా సత్కర్మముల నాచరించుచుండవలయున నియు దాననే యీశ్వరానుగ్రహము గలుగుననియు నపుడు ప్రకృతిపాశబంధనములు వీడుననియుఁ దెలిసికొనవలయును.

నరకాసురుఁడు చెఱలో నుంచియున్నపదాఱువేలసం ఖ్యగలకాంతలను శ్రీకృష్ణుఁడు పెండ్లియాడెనని కొంద ఱభి ప్రాయములను దెల్పుదురు. ఆరాజకన్యకల నరకాసురుఁడు బల వంతముగాఁ బట్టితెచ్చినను వా రతనిఁ గామింపలేదనియుఁ గొంతకాలమునకైన బుద్ధిరాదా యని కారాగారమున నునిచె ననియు నింతలో హరి నరకుం బొలియించెననియు వారెల్ల జగన్మోహనాకారుని బతిగాఁ గోరిరనియుఁ గోరిన రాజకన్యకల వరించుట న్యాయముకానఁ గులకన్యకలం బెండ్లియాడెననియు నెఱుంగవలయును. గోపికలఁ బదాఱువేలమందినిఁగూడి వ్యభి చె నన్నమాట దీనితో నేటఁ గలిసినదనవచ్చును.

"యథోపయేమే భగవాన్ తావద్రూపధరోఽవ్యయః" అని . ాగవతమునఁ గలదు. రాజకన్యకలఁ బెండ్లియాడుట

రాజకులమున నవతరించిన శ్రీహరికిఁ దప్పుగాఁ జెప్పవచ్చునా. తప్పుగానుండు భాగ మిం దణుమాత్రము గానరాదు. వ్యభిచారమనుమాట నిటఁ జెప్పవలనుపడదు. ఇఁక దేవతాస్త్రీలను నిర్బంధించి నరకాసురుఁడు పర్వతకందరముల నుంచెనని హరివంశమునఁ గలదు.

శ్లో. "నరకేణ సమానీతాః రక్ష్యమాణా సమంతతః,
త్రివిష్టపసమే దేశే తిష్ఠంతీ రపరాజితాః."

... ... ... ...

దేవలోకమును జయించి యందున్న గంధర్వాదిదేవతావిశేషములభార్యలను గొమరితలను దెచ్చెను.

"గంధర్వాసురముఖ్యానాం ప్రియాదుహితర స్తథా,
దదర్శ పృథులశ్రోణీ స్సంరుద్ధా గిరికందరే.
యానైః కింకరసంయుక్తై రువాహ మధుసూదనః."

(హరివంశము.)

అట్టివారినెల్ల శిబికాదియానముల నునిచిపంపెను. అనియున్నదానిం గాంచి కొందఱు వారిని ద్వారకానగరమునకుం బంపి పదంపడి వారింగూడి విహరించెనని కొందఱు దేవానాంప్రియులు పలుకుదురు. అదిపాటింపఁదగనిమాట యనక తప్పదు. హరివంశమునందే, ఆస్త్రీలందఱు నియతిమీఱ నేకవేణీధరలయి కాషాయవసనములంగట్టి నియతేంద్రియలై వ్రతోపవాసములఁ దనువులఁ గృశింపఁజేసిరనియుఁ గృష్ణదర్శనమును గోరుచుండిరనియు వాయుదేవుఁడు నారదమునియు వారికి విమోచనకాలమును దెల్పిరనియుఁ దత్కారణంబున వారు శ్రీకృష్ణదర్శ

నమును గోరుచుండిరనియు హరివంశమునందే కలదు. భగవంతుని జూచినంతనే వారు నమస్కరించి,

"దర్శనేన కృతార్థాహి వయమద్య మహాత్మనః"

అని ప్రార్థించిరి అని యందే కలదుకాని వారు తమ యాపన్నిర్మోచనార్థమరుదెంచినభగవంతునిగా నెఱింగి ధన్యుల మైతిమని ప్రార్థించిరి. వారిని శ్రీహరియు,

"యథార్హ్వతః పూజయిత్వా సమాభాష్యచ కేశవః,"

అని యున్నమూలముం గాంచినను వారిశంకలు తొలంగకుండునా. తాను గామించినకాంతలను బూజించుట సంభవమా కాదా యనియైన నాలోచించిన దేటపడఁగలదు. మణిపర్వతకందరములఁ దనకొఱకుఁ దపస్సాచరించుచున్న యాదేవతాకాంతల రక్షింప నరిగెననియు వారి నాశ్వాసించి నరకాసురకింకరులచే యానములపై నెక్కించి వారివారియాలయములకుం బంపెననియు గ్రహించుట బుద్ధిమల్లక్షణము.

ఈవిషయములనుబట్టి యాలోచింపఁగా గర్మానుభవము పూర్తికాఁగా భగవంతుఁడు వారిని దానే యుద్ధరించుననియుఁ గర్మఫలానుభవము ముగియకముం దెవ్వరేని వారి ప్రస్తావము నకుం బోరనియుఁ గర్మము బలవత్తరమనియు దాని మీఱఁజాలుశక్తి పరాత్పరున కొక్కరునకుందప్ప నింకెవ్వరికిని లేదనియుఁ దేలెడిని. భూదేవి శ్రీహరిని వినుతించుఘట్టమునందు,

శ్లో. "భక్తేచ్ఛోపాత్తరూపాయ పరమాత్మన్నమోఽస్తుతే"

అని శ్రీభాగవతమునఁ గన్పట్టెడిని. భగవంతుఁడరూపుఁడయ్యు నుపాసకుల యిచ్ఛానుసారము రూపములఁ దాల్చు

సనియు వానిమూలమున నాభక్తుల నుద్ధరించుననియు దీనిభావము. భగవంతుఁడే భక్తుఁడేరూపమునుగోరినను వారియిచ్ఛాను సార మగురూపమున వారికి దర్శనమిచ్చి కృతార్థులనుగాఁ జేయుననఁగా నారూపము వాస్తవము కాదనుట స్పష్టముకదా. ఇట్టులు శ్రీభాగవతమే తెల్పుచుండ భాగవతులు శివాదిరూపముల నీసడింపఁగల కారణమేమియో తెలియఁజాలకున్నాఁడను. వారిమొఱకుఁదనమే కారణము కాని వేఱేదియుఁ గాదని తోఁచెడిని. సర్వనామములు సర్వరూపములు పరాత్పరునకు సమానములని శాస్త్రములు ఘోషించుచుండ వానిం ద్రోసిపుచ్చి తమమొండిపట్టును విడువకున్నచో వారికిఁ జెప్పినను లాభమేమి? గీతాశాస్త్రమునఁ బదునొకండవ యధ్యాయమునందు.

"మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. ४७
నవేదయజ్ఞాధ్యయనైర్నదానై
ర్నచక్రియాభిర్నతపోభిరుగ్రైః,
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. ४८
మాతే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతిమనాః పునస్త్వం
తదేవ మేరూప మిదం ప్రపశ్య." ४९

అనుభగవద్వాక్యములను బరికింపుఁడు. కాలానుసారము కార్యానుకూలము నగురూపముధరింతుననియు దాన భీతినొందఁ బనిలేదనియు నాసౌమ్యరూపమును జూడుమనియుభగవంతుఁడు తెలిపెనని దీనిసారము. కాఁబట్టి భగవద్రూపభేదములయందు బరాత్పరునినామభేదములయం దుచ్చత్వనీచత్వములఁ గల్పింపరాదు. అది పాపహేతువు. అట్టివాఁడు భక్తుఁడు కాఁడు. అట్టి కార్యమునకుం బూనక భగవత్కథలంబఠించి యాతనికరుణకుఁ బాత్రులు కావలయు. ఇంకను దీనిం దడవక తర్వాతిభగవత్కథను వ్రాయ లేఖినిం బ్రార్థించువాఁడను.

దీనితర్వాతికథ శ్రీహరి దేవలోకమున కరిగి యదితికిఁ గుండలముల నొసంగి పారిజాతవృక్షమును బెకలించి తెచ్చి ద్వారకానగరమున సత్యభామామందిరమున నునిచె ననుకథ గలదు. దీనికి ముందు సత్యాదేవి పారిజాతము నేలకోరెనో తెలిసికొనవలయుఁ గావున నీయధ్యాయశిష్టభాగమును నిలిపి పారిజాతకుసుమవాంఛ గల్గుటకుం గలకారణమును ముందు వ్రాసెద. శ్రీభాగవతమున నీకథ యత్యల్పముగ నున్నది. హరివంశమున విశేషించి కలదు. బ్రహ్మపురాణమునందును గలదు. వాని ననుసరించి వ్రాసెదను.

### నారదముని పారిజాతకుసుమమును హరికి సమర్పించుట.

శ్లో. అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీ
సరసతరసరసిరుహసదృశదృశి దేవే,
వ్రజయువతిరతికలహవిజయినిజలీలా
మదముదితవదనశశిమధురిమణి లీయే. ౫౧

శ్లో. కరకమలదరదళితలలితతరవంశీ
కలనినదగళదమృతఘనసరసి దేవే,
సహజరసభరభరితదరహాసితవీథీ
సతతవహదధరమణిమధురిమణి లీయే. ॥ ౨

శ్లో. కుసుమశరశరసమరకుపితమదగోపీ
కుచకలశఘుసృణరసలసదురసి దేవే,
మదలులితమృదుహసితముషితశశిశోభా
ముహురధికముఖకమలమధురిమణి లీయే. ॥ 3

(శ్రీకృష్ణకర్ణామృతము. ౧. ఆశ్వా.)

*ఇప్పటికథ ద్వారకాపురమున శ్రీకృష్ణమూర్తి భార్యాసమేతుఁడై తనయవతారఫలమును బ్రపంచమునకుఁ గలిగింపఁ దలంచియున్నయట్లెఱింగి చదువవలయును. నరకాసురవధకంటె ముందుగా నీకథ సాగిన ట్లూహించిన స్పష్టముగాఁ దెలియును. సత్యభామకుఁ బారిజాతముపైఁ గోరికకలిగినదని తెలుపుటకే యీ పీఠిక. కావున నరకవధపూర్వమీ కథకుఁ బ్రస్తావము గల్గింపవలయును. దాన నరకాసురుం జంపఁబోవుచు శ్రీకృష్ణుఁడు సత్యభామను దోడ్కొనిపోయినన్న కథ సరిపడును. లేకున్నఁ బెండ్లికిం బోవుచుఁ బిల్లిని జంకఁబెట్టుకొనిపోయి నన్నసామెత కుదాహరణమగును. నరకాసురునితో సత్యభామ యుద్ధము

* ఈకథ హరివంశము విష్ణుపర్వము ౬౫ వ అధ్యాయమునుండియుం, బ్రహ్మపురాణము ౯౪ వ అధ్యాయమునుండియుం, గర్గసంహిత పదియవదగు నశ్వమేధఖండము 3 వ యధ్యాయమునుండియుం వ్రాయఁబడినది. విష్ణుపురాణము పంచమాంశము ముప్పదియవయధ్యాయమున నీకథ కలదు. బ్రహ్మపురాణశ్లోకములే యందుఁ గలవు.

చేసెనన్న కథ తెనుఁగునఁ గలదు. సంస్కృతభాగవతమునఁ గాన రాదు. చమత్కారమును గల్గింపఁగోరి తెనుఁగున వ్రాసిరనుట కంటె వేఱొకమాట యనఁగూడదు. మూలవిరుద్ధమనిమాత్రము గట్టిగాఁ జెప్పవచ్చును. కల్పించిన నపచారమేమనుప్రశ్నమునకు బదులు చెప్పవలసినంత యవసరము నాకుఁ గల్గలేదు. దానికిది స్థలముకాదు. కావున నిపుడు శ్రీహరి భార్యాష్టకసమేతుఁడై ద్వారకానగరమున భూభారహరణార్థము కాచుకొని కాల మెపుడు వచ్చునా యని యున్నట్లూహించి యీకథను బఠింపుఁడు. నిస్సంశయముగాఁ గథ గోచరించును. ఇఁకఁ గథ వినుఁడు.

మథురానగరమునఁ బరమేశ్వరుఁ డుండి కనఁబఱచిన యద్భుతకర్మములు భక్తులకుఁ దెలిసినవియేకదా. ద్వారకానగరమున వేంచేసియున్నప్పుడు కనఁబఱచిన విచిత్రచర్యల నిపుడు పఠించు టుత్తమము. అది పరమార్థము. దానఁ జేకూరని వాంఛలు భక్తులకు నుండవు. చరితమును బఠించునపుడు భక్తియు శ్రద్ధయు నుండవలయును. లేకయున్న వృథా కాలము గడపుట వంటిదే యగును. భక్తి యనునది పాఠకునిమది నపార్థములు తోఁపకుండఁజేయును. శ్రద్ధ యనునది దానిసార మును గ్రహించునట్లు చేయును. ఈ రెండును లేనివారు భగవత్కథలఁ బఠించుటకంటె నూరకుండుటయే మేలు. పఠనఫలమైన నుండదా యందు రేని వారిలో రితరులకుఁ గలభక్తిని రూపుమాపు దురన్నభయము నాకించుక గలిగియే యీమాట వ్రాయుచున్నాఁడను.

ద్వారకానగరమున నున్న శ్రీకృష్ణమూర్తి యొకానొక దినంబున నునట్టులుండి రుక్మిణీదేవింగూడి రైవతకపర్వతమున కేగెను. రుక్మిణీదేవి యుపవాసవ్రతము నాచరించుచుండెను. ఉపవాసానంతరము పారణముచేయుట విధి. ఆ కార్యము రైవతకాద్రియందు జరపఁదలంచి సభార్యుఁడై పోయెను. రుక్మిణి పుత్త్రులు పరిజనులు బంధువులును బోయిరి. పెక్కుమంది స్త్రీలు రుక్మిణింగూడిపోయిరి. వారిసంఖ్య వేలకు మించియుండెను. ఆనగోత్తమమున నాఁడు భగవంతుని దద్బాంధవులను లెక్కింపనుగాని వారిసంతసమును వర్ణింపనుగాని యెవ్వరికిని వలను పడదు. అందు వచ్చి దర్శించినబ్రాహ్మణులకు సంతృప్తిగా ధనమిచ్చి శ్రీహరి వారిని సంతుష్టాంతరంగులనుగా నొనరించెను. యాచకులకోరికలఁ దీర్చెను. ధర్మకార్యనిరతు లగువారి కనంత ధనము లొసంగెను. స్తుతిపాఠకుల నలరించెను. కులగోత్ర నామముల వినుతించు వందిమాగధవైతాళికులు లోనగువారికిని బుణ్యకర్మములనే సదా యాచరించువారికిని దృప్తిగా ద్రవ్య మిచ్చెను. భగవంతు నాశ్రయించినవారికిఁ గొదువయుండునా. భక్తవత్సలుఁడు కావున జ్ఞానుల నానందపరవశులనుగాఁ జేసెను. ఉపవాసవ్రతాంతమున నేయేకార్యములు విధివిహితములో వానినెల్ల నాచరించి రుక్మిణి మదిఁ గొఱంత లేకయుండఁ జేసెను. ఆవ్రతము సాంతముగా నెఱవేఱగా రుక్మిణిని భార్యలయందుత్తమురాలినిగాఁ దలంచెను. ప్రీతిమీఱ నాదరించెను.

## నారదాగమనము.

ఇట్లు రుక్మిణియుఁ దత్సంతానము తద్బంధువులు తన్నుఁ బరివేష్టింపఁగా భగవంతుఁడు రైవతకాద్రియందు వేంచేసి

యుండఁగా నాపరమాత్ముని తేజమున నలుదిక్కులు తెల్వొనొం దఁగా నొక్కనాఁడు రుక్మిణిచెంతనుండి మాటలాడుచుండఁగాఁ దానందులకు బదులుచెప్పుచు నానందించుచుండెను. అట్టియెడ దేవలోకమునుండి నారదమహాముని యరుదెంచెను. అప్రమేయాత్ముఁడగు నుపేంద్రుఁ డామునిరాకకుఁ గారణ మెఱింగి లోకాచారమును బాటించి విధివిహితముగా నాతిథేయసత్కారములాచరించెను. నారదముని సత్పురుషులలో నగ్రగణ్యుఁడు. పూజ్యులలోఁ బూజ్యుఁడు. కావున హరిచే గారవింపఁబడి భక్తిభరాక్రాంతస్వాంతుఁడు కావునఁ బారిజాతకుసుమమును భగవంతున కర్పించెను. పారిజాతము కల్పవృక్షము లనఁబడు నైదింటిలో నుత్తమమను ప్రఖ్యాతిఁ గన్నయది. అది శచీదేవికిఁ బ్రాణపదమగు వృక్షరాజము. కాఁబట్టియే యింద్రుఁడు దాని నతిప్రీతిఁ గాపాడుచుండును. దానికుసుమములు సర్వకామప్రదములు. కాఁబట్టియే త్రిలోకములందుఁ బ్రసిద్ధిగాంచినవి. శ్రీహరి మునియిచ్చిన యాదివ్యకుసుమమును గైకొని గారవించి ప్రాణప్రియ యనందగురుక్మిణీదేవి కొసంగెను. ఆసమయమున నాదేవి భగవత్పార్శ్వమున నిలువఁబడియుండెను. మహాలక్ష్మి యగు నాదేవి యాదేవకుసుమమును బ్రతిగ్రహించి ప్రాణనాథుని యభిమతము నెఱింగిన చతురురాలు గావున శిరమున ధరించి దానిని బహూకరించెను. రుక్మిణి త్రైలోక్యరూపసర్వస్వ మనఁదగును. నారాయణమనోహారిణి. ఆదేవకుసుమధారణమున ద్విగుణముగాఁ బ్రకాశించెను.

## పారిజాతమహిమము.

బ్రహ్మతనయుఁడు మునిజనసత్తముఁడు నగు నారదముని యాదేవితో నిట్లుపలికెను. పతివ్రతాశిరోమణీ! భీష్మరాజనందినీ! నీకే యీపుష్పరాజము తగినది. పుష్పరాజమనునిది యొక్కఁడేసుమా. దీనిని నీవుత్తమాంగమునఁ దాల్చితివి. దీనిసంసర్గమున నీవు మిగులఁ బూజ్యురాలవగుదువు. వ్రతపరాయణురాలవు కావునఁ దదంతమున నీకీదివ్యకుసుమము లభించుటయే యదృష్టమనవలయు. కావున నీకనంతకల్యాణములు లభించును. కల్యాణగుణసంపన్నురాలవై సతతము భర్తృవత్సలవయి యుండఁగలవు. దీనిమాహాత్మ్యము నాలకింపుము. ఇది యెంతకాలమునకేని వాడదు. సంవత్సరపరిమితకాలము దీనిని ధరించినయెడల నీప్సితముల నొసంగుచు విమలపరిమళముల నీనుచుండును. నీవెఱుంగనిదేమున్నది? ఐనఁ జెప్పెద అవధరింపుము. శీతోష్ణములఁ గోరితివే నొసంగును. సకలరసములఁ గురియును. మనఃకాంక్షితములఁ దెలుపకయే యీయఁగలదు. దీనిని సేవించినచో సౌభాగ్యము స్థిరముగానుండును. ఎట్టిపరిమళమునుగోరిన నొసఁగూర్చును. కష్టముల మదిఁదోఁపనీయదు. సంతోషమునే కల్గించుచుండును. ముల్లోకములఁ గల నేయేకుసుమములఁగోరుదువో దానినెల్ల నప్పుడ లభింపఁజేయును. సకలవృక్షప్రసూనముల నొక్కసారి తెచ్చియిచ్చును. షడ్గుణముల నొసంగునదిదియే. సంతానప్రదము. ధర్మబుద్ధి నొసంగును. అపరిశుద్ధునకు నిర్మలమతి నొసంగును. దీని ధరించినమాత్రమున నెల్లదుఃఖములుతొలంగును. ఏయేవర్ణముగల వస్త్రమాల్యాభరణములను గోరుదువో వానినెల్లఁ బడయవచ్చును. కొలఁది వాంఛితముగాని

గొప్పకోరికగాని నీవు కోరినది ఫలించుచుండును. దీనిసంగతిచే దుర్గంధములు తొలఁగి యెటకో పోవును. ఇష్టగంధము వృద్ధి నొందును. కమలాక్షీ! రాత్రులయందిదియుండుచోట దీపములు పెట్టనక్కఱయుండదు. దీనికాంతులచే దీపములు వెలిఁగించు నట్లు గృహములు ప్రకాశించును. సంతానమను కల్పవృక్షము గలదు. దానిపూలహారమును స్త్రీలు కోరుదురు. దీనిధరించి యాసంతానకల్పవృక్షమాలిక వలయునని కోరినవెంటనే లభించును. కోరినవస్త్రములు సిద్ధించును. సర్వర్తుకుసుమములు లభించును. తలంచినంతనే యాలస్యములేక యేవాంఛితమైనను జేకూరును.

ఎప్పుడైన నాకలిగాని దప్పిగాని బాధించునేని దీని ధరించినంతన యవి మాయమగు. జరాభారము వీడును. దేహాయాసము పోవును. దేవతలవలెఁ ద్రింశద్వర్షపరిమితవయస్సు సదా యుండును. దీనిప్రభావ మిట్టిదని యెఱుంగుము. స్వచ్ఛందజీవనము దీన లభించును. సంగీతముఁ నిచ్ఛపొడమునేని సాధుగీతములు వినవచ్చును. నీమదిఁ గోరినవాద్యముల కలస్వనములు వినఁబడును. రుక్మిణీ! ఒక్కసంవత్సరము పూర్ణము కాఁగా నీకుసుమము నీకడ నుండదు మరలి యావృక్షముకడకే పోవును. సంవత్సరకాలమే యిది యొకచోట నుండును. ఇది పారిజాతకుసుమప్రభావము. దేవతలవాంఛితము లీనుచుండున దిదియే యని యెఱుంగుము. పరమశివుని పత్నియయి హిమాచలపుత్రిక యగు పార్వతీదేవి యీపారిజాతకుసుమముల సర్వదా ధరించుచుండును దేవమాత యగునదితియు శచీదేవియు వేదమాత యగుసావిత్రియు దేవతాసమారాధితపాదాంబుజాత

యగు మహాలక్ష్మియు నింకను లెక్కకు మించియున్న దేవపత్ను లును వసుదేవతలు నితరదేవతలును సర్వదా పారిజాతకుసుమ ముల ధరింతురు. దీని ధరించినవారి కిది ఫలము నొసంగుట యొకసంవత్సరపర్యంతమే. తరువాత నిది ఫలమునొసంగక తానే యదృశ్యమగును. రుక్మిణీదేవీ! శ్రీహరికిం గలభార్యలందఱిలో నీవే యగ్రగణ్యవనియుఁ దత్ప్రీతికి మిక్కిలి పాత్రురాలవనియు నిపుడు తేటపడియెను. ఈదివ్యకుసుమమును బ్రీతిమై నీకొసం గుటయే యీ నాయూహకుం దగినకారణము. భగవంతుఁడు నిన్నుఁజూచి సపత్నులందఱు తలలువంచుకొని నీమహిమ మెఱుంగఁజేసెను. నీసౌభాగ్యము నేడు ప్రకాశించెను. నీయ శస్సు దిగంతవిశ్రాంతమయ్యెను. మధుదానవసూదనుఁ డీకల్ప వృక్షప్రసూనమును నీకే యిచ్చెనుగదా. సాత్రాజితీదేవి యిపుడు నీమహిమ యిట్టిదని తెలిసికొనఁగలదు. ఆమె తనసౌభాగ్య మునే కడుంగడుం గొండాడుచుండును కాని నీసౌభాగ్యాదుల నెఱుంగదు. సాంబునిమాత యగుగాంధారియు నితరభార్య లును హరికరుణారస మెవ్వరియం దధికముగాఁ బ్రవహించు చున్నదో యిపు డెఱుంగుదురుగాక. ఇట్టి యదృష్టము తమకుం గలుగఁగల దనువిషయమున నిస్పృహ లగుదురుగాక. సౌభా గ్యమెల్ల నీయధీనమే యగును. అది సర్వదా జయశీలమయి నెగడెడిని. ఆ నీసౌభాగ్యరథము నితరభార్యలమనోరథరథస హస్రములును జయింపఁజాలవు ఈవిషయము నిట నేను బ్రత్యక్షముగా నెఱింగితిని. శ్రీకృష్ణునకు ద్వితీయప్రాణము నీవే యని స్పష్టమయ్యెను. అచ్యుతుఁడు త్రైలోక్యరత్నమగు పారి జాతకుసుమమును నీకే యొసంగెనుగదా. జీవితాతిశయపుష్ప

రత్నము నీచేఁ బడయఁగల్గెను. శ్రీహరిప్రియా ! కడుధన్యు రాలవు. అని మఱిమఱి పొగడెను.

సత్యభామ చింతానిమగ్న యగుట.

నారదముని శ్రీకృష్ణమూర్తి వినుచుండఁగా రుక్మిణి నిట్లు పొగడుటయు శ్రీహరి తా నామాటలు వినుచు నవ్వు చుండుటయు సత్యభామాపరిచారికలు వినిరి. అంతకుముందే శ్రీహరిసన్నిధికి దాదిని సత్యాదేవి పంపియుండెను. నారదాగమ నము మొదలుకొని యంతదనుక నిట సాగినచరిత్రమంతయు వారికి స్పష్టముగఁ దెలిసెను తక్కినహరిపత్నులును దమపరి చారికల భర్తృసన్నిధికిఁ గార్యాంతరములకై పంపియుండిరి. వారునుగూడ నీమునివాక్యముల నాలకించిరి. వారెల్ల నందుజరి గినవిశేషములను నారదముని రుక్మిణీదేవిని బహూకరించు టయుఁ జక్కఁగా నాలకించి స్త్రీస్వభావమును వదలఁజాలక జరి గినది జరిగినట్లు తమతమరాణులకడఁ బూసగ్రుచ్చినట్లు వరుసతప్ప కుండ విన్నవించిరి. కర్ణాకర్ణికగా నందలిరహస్య మెల్లరకుఁ దెలి సెను. ఒకరితో నొకరు రుక్మిణి సౌభాగ్యాభివృద్ధింగూర్చి గుస గుసలాడుకొనిరి. *ఒక్కర్తుక యర్హురాలే యని సమాధానము చెప్పెను. వేఱొక్కర్తుకపుత్త్రవతిగదా రుక్మిణి. కాన నొసంగెనని పల్కెను. ఇంక నొక్కతుక పెద్దభార్యకదా యనియె. మఱియు నొక్కర్తు వేఱొకమాటగా నిట్లు పదుగురుపది మాటలనునట్లు పలికిరి. కోపగించుకొనిన భర్తను హితముకాదని హర్షించిరి.

---

* అర్హేతి పుత్త్రమాతేతి జ్యేష్ఠేతి చ సమాగతాః, ప్రాయేణ ప్రవ దంతి స్మహృష్టాదామోదరస్త్రియః. మన్యుషేన సపత్న్యస్తు తతస్సౌభాగ్యగు ణోదయం, సత్యభామాప్రియానిత్యం విష్ణోరతులతేజసః. అని హరివంశము.

ఈఘట్టమునఁ దెనుఁగుకవులలో మృదుపదముల జతపఱచుటకు రెండవదండియను విఖ్యాతింగాంచిన ముక్కుతిమ్మన్నగారు తమ పారిజాతాపహరణ మనుప్రబంధమున వ్రాసినపద్యరత్నములఁ గొలఁదిగా వ్రాసెదను. వారిగ్రంథమున కీహరివంశమే యాధార మని తేటపడియెడిని.

ఉ. అందఱిలోనఁ బెద్ద మహి • మాన్వితరుక్మిణి గానఁ బూవు
గో, విందుఁడు దాని కిచ్చెఁ దగ • వే యని లక్ష్మణ యోర్చె
నైఁచెఁ గా, ళింది శమించె భద్రయవు • లెమ్మని యూఱ
డి లేఁ సుదంతలోఁ, గుందుట మానె జాంబవతి • కోపమడం
చెను మిత్రవిందయున్.

పద్య మెంతమనోహరముగా నున్నది! భాషాంతరీకరణము కాదు కాన నామములఁ గొన్నింటిని జేర్చినను ముద్దులొలుకుచున్న పదములకూర్పు మెచ్చఁదగుఁగదా. * శ్రీమహావిష్ణువునకు నిరంతరము ప్రీతిపాత్రురాలగు సత్యభామసవతి యదృష్టపు టుదయమున కోర్వఁజాలకపోయెను. ఆమెరూప యౌవనముల సాటిలేనిది. తనసౌభాగ్యమే లోకాతిశయమని గర్వించునది. విశేషించి యభిమానముగలదేవి. నారదముని యాడినపలుకులు ములుకులవలెఁ జెవిసోఁక నోర్వఁజాలకయే పోయెను. దీనికిఁ దెనుఁగున నెంతసొగసుగా వ్రాయఁబడినదో చూడుఁడు.

---

*సత్యభామా ప్రియా నిత్యం విష్ణోరమితతేజసః, రూపయౌవనసంపన్నా స్వసౌభాగ్యేన గర్వితా, అభిమానవతీదేవీ శ్రుత్వైవ వేర్ష్యా వశంగతా. అని మూలము.

తే. వారిలోపల సౌందర్య • వతియు మాన
వతియు మహనీయసౌభాగ్య • వతియు నైన
సత్య యంతట, నేమొకో • శౌరికడకుఁ
బోయి రాదయ్యెఁ జెలి ప్రొద్దు • పోయె ననుచు.

అనుకొనుచుండు నంతలోఁ జెలివచ్చి

క. అమ్మా యేమని చెప్పుదు
నెమ్మిన్ నీవిభుఁడు రుక్మి • ణీసతిమణి సౌ
ధమ్మున నుండఁగ సురముని
గ్రమ్మఱ నాకస్మికమ్ము • గా నచ్చటికిన్.

క. చనుదెంచి యమ్మురారికి
ననఘమ్మనరైకయోగ్య • మతిసౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్కదివ్య • కుసుమ మ్మొసఁగెన్.

ఉ. ఎంతకు నేఁడు నారదము • నీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁ • గాఁ బలికెం బతి గూర్చుదాన నా
యంతటివారు లేరని య • హంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచు
న్వంతునవచ్చు సత్యగరు • వం బిఁకఁ జెల్ల దటంచు మానినీ.

క. ఆరణభోజనుమతకము
లారుక్మిణి నటన లాము • రాంతకు చెయ్యిల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు • వారిజనేత్రా.

ఇట్లు తనచెలిపలుకఁగా నాగ్రహించి పతి కింపుగాని సౌందర్యము సతికేల యని విసుగుకొని మేలికుంకుమవర్ణము గల వస్త్రమును వదలి శుచిస్మితయగు నాలేమ తెల్లనివస్త్ర

మును గట్టుకొని రోషాకులిత చేతస్సుగలది యగుచు వర్ధితేంధనుండై మండువహ్నివడువునఁ గనఁబడియెను. ఈర్ష్యాజనితహావ్యవహుఁడట్టె వృద్ధినొంది యామె దేహకాంతిని మార్చెను. క్రోధాతిశయము తన్నుఁ బురికొల్పఁ గ్రోధాగారమును భూరిజలదమును దారవలెఁ బ్రవేశించెను. ఇచ్చోముక్కుతిమ్మన్నగారిపద్యరత్నములఁ బఠింపక తప్పదు.

చ. అన విని వ్రేటుపడ్డ యురగాంగనయుం బలెనేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి పే
ర్చిన కనుదోయి కెంపు దన చెక్కులఁ గుంకుమపత్రభంగసం
జనితనవీనకాంతి వెదచల్లఁగ గద్గదఖిన్నకంఠయై.

శా. ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాట ల్చెవియొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు నీ వింకేటికిన్ దాఁచె దే
నీమోమాటలు మాని నీరజముఖీ నిక్కం బెఱింగింపవే.

చ. అతులమహానుభావమని యవ్విరిఁదా నొకపెద్దచేసి య
చ్యుతునకు నిచ్చెకం బొదవ సూడిద యిచ్చిననిచ్చెగాక తా
నతఁడు ప్రియంబుకల్గునెడ కర్పణచేసినఁ జేసెగాక యా
మతకరి వేలువుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్.

క. పలు దెఱఁగు ముళ్లమాటలు
కలహమె కల్యాణమని జగంబుల వెంటన్
మెలఁగెడువానికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్.

క. ముని యేమిచేయు రుక్మిణి
గొనఁ గారణమేమి ధూర్తగోపాలుఁడు చే

సినచెయిద మేమిచెప్పుదు
మనమెరియదె ప్రాణమైన • మగఁ డిట్లయినన్.

ఉ ఇన్నిదినంబులున్ సవతు•లిందఱిలోఁ గడుగారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు•గన్నుల గప్పుకొనంగ నుండియా
వన్నెయుఁ వాసియుం దఱిఁగి•వారు ననుం దలలెత్తిచూడగా
సన్నలఁ జాయలంబలుక•నైతునె ప్రాణము లింత తీపొకో.

ఆక్రోధాగారమును బ్రవేశించి యాయలినీలవేణి హిమమువలె శుభ్రమగు తెల్లనివస్త్రమును లలాటమున బిగించుకొని యది ప్రియరోషచిహ్నమౌనన్న నమ్మికఁ దాల్చి లోహితచందనమున లలాటాంతభాగములను గప్పి నారదుని మాటలు రుక్మిణికిఁ గల్గినపరమలాభమును మగడు దానికిఁ గారకుఁడై ముని పలుకులకు బదులాడకుండుటయుఁ దలంచి తలంచి శిరఃకంపము చేయుచు నంతకంత కుప్పొంగు రోషాతిరేకంబున దవుడలు కంపించుచుండఁ బరుండెను. దివ్యమగుహంసతూలికాతల్పము నందు విభూషణంబులు చెదరవైచి వేణివిడి పొరలాడుచుండ నిష్కారణముగాఁ గలిగిన కోపము తన్ను లోఁబఱచుకొని కలఁతనొందింపఁ బరిచారికలు మఱింత దాని నభివృద్ధినొందింప సత్కులప్రసూతయయ్యు నీచభావమూని లీలారవిందములు శకలములుగా నొనరించి నలుఁగడలఁ జెదరవైచి నిట్టూర్పులు పుచ్చిపుచ్చి నఖముల నించుక వ్రణములు పడఁదనూలతికఁ గలంచి యెట్లో శయనించి భూతలము నాశ్రయించియుండెను. ఈఘట్టమున నొక్కచిన్నిపద్యము తిమ్మకవిగారిది వ్రాసెదను.

ఉ. మాసినచీరఁగట్టుకొని•మౌనముతోడ నిరస్తభూషయై
వానెనకట్టుకట్టి నిడు•వాలికగస్తురి పట్టుపెట్టి లోఁ

గాసిలి చీకటింటికడఁ గంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగియై పొరలెఁ గాఢమనోజవిషాదవేదనన్.

ఇట్లు శయనించి తనయం దింతకుంబూర్వము శ్రీహరి చూపినప్రేమచిహ్నములం దలంచుకొనుచు నింతలో నెట్లు మాఱెనో మగఁడు తెలియదాయెఁగదా యనివెచ్చ నూర్చుచు వగచుచు మరల నామగఁ డిట్లు చేసియుండునా యని వితర్కించుచు నెచ్చెలి యబద్ధము లాడదు. కాన నాసవతిమాయలకుఁ బతి లోఁ బడియెఁగదా యని పరితపించుచు రుక్మిణి నెంతో కోపమున దూఱుచు నారదముని యేలవచ్చెరా తండ్రీ యని కటకటం బడుచుఁ బతికంటఁబడిన నేమిచేయుదునా యని యాలోచించుచు నాయింటికి శ్రీకృష్ణుఁ డింకవచ్చునా యది రానిచ్చునా యని సంశయించుచు సఖీజనుల నందందుఁ గావలియునిచి చక్కఁగాఁ గనిపెట్టియుండుఁడని హెచ్చరించి చింతాసాగరమున మునింగి తనయభాగ్యదేవతను దిట్టుచు నింకేటిసుఖమని నిరాశ చెందుచుఁ బొరలాడుచు భూరజంబంగమును గాసిల్లం జేయఁగాఁ బరితపించుచుండెను.

## శ్రీకృష్ణుఁడు సత్యభామ నూఱడించుట.

*శ్రీకృష్ణునిభార్యలందఱెట్లో మనస్సమాధానము చేసికొనియుండిరి. సత్యభామమాత్రము క్రోధాగారమున శయనించియుండెను. రుక్మిణీగృహమున శ్రీకృష్ణనారదు లుండిరి. భగవంతుఁడు సర్వజ్ఞుఁడు కావున నన్నివిషయముల నెఱింగియే

* ఈకథ హరివంశ విష్ణుపర్వము ౬౬. వ అధ్యాయమునుండియు, బ్రహ్మపురాణాదులలో లోపల వ్రాసియున్న యధ్యాయములనుండియుఁ వ్రాయఁబడినదని యెఱుఁగఁదగు.

యొఱుంగనట్లు నటించుచుండెను. రైవతకాద్రియందు భగవదనుజ్ఞచే నందఱి కాయాయితావుల గృహములు కట్టఁబడి యుండెను. ద్వారకానగరమునఁ గొన్నిదినములును రైవతకాచల నిర్మితమందిరములఁ గొన్నిదినములు నివసించుట శ్రీకృష్ణునకు సమ్మతము. రుక్మిణీదేవి యుపవాసవ్రతానంతరము రైవతకాద్రికిం బోఁగోరఁగా శ్రీహరి యందులకు సమ్మతించి యామెను బిలుచుకొనిపోయెఁగదా. అందఱు హరివెంటఁ బోయిరని మన మూహింపక తప్పదు. ప్రతిభార్యయు వల్లభుఁడు తనయందే పక్షపాతముగలవాఁడని భావించి సంతోషాంబుధి నోలలాడునట్లు శ్రీహరి ప్రవర్తించుచుండెను. ఇట్లు ప్రవర్తించుట యొక గొప్పకాదు. సర్వగతుండగు భగవంతున కది స్వభావమే. ఇతరులట్లుండిన గొప్పయగుంగాని సర్వగతున కది యొకగొప్ప కానే కాదు.

నారదముని యిట్లు పారిజాతకుసుమమహిమమును దెలుపుచు రుక్మిణీదేవినిబొగడుచుండఁగా శ్రీహరి సత్యభామయాగ్రహించుటయుఁ జెలికత్తియల మూలముగ నిందలివార్త లాదేవి శ్రుతివివరములం జొచ్చుటయు లోనగువార్తల మదిం దలంచెను. త్వరగ సత్యభామామందిరమున కరిగి యాతన్వంగి శ్రమములం దీర్ప నుంకించెను. ఏదియే నొకమిషను గల్పించిపోవలయునని యూహించెను. ఇచ్ఛామాత్రమున బ్రహ్మాండములు పుట్టుచుఁ బెరుగుచు నశించుచుండ నిఁక నీస్వల్పకార్య మామహాత్మునకు నొకలెక్కయా. కావునఁ ద్వరపడి వెడలి యాప్రియురాలి వెతలఁ బాపఁ దలంచెను. అపరమేశ్వరు నెమ్మది నాతలంపు పొడమినంతనె మహర్షికి రుక్మిణీదేవితో లోకవార్తలం

దెలుపవలయు నన్నబుద్ధి పుట్టెను. రుక్మిణికి వాని నాలకించునా దృతియుఁ గల్గెను. కావున వారిరువురు మాటలాడను వినను బ్రారంభించిరి. ఇదియ తగినయదనని శ్రీహరి యేదియో కార్య ముగలిగినట్లు నటించి యారీతి గనఁబడ చర్యలం జూపుచు మెలమెల్ల నాచోటువాసి పోయెను. హరి సత్యభామ నూఱ డింపఁబోయె నన్నశంక వారికిం గలుగలేదు. తన్మాయామోహి తుల కేమి తెలిసికొను యోగ్యతకలదు. * కార్యాంతరము కల్పింపఁబడియెను. హరియాచోటువాసిపోయెనే యన్నపరితాప మారుక్మిణికిం గలుగమి నారదోక్త లోకవార్తలఁ జక్కఁగాఁ నాలకించుచు ధర్మముల వినుచు వారినుడులయందే బద్ధా దరయై యుండెను. హరి త్వరపడి సత్యభామ ప్రాసాదమునకుఁ బరుగిడెను.

సత్యభామాగృహ మారైవతకభూధరమునం దొకచో విశ్వకర్మ నిర్మించి యుండెను. విశ్వకర్మయనుపదమునకు శిల్పి ప్రవరుఁ డనునర్థమునే గ్రహింపవలయును. సత్యభామ మిగుల నభిమానవతి భగవంతునకుఁ బ్రాణములకంటె నెక్కుడు. సదా పతియిష్టమురీతి మెలఁగుస్వభావము గలది. అట్టి యాసాధ్వీమణి విచారమునఁ గుందుచుండఁ బరమేశ్వరుఁ డోర్వఁజాలునా.

శ్లో॥ "అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్"

---

* నిశ్చక్రామాప్రమేయాత్మా వ్యపదేశేన సర్వవిత్. అనిమూలము.

అని కదా భగవంతునిశపథము. సత్యభామమందిరము నొక త్రుటికాలము మీఱకుండనే చేరెను. మందిరములోని కేగునపు డడుగులచప్పుడు వినరాకయుండ మెలమెల్లగాఁ బోయెను.

"అణోరణీయాన్మహతో మహీయాన్"

అని కదా శ్రుతి వచించెడిని. అడుగులు క్రిందసోఁకక యుండఁ బోవఁగలఁడు. ఆమె శయనించిన గృహముకడ కరుగునపు డాసాధ్వి కోపమునఁ జింతలపాలగుచుండునని స్నేహాతిశయమున నూహించెను. మిగుల భయంపడినచందమును గనఁబఱచుచు మెలమెల్లనఁ బోయెను. సేవకుఁడుకూడ రాఁగా నిందుండుమా యని ద్వారదేశమున నిలిపి తా నొక్కండ పోయెను. నారదమహర్షికి వలయునుపచారములు సలుప రుక్మిణీమందిరమునుండి వెడలుతఱినే ప్రద్యుమ్నకుమారు నునిచి వెడలెను. ఇంచుకదూరమునుండియే తనప్రేయసి క్రోధాగారమున నున్నదని తెలిసికొనియెను. అంతఃపురమునఁ గల పరిచారికవలె నాదేవి యపుడుండెను. పలుసారులు నిట్టూర్పులను విచ్చుచు విచారసాగరమున మునింగి యుండెను. కరసరసీరుహాగ్రమున లీలారవిందమును బట్టుకొని దానిని ముఖపంకజమున నునుచుకొని వెచ్చనూర్చుచు మరల మరల నాచింతలనే పెంచుకొనుచుఁ బరితాపతప్తయై యుండెను. ఒక్కొక్కపర్యాయము పాదారవిందమున భూమిని స్పృశించుచు ముఖము నొకప్రక్కకుఁ ద్రిప్పుకొనుచుండెను. ఒక్కొక్కతఱి నెడమచేతియందు ముఖము నుంచుకొని యేమో ధ్యానించుచున్నయట్టులుండెను. ఆమె కమలేక్షణములు వికాసము లేకయుండె

ను. ఒక్కసారి సరసమగు చందనమును దీసికొని సెగలెగయు హృదయమున నిడుకొని నిర్దయుఁ డగుపతిచేష్టలం దలంచు చుండెను. శయనమునుండి లేచుచు మరల దేహము నాశయ్యా తలమునఁ బడవేయుచు దేహమును ద్యజింపనెంచినపోలికను గనఁబడఁజేయుచుండెను. ఆయాయితరుణముల నాప్రేయసి కావించుచేష్టల నాశ్యామసుందరచక్రవర్తి కన్నులారఁ గాంచెను. క్షణము వేచియుండి యామె చేలాంచలమున ముఖము నాచ్ఛాదించుతఱిని గనిపెట్టి యిదియ చేరఁబోవుసమయమని యూహించి జగన్నాటకసూత్రధారుఁ డయ్యతివ చెంతకుం బోయి యామె ప్రక్కనున్న ప్రేస్వ్యాజనమును సంజ్ఞచేఁబిలిచి నా రాక తెలుపకుఁడని పలికి యనుమానించుచు వారిపుడు వల దనుచున్నను నిలువక పోయెను. ఆమెచెంతనున్న తాళవృంతమునుబుచ్చుకొని యామెప్రక్కన నిలువంబడి మెల్లగ విసరుచు శీతవాతమును దదీయతనూలత సోఁకఁజేయుచు మెలమెల్లన నవ్వుచు నుండెను. ఆకృష్ణదేహమునఁ బారిజాతకుసుమవాసనలు గుబాళించుచుండెను. ఆపరిమళము మానుషదుర్లభము. కావునా సువాసన లాయభ్యంతరావాసమును వాసనామయముగ నొనర్పఁజాలెను. ఆసువాసనలు భగవత్తనూసంసర్గమున మఱింత వ్యాపింపఁజాలియుండెను.

ఆపరిమళము లత్యద్భుతములు గావున నాసికావివరములఁ బ్రవేశించినంతనే యాలేమ విస్మయాకులస్వాంతయై ముఖమున కడ్డముగనున్న చేలాంచలమునుదీసి యిదేమని ప్రశ్నించెను. శయనమునుండి తటాలున లేచి యాజగన్నాథునిం జూడక యంతఃపురపరిచారికయే యున్నట్టు లూహించి యేమి

యీపరిమళమని యడిగెను, ఆసఖీజన మామాటలకు బదులిడఁ జాలక మోకాళ్లు భూమిసోఁక వందనము లాచరించిరి. అధో ముఖములఁ గరపుటములఁ బట్టుకొని లేవకుండిరి. సత్యభామ యాయపూర్వగంధము నాఘ్రాణించి భూమి యీవాసనల నొసంగుచున్నదా యేమి? ఈయొక్కతావునుండి యీపరిమళము రాఁగతంబేమి అని సంశయించుచు నలుగడలఁ బరికించుచు నొకభాగమున నిలుచుండి తాళవృంతమునుబట్టుకొని యున్న ప్రాణనాయకుం గనుం గొనియెను. కన్నీరు మున్నీరుగాఁ బ్రవహించుచుండ నిది తగినపనియే యగునాయని ప్రశ్నించెను. రోషమున వెగటుగనున్నమదితో నాతన్వి ప్రణయాన్వితయు నయ్యెను. అతిజవమున నెగురుచున్న యోష్ఠములుగలిగి యధో ముఖియయి నిట్టూర్పులం బుచ్చుచు ముహూర్తమాత్రము మొగము వేఱొకదిక్కు చూచుచుండఁజేసి యామె యూరకుండెను. ఈఘట్టమున ముక్కుతిమ్మన కవితల్లజుఁడు,

ఉ. "ఈలలితాంగిచంద మొక • యించుక చూచెద నంచు
ధూర్తగో, పాలుఁడు తాలవృంత మొక • భామిని సత్య
పిఱుందనుండి మం,దాలసలీలమై విసర • నాదటఁ గైకొని
వీచెఁ దద్వపుః, కీలితపంచసాయక శి•ఖిందరికొల్పుచు నున్న
కైవడిన్.

ఉ. అంతటఁ బారిజాతకుసు • మాగతనూతనదివ్యవాసనల్
వింతలు చేయఁ దావి యది • విస్మయ మంచు మనుంగు
ద్రోచి య, క్కాంత గృహంబు నల్గడలు"

అని వ్రాసి తనయపూర్వచమత్కృతిని వెల్లడించెను. *

అంత సత్యభామకుఁ గోపము పొడసూపి యామెమన స్సును జింతనుండి మరలించెను. కావుననే యామె వామ భ్రుకుటిని ముడిపెట్టి కన్నులు చక్కఁగ విప్పిచూచి మోము కరతలమునను నిచి చక్కఁగా సుఖము లనుభవించుచున్నాఁడవా యని ప్రశ్నించెను. ఆమె కనుదమ్ములనుండి ప్రణయకోపజనిత వారికణములు స్రవించెను. ఆజలకణములు తామరపాకునుండి స్రవించు మంచుబిందువుంబోలియుండెను. హరియు రసిక శేఖరుఁడు కావున నామె ముఖకమలమునుండి ధారలుగా స్రవించునశ్రువులను ద్వరపడి క్రిందఁ బడనీయక రెండుచేతు లచే ధరించెను. మఱియు నాశ్రీవత్సాంకుఁడు ప్రేయసి ననున యింపఁగోరి కన్నీటిధారలు కొన్నివక్షోభాగములఁబడుచుండఁ గాంచి చేలాంచలమునఁ దుడుచుచు బుజ్జగింపుమాటల నిట్లు పలికెను. కువలయదళనయనా! భామినీ! ఏల నీకన్నుదమ్ములనుండి యుష్ణజలశీకరములు నిరంతరముగా వెడలుచున్నవి? సుందరీ! నీమోముదమ్మినుండి జలకణము లురులనేల? మనోహరాంగీ! ప్రభాతకాలమునఁబూర్ణచంద్రునియొక్కయు మధ్యాహ్నమునఁ బంకజాతముయొక్కయు రూపమును నీముఖము నీస్వరూపము ధరించుచున్నవే? ఏల? పీతారుణవర్ణవస్త్రమును రక్తద్రవ్యవిశే

* ఇచ్చో హరివంశమూలముం జూడుఁడు. గ్రహీయ వ్యజనం చైవ స్థిత్వా సపరిపార్శ్వతః, శనైరివాస్పృశద్వాతం జహాసశనకైరివ 14. సపారిజాతపుష్పస్య సంసర్గాదనువాసితః, బభార భగవాన్ గంధం దివ్యం మానుషదుర్లభమ్. 15. అత్యద్భుతం సుగంధంచ జిఘ్రిత్వా విస్మయాన్వితా, అపావృణోన్ముఖం సత్యా కిమేత దితి చాబ్రవీత్. 16. అని.

షాంకితవసనమును ధరింపక యేల యిట్టి సుసమయమున దేవపూజాకాలమున ధరింపఁదగు తెల్లనిచీరను గట్టితివి. తెల్లచీర దేవపూజాకాలమునదప్ప నితరకాలమునఁ బ్రియుని రంజిల్లఁజేయు నూహాలుగల సౌభాగ్యవతులు ధరింపరాదనుశాస్త్రము నీవెఱుంగనిదికాదుగదా? కువలయాక్షీ! *ముత్తైదువులకు పీతరక్తవస్త్రము రక్తవిశేషచ్ఛాయాంచితవస్త్రము ధరింపఁదగినవి. దేవపూజానంతరము శ్వేతాంబరము ధరింపరాదు. ఇచ్చోఁదెనుఁగునఁ గవితల్లజుఁడు.

ఉ. "ఇందునిభాస్యమై తొడవు • లేల ధరింపవు నున్నగావు లీ
వెందును మానలేవు తెలు•పేటికిఁ గట్టితి వీటికారుచుల్
కెంద లిరాకుమోవిఁ దుల•కింపఁగఁ జేయక యున్కి యేమి నీ
చందమువింతయయ్యెఁడుని•జంబుగ నాకెఱుఁగంగఁ జెప్పుమా

చ. మనమరయం దలంచి యొక•మార్గముపన్ని తొ నవ్వటాలకో
నను వెఱపించెదో యకట • నాయెడ నిక్కము దప్పగల్గెనో
వనజదళాయతాక్షి పగ • వాఁడనె నన్నిటు లేలచూడ వో
క్కనిమిషమైన నీవు దయఁ • గన్గొనకుండిన నిల్వనేర్తునే."

అని వ్రాసి తనయుపారచాతురి సజ్జనులకుఁ గానుకపెట్టెను.

ఇట్లుపలికి మఱియు నిట్లనిరి. పంకజాక్షీ! దేవపూజాది కార్యములయందు ధరింపఁదగు శ్వేతాంబరము నిట్టి విలాసధామమున సుఖానుభవమున ధరింపనేల? అంతియకాక క్రోధాగారమును బ్రవేశింపనేల? పోనిమ్ము. ఏదియో కోపమువచ్చె నను కొందును. అది నన్నుడికించుటకుఁ గానోపును. ఇపుడేల

*వాసస్యేతే తవాభీష్టే మహారజతకౌంతుమే, దేవాభిగమనాదూర్ధ్వం శుక్లం నేష్టం హి తత్స్త్రియః. అని మూలము.

యాభరణముల కాంతుల మించక నీతనూలత యిట్లున్న దే. ఏల? దానికింగల కారణ మెఱుంగఁగోరి నామానసము చంచలతం గాంచుచున్నది. చెప్పుమా. లాక్షారసచర్చలఁ దులకించు నీపాద మేల యీ శ్వేతాంబరమున నాచ్ఛాదింపఁబడినది? కావున నే ప్రియదర్శనముగా నది లేదు. లలాటమున వాసనలు గలిపినగంధపుఁబూఁతలచే నొకవింతగ నున్నది. ఏటికి? ఏదియే నొకగొప్ప కారణముచేత లలాటకాంతుల నాచ్ఛాదింపఁదలంచితివా యేమి? ఆ కారణమును వినఁగోరెదను. తెల్పుమా. నామనస్సు కలవిలపాటొందుచున్నది. నీ కపోలతలములయందుఁ జందనరసము పూయఁబడినదికదా. మకరికాదిపత్త్రములు లిఖింపఁదగిన యాభాగముల నీపూఁత యందముగా లేదే! వాని శోభయే కానరామి నాహృదయము వడఁకుచున్నది. రత్నభూషణభూషితము కాక నీకంఠము ప్రకాశింపకున్నది. ఇది తగునా? శరత్కాలత్రియామ గ్రహనక్షత్రశూన్యమైన నెట్లుండును? శరత్కాలరాకాదినమున నిండుచందురుని గ్రిందుసేయు నీముఖమునించుక పైకెత్తి యుత్పలకుసుమపరిమళముల వెదఁజల్లుచు నీవేల మాటలాడి నన్నానందింపఁజేయవో తెలియకయున్నవాఁడ. అఱచూపులనైన నన్నేల చూడవు? నిట్టూర్పులు విరతి లేకపుచ్చుచుఁ గనుదమ్ములనుండి యశ్రుబిందువుల వదలుచున్నదానవే. ఏటికి! మనస్వినీ! ఏల వగచెదవు? ఇంకనైనఁ జాలింపుమా. కాటుక పసచెడునట్లు కన్నీరు వదలుచు ననుం దిలకింపుమా. అవి నీముఖసౌందర్యమును డిందుపఱచుచున్నయది. నేను నీకింకరుఁడనని జగమునఁ బ్రఖ్యాతిం గాంచితిని. పూర్వము రీతిగా నీకింకరుఁడ నగు నన్నేల పరికింపవు? నేనేమి యకార్య

మొనరించితిని? అపరాధము చేసితిని? వివరింపుమా తెలిసికొని దానిని సవరించుకొని పరిశుద్ధచిత్తుండనై నిన్ను సేవించువాఁడ. పోనీ! నీకుఁ బ్రియముకానికార్యము దేని నేఁ జేసితినా. ఏకారణమున నన్నిట్లాయాసపెట్టుచున్నావో యాకారణ మెఱింగింపుము మనోవాక్కాయముల నీయానతిమీఱి ప్రవర్తించిన వాఁడనుగాను. ముందును బ్రవర్తింపనని చెప్పఁగలను. సర్వదా నీసేవ చేయుచుండువాఁడ నని సత్యము నాధారము చేసికొని చెప్పుచున్నాఁడను. కాంతలు బహుమానముచేతనే మన్నింపఁదగుదురు. నాకుంగలపత్నులయందు నీకంటె మన్నింపఁదగినవారెవ్వరును లేరనుట నిక్కము. బహుమానము కాని స్నేహము కాని నీయందుఁ దప్ప నితరులయం దెవ్వతుకయందును లేదు. నాయనంతరముకూడ నాప్రేమము నిన్నెడఁబాయదుసుమా. ఇది నిక్కమని నమ్ముమా. ఇదియె నానిశ్చితమనియు నమ్ముము. నీమనసునఁగల కలవరము నడంచుకొనుము. ఈచింతకుంగలకారణంబును దెల్పుము. *భూదేవియందు క్షమాదిగుణము లెట్లు నిలిచియున్నవో శబ్దాదిగుణము లాకాశమునం దెట్లు నెలకొనినవో యట్లే నీయందు నాస్నేహము స్థిరముగ నిల్చియున్నయది. ఇది సత్యము. ఇన్నివిశేషములుగల యీమూలమున కేలొయొకటిరెండుపద్యములు వ్రాసి ముగించిరి. అందొక్కపద్య మిది.

---

* క్షమాదయశ్చ మేదిన్యాం శబ్దాద్యాశ్చాంబరే గుణాః, ధ్రువం పంకజగర్భాభే త్వయి స్నేహ స్తథా మమ. రుచిరాగ్నౌ యథా దివ్యా ప్రభా చైవ దివాకరే కాంతిశ్చ శాశ్వతీ చంద్రే స్నేహ స్త్వయి తథా మమ. ౪౫. అని హరివంశము.

చ. మనముల మాటలం గ్రియల ♦ మన్ననలీ నొకనాఁడు నెట్టి కా
మినులకు గారవంబు మెఱ ♦ మెచ్చులకై పచరింతుఁగానిపా
యనియనురక్తి నీయెడన ♦ యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచిన పంపుచేయుటయ ♦ ప్రాభవమౌ టది నీవెఱుంగవే.

ఈవిధముగఁ దన్నుఁ బ్రార్థించు నామదనకోటిమోహా నాకారుని ప్రాణనాయకుని బుండరీకాక్షుని నించుక చూచి యాయన్నులమిన్న నయనారవిందములనుండి యశ్రుజలకణంబులు స్రవించుచుండ మెల్లగా నిట్లు మాటలాడెను. ప్రాణేశ్వరా! ఇంతకుముందు నీవు నావాఁడవే యనునమ్మకము నాకు నుండెను. ఇపుడు సాధారణస్నేహము నీయందు నునుపఁదగు నని తోఁచినది. ఇంతకుము న్నెన్నఁడు దీని నెఱుంగఁజాలనై తిని. కాలమింతలో నిట్లుమాఱుననియు నెఱుంగనైతిని. ఇపుడు లోకగతినెల్లఁ జక్కనెఱింగితిని. నీస్నేహము శాశ్వతముకా దని తెలిసికొంటిని. నేను మృతినొందకున్నను రెండవజన్మ మఁల వడినదని తలంచుచున్నాను. విశేషించి వచింపనేల? అచ్యుతా! నీహృదయమును దెలిసికొంటిని. నాయందు నీకుఁ గలప్రీతి నావాక్చాతుర్యమాత్రమే. నాపైఁగలస్నేహము కూడఁ గృతకమనియే నమ్మితిని. వేఱొకతావున నీస్నేహము కృత్రిమముగాదనియు నెఱింగితి. ఋజుస్వభావముగలిగి భక్తురాలనగునన్నుఁ బురుషోత్తమా! చక్కఁగా నెఱింగియు నవమానించితివి. కృతకవృత్తి నాశ్రయించితివి. నీవింతకుముందు చూపినప్రీతి కపటవృత్తి చేతనేకాని నిక్కంపుఁ బ్రీతికాదని తోఁచెను. ఇంతదనుకఁ జూడఁదగినదానిం జూచితిని. వినఁదగిన దేదో వింటిని. నీస్నేహ ఫలోదయము పరికించితిని. నేను నీయనుగ్రహమునకుఁ బాత్రు

రాలైనచో నన్ను ననుగ్రహింపుము. తపస్సుచేయుచు నెట్లో కాలమును గడపెదను. అనుజ్ఞయిమ్మా. పురుషోత్తమా! పరమ నిశ్చితముచేసికొని తపస్సుచేయుచు నుండుదాన. * భర్త యిష్టము ననుసరించియేకదా స్త్రీలకుఁ దపముగాని వ్రతములు కాని చేయఁదగునని పెద్దలు వచింతురు. భర్తకు నిష్టములుకాని వ్రతాదులు నారీమణు లాచరించిన నిష్ఫలములగును. అనిపలికి యాసత్యభామ మరల నయనద్వయమునుండి యశ్రుజలకణముల వదలెను. ఆశుభాంగి శ్రీహరి పీతాంబరముచెఱఁగును మోము నకడ్డముగా నునుచుకొని విలపించెను.

మహాత్ములారా! ఈకథయందలి విశేషముల నించుక యాలకింపుఁడు. "మహాత్మనామాగమనం శుభాయ" అన్న సూక్తి మీఱరానిది కాదు. ఇందానీతి కుదాహరణము కలదు. రుక్మిణీదేవి యుపవాసవ్రత మూనెను. ఎందులకో యన రాదు. లోకుల కిది యవశ్యాచరణావ్రతమని బోధించుటకే. సర్వదా భగవంతు నారాధించుచున్నదాన నని రుక్మిణి యెఱుఁగునని యే మనము నమ్మవలయును. కాని తా నాచరించినచో దానియం దొకమహిమము కలదని నమ్మి పామరు లాచరింతురు. ఇదియే జ్ఞానులకు నజ్ఞానులకుఁ గర్మాచరణమునఁ గలభేదము. తమకొనరించిన కార్యములనుండి ఫలములను గోరకుండుటయుఁ దమవలెనే యితరు లాచరించి ఫలములను గోరినను మేలే యని యూహించుటయు సాధుమతులభావమని గ్రహింపక తప్పదు. జ్ఞానధనురాలగు రుక్మిణి వ్రతమాచరించుచుండ దాని చివర

* భర్తుశ్ఛందేన నారీణాం తపో వా వ్రతకాని వా, నిష్ఫలం ఖలు యద్భర్తు రశ్ఛందేన క్రియేతహి. అని మూలము.

భాగమునఁ జేయఁదగినది జ్ఞానధనులకుఁ దృప్తి చేయుటయే. అన్నమునఁ బ్రాణికోటి తృప్తినొందినట్లు మఱేపదార్థముల చేతను దృప్తినొందదు. జీవుఁ డన్నరసముచేఁ దృప్తినొందును. నవరత్నములు లాజీవునకక్కఱలేదు. నవరత్నాదులం గోరునది యరిషడ్వర్గమున నొక్కఁడగు లోభము. లోభము మనల నశింపంజేయునని యెఱింగియు దానిం దృప్తిచేయఁ బూనుటకంటె వెఱ్ఱితనము వేఱుగనున్నదా. అన్న మట్టిది కాదు. జీవాత్మను దృప్తిచేయును. దాని సర్వాంగములు సేదదేరి సుఖించును. దాన మనశ్శాంతి చేకూరును. దానఁ బుణ్యకార్యములు చేయునూహ కలుగును. తదాచరణమున భక్తి యలవడును. దాన భగవత్కరుణకుఁ బాత్రుఁడగును. అదియే కోరఁదగినది. దానికి మించినకోరికలు లేవు. కాఁబట్టి యన్నదానము ముఖ్యమని శాస్త్రములు మనకు నుపదేశించుచున్నవి. ఆయన్నము భుజించుజీవుల ననుసరించి ఫలముల నొసంగును. ఎవరికిఁ బెట్టినను ఫలము సమానము కాదు. ఆయన్నరసమున నవయవములు దృఢతరం గాంచఁగా నెవ్వఁడా బలము సాయపడఁగా దుష్కార్యము లాచరించునో యాపాపము కర్తకును గొంతఫలము నిచ్చును. దుష్కార్యముల నాచరించువారికి సాయపడరాదన్న న్యాయ మీహేతువుననే కలిగెను. ఆయన్న భక్షణమునఁ దృప్తినొందియేజీవుఁడు సత్కర్మముల నాచరించునో యాపుణ్యఫలమునఁ గొంతభాగము కర్తకును జేరును. వివేకము కావలయుననుట యిందులకే. పాత్రాపాత్ర వివేకము లేక చేయుదానము నిష్ఫలంబగుట మాత్రమే కాక దుష్ఫలములంగూడ నొసంగును. దుష్కార్యములను జేయఁ బ్రోత్సహించుట పాపముకదా.

శ్లో. "కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః,
సుకృతే దుష్కృతే చైవ చత్వార స్సమభాగినః."

అనుట యెల్ల రెఱింగినదియేకదా. కావుననే దుర్మార్గులను జెంతఁజేరనీయరాదందురు. ఆశాపాశములను మెడకుఁ దగిలించుకొనుటెట్టిదో దుస్సహవాస మట్టిది.

శ్రీహరి రుక్మిణివృత్తాంతముఁ దనకరుణను బొందఁ గోరినదని యెఱింగెను. నగరవాసమునకంటె భగవత్సేవకుఁ బర్వతవాసము మంచిది ఏకాంతవాసమందుఁ గుదురును. అంతియ కాదు. పర్వతకందరములయందు మహాత్ములుందురు. వారుండు తావులు పరమపావనములు. అందొనరించుతపస్సు స్వల్పమైనను విశేషఫలముల నీఁజాలును. కావుననే నిర్జనవనముల మహాత్ములుందురు. దుర్వాదము లట వినరావు. దుష్కర్మాచరణము లట నుండఁజాలరు. నిర్మలవాయువు నీరోగము లగుఫలములు స్వచ్ఛజలములందు దొరకును. ఇవన్నియు మనశ్శాంతిని గల్గించును. అహంకారాదుల నడంచును. వీర్యవృద్ధిని గల్గించును. రక్తము పరిశుభ్రముగ నుండఁజేయును. ఇవియే యారోగ్యలక్షణములు. అంతియకాని కాలనియమము మాని తెలియని పదార్థములు మంచివని భ్రాంతిచేఁ గొని తినినచో నాయుస్సు క్షీణించుటయే కాని వృద్ధి కానేరదు.

" స్యాధశ్రేష్ఠసుశీలపథ్యసుభుజాం న స్యాదిదం పాపినామ్."

అని కేశవదైవజ్ఞు లాయుర్దాయనిర్ణయావసరమునఁ దెలిపిరి. కందమూలము లాహారపదార్థములయం దగ్రస్థానమును వహించుచున్నవని పూర్వులుపలుకఁగానపవాస్యముగా వానిని

భావించువా రిప్పుడు సత్యములే యని యావాక్కుల నంగీకరించుచున్నారు. కూరగాయలే యాహారమునకుఁ దగినవని ఫలరసమారోగ్య మొసంగినట్లేదియు నీఁజాలదని యిపుడిపు డూహించుచున్నారు. ప్రాచీనాచారములు ప్రాచీనులవాక్కులు సత్యములని యిపుడిపుడు సాధుమతులు కొందఱు తెలిసికొనుచున్నారు కొంద ఱింకను దమ మొండిపట్టులవీడక యూఁగులాడుచున్నారు. వీరు నింకఁ గొంతకాలమున కంగీకరింతురు.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ రైవతకాద్రియందు నివాసము లందఱకుఁ గల్పించియుండెనుగాన నీసంతర్పణము చేయ నచటికిం బోయెను. తక్కుంగలభార్యలందఱును బతివెంటఁబోయిరి. వనితలంద ఱొకచో నుండరాదనియు నట్లుండినఁ గలహములు గలుగకమానవనియు భగవంతుఁ డెఱుంగును. కాననే యా యాయిమందిరము లాయా కాంతామణుల కని నియమించియుండెను. వారంద ఱాయాయిహర్మ్యములనుండిరి. అప్పుడు హరి రుక్మిణి యుపవాసకృశాంగి యని యెఱింగి యన్నదానమున నెల్లసాధుభూతములఁ దృప్తి చేసెను. జ్ఞానధనులగు ద్విజాతులకు ధన మొసంగి వారిని బహూకరించెను. జ్ఞానులు సర్వభూతదయావంతులు. వారు తృప్తినొందిన భగవంతుఁ డానందించును. ఆపరాత్పరుఁ డానందించిన నెల్లలోకము లానందించినట్లే. కర్తవ్యమును దీర్చి కూరుచుండియుండఁగా నారదముని యరుదెంచెను. సత్కారములంది భగవంతునకుఁ బారిజాతపుష్పము నొసంగెను. అది భగవంతుని కొసంగుట యనేక కార్యములు దాన నెఱవేఱుననియే. ఏవాఁడుగాని తనకుంగలపదార్థముల

నుత్తమోత్తమమును భగవంతున కర్పింపవలయు. దానిమూల్యమును బరీక్షింప నక్కఱలేదు.

శ్లో. "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." (గీత.)

అని భగవంతుఁడే చెప్పెనుగదా. దానిని గ్రహించి చెంతనున్న రుక్మిణి కొసంగెను. భగవత్ప్రసాదమని యాశుభాంగి శిరమున ధరించెను. ఆయది సామాన్యకుసుమముఁ కాదు. కల్పవృక్షప్రసూనము. అది కోర్కులం బిడుమను ఒక్కచెట్టునఁ బూచిన పూవు సకలవాంఛల నొసంగునా యని ప్రశ్నింపరాదు. అది మనుష్యలోకవృక్షము కాదు. దానిమహిమము మనుష్యుల యూహల మించియుండును. ప్రాణహారమగు సర్పవిషమును మూలికహరించుట కన్నులారఁ గాంచుచున్నారము. మందుల ద్వారా రోగములు కుదురుట స్వానుభవమున నెఱుంగుచున్నారము. ఇది మనుష్యలోకమునఁ గలమూలికలశక్తి. దేవలోకమునందున్న కల్పవృక్షములకు సర్వవస్తువులను గల్పించుశక్తి కలదన్నఁ జిత్రముకాదు. ఒక్కవనస్పతి పత్రమును దినిన నాలుమాసములు క్షుత్తృష్ణ లుండవుకదా. కాఁబట్టియే కాళిదాసకవిశ్రేష్ఠుఁడు మేఘసందేశమునందు,

శ్లో. వాసశ్చిత్రం మధునయనయోర్విభ్రమాదేశదక్షం
పుష్పోద్భేదం సహ కిసలయైర్భూషణానాం వికల్పాన్,
లాక్షారాగం చరణకమలన్యాసయోగ్యం చ యస్యా
మేకస్సూతే సకలమబలామండనం కల్పవృక్షః.

(ఉ. స. ౧౩.)

అని చెప్పెను. ఇది యతిశయోక్తియే యనరాదు. వృక్షమహత్వ మపారమని స్మృతులు ఘోషించెడిని.

"శుచిర్భూత్వా తరోః పూజాం
కృత్వా స్నానానులేపనైః."

అని బృహత్సంహితయందు వరాహమిహిరాచార్యులు విశదీకరించిరి. అనఁగా వృక్షరాజములు దివ్యఫలప్రదాయకములు. కావున నిర్మలాంతఃకరణుఁడై వానిం బూజించు టొప్పునని యామహానుభావునిభావము. వృక్షములు మాటలాడును. కాఁబట్టి యావృక్షములను గొందఱు వరముల నడుగుదురు.

శ్లో. "ప్రాతస్స్నాతస్సోపవాసస్సువాసః
కృత్వా బీజం కాంచనాంభోనిషిక్తం,
పూతం పుణ్యైర్విప్రపుణ్యాహఘోషై
ర్భూయోభూమిం రోపయేన్మంత్రపూర్వమ్."

అని గార్గిచెప్పెను. కావున వృక్షమూలముల మహిమ మపారమని మనుష్యుల కగమ్యమనియుఁ దేటపడియెడిని. ఒక్క వనస్పతిమూలము వాసనచూచిన స్మృతితప్పుట యనుభవముననే తెలిసికొనవచ్చును. ఇట్టులుండ దేవలోకముననున్న కల్పవృక్షప్రసూన మనూనఫలదంబను టొకవింతకాదు. అవియొక సంవత్సరకాలమే యొకచోట నుండును. ఫలమునిచ్చుననియు నారదముని వచించెఁగదా. ఏలయనఁగా మనుష్యమానమున నొకవత్సరమైనచో దేవలోకమున నొకయహోరాత్ర మగును. పుష్పము లొకయహోరాత్రము వాసనపాయక వాడకయుండుట స్వభావమే. మనుష్యులకు దేవతలకు నింతభేదము కలదు. మహిమములందు నిట్టిభేదముండక తప్పదనుట విస్పష్టమేకదా.

దేవలోకమునుండి పుష్పము తెచ్చియిచ్చినముని రుక్మిణీ దేవిని బొగడెను. పొగడుటమాత్రమేకాక సత్యభామ పేరెత్తి యామెకుం గర్వము ఫలింపదని పలికెను.

శ్లో. "అథ సాత్రాజితీ దేవీ జ్ఞాస్యతే వరవర్ణినీ,
సౌభాగ్యాద్యం సదా వేత్తి యాత్మానం సుభగం సతీ.
అద్యాహామవగచ్ఛామి సర్వథా సర్వశోభనే,
ఆత్మా ద్వితీయః కృష్ణస్య భోజే త్వమితి భామిని."

అను నీమాటలమూలమున సత్యభామకన్న నీవే మిన్న వని సన్నుతించెను. మహాత్ములపలుకులు వ్యర్థములు కావు వారి మాటలనే యర్థమనుసరించును.

శ్లో. "లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

అని మహాకవి భవభూతివచించెను. వారివాక్యములను కర్మముపరుగెడుచు ననుసరించును. కర్మము లిట్టివని యూహించి వారు మాటలాడరు. వారివాక్కు లేరీతివెడలునో యా దిక్కును గనిపెట్టుకొనియుండి కర్మములు పరుగిడును. అనఁగా సిద్ధసంకల్పులనియే భావము. నారదముని యీమాటయాడుట భావిలోకశుభార్థమే. సత్యభామవిఖ్యాతి జగత్త్రయమున నెల కొనవలయును గదా. మనకంటె నధికులు లేరని విఱ్ఱవీఁగు దేవతల గర్వమడంగవలయుననియు, హరి చేఁజావఁదగినవారికి మోక్షము కలుగుననియు నారదమునివాక్కులు వెడలినవని మనమూ హింపవలయును. శ్రీహరి యీనుతుల వినుచు నూరకుండెను.

ఈమాట లెట్లో యాయుత్తరక్షణముననే యందఱకుఁ దెలిసెను. తక్కినవారు మనస్సు నెట్లోసమాధానమున నునుచు

కొనిరి. సత్యభామ యోర్వఁజాలకపోయెను. అనఁగా సత్య యసాధ్వి యనరాదు. మహాపతివ్రత. ఆమె కాగ్రహముకల్గినఁ గాని కార్యము కాదని భగవంతుఁ డెఱుంగును. కొందఱు సత్యా దేవి రుక్మిణికంటె గుణహీనురా లగునందురు. అది మిగులఁ బొరపాటు.

శ్లో. "సత్యభామా ప్రియా నిత్యం విష్ణోరమితతేజసః,
రూపయౌవనసంపన్నా స్వసౌభాగ్యేన గర్వితా,
అభిమానవతీ దేవీ శ్రుత్వైవేర్ష్యావశంగతా." హరివంశము.

అలోకాతిశాయి తేజస్సుగల శ్రీవిష్ణువునకు ననవరతము ప్రియురాలు. అనఁగా నెడఁబాటులేని భార్య యనికదా దీనిభావము. సత్య భూదేవియే యని యెఱుంగుఁడు. ఈవిషయము నరకాసురకథయందు వ్రాయఁబడినదికదా. స్వసౌభాగ్యమున గర్వించుట స్త్రీధర్మములయందుక్తము. సౌభాగ్యగర్వ ముండ వలసినదేయని శాస్త్రములభావము. భర్తనలరింప నదియే సమర్థము. కాఁబట్టియే కాళికావాక్యము,

శ్లో. "యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
మమరూపైవ సా జ్ఞేయా పుష్పేనాపి న తాడయేత్."

అని కనఁబడియెడిని. గర్వమనఁగా నాకంటెనందగత్తియ లేదను భావము. మదమనఁగా భర్తను నాసౌందర్యమున నలరింపఁ జేయఁగల నను భావము. ఇదియే గర్వమదశబ్దముల యర్థము.

'సదా ప్రహృష్టయా భావ్యమ్' అనిమనుస్మృతియుఁ దెలుపుచున్నది. సదాసంతోషము గలిగియుండినఁగాని వనిత గృహకర్మప్రవీణురాలు కాఁజాలదని మనువుభావము. ధనార్జనము

పురుషకృత్యము. దానిని వ్యయించుట స్త్రీకృత్యమని మనువు చెప్పెను.

"సుసంస్కృతోపస్కరయా వ్యయే చాముక్తహస్తయా."
(మనుస్మృతి.)

"వ్యయేచాబహుప్రదయా" అనివ్యాఖ్య. మితవ్యయము చేయునదియనిభావము. సత్య యభిమానవతి. అనఁగా భర్తనాయందే ప్రీతిగలవాఁడన్న గంభీరభావముకలదని భావము. కావున నే నాసవతికడ నన్ను ముని దూషింపఁగా భర్తవినుచుండుట న్యాయమా యని యామె యాగ్రహించెను ఇది పతివ్రతాలక్షణమగునా యనరాదు. ఈకోపము న్యాయసమ్మతమే.

శ్లో. "యథా కామీ భవేద్వాపి స్త్రీణాం వరమనుస్మరన్,
స్వదారనిరతశ్చైవ స్త్రియో రక్ష్యాయతస్స్మృతాః."
(యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము)

శ్రుతి. "భవతీనాం కామవిహంతా పాతకీ స్యాత్,"
అని యింద్రుఁడు స్త్రీలకు వరమిచ్చెనని శ్రుతి ఘోషించెడిని.

శ్లో. "పతిప్రియహితేయుక్తా స్వాచారా విజితేంద్రియా,
సేహకీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమాం గతిమ్."
(యాజ్ఞ. స్మృతి. ఆచారకాండము.)

కావున స్మృతుల నాలోచించినఁ బతిప్రియమునుగోరి ప్రవర్తించుట స్త్రీధర్మమైన దని తేలెడిని. అంతియకాక పురుషునితోఁ జెప్పక యిల్లువదలి పోరాదని శంఖస్మృతియందున్నది.

"నానుక్తాన్ గృహాన్నిర్గచ్ఛేన్నానుత్తరీయా న త్వరితం వ్రజేన్న పరపురుషమభిభాషేతాన్యత్ర వణిక్ప్రవ్రజితవృద్ధవై

ద్యేభ్యో న నాభిం దర్శయేదాగుల్ఫాద్వాసః పరిదధ్యాత్." ఇత్యాది.

ఇట్లు భార్యాభర్తలధర్మములు నిబద్ధములైనవి. అట్టిచోఁ దన్నుదూషించుచుండ వినుచు నూరకున్నభర్తపై నాగ్రహించుట స్త్రీలకు న్యాయమే యనక తప్పదు.

ఇట్లు సత్యభామ క్రోధాతిరేకకలుషితాంతరంగయగుట భగవంతుఁ డెఱింగెను. వెంటనే యచటికింబోయెను. భగవంతుఁడు సత్యభామనుజూచునపుడు చూపిన చమత్కారములు మానవులకెల్లఁ జేయఁదగుకార్యములని గ్రహింపవలయును. నిరంజనుఁడు కాముకుఁడయ్యెనన రాదుకదా అనఁగా భార్యను సంతోషపెట్టుట పతికివిహితమని శ్రీహరి తనకృత్యమునఁ దానే బోధించెను. వానిని మనుజు లంగీకరింపవలదా. సత్యము విహితముగాఁ బ్రవర్తించినదా. కనుఁగొనుఁడు. హరివంశము ననుసరించి పరికింపుఁడు. తెనుఁగు గ్రంథములం గైకొనకుఁడు. అవి కల్పింపఁబడినభాగములుకలవి. ఈఘట్టమున స్త్రీలవస్త్రభూషణములు చెప్పఁబడినవి.

## స్త్రీల కర్హములగువస్త్రములు.

పీతరక్తచ్ఛాయలుగలది కౌంకుమమనఁబడును. రక్తవర్ణాధికమై పసుపురంగును గలదిగానున్నది మహారాజత మనఁబడు. ఈరంగులుగల వస్త్రములను స్త్రీలు ధరింపవలయు. దేవపూజాదికార్యములయందుఁ దెల్లనివస్త్రమునుగట్టవలయు. ఇతరకాలములయం దనఁగా భర్తృప్రియకార్యములయాదుఁ బైవస్త్రములనే ధరింపవలయును. శ్వేతాంబరము పురుషధార్యమని పెద్దలందురు. సౌందర్యప్రేమముల రెంటను భర్తను

సంతోషవంతునిగఁజేయుట భార్యకుం గర్తవ్యము. వస్త్రాలం కారప్రీతుల నామెనలరించుట పతికింగర్తవ్యము. ఇది ప్రాచీనుల భావము. ఇక్కాలమున నీలాంబరధారణమే ప్రధానముగాఁ గొన్నితావులఁ గన్పట్టెడిని. అట్టిరంగుగలవస్త్రము రక్తమును క్షీణింపఁజేయునని యాయుర్వేదగ్రంథములఁ గానంబడునని పెద్దలందురు. పెద్దలమాటలు పాటింపక స్వేచ్ఛమైఁ బ్రవర్తించుచో నది విహితము కాదనక తప్పదు. వినువారెవరు ? అన రాదు. ధర్మప్రవచనము పురుషకృత్యము. దాని నాదరింపనిచో స్త్రీజాతికే లోపము. వారు నియతవ్రతకర్మములమానిన, దమ గౌరవమును శక్తిని బోఁగొట్టుకొందురు. పురుషులకు నష్టమేమి? కొందఱనుసరించువా రుండకపోరు. వారికే యుపకరింపనిండు. చాలును. లోకమంతయు నొక్కరీతిగా నుండదు. ఉండినచోఁ గర్మసిద్ధాంతమే వ్యర్థమగును. బహువిధకర్మములఁ జేసినవా రొక్కభూమినిబుట్టి మనలునపు డేకరీతిగా నాచారములుండు ననుట తెలివితక్కువయే కదా. పెక్కుదురభ్యాసము లుండును. సదభ్యాసములుండును. అందఱిని బాగుచేయఁగలవాఁడు భగ వంతుఁడు. అట్లని యూరకుండరాదు.

"వసంతవల్లోకహితం చరంతః."

అని శంకరభగవత్పాదులవారు తెలిపిరి. సదాచార ములు నశింపకుండ నెలకొల్ప నుద్దేశించువారు తమపనుల నిర్వహింపవలసినదే. దురభ్యాసములమాన్పఁ బ్రయత్నింపవల సినదే. దానిఫలమునుమాత్ర మాశింపరాదు. అది ఫలించుట భగవదధీనము. స్వధర్మము నెఱవేర్చుట యెల్లవారికి ధర్మము. శ్రీకృష్ణుఁడిట్లు తన నిరంజనత్వమును లోకానుగ్రహార్థముదాఁచి

లోకాచారములఁ బాటించి హితముపదేశింపనెంచి తనప్రవృత్తి ద్వారా యాకార్యమును నెఱవేర్చెను. భార్యను మిగులఁ బ్రేమించి తదనుకూలముగా న్యాయమునువీడక ప్రవర్తించుట పురుషునకుధర్మమనియుఁ దానెన్నికష్టములకులోనైనను దనయిల్లాలిని గష్టపెట్టరాదనియు స్త్రీలు కాలోచితముగఁ గార్యానురూపముగా వస్త్రాలంకారముల ధరించి భర్తయభీష్టము ననుసరించి మెలంగవలయుననియు నట్టివారికే కష్టములు కలుగకుండ నభీష్టములు నెఱవేఱుననియు నీకథనుండి మన మెఱుంగవలయును. ఇంకఁ దర్వాతి భగవచ్చేష్టితమును వ్రాసెదను.

## శ్రీకృష్ణుఁడు సత్యభామ ననునయించుట.

*సత్యభామ యీరీతిఃబలికి విలపింపఁగా నాలకించి శ్రీహరి ప్రణయమున నాగ్రహించి యభిమానవతియగు సాధ్విని గాంచుచునిట్లుపలికెను. కమలాయతాక్షీ! నాయవయవములుడికి పోవుచున్నవి. శోకాగ్ని ప్రజ్వరిల్లుచున్నది. నీవిట్లు విక్లబవగుటకుంగలకారణము నెఱింగించుము. నాప్రాణముతోడని శపథముచేయుచున్నాఁడను. నిజము చెప్పుము. చెప్పకున్న నన్నుఁ జంపుకొనినట్లు సుమీ. సర్వాంగశోభనురాలా! నీయందాదృతి గల్ల నీయీభర్తవినఁదగునేని పల్కుము. నే వినఁదగినదున్నదా అనియొట్టుపట్టిపలికిన శ్రీహరింజూచి సత్యభామ సత్యవ్రతపరాయణురాలు గావున నిట్లు వచించెను. †తనపతిని సత్యవ్రతపరాయణుఁడని భావించెను. ఆమెకనుదమ్ములనుండి బాష్పములు

*ఈకథ హరివంశవిష్ణుపర్వము ౬౭ వ అధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయుఁ. †తతః ప్రోవాచ భర్తారం సత్యా సత్యవ్రతే స్థితమ్. అని మూలము.

ధారలుగా స్రవించుచుండెను. మాటలు తడఁబడుచునుండెను. ఆమెమోము వంచఁబడియుండెను. శ్రీహరీ! మానదా! తొలుత నాకుసౌభాగ్యమును బ్రసాదించినవాఁడవునీవే. కమలాక్షా! జగత్తునందు విఖ్యాతిని గల్గించినవాఁడవు నీవే. నీయానతి శిరసావహించుచుండుదు. నీ కిష్టురాలననిగర్వించుచుందును. అందఱు చేడియలు నన్నే కనిపెట్టుకొని యుందురు. అట్టినే నిపుడు నాసపత్నులలో నవమానము ననుభవించుచున్నదానను. అని నాసకియలమూలమున నెఱింగితిని. నా యీయవమానము సఖీమూలమున నెఱుకపడెనని యెఱుంగుము. అది సత్యమే. అసత్యము నాకెవ్వరును జెప్పలేదు.

ప్రాణేశా! నీకుఁ బారిజాతకుసుమమును నారదముని వతంసుఁ డిచ్చెనుగదా. దానిని నీప్రియకిచ్చితివి. నన్ను మఱచితివి. రత్నముల మించినపదార్థము నిచ్చుటచేత నామెయందు నీ కధికప్రేమము కలదనుట తెల్లమాయెను. ఆపత్నియందు నీకుఁ గలస్నేహము బహుమానము వెల్లడిచేసితివి. దానికేమి గాని పోనిమ్ము. ఆనారదముని నీవు వినుచుండ నామెను సన్నుతించెను. నీ వాప్రియురాలిసంస్తవమును మహాహర్షమున నాలకించితివికదా. ఆ నీ ప్రియురాలా నారదమునిచే నంతగా నుతింపనర్హురాలగునేని నేనచట నదృష్టహీనురాల నైతిని. ఆతావున నావే రుచ్చరింపనేల? తొలుదొలుతఁ బ్రణయరసము నొసంగి వెనుకఁ దాపము నొసంగితివి. ఇంతటనైన ననుజ్ఞయిమ్ము. తపస్సొనరింపఁబోయెదను. కరుణింపుము. స్వప్నమునందైన నిట్లగునని స్మరింపలేదు. నాతలంపునకు రాఁదగినదిది కాదని నాకుందోఁచెను. నా యీసౌభాగ్యము వేఱొకవిధముగా నీవు

చూచుచుండఁగనే మాఱినది. నే నిట్టిపరుషభాషల నాలకింప నోచితినిగదా! మహానుభావుఁడు తేజోరాశియు నగునారదముని కామెయే మిక్కిలి స్తవార్హురాలగుఁగాక. నాకిపు డారుక్మిణి యందాగ్రహము లేదు మద్దూషణసంభరితమగు నాస్తోత్రము నందు నీ వచట నుండుటయే నాకిపుడు సంతాపకారణము కోప కారణము నయ్యెను. మున్నొకనాఁడు లోకమున సాధువులు బ్రదుకుట మర్యాదకొఱకే యని చెప్పియుంటివి. స్మృతిగలదా. మఱచితివా. దానినే నమ్మియుంటిని. ఇపుడు నాస్థితి యిట్టు లాయెఁగదా. మర్యాదకు హానికలుగఁగా నిఁక నేను జీవింపఁదలం పను. ఎవరివలన నా కింతకుమున్ను రక్షణము కలుగుచుండెనో వారినుండియే యిపుడు భయము కలిగినది. పుట్టిననాఁటఁగోలె రక్షించుచున్న యానాథుఁడే నన్నిపుడు రక్షింపఁబూనలేదు. అక్కటా! నే నిఁక నేగతిఁబట్టుదును ? నీచే విడువఁబడితిని. నీసంగతింబాసి కుముద్వతికిం గల్గినగతినే యాశ్రయింపఁగలను. ఈశ్వరుఁ డొనర్చిన ప్రియాప్రియములనుగూర్చి నేనేమిచేయ గలను ? మానదా ! నీకుఁ బ్రియురాలనుగాఁ గొంతకాలముం టిని. ఇపు డప్రియురాల నైతిని. ఈరైవతకాచలము వసంత కుసుమములచేఁ జిత్రింపఁబడినది. ఇందు సకలవిధవాంఛల నను భవించితిని. ప్రియురాలనై యుంటిని. అట్టి నే నిపు డప్రియు రాలనైతిని. నే నిపు డేమని చెప్పుకొందును. రైవతకాద్రి నే మోముపెట్టుకొని చూడఁగలను.? చూతపల్లవముల మెసవి కండుఁగోయిలలుకూయుచుండ నాకలరవమును వహించి వీచు నీసర్వర్తుగంధవహుఁడగు గంధవహుని నీకుఁబ్రియురాలినిగాక యదృష్టహీనురాలనుగూడనగు నేనేమనిసేవింతును ? మున్ను

ప్రాణనాథుఁడవగు నీతోడఁ పైఁ గూరుచుండి మహోదధియందు జలక్రీడలు సల్పుదానను. ఇపుడు దౌర్భాగ్యమునంది యాసాగరము నేమని దర్శింతును. శ్రీకృష్ణా ! పెక్కుపర్యాయము లో సాత్రాజితీ ! నీవే నాకుఁ బ్రియురాలవు. ఇతరకాంతలు కారు. నీకంటెఁ బ్రియురాలు నాకుం గలదా యని నాతోఁ బెక్కుసారులు పలుకుచుందువు. ఆమాట యిపు డెటుపోయెను ? ఎవఁడిపు డాపలుకుల స్మరించును ? నమ్మును?

ప్రాణేశా ! నందునిపత్ని యగుయశోద మాయత్త నన్ను బహుమానపురస్సరముగాఁ జూచుచుండెను. నీవిపుడు నన్నిట్లవమానింపఁగా దౌర్భాగ్యురాలనగుట నట్లు చూచునా? రహస్యప్రీతిచే నందఱను సమ్మానింతువు. నన్ను మాటలచే బహూకరింతువు. ఈవిషయము నెఱింగినవా రెవ్వరైన నన్నందఱతో సమానముగా నైనఁ జూతురా. మాయత్తమాత్రము నన్నుఁ బూర్వమువలె నాదృతిం గాంచునని నేనెట్లు నమ్ముదును ? అరిందమా! ఇంతదనుక నిన్నుఁ గితవునిగా ధూర్తునిగా నెఱుంగఁజాలనైతిని. ఇపు డెఱింగితిని. రుక్మిణీపక్షమున నీమది వ్రాలును. జనవంచకుఁడనియుఁ దెల్లమాయెను. స్వరవర్ణేంగితాకారములచే నిన్నుఁదెలియకుండ దాఁచితివి. ప్రయత్నమున నిట్లుచేసితివి. ఇపుడు నీదొంగతనము విశదమాయె. నీ వా పక్షపాతముకలవాఁడవు. మధురవాక్కుల మోసగించు శఠుఁడవు. అనిపలికి కన్నీరునించెను. ఇప్పట్టునఁ గల హరివంశార్థమును గ్రహించి కవితల్లజుఁడు ముక్కుతిమ్మన,

ఉ. "ఈనయగారవుం బ్రియము•లీపస లీమొగమిచ్చుమాట లే
లా నిను నమ్మియుండినఫ•లం బిదె తోడనెకల్గె నాకు నీ

యానసుమీ సనుం జెనకి ♦ యాఁడిఁబెట్టిన నవ్వువారలం
గాన లెఱుంగునే పసుల ♦ గాపరి భావజమర్మకర్మముల్.

ఉ. ఇంకిట నిన్ను నమ్మ నను ♦ నేమిటికిం గెరలించె దెంతయున్
బొంకముగాని యీవలని♦బొంకులు మా చవిగావు రుక్మిణీ
పంకజపత్త్రనేత్రకును ♦ బ్రాణపదంబులుగాని వల్లవీ
కింకర! చాలుఁజాలు నుడి ♦ కింపకు నింపకు లేనికూరుముల్.

చ. మునిపతివచ్చి పూవొసఁగి ♦ మోదముతోడ భవత్ప్రియాం
గనన్, వినుతి యొనర్పఁగా వినిన ♦ వీనులమాచవిగానిమా
టలన్, వినవలసెంగదా యిపుడు ♦ నీవిట వచ్చుట పారిజా
తవా, సనఁ బ్రకటించి నాకు నెక ♦ సక్కెము సేయన కాదె
చెప్పుమా.

తే. తనదుకోడండ్రలోనఁ బె ♦ ద్దయుగ నన్ను
దేవకీదేవి మన్నించు ♦ నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁ జేసి యా ♦ సాధ్వి సేవ
చేయఁబోవంగ నాకిఁక ♦ సిగ్గుగాదె."

అనుపద్యరత్నముల వ్రాసి తనముద్దుకవితను మహాత్ము లకుఁ గానుకపెట్టి కృతార్థుఁ డయ్యెను. అంతియగాక సపత్నీ కృతపరాభవమునకుఁ జింతిల్లుచున్నసత్యభామ కన్నీరునించెనని మూలమున నుండఁగాఁ దెనుఁగున నొక్కపద్యరత్న మత్యంత మనోహరాకృతిం గాననయ్యెడిని.

ఉ. "ఈసునఁబుట్టి డెందమున ♦ హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు♦కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైనమోముపయిఁ♦జేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకల♦కంఠవధూకలకాకలీధ్వనిన్."

ఇందలియొక్కొక్కపదము రత్నములతో సరిపోల్పఁదగును గదా.

సత్యభామ యీరీతిగా నీర్ష్యావశంగతాంతఃకరణ యై యభిమానమున మఱింతవంతం జివికిపోవుచుండు టెఱింగి భగవంతుఁడు శ్రీహరి సాంత్వనోక్తుల మెల్లఁగా నిట్లు పలికెను. ప్రాణేశ్వరీ! పద్మపలాశాక్షీ! నీవు నన్నిట్లు తలంచుట పాడియా. చాలఁ బొరపడితివి. సుందరీ! విశేషించి పలుక నేల? త్రికరణశుద్ధిగాఁ బలికెద. ఆలకింపుము. నన్ను నీవాఁడనుగా భావింపుము. *దేవీ! ఇతరుల కించుకంతయు బాధ కల్పింపఁగూడదను భావము కలిగి యట్టికార్యములనే చేయుచుండు నారదముని నాకుఁ బ్రియము చేయఁగోరి నాచెంతనున్న రుక్మిణిని బొగడుచుఁ బారిజాతకుసుమము నొసంగెను. ఆమహాత్ముని భావము రుక్మిణిని నుతించిననే నానందింతునని నాకుఁ బ్రియము చేకూర్చుటయే తనకుఁ గృత్యమని భావించెను. మోమోటమివలనను నిర్బంధమువలనను రుక్మిణి కొసంగెను. ఇందులకు సందియము లేదు. ప్రసన్నురాలవు కమ్ము. శుచిస్మితా! ప్రేయసీ! ఈస్వల్పాపరాధమును క్షమింపుము. నాతప్పు ఇందు లేదనను. చాలస్వల్పము. కావున నింతమాత్ర మపరాధమును సహింపరాదా. మునియొక పారిజాతము నిచ్చెను. ఇంతమాత్రమునకే నీ కింతయాగ్రహ మేల కలిగెను? త్వరగా నాగ్రహించుస్వభావము కలదానవు కదా. సుశ్రోణీ! నీవు పారిజాతకుసుమములం బెక్కింటిని గోరుదువా. ఇచ్చెదను. సత్యముపై శపథము చేసెదను.

---

* తత్పారిజాతకుసుమం తస్యా దేవి మమాగ్రతః, నారదో మత్ప్రియం కర్తు మ్మునిరక్లిష్టకర్మకృత్, దాక్షిణ్యాదానురోధాచ్చ దత్తవాన్నాత్ర సంశయః. అని మూలము.

*స్వర్గనగరోద్యానమున నలరారు నాపారిజాతకల్పవృక్షరాజ మును దెప్పించి నీయింట స్థాపించెదను. ఎంత కాలము దాని నిలుపఁగోరెదవో యంతకాల మునుచువాఁడను. కోరుము. దానిందీర్చెదను. ప్రేయసీ! సంశయము నొందవలదు. అని పలికెను. ఈభావము తెనుఁగునందు,

తే. "వామలోచన నీకేళి•వనములోనఁ
జలువవెదచల్లు చెంగల్వ•కొలని కెలన
సరసకర్పూరకదళీకా•తరులనడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ • బెంపుగనుము."

అని వ్రాయఁబడినది.

ఇట్లు శ్రీహరి సత్యముపై శపథముచేయఁగా హరివల్లభ సత్యాదేవి మనోదుఃఖము తగ్గగా నిట్లు మెల్లగాఁ బలికెను. నాథా! నీమాట సత్యమేని యాపారిజాతమహీరుహరాజము తెప్పింప శక్యమగునేని నా యీక్రోధ ముపశమిల్లఁగలదు. నాకు మర్యాదయుఁ గల్గును. ప్రాణేశా! నేను సవతులలో నెల్ల నధికురాల నగుదును. అని మందహాససుందరముఖార విందయై పలికినసత్యభామం గాంచి మధుసూదనుఁ డిట్లు స్వర్గ పురమునుండి పారిజాతమును దెప్పించి నీయింటనుండునట్లు చేసెదనని ప్రతినచేసెను. నాకర్తవ్యములలోనిదియే ప్రథమమని భావింపుమా యని వేఁడుకొనియెను. జగముల సృజియింపఁ బెంప సంహరింప మూలకారణమగు భగవంతుఁడు సత్యము సత్యము నీయింటఁ బారిజాతమహీరుహము నాటంజేసెదనని

*స్వర్గాత్సదా దానయిత్వా పారిజాతం ద్రుమేశ్వరం, గృహే తే స్థాపయిష్యామి యావత్కాలం త్వమిచ్ఛసి. అని మూలము.

మాఁడుమాటలు పలుకఁగా నాసాత్రాజితీదేవి సంతోషభరాక్రాంతస్వాంతయయ్యెను. సజ్జనులకు సంతోషమును గల్గించు నాకంసనిషూదను ప్రాణవల్లభ సంతోషించుటయే జగన్మంగళమని భగవంతుఁడు భావించెను.

అంత నాజగన్నాథుఁడు సర్వేశ్వరుండు సర్వభావనుండయ్యు లోకాచారమూని యాప్రాణేశ్వరియింట స్నానము చేసి యావశ్యకకృత్యములన్నియు నిర్వర్తించెను. సత్పురుషులకు సర్వకామప్రదుఁడుకదా. * మఱియుఁ దనచిత్తమున స్నానముచేసి నారదముని రావలయును. అని స్మరించెను. రుక్మిణీగేహమునుండి యానారదముని సాగరమున కరిగి స్నానమొనర్చి సత్యభామమందిరమున కరుగుదెంచెను. సాధుసంతతి కెల్లఁ బరమగతియగు శ్రీహరి సత్యాదేవింగూడి యెదురుచని తోడితెచ్చి యథావిధి నాదేవమునిం బూజించెను. తొలుదొలుత నాతనిపాదములను సాత్రాజితి శుద్ధోదకంబులఁ గడిగెను. ఆమె మునిపాదారవిందములఁ గడుగుచుండ శ్రీహరి పాత్రమును జేతఁబట్టుకొని నీరుపోయుచుండెను. పిదప నా మహర్షి యుచితాసనమునఁ గూరుచుండఁగాఁ బ్రయతాత్ముఁడై జగద్గురువునగు శ్రీకృష్ణుఁడు పరమాన్నము నొసంగెను. ఆమునివరుఁడును లోకకర్త యొసంగినపాయసము నాదృతిమై నారగించెను. శ్రద్ధమై భుజించెను. అవ్వల శుద్ధాచమనముచేసి తృప్తుఁడై యాశీర్వదించెను. ఆయమోఘాశీర్వాదములను గేశ

*దధ్యౌ చ నారదం దేవ స్నాతో దేవముని ర్నృప, అభ్యాజగామ స్నానాంతే మునిశ్రేష్ఠో మహోదధౌ. తమాగతం నరపతే సతాంగతి రథోత్థితః, సత్యయాసహ ధర్మాత్మా యథావిధి అపూజయత్. అని మూలము.

వుఁడు ప్రీతమనస్కుఁడై గ్రహించెను. శ్రీకృష్ణు ననుమతంబున సాత్రాజితి మునిపతికి నమస్కరింపఁగా నారదముని సజలమగు తనదక్షిణహస్తమును జాపి కమలపత్త్రాక్షిని సత్యభామను దేవీ ! ఇపుడెట్లు హరిప్రియురాలవో సర్వదా యిట్లే శ్రీకృష్ణా నందవర్ధని వగుదువుగాక. విశేషించి నాతపోబలమున నదృష్ట వంతురాలవు కమ్మా. అని దీవించెను.

* ఇట్లు దేవముని నారదుఁడు దీవింపఁగా నాసాత్రాజితి మహోత్తరహర్షమున లేచి నిలువఁబడి వినయమునఁ బతిచెంత నుండెను. మునివరుం డనుమతింప శ్రీకృష్ణమూర్తి యవ్వేల భుజించెను. ఆవిఘుసాన్న మాపరమాత్మున కత్యంతప్రీతిదాయక మయ్యెను. సత్యభామయు విధివిహితకృత్యములందీర్చి(భుజించి) శ్రీహరి యనుమతినొంది యంతఃపురమునకు ముందుగాఁ బో యెను. సత్య యంతఃపురమునకుఁబోవుటకుం గలకారణమెఱింగి శ్రీహరియు నారదమునివరుం దోడుకొని యంతిపురి కరి గెను. అందు సత్యభామ వారి నాసీనులం జేయించి హరిపార్శ్వ మునఁ దా నిలువఁబడియెను. తననగరునకు రాఁగానే మహాత్ముఁ డగుమునిపతికి నమస్కరించెను. నారదమునియు నందు ముహూ ర్తము నివసించి శ్రీహరీ! ఇంక సెలవిమ్ము. స్వర్గలోకమునకుం బోయెదను. నిన్నుం బ్రార్థించుచున్నాఁడను. అవ్వలఁ గైలాస మున కరిగెదను. అందు నీశానుని శంకరుని దేవతలు గంధర్వు లప్సరసలు వినుతిగీతముల నారాధించుచుందురు. ఇపు డాశం

* సకృష్ణోప్యభ్యనుజ్ఞాంతు లబ్ధ్వా మునివరాత్తదా, బుభుజే విఘసం ధీమానప్రమేయపరాక్రమః. తతస్త్వావశ్యకం కృత్వా సత్యభామాపి భారత, అనుజ్ఞయా తదా భర్తు ర్వివేశాంతర్గృహం ముదా. అని మూలము.

కరుఁడే స్వర్గపురమునకు వచ్చియున్నవాఁడు. ప్రతిమాసమందును మహేంద్రసదనంబున నీశ్వరారాధనము జరగును. ఇంద్రాదులామహాత్మునిం బూజింతురు. అందు గాంధర్వము నృత్తము నొకయారాధనావిశేషముగా జరపఁబడును. ఆ విగ్రహమును బూజించుచుండఁగా నంతర్హితుఁడై దేవదేవుఁడగుపరమశివుఁడు దేవతలొనరించుపూజావిశేషములఁ దిలకించుచుండును. ఆయారాధనమునందుఁ బాల్గొనవలయునని నిన్న నన్నింద్రుఁడు ప్రార్థించెను. అంగీకరించితిని. పాల్గొంటిని. ఆపూజాకుసుమమే యిది నాకీఁబడఁగా నేను నీకర్పించితిని. పారిజాతవృక్షరాజము మన్నింపఁదగినది. విశేషించి కొనియాడఁదగినది. శ్రీకృష్ణా! నీకు సకలశుభము లొనఁగూడుఁ గాక! సకలలోకమునుండి ప్రియమాఱ నేఁదెచ్చినయీతరువరదివ్యకుసుమము నీపాదకమలములకడ నర్పించితిని. ఆవృక్షము శచీదేవికిఁ బ్రీతిపాత్రము. ప్రతిదిన మావృక్షము పూజింపఁబడునేని సౌభాగ్యము నొసంగును. పారిజాతము సుకృతఫలముల నొసంగుటకే సృష్టిచేయఁబడినది. దాని నిత్యమదితియుఁ గశ్యపమునియుఁ బూజింతురు. పూర్వ మాకశ్యపముని యదితికీతరురాజమాహాత్మ్యమునుపదేశించెను. వరముగోరనొసంగెను. దాననామె సౌభాగ్యమువృద్ధియయ్యెను. ఈతరురాజ మాయదితికి సర్వాలంకారముల నొసంగెను. ఆయదితి మహామోదమునఁ గశ్యపునింగాంచి నేను సదా కుమారివలె నుండవలయు. గర్వములేక యేచింతలులేక యుండవలయు. పతిభక్తిగలదియు ధర్మశీలయునగు నాయదితి యట్లుకోరి భర్తయంగీకరించి వరమీయఁగాఁ గుమారికవలెనే కనఁబడుచుండెను. ఆమెకోరికలఁ

దీర్చుపొంటె నాతపోనిధి యీపారిజాతమును నిర్మించెను. నిత్య పరిమళవంతములై సర్వకామప్రదము లగుపుష్పములం గూడి యీ తరురాజము చెన్నారు చుండును. దీనికి మూఁడు శాఖ లుండును. సర్వభూతమనోహరములై యాశాఖ లలరారును. సకలర్తుకుసుమము లాతరువరమునందే కోరినవారికిం గనంబడు చుండును. ఇట్టికుసుమములు లెక్కింపరాక యందగపడును. బహురూపములుగా నీవృక్షమే కనఁబడును. పద్మాదు లవ్వాని నుండి లభించును. మందారమను నొకవృక్షరాజము కలదు. అదియు సకలవృక్షసారముంగొని కశ్యపునిచే నిర్మింపఁబడినది. అదియు వృక్షశ్రేష్ఠ మనందగు. ఈపారిజాత కుసుమముల హారముగా నలరించి యదితి కశ్యపున కిచ్చును. ఆముని యామె సౌభాగ్యవృద్ధ్యర్థ మీతరుసుమముల నదితి కిచ్చును. నాకు నామహర్షి యీకుసుమమాలికను బుణ్యము వృద్ధినొం దుపొంటె నొసంగును. ఏఫలమును గోరని నే నాకుసుమదా మమును గశ్యపునకే మరల సమర్పించువాఁడను. ఇంద్రుఁడు సౌభాగ్యవృద్ధింగోరి శచీదేవి కిచ్చును. ఆమె నాకు నిచ్చును. సోముఁడు తనప్రియపత్నియగు రోహిణికిఁ గుబేరుఁడు తన పత్నికి నిచ్చుచుందురు. కావున నీవృక్షము సౌభాగ్యప్రదమను టకు సంశయములు లేవు. విష్ణుపదియనునామము గంగానదికిం గలదు. విష్ణుపదినుండి పరిజాతముగానఁ బారిజాతశబ్ద మీవృక్ష మునకుఁ బేరుగా విఖ్యాతమయ్యెను. మందారపుష్పములతోఁ గూడుట మందారమనియుఁ బిల్తురు. ఏదో యొకదారువిశేష మిదియని తెలియక జనులు వాడుటచే నిది కోవిదారమని చెప్పం బడును. మందారమని కోవిదారమని పారిజాతమని కల్పవృక్ష

మే పిలువఁబడును. దాని పుష్పరాజమే యిది. అని పలికి పయ నము చేయ నుద్యుక్తుఁడాయెను.

ఆర్యమహాశయులారా! శ్రీకృష్ణుఁడు సత్యభామ ననున యించిన యీవిషయమునందొక్కవిశేషవార్త కలదు. అదియే స్త్రీలమర్యాదను దెలుపును. పతివ్రతల ధర్మములను దెల్పును. సత్యభామను హరి యనునయించెను. శోకకారణము ప్రశ్నిం చెను. తనకేమియుఁ దెలియనట్లు పలికెను. సత్యభామ తనకుఁగల పరాభవమును భర్తకుం దెల్పెను. సాధ్వియగుభార్య తనకు సపత్నులవలనఁ గలిగినపరాభవము నెట్లు తెలుపఁదగునో యా మర్యాద వదలకుండఁ దెలిపెను. కఠినాత్ముఁడవు. వంచకుఁడవు. కపటివి. అనునివి మహాపాపఫలదములు కావు, ప్రాయశః స్త్రీల నోటినుండి సత్కవులు వ్యాసాదులు పల్కించుమాటలే అవి లోకస్వభావముల మీఱియుండలేదు. ఆమాటలు విని భగవం తుఁడు నవ్వి సత్యా! యీమాత్రమునకా యింత చింతనొంది తివి. పారిజాతమహీరుహవర్యమును వలయునన్నఁ దెప్పించి నీయింట నాటించెద. వలసినంతకాలముండనిమ్మనియె. ఈమాట హరినోటనుండి రాఁగానే యీమాట సత్యమేని నాదుఃఖము తొలఁగినట్లే యనెను. సపత్నులలోఁ దలవంపులు తొలఁగుట నేనుత్తమురాలనగుదుననియె. మిక్కిలియాతురతంబూని ప్రార్థిం చెను. తనహితమునుగోరి పతియొకమాట నుడువఁగా దాని కానందించుట సాధ్వీస్వభావ మనక తప్పదు. ఈఘట్టమునందు జరగినసంభాషణమును గాంచినచో సత్యభామ యుత్తమనా యిక యనవలయునేకాని యింకొకమాట పలుక వీలులేదు.

ఇట్టులుండఁ దెనుఁగున మహాకవి ముక్కుతిమ్మన యొకపద్యము వ్రాసెను.

ఉ. "పాటలగంధి చిత్తమునఁ • బాటిలు శోకభరంబు దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదు•పల్లవకోమలతల్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణి•పంక్తికి వన్నియ పెట్ట నాజగ
న్నాటకసూత్రధారియదు•నందనుఁడర్మిలిమ్రొక్కెమ్రొక్కినన్.

మ. జలజాతాసనవాసవాదిసురపూ•జాభాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రి శిరమ•చ్చో వామపాదంబునం
దొలగం దోచెలతాంగియట్లయగునా•థుల్ నేరము ల్చేయ చే
రలుకం జెందినయట్టి కాంత లుచిత•వ్యాపారముల్ నేర్తురే."

ఈ రెండుపద్యములకు విలువయే లేదు. అమూల్యరత్నములే. కాని భగవంతునివిషయమున నిట్లు చెప్పుట న్యాయమా యని విచారింపవలయును. భగవంతునికార్యములన్నియు నితరులకు నుదాహరణభూతములుగా నుండవలయుఁగదా. ప్రణయకలహమున నిట్లు వర్ణించుట యాలంకారికులమత మనవచ్చును. శృంగారములందు భర్త భార్యకు మ్రొక్కినను దప్పులేదనవచ్చును. అది నమస్కారపద్ధతిలోనిది కాదనియు నదియు నొకశృంగారలక్షణమనియు ననవచ్చును దాని కంగీకరింపరా దనుచంతటి మోఱకుఁదనము నాకు లేదుగాని భగవంతునియుఁ దత్పత్నులయు వాడుకలు లోకములోనివారికెల్ల శిరోధార్యములు కావలదా యనిమాత్రము ప్రశ్నింపక మానను. ఇచ్చో రసభంగమే యనక యూరకుండ నామనసొప్పకున్నది. ముక్కుతిమ్మనగారిచ్చోట నిదియెందులకుఁ జేర్చెనో దానికారణము వేఱుగనున్నది. అది కృష్ణరాయలకు భార్యపైఁగల క్రోధ మడంపఁ

బూని కవిరత్న మీపద్యరత్నమును వ్రాసెనని యెవ్వరూహింతురు. నీచు లీయుదాహరణమును జూపుచు భారతదేశీయ ప్రాచీనాచారము లిట్టివని యాక్షేపింతురుగదా యన్నపరితాపమున నిట్లు వ్రాయుచున్నాఁడను. హరివంశమున నీచోట నీకథ కానరాదు. భాగవతమున లేనేలేదు. నిర్మూలముగా నేల దీనిని గల్పింపవలయునో తెలిసికొనఁజాలక కలవరపాటొందుచున్నాఁడను. ఇట్టితావులయందుఁ గవి కడుజాగరూకుఁడై మెలంగవలయును. దేహమంతటఁ గన్నులుండి ప్రవర్తింపకయున్నఁ బ్రాచీనాచారములయందు లోపము కల్గించినవాఁడగును. దానవించుకయేఁ గళంకములేని మతాచారములకు లోపము గల్గించిన పాపమునకుఁ బాత్రుఁడు కాకతప్పదు. "స్థితస్యగతిశ్చింతనీయా" యన్నప్రాక్తనసూక్తినే యనుసరించి యెట్లో సమాధానము చేసికొనవలయునే కాని సంతృప్తిగా సమాధానము చెప్పవలను పడకయున్నది. ఇంక నీవిషయమును వదలెదను.

శ్రీహరి యిట్లు లొక్కమాటచే సత్యభామాదేవి కోపమునాపి సంతుష్టాంతరంగనుగా నొనరించి తనమది నారదమహర్షిని తలంచెను. స్నానముచేసి సిద్ధముగా భోజనమునకు రమ్మనియే యాతలంపు. ఏతక్షణమున శ్రీహరి యిట్లు తలంచెనో యాముని మానసమందున్నవాఁడు తానే కాన నాతనిమది కిపుడు శ్రీహరిని దర్శింపఁబోవలయునని తోఁచెను. సముద్రమున స్నానముచేసి భోజనసమయమునకు నారదముని సత్యాదేవిగృహమున కరిగెను. ముందే స్నానముచేసి హరి సిద్ధముగ నుండెను. సత్య విధివిహితముగాఁ బాదప్రక్షాళనము భర్త కలశమును బూని జలముపోయుచుండఁగా నొనరించిముని నర్చించెను.

ఆమె కంతకుముందున్న యాగ్రహలేశమేనియు నిపుడు లేదు. పరమానందభరితురాలై తనపెనిమిటి తనకే లోఁబడియుండునని భావించెను. రుక్మిణికడనున్నపుడు విధిలేక యామెపైఁ బ్రేమ మున్నచందము నటించెనుగాని నిక్కముగా నాయందే ప్రీతిగలవాఁడని విశ్వసించెను. ఔరా! ఏమి యాలతాంగివిశ్వాసము! అంతలోఁ గ్రోధము! అంతలో శాంతము! అంతలో భర్తపై విశ్వాసము. సెబాసు! జగన్నాటకసూత్రధారునిత్రిప్పులకు లోఁబడి హరిహరబ్రహ్మశక్రాదులు నారదాదిమహర్షులు తిరుగుచుందురన నిఁక సత్యభామప్రస్తావమేల ? ఇచ్చోనొక్కరహస్యార్థము కలదు నారదముని హరిభక్తుఁడు గాన రూపమున శ్రీహరిని భజించువాఁడు. అనఁగా హరిసేవకుఁడనికదా భావము. అట్టి తనసేవకుఁడు మందిరమునకు రాఁగాఁ దాను గలశమెత్తికొని నీరుపోయుచు భార్య యామునిపాదములు కడుగునట్లు చేసెను. ఏమి దీనిభావము? ఎల్లవారును సాధుమనస్కుఁ డింటికి రాఁగానే భగవత్స్వరూపునిగా భావించి భగవంతున కెట్లుపచారములు విధిననుసరించి చేయుదుమో యట్లు చేయవలయునని లోకుల కుపదేశించుటకే యని మనము గ్రహింపవలయును. అతిథిపూజ మహాఫలప్రదము.

శ్లో. "సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకమ్. ౯౯
నవై స్వయం తదశ్నీయాదతిథిం యన్న పూజయేత్,
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం చాతిథి పూజనమ్.
శిలానప్యుంఛతో నిత్యం పంచాగ్నీనపి జుహ్వతః,

సర్వం సుకృతమాదత్తే బ్రాహ్మణోఽనర్చితో వసన్." ౧౦౦

(మనుస్మృతి. 3 అధ్యా.)

"అనయాచ నిందయాతిథ్యర్చనస్య నిత్యతావగమ్యతే."

అని కుల్లూకభట్టు వ్యాఖ్య.

అతిథిపూజయనఁగా మనుష్యయజ్ఞమని శ్రుతి తెలుపుచున్నది.

శ్రుతి. "యద్బ్రాహ్మణేభ్యోఽన్నం దదాతి తన్మనుష్యయజ్ఞస్సం

తిష్ఠతే."

శ్లో. "అతిథిం తత్ర సంప్రాప్తం పూజయేత్స్వాగతాదినా,

తథాసనప్రదానేన పాదప్రక్షాళనేన చ. ౫౭

శ్రద్ధయా చాన్నదానేన ప్రియప్రశ్నోత్తరేణ చ,

గచ్ఛతశ్చానుయానేన ప్రీతిముత్పాదయేద్గృహీ. ౫౮

అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే,

స తస్మై దుష్కృతం దత్వా పుణ్యమాదాయ గచ్ఛతి. ౬౨

ధాతా ప్రజాపతిశ్శక్రో వహ్నిర్వసుగణోఽర్యమా,

ప్రవిశ్యాతిథిమేతేవై భుంజంతేన్నం సురేశ్వర. ౬౩

తస్మాదతిథిపూజాయాం యతేత సతతం నరః,

స కేవలమఘం భుంక్తే యో భుంక్తే హ్యతిథిం వినా. ౬౪

తత స్స్వవాసినీ దుఃఖగుర్విణీ వృద్ధబాలకాన్,

భోజయేత్సంస్కృతాన్నేన ప్రథమం చరమం గృహీ. ౭౦

అభుక్తవత్సు చైతేషు భుంజన్ భుంక్తే సదుష్కృతమ్,

మృతశ్చ గత్వా నరకం శ్లేష్మభుగ్జాయతే నరః" ౭౧

(విష్ణుపురాణము తృతీయాంశము ౧౧ అధ్యాయము.)

స్వవాసినీ = పితృగృహస్థకన్యా అని వ్యాఖ్య.

శ్రుతిస్మృతిపురాణములతిథిపూజ భగవత్పూజయనియే తెల్పు

చున్నవి. దరిద్రుఁడైనచో నతిథికి నన్నము పెట్టఁజాలఁడు కదా వానిగతి యేమని ప్రశ్నింతురు కాఁబోలు.

శ్లో. "తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా.
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన"
(మను. ౩. అధ్యా ౧౦౧.)

"ప్రియప్రశ్నోత్తరేణ చ" అని విష్ణుపురాణము.

వీనింబట్టి యథాశక్తిన్యాయముననుసరించి తనకుఁగలిగి యున్నయంతలో నతిథికిఁ బూజచేయవలయునని భావము తేలెడిని. ఏమియులేనిచోఁ బ్రియప్రశ్నములకు లేమియనునది లేదు కావున మంచిమాటలచేతనైన నాతని సంతోషింపఁజేసి ధనవంతులయిల్లుచూపవలయునని గ్రహింపందగు. అంతియకాని నాలుగుచీవాట్లుపెట్టి పంపరాదు. జలము మంచిమాటలు ఇవియే దరిద్రున కతిథిపూజచేయుసాధనములనుట సర్వసాధుజనసమ్మతము కదా. ఈన్యాయమును శ్రీహరి తనయాచరణముచేఁ దెల్పెను.

మఱియు శ్రీహరి నారదమునికిఁ బరమాన్నముపెట్టి సంతోషింపఁజేసెను. ఆపిదపఁ దానావిఘసమును భుజించెను. విఘసమనఁగా నతిథి భుజించినపిదప మిగిలినయన్నము. కాని యతిథి భుజింపఁగా మిగిలిన యుచ్ఛిష్టముకాదు.

శ్లో. "విఘసాశీ భవేన్నిత్యం నిత్యం వామృతభోజనః,
విఘసో భుక్తశేషం తు యజ్ఞశేషం తథామృతమ్."
(మను. ౩ అధ్యా. ౨౮౫.)

"విప్రాదిభుక్తశేషం విఘస ఉచ్యతే. దర్శపౌర్ణమాసాది యజ్ఞశిష్టం పురోడాశాద్యమృతం సామాన్యాభిధానేఽపి ప్రకృతత్వాచ్ఛ్రాద్ధే విప్రభుక్తశేషభోజనార్థోఽయం విధిః. అతఏవ

"భుంజీతాతిథిసంయుక్త స్సర్వం పితృనిషేవితమ్" ఇతి స్మృత్యం తరమ్ అతిథ్యాదివిశేషభోజనంతు "అవశిష్టంతు దంపతీ" ఇత్య న్యేనైవ విహితమ్. తస్యైవచ యజ్ఞశేషతుల్యత్వాపాదనేన స్తుత్యర్థం పునర్వచన మితి తు గోవిందరాజవ్యాఖ్యాన మనుష్ఠాన విశేషానర్హత్వమప్రాకరణికంచ" అని కుల్లూకభట్టువ్యాఖ్య.

అతిథులనుమాత్రమే కాక పెండ్లిగానికన్యక, వ్యసనగ్రస్తుఁడు, గర్భవతి, వృద్ధుఁడు, బాలుఁడు వీరిని ముందు భుజింపఁజేసి వెనుక గృహస్థువు భుజింపవలయునని విష్ణుపురాణము తెల్పుచున్నది. ఈయర్థమునే మనుస్మృతి దృఢపఱచుచున్నది. చూడుఁడు.

శ్లో. "సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీస్త్రియః,
అతిథిభ్యోఽగ్ర ఏవైతాన్ భోజయేదవిచారయన్."

(మను. 3 అధ్యా ౧౧౪ శ్లో.)

"కథమతిథిభ్యోఽభోజితేషు భోజన మేషా మితి విచారమ కుర్వన్" అని వ్యాఖ్య సువాసినులకు, పెండ్లిగానికన్యలకు, రోగబాధితులకు, గర్భవతులకు నతిథులకంటె ముందుభోజనము పెట్టవలయునని భావము. అంతియకాక అతిథులకంటె ముందు వీరికన్నము పెట్టుటెట్లు? అని సంశయింపక పెట్టవలయునని మను స్మృతి విధించుచున్నది దీనిభావమేమి ? క్షుధార్తులను దృప్తి చేయుట ప్రధానధర్మము. వారి కాకలిబాధ యెక్కుడు. దానిని సహింపఁజాలరు. కావున మతిమంతుఁడగు నతిథి వారి యంతరంగమందున్న భగవంతుఁడు తృప్తినొందుఁగాక యను సంకల్పమున నన్నము పెట్టి సంతృప్తిచేయవలయునని రహస్యార్థము. అతిథులు పండితులున్నారే వీరికంటె ముందీస్త్రీల కన్నము

పెట్టవచ్చునా యని సంశయింపరాదు. అట్లు సంశయింపక ప్రాణి తృప్తిచేయువాఁడు సమదర్శనుఁ డనంబడును. ఈవిషయము భగవద్గీతా శాస్త్రమునందు.

శ్లో. "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

(౬ అ. ౨౯. శ్లో.)

అని చెప్పఁబడినది చూచితిరా? పురాతనప్రోక్తధర్మము లెంత యింపుగా నున్నవో. సర్వత్ర భగవంతుని గాంచుచు నేభూతమునకుఁ దృప్తిగావించినను భగవంతుఁడు తృప్తినొందు నని శాస్త్రములు ఘోషించుచున్నవి.

ఇట్లు శ్రీహరి నారదునకుఁ బాదప్రక్షాళనాదికృత్యముల నలరించి యన్నముపెట్టి పిదపఁ దాను భుజించెను. ఆమీఁద సత్యభామ భుజించెను. భర్తకంటె ముందు భార్య భుజింపరాదని ప్రాచీనశాస్త్రనియమము కలదు.

"అగ్రాశినీ మన్యగృహప్రవేశినీం,
త్యజంతి భార్యాం దశపుత్రమాతరమ్"

అనుసూక్తి యందఱెఱింగినదియే కాని క్రొత్తది కాదు కదా. ఇట్టు లీకథ సదాచారములను దెలుపుచున్నది. కథమాత్రమే కాక యిట్టివిషయముల నెఱుంగవలయును. ఇఁక నీవిషయమును వదలి కథాభాగమునకుఁ బోయెదను.

## శ్రీకృష్ణనారదమునిసంవాదము.

*నారదముని సత్యభామాసహిత శ్రీకృష్ణపరబ్రహ్మము ననుమతినొంది స్వర్గమున కరుగఁ దలఁచునంతలో సర్వజ్ఞుఁ డగు

---

*ఈకథయును హరివంశవిష్ణుపర్వము ౬౭ వ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యూహింపవలయును.

నారాయణమూర్తి మరల నారదునితో నిట్లు పలికెను. సకల ధర్మతత్త్వముల నెఱింగినమహామునీంద్రా! సురనగరమున కరిగి త్రిపురాంతకు సదస్యులం గాంచి యాజ్ఞారూపముకాని నామాటలుగా నింద్రునితో నిట్లు తెలుపుము. మునీంద్రా! ఇంద్రునకు నేఁ దమ్ముఁడనని యెఱుంగుదువుకదా. కశ్యపమునిచంద్రుఁ డేవృక్షరాజమును సృజించెనో పూర్వమదితికి సుఖాభివృద్ధియగు పొంటె నేతరువరము నలరించెనో యాపారిజాతము పరమ పావనము, సౌభాగ్యమునొసంగు సుమరాజముల నీనును. నరకాసురసంహారమునకు ముందు శతక్రతూ! దాని నాకొసంగెదనని వాగ్దానము చేసియుంటివి. ఆవాగ్దానమును ధర్మనిరతిగల నాభార్య లాలకించిరి. వారు నన్నిపుడు కోరుచున్నవారు. ప్రభూ! దాని నిపు డొసంగుము. పుణ్యము నిమిత్తము, దానధర్మముకొఱకు, నాప్రీత్యర్థము దాని నిమ్ము. ఆమహాద్రుమము నీద్వారవతిం జేర్ప నాజ్ఞాపింపుము. దానము నీయఁగా మరల నావృక్షరాజము నీవు వలసినపుడు కొనిపోవచ్చును. మునిచంద్రా! ఈమాటలు నావిగా నా దేవతాధీశునకు విన్నవింపుము. ఎట్లది నాకు లభించునో తదనుగుణముగు ప్రయత్నము చేయవలయును. ఈకార్యమునందు దూతత్వము గనఁబఱపుము. తాపసేంద్రా! నీచమత్కృతి యచ్చెరువుగదా. నాయందుఁ దమకుఁ గలవాత్సల్యము పారిజాతానయనమునఁ దేటపడవలయును.

అని శ్రీహరి పలుకఁగాఁ గేశిదానవనిషూదనుం డగు నారాయణుం గని నవ్వి నారదుఁ డిట్లు భాషించెను. యాదవేంద్రా! చాలసంతోషము. నీవాక్యముల నింద్రునకుం దెలిపెదను. ఏవిధమున నింద్రుఁ డాపారిజాతము నొసంగఁడేని

వేఱొకయుపాయముం జెప్పెద నాలకింపుము. పూర్వము దేవ దానవులు మందరపర్వతమును క్షీరవారాశిని వైచి త్రచ్చి పారిజాతమును బడయఁగల్గిరి. ఆమందరాద్రిపై శంకరుఁడు పార్వతింగూడియుండఁగా దేవేంద్రుఁడు స్వయముగాఁ బోయి శచీదేవికి నానందము కలుగఁజేయునిమిత్త మాపారిజాతము నిమ్మని ప్రార్థించెను. మహాదేవుఁడు కరుణావారిరాశి కావున నట్లే యగుంగాకయనియె. కొంతకాలమున కది మరల మందర పర్వతమును జేర్పఁదగునన్న నియమమును మీఱితి శచీదేవికిఁ గ్రీడాభంగమది లేకున్న నగునను నెపమున నింద్రుఁ డూరకుం డెను. శంకరుఁ డామందరాద్రియందుఁ బార్వతీదేవికి సంతో షము కలుగఁజేయు నిమిత్త మొకకందరమును నిర్మించెను. ఆకందరము రెండుక్రోశములపొడవుకలది. ఆకందరమున శ్రీ కృష్ణా! సూర్యకిరణములు వ్యాపింపఁజాలవు. చంద్రమరీచులు ప్రవేశింప సమర్థములుగావు. వాయుదేవున కందుఁ బ్రసారము లేదు. శైలపుత్రికతలంపు ననుసరించి శీతోష్ణము లందుఁ గలుగు చుండును. అందున్న దివ్యవనము శంకరతేజమున నిరంతర ముల రారుచుండును. ఆవనమును మహాదేవియు మహాదేవుఁడు నేనునుదప్ప నితరులు ప్రవేశింపననుమతిలేదు. ఆవనమునఁ గల పారిజాతవృక్షములన్నియు సర్వరత్నములనుగోరినపుడు వర్షించు చుండును. మనస్సునఁ దలంచుటయే యాలస్యముకాని కోరికల ననుసరించి యాపారిజాతములు ఫలముల నొసంగును. ప్రమథ గణము లాదివ్యపారిజాతఫలముల యథేష్టముగా ననుభవించు చుందురు. అట్టియాజ్ఞ సకలలోకనాయకుఁ డగుమహాదేవుఁడే యిచ్చెను. దేవలోకమునఁగల పారిజాతమునకంటె నామందర

కందరాంతరాళవిలసద్వనరాజమునఁగల పారిజాతములఁ గలఫల
ములు బహుగుణములు. వానిప్రకాశము లత్యధికములు.
గుణములు విశేషములు. ఆవృక్షరాజములు మూర్తిమంతములై
వృషభధ్వజుఁ డగుశంకరుని, సర్వకాలములయందుఁ బ్రమథ
గణములంగూడి సేవించుచుండును. ఆద్రుమరాజములు శంకరు
తేజస్సంక్రాంతిం బొలుపారుచు నేకష్టముల నెఱుంగక సుఖా
న్వితములై వెలయును. శైలరాజకన్యక వాని నతిప్రీతి గౌర
వించుచుండును. ఆవృక్షము లాదేవికి విశేషించి ప్రీతిపాత్రము
లని యెఱుంగవలయు.

ఒకానొకకాలమందు వరదానగర్వితుఁడై పాపనిశ్చయ
ముగలయంధకుఁ డనుపేరుగల ఘోరరాక్షసుఁడు మహాబలశాలి
కావున నావనమునఁ బ్రవేశించెను. అమిత్రఘాతి యగుమహా
దేవుఁ డాక్రూరదానవుని సంహరించెను. వాఁడు సర్వభూతా
వధ్యుఁడు. వృత్రాసురునకన్నఁ బదింతలు బలముగలవాఁడు. అట్టి
వాని నామహాదేవుఁ డశ్రమంబునం జంపెను. పారిజాతములు
గలతావులం దెల్పితి. నాయెఱింగినంతదనుక వానిమహిమముల
నెఱింగించితిని. పారిజాతవిషయమున నీకు విచారము వలదు.
కమలాక్షా! సహస్రాక్షుఁ డావృక్షరాజము నీకొసంగును. ఇది
నిజము. శచీదేవింగూడి యావృక్షరాజము వెలఁగుచుండును.
సర్వకామప్రదము. ఇంద్రున కావృక్షము కోర్కుల నొసంగు
చుండును. అని నారదమునిపలుక విని శ్రీహరి యిట్లు పలికెను.
మునీంద్రా! శచీదేవియానందమునకుఁ గొఱంతకలుగునన్న
హేతువుచే దాని నీశ్వరునకుం బంపఁడయ్యెను. ఇంద్రుఁడు
నాకంటె జ్యేష్ఠుఁడు. త్రిలోకాధిపతి. అవ్యయభోగశాలి. నే

నాశతక్రతువు ననుజుఁడను. జయంతునిం గాంచి లాలించునట్లు నేను నతనిచే నుపలాలింపఁదగువాఁడను. కావున మునీంద్రా! బహువిధోపాయములఁ బ్రయత్నింపుము. నాప్రీత్యర్థము శక్తికిందగిన ప్రయత్నముచేయుము. సత్యభామకు సంతుష్టినిగలిగించునిమిత్తము నేను బ్రతిజ్ఞ చేసితిని. స్వర్గమునుండి యీనగరమునకు దానిం దెప్పింతు ననియే యాప్రతిజ్ఞాఫలము. ఆప్రతిజ్ఞ నన్నృతము చేయుటకు శక్యమగునా. *ఇంతకుఁబూర్వ మెప్పుడు నన్నృతము చెప్పలేదు. అట్టినేను బ్రతిజ్ఞఁ దప్పితినేని లోకములకు విప్లవము గలుగును. ప్రళయము ధర్మమార్గము నకుం గలుగునని గ్రహింపుము. నాచే సద్గుణాన్వితము లగు లోకధర్మము లనుసరింపఁబడినవి. లోకపాలనమున కవియే పనికివచ్చును. అట్టి నే నన్నృతము చెప్పవచ్చునా. నాప్రతినను వ్యర్థముచేయుటకు దేవతలు, గంధర్వులు, రాక్షసులు, నసురులు, యక్షులు, పన్నగులు, నొక్కటిగాఁగూడి ప్రయత్నించి నను సమర్థులు కాఁజాలరు. మునీంద్రా! నీకు మేలుగలుగుఁగాక. నేను యాచించినపుడు దేవేంద్రుఁడా పారిజాతము నీయఁడేని శచీదేవ్యనులేపనాంచిత మగు నాయింద్రునురమున నాగదాయుధము పడఁగలదని నమ్ముము. అని యింద్రునకుం దెలుపుము. తొలుదొలుత సామపూర్వకముగాఁ బారిజాతమును యాచించితినని తెల్పుము. ఆప్రార్థన నంగీకరించి పారిజాతము నొసంగఁ

---

* నానృతం హి వచో విప్ర ప్రోక్తం పూర్వం మయానఘ, మయి భగ్నప్రతిజ్ఞేతు లోకానాం విప్లవో భవేత్. యన్మయా హి మునిశ్రేష్ఠ లోకధర్మా గుణాన్వితాః, పరివార్యాః స్థితాః సర్వే సకథం వ్యానృతం వదేత్. అని మూలము.

డేని నా ప్రయాణము తదానయనార్థము నిశ్చితమని నీవు నెఱుంగుము. అని పలికి శౌరి యూరకుండెను.

మహామతులారా! ఈనారద నారాయణసంభాషణము నుండి గ్రహింపఁదగువిశేషములు కొన్ని కలవు. అందొక్కవిశేషము రహస్యాతిరహస్య వృత్తాంతము నెఱింగించును. పరమేశ్వరుఁడు పార్వతి కానందమును గల్గించుపొంటె మందరాద్రి కందరమున నొక పారిజాతవనమును గల్పించెనని యిందుఁ గలదుకదా. దీనిభావమేమి? నిరంజనుఁడగుశంకరుఁడు ప్రకృతిం గూడి చిత్రకార్యముల బ్రహ్మాండనిర్మాణము లోనగువానిం జేయును. ప్రకృతి ప్రీత్యర్థమే కాని స్వకార్యముకొఱకుఁగాదు. పరమాత్మయగు శ్రీకృష్ణమూర్తి తానిర్గుణుండయ్యుఁ దనయోగమాయయగు సత్యాదేవి సంతోషార్థమే పారిజాతానయన ప్రతిజ్ఞ నొనరించెను. అంతియకాని తుచ్ఛమగు నీపారిజాత ప్రసూన మూమహాత్మునకేల? ద్వారకయందే కల్పింపరాదా యని ప్రశ్నింపరాదు. లోకాచారముల ననుసరించితినని శ్రీహరియే యిందుఁ దెలిపెఁగదా. ఇచ్చెదనని చెప్పి యీయకున్నచో వాని జయించి దానిని సాధింపక మానరాదను రాజనీతిని హరి యాశ్రయించెను. దా నాశ్రయింపకున్నఁ బౌరుషగుణప్రధానులగురాజులు మానుదురు. పౌరుషశక్తియే వారియందు నశించు. దాన లోకమునకు హాని కల్గును. కావునఁ దద్రక్షణార్థమే హరి యీప్రతినచేసెనని యెఱుంగవలయు. ఈరీతిని భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు భగవద్గీతాశాస్త్రమునందే తెలిపెను.

శ్లో. "ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,

భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాంతాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు. ౯
మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦
అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్." ౧౧

వీనియర్థమును నిర్మలాంతఃకరణమునఁ బరిశీలించినచోఁ బైయర్థము తేటపడియెడిని.

మందరపర్వతగుహలో నొక యుద్యానవనము నిర్మింపఁ బడియెననియు, నందు సూర్యచంద్రరోచిస్సులు ప్రవేశింపఁజాల వనియుఁ దుదకు గాలికూడఁ బ్రవేశింపఁజాలదనియు నిందుఁ బొడకట్టెడిని. తొలుదొలుత నిది యసంగతముగాఁ దోఁచెడిని. కాని మనశ్శక్తి నుపయోగించి పరిశీలించిన నిది సుసంగతమనియే తోఁచును. భగవంతునకు శక్యముకానిపని యుండరాదు. భగవంతుఁడే లేఁడన్నవారి కేదియుఁ బనికిరానిసమాధానమే యగును. సూర్యమండలమును సృజించినపరమాత్మకు నొక గుహలో వెలుతురుండునట్లుచేయుట తుచ్ఛకార్యముకాని బృహత్కార్యము కానేరదు. ఇట్టి ఘట్టములయందు సర్వశక్తుఁడు పరాత్పరుఁడని మఱచి మానవశక్తితో నాతనిశక్తి నుపమింపఁ బూని యిది యశక్యము ఇది శక్యము. అని సిద్ధాంతము చేయఁబూనుట గొప్పపొరపాటని నాభావము. అందఱి భావము నిట్టిదిగనే యుండనోపు. సర్పములలోఁ గొన్నిజాతు లెగురును. పక్షములు లేవనరాదు. పక్షులకుఁ గనఁబడునట్లు

లేవే యనరాదు. పక్షిసహాయము లేకున్న నెట్లెగురును ! ఎగురుటకుఁ గలశక్తి నెట్లొ యొసంగును. ఆశక్తి తక్కుంగలసర్పముల కేల యుండరాదు.? అని ప్రశ్నింపరాదు. వీనికేలయుండవలయునో వానికేల యుండరాదో యాపరమేశ్వరుఁడే యెఱుంగును. ఇతరు లెఱుంగరు. ఎగురునట్టి వ్యాళములవలన నేమిలాభములుగలవో ఆశక్తి యన్ని భుజగములకొసంగిన నేమినష్టము కలదో యెఱింగినవాఁడొక్క జగన్నాయకుఁడే కాని యితరులు చేతులు త్రిప్పి సభలో ప్రల్లదములు పల్కుటయే గాని వేఱొకటి యెఱుంగరు. కొందఱు తెలిసినట్లు నటింతురు. కావున శంకరుఁడు గుహాంతరాళమునఁ గ్రొత్తగావలసినపుడు శీతోష్ణముల నిర్మించుననఁగా నత్యంతసులభముగాని పొగడఁదగిన దిందేదియు లేదు.

శ్లో. "నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦
అథవా బహునైతేనకిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్." ౪౨
(భగవద్గీత. ౧౦. అధ్యాయము.)

అను భగవద్వాక్యము లీయర్థమును దేటపఱచుచున్నవి. భగవద్గీతలు ప్రమాణములనువారు గలరుగాని వారిభావమున కనుగుణముకానిది ప్రమాణము కాదనువారు నందుఁ గొందఱు గలరు. అంతకంటెఁ దెలివితక్కువగలవా రుండఁబోరు. విశ్వరూపము భగవంతునిదని గీతలలోఁ గనఁబడుచుండఁగాఁ గొంతభాగ మాతఁడసత్యము చెప్పెననికదా యపుడనవలయును ? వారి దృష్టి కేదియుఁ బ్రమాణముగాఁ దోఁపదని నాయాశయము.

అట్టియజ్ఞులమాట మనకేలగాని భగవదిచ్ఛ యేకార్యమునైనఁ జేయఁగలదని దీనిసారము.

శ్లో. "దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం,
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతోముఖమ్. ౧౧.
దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాస్సదృశీ సాస్యా ద్భాసస్తస్య మహాత్మనః. ౧౨
తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. ౧౩
ఆఖ్యాహి మే కోభవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవ వీర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్." ౩౧

(గీత. ౧౧. అధ్యా.)

ఈశ్లోకములభావ మేమి ? సూర్యులు వేయిమంది యుదయింపఁ బ్రకాశించుతేజస్సు నీయందుఁ గనఁబడుచున్నదనఁగా భగవత్ప్రకాశమును దీభాస్కరప్రకాశ మత్యల్ప మని తాత్పర్యముకాదా! ఈశ్లోక మతిశయోక్తిగాఁ జెప్పఁబడినదని యొకఁడనెను. తక్కిన వతిశయోక్తి కుదాహరణము లేల కాఁగూడదనిన నాతఁడేమియుఁ జెప్పఁజాలకపోయెను. పాపము! ఆతఁడేమి యెఱుఁగఁడు. ఉపన్యాసములు కంఠపాఠములుగాఁ జేసికొని వానిని సభలోఁ జదువువాఁడు. గ్రంథమును గురుముఖముగాఁ బఠించి ధ్యానమున దానియర్థము నలవాటుచేసికొనినపాపమునఁబోయినవాఁడుగాఁడు. కేవలోపన్యాసకుఁడు. చాలమంది యీకాలమున నుపన్యాసకు లిట్టివారే. కావున

నట్టియసద్వాదముల నాలకింపక భక్తికి మనమనస్సులఁ దావుంచ వలయును. ఆతావున నది వెలసినఁగాని యథార్థములు తోఁపక సదర్థములు తోఁచుట కవకాశముగలుగదు. కాఁబట్టి పారిజాతమును ద్వారకానగరమందే కల్పింపక దేవలోకమునుండి యేల తేఁబూనెను శ్రీకృష్ణుఁడని తెలియనిప్రశ్నములను జేయరాదు.

అనృతము నింతకుఁ బూర్వము నే నెప్పుడు చెప్పలేదు. నేఁబ్రతినతప్పినచో లోకముల ధర్మమార్గమే నశించును. లోకధర్మముల నవలంబించితిని. వానిని విడనాడరాదు. అని భగవంతుఁడు నారదమునితోఁ బల్కెను. దీనిసార మేమి? సత్యము నాస్వరూపము. దాని కెట్టిలోపము కాఁగూడదు. ఈరూపము నామములోనగువానిని వలయునని గ్రహించితిని. వానిం దగురీతి నడపవలదా. నేను భిన్నమార్గమునఁ బ్రవర్తించుచో జనులంద ఱట్లే ప్రవర్తింపఁబూనరా. అపుడు ధర్మవిప్లవము కాదా. అట్లుకాక యుండఁజేయుటకేకదా నే నవతరించినది. అని భగవంతుఁడు పల్కెను. అనఁగా లోకాచారము ననుసరించి తాను బ్రవర్తింతునని, అందిష్టానుసారము ప్రవర్తింపవీలులేదని, నేనట్లు ప్రవర్తించుచో నందఱు న న్నుదాహరణముగాఁ గైకొని యిష్టానుసారము చరింతురని, అట్లు చరించుచో లోకము లాకులములగునని, అట్లు కాఁగూడదని భగవంతుఁ డాజ్ఞాపించెననియే దీనిభావము. అనృతము పాతకమని సత్యము నాశ్రయించుట భగవంతు నాశ్రయించుటయే యని సత్యమున సకలధర్మము లిమిడియున్నవని మనము గ్రహింపవలయు. నిర్మల ధర్మమును దేని నారాధించినను భగవంతు నారాధించినట్లే యని తెలిసికొనుట మంచిది. ఇట్టి యపూర్వానేకవిషయము

లిందుఁగలవు. వీని నింకను గలవాని నాలోచింపుఁడు. భగవన్మ హిమమును శక్తికొలఁది నెఱుంగఁ బ్రయత్నింపుఁడు. కపట వేదాంతులదుష్టాలాపములకు శ్రవణరంధ్రములందుఁ జోటీయ కుఁడు. ఏపురాణము చదివినను భక్తిజ్ఞానవైరాగ్యమురీతులు తెలియఁగలవు. సమగ్రముగాఁదెలియ నెవ్వరికిని శక్యము కాదు. అంతయేల ? తెలియదనుకొని భగవన్నామమును జపించిన నన్నియుఁ దెలియునట్లు చేయుపని యాసర్వేశ్వరునిది.

శ్లో."అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."
(గీత. ౯. అధ్యా.)

అన్నప్రతిజ్ఞ భగవంతునిదే కదా. ఇంకఁ దరువాతికథను వినఁబూనునట్లు మీకర్ణముల కాజ్ఞాపింపుఁడు

## ఇంద్రనారదసంవాదము.

*శ్రీహరి యిట్లు నారదమునికి స్వాభిప్రాయము నెఱిఁగించి యనుమతియీయఁగా ముని యాదంపతుల నాశీర్వదించి సుర పురికరిగి యాదితేయాధీశ్వరునిసదనమున నారాత్రి నివసించెను. ఆనగరమున సాగుచున్న మహోత్సవమును గన్నులారఁగాంచెను. ఆయుత్సవమున మహామతిమంతు లగునాదిత్యులు, వసువులు, సురలు, రాజర్షులు తమతమశుభకర్మఫలముల ననుభవింప నందుఁ జేరియున్న పుణ్యపూరుషులు, మఱియు నాగులు, యక్షులు, సిద్ధులు, చారణులు, తపోధనులగు బ్రహ్మర్షులు, దేవర్షులు గుంపు లుగాఁజేరి యం దానందము ననుభవించిరి. వీరెల్లఁ గొలువ

* ఈకథయుం హరివంశము విష్ణుపర్వమున నఱువదిలొమ్మిదవయధ్యా యానుసారముగ వ్రాయఁబడినదని యెఱుంగుఁడు.

మహాదేవుం డందుఁ బూజింపఁబడుటయే యుత్సవమని యెఱుంగవలయును. ప్రమథగణములాపరమశివుని గూడియుండెను. సుపర్ణులు, మరుద్గణములు, దక్షుఁగలదివౌకోగణములుండి యానంద మనుభవించెను. దేవర్షులు శంకరు నారాధించిరి. కల్పాంతములయందు నేశంకరురూపములకు క్షయములేదో దేవాధీశుఁడు లోనగువా రేమహాత్ముని సర్వదా యారాధింతురో ఆత్మజ్ఞులు, గర్వలేశశూన్యులు, ధర్మమార్గస్థితులు నగువారెల్ల నెవ్వనిఁ బూజింతురో యట్టిపరమానందరూపుఁడు పరమశివుఁడాయుత్సవమున నెల్లర పూజలంగొని యానందించుచుండెను. స్కందుఁడును, అగ్నిదేవుఁడు, సరిద్వరయగు గంగాదేవియుఁ, దేజోవంతుఁ డగుతుంబురుఁడును, భారినామకుండగు ప్రమథవర్యుండును, దేవతానమస్కారములకుం బాత్రులై యుండిరి. వీరినెల్ల దేవగణము లారాధించుచుండెను. ధర్మనిరతులు తపోనిరతులు సజ్జనమార్గావలంబకులు దేవతలచేఁ బూజితులయిరి. మానుషలోకమున దేవతల నెవ రెవరర్చింతురో వారినెల్ల స్వర్గపురమున దేవతలు సుఖాభివృద్ధిపొంది నారాధింతురు. ఎవరు మానవలోకమునఁ బితృదేవకార్యములయందుఁ దమకుఁగల విభవమును సమర్పింతురో వారెల్ల నందుఁ బూజింపఁబడుదురు. వేదాధ్యయనతత్పరులు నియమమును వదలక ప్రవర్తించువారు నాలోకమునఁ బూజితులే యగుదురు.

ఆశంకరోత్సవమునందు గంధర్వాధిపతియగు చిత్రరథుఁడు మహాహర్షమున దేవవాద్యముల వాయించి శంకరుకృపకుఁ బాత్రుఁ డయ్యెను. ఊర్ణాయు వనుగంధర్వుఁడు, చిత్రసేనుఁడు, హాహాహూహూ నామకగంధర్వులు, దుంబురతుంబు

రులు శంకరోత్సవమున గీతములను బాడిరి. ఊర్వశియు, విప్ర చిత్తియు, హేమారంభలు, హేమదంతయు,ఘృతాచియు,సహ జన్యయు నృత్తముసల్పి శ్రీశంకరు నారాధించిరి. ఆత్మతత్త్వము నెఱింగినశంకరుఁడు వారుచేయు పూజావిశేషముల కానం దించెను. మహేంద్రుఁడొనరించిన యాపూజోత్సవమున కానం దించి జగములకు దిక్కగు నాపరమశివుఁడు కైలాసమున కరి గెను. శంకరుఁ డరుగ నందులకై వచ్చినవారెల్లఁ దమతమ నివాసములకరిగిరి. ఆయుత్సవార్థమువచ్చిన దేవతలనెల్ల మహేం ద్రుఁడు బహూకరింప వారు తమతమస్థానములకుఁ బోయిరి. ఉత్సవానంతరము వచ్చినవారినెల్లఁ దగురీతి సన్మానించి వార లను సాగనంపి సుఖముగాఁ గూరుచున్న మహేంద్రుం గాంచి యతని సేవించుసదస్యులం దిలకించి చెంతకుంబోయిన నార దముని నింద్రుఁడు విధిప్రకారము సన్మానించెను. ఎదురుగాఁ బోయి తోడితెచ్చెను. కుశాజినాసనములయం దాసీనుంగావిం చెను. ఆయాసనస్థలము దేవేంద్రునిసింహాసనమునకు నుద్దిరయై యుండెను.

అంత నారదుఁ డాదేవేంద్రుని గాంచి యీరీతి బలికెనుః మహేంద్రా! నిస్సమానతేజోవిరాజితుఁడగు శ్రీమహావిష్ణు వంపినదూతయని నన్ను భావింపుము. ఆమహాత్ముఁడు నీచెంతకు నన్నొక్క చిన్నికార్యము గలిగి పంపెను. ఆమాటలు విని శత మఖుఁడు విష్ణువేమో తనకు వార్తనంపెను. వినవలయునన్న కౌతుక ముదయింపఁగా పరమాదరంబున వాని వినిపింపుఁడని ప్రశ్నించెను. నారదమునీంద్రా! పురుషోత్తముఁడు నాకు సందేశ మంపెనా. త్వరపడు నాచిత్తమునకుఁ దృప్తిచేయుము. చిరకాల

మునకు శ్రీకృష్ణుఁడు నన్ను స్మరించెను. అన నారదముని పురుషోత్తమునివాక్యములఁ జెప్పనారంభించెను. మహేంద్రా! నీయనుజుఁ డగుపంకజాక్షునిఁజూడ ద్వారకానగరమునకరిగితిని. కశ్యపాన్వయక్షీరసాగరశీతాంశుని దర్శింపంగోరి పోయి యాసర్వేశ్వరుని రైవతకపర్వతముకడదర్శించితి.అందొకరమ్యహర్మ్యమున సుఖాసనాసీనుఁడై యుండెను. *రుక్మిణిదేవి యాపురుషోత్తముని చెంత నుండెను. వృషభధ్వజుని వినుతించుచుండెను. దేవేంద్రా! పారిజాతప్రసూన మామహాత్మున కొసంగితిని. శ్రీహరిపత్ను లచ్చెరువొందుదురుగాక యనియే నే నిచ్చితిని. ఆకుసుమరాజమును గాంచి యాశ్రీహరిపత్ను లాశ్చర్యసాగరమున మునింగిరి. బహుకామముల నొసంగునని పారిజాతవృక్షరాజసముద్భవంబని వారెఱింగిరి. ఆపారిజాతకుసుమసుగుణగణముల నేను విశేషించి వర్ణించితిని. పారిజాతము కశ్యపమునితల్లఁజూచే సృజింపఁబడియెననియు, నదితికిఁ బుణ్యాభివృద్ధిపొందనది యీఁబడుటయు, నాపుష్పములదామమును నీవు శచీదేవి కిచ్చుచుంటయు నెఱింగించితిని.

ఆవార్త లాలకించి యామురారి పత్నులలో నొక్కరగు సత్యభామ యాకుసుమదామమును గోరెను. ఆమె నీసోదరునకుఁ బ్రియపత్ని. ఆకాంతామణి తన్నభ్యర్థింప నామురారి కడుంగడు ముదంబంది ప్రతినపట్టెను. బలవంతులలో మిగుల బలవంతుఁడగు నామురారి నన్నుం గాంచి యిట్లు పలికెను. ఆపలుకుల వదలక పలికెద. ఆలకింపుము. కృష్ణమూర్తి నీకనుజన్ముఁడు కావున నీకు నమస్కరించెను. మహేంద్రా! తరు

* రుక్మిణీసహితం వీరం స్తువంతం వృషభధ్వజమ్. అని మూలము.

వరమనందగు పారిజాతమునుబంపుము. నీపత్నికది మనోరథప్రదమగునుగాక. విశేషించి నీపత్ని కాతరువరము ధర్మకృత్యముననుపయోగించును. దానివలనఁ గలుగుపరమ కల్యాణము మానవలోకమునకుం గలుగవలయుఁగదా. నీవు త్రిలోకాధిపతివి కదా. మానవులు నామూలమున దేవతాకల్యాణముల దానినుండి చూడఁగలరు. ఇదియ శ్రీకృష్ణ వాక్యములు. అనిపలికి నారదమునిలలాముఁ డూరకుండెను. నారదముఖమునుండి వాసుదేవుని భాషణముల నాలకించి యిట్లు బదులు చెప్పెను. మునీంద్రా! ఆసనము నలంకరింపుము. మంచివాక్యము తెల్పితివి. ప్రతిసందేశమును బలికెద. దానిని విష్ణువున కెఱింగింపుము. అని తాను లేచియున్నవాఁడు కాన నిజాసనమునఁ గూరుచుండి తనబలమును నమ్మి మహాహర్షమునఁ దేలియాడుచు నిట్లు పలికెను. నారదా! మునీంద్రా! తొలుదొలుత శ్రీహరికుశల మడుగుము. పిదప నిట్లు పలుకుము. ఆపలుకు సర్వభూతసుఖావహము. కావున నేఁ జెప్పినట్లే పలుకుము.

శ్రీకృష్ణా! నాయనంతరము నీవే త్రిజగంబులఁ బాలింపఁగలవాఁడవు. ఇందులకు శంకలు లేవు. ఈపారిజాతము, ఇతర రత్నావళులు నీవే యగును. భూభారమును హరింప మర్త్యలోకమునకరిగితివి మానుషకార్యములనెల్లనెఱవేర్పవలయును. ఆభారము నీపై నున్నది. ప్రతిజ్ఞ నెఱవేర్చి మరలఁ ద్రివిష్టపమునకు రాఁగా నీకాంతామణివాంఛితములనెల్లనెఱవేర్తును. స్వర్గార్హరత్నసంతతులను మర్త్యలోకమునకుం గొనిపోవఁదగదు. స్వల్పకార్యార్థ మిట్టిస్వర్గార్హ పదార్థములను మర్త్యలోకమునకుం జేర్పరాదని నియమము కలదు. దైవమర్యాద నతిక్ర

మించి ప్రవర్తించినచోఁ బ్రజానాథులునన్నే మందురు? లోకముల యందు శాశ్వతములుగా నుండఁదగు ధర్మములను బ్రహ్మయుఁ దత్పుత్త్రులుఁ దత్పౌత్త్రులును నియమించిరి. ఆబ్రహ్మ శాసనమును మీఱి ప్రవర్తించు నావార్త నాలకించి ధర్మమార్గోల్లంఘన మొనరించె నన్న కోపమున నన్ను శపించును. మనమే ధర్మసేతువు నుల్లంఘించితిమేని దైత్యులు నతిక్రమింతురు. వారికించుకయు శంకయే కలుగదు. ఒకయాఁడుదాని తృప్తి సేయఁ బోయె నీస్వర్గమునుండి పారిజాతముం గొనిపోయినచో సురలోకవాసు లవమానపరితప్తు లగుదురు. మానవుల కుపభోగ పదార్థములు బ్రహ్మచే నిర్మింపఁబడినవి. ఓసహోదరా! వారు వానిచేఁ దృప్తులగుదురుగాక. కాలపర్యయమున కెదురుచూచుచునుండి యిచ్చటికివచ్చి యిందలిసుఖముల ననుభవింతురుగాక. ఇందు నాకొఱకుగా నేర్పఱుపఁబడిన భోగము లిచ్చటఁ జేరిన పిదప నీవు ననుభవింతువుగాక. అట్లుగాకిప్పుడే వలయునన్నచో స్త్రీకి లోఁబడియెను శ్రీకృష్ణుఁ డన్నయపవాదము కల్గకపోదు. నే నొకవేళ నాపారిజాతము నంపిన నిర్మల శ్రీకృష్ణకీర్తికిఁ గళంకము గల్గించినవాఁడ నగుదును. మానుషలోకమున మనుజార్హభోగములఁ బొందు శ్రీకృష్ణుఁ డిట్లు కోరుట జ్యేష్ఠసోదరుల నిర్బంధించినట్లే యగును. స్వర్గలోకార్హరత్నములోపించినచో నాకుఁ దిరస్కారమగును. ఆయవమతి సోదరుని మూలమునఁ గలిగిన విశేషించి సంతాపహేతువగును. ధర్మార్థ కామములను యథాక్రమముగా బ్రహ్మయాజ్ఞానుసారముగనే యనుభవించుట నీతి. ఇది సాధువిహితమార్గము. భూలోకమున కీపారిజాతము నర్పింతునేని శచీదేవి మొదలుకొని యెవ్వరును నన్ను

మన్నింపరు. ఇంతియగాదు. ఈపారిజాతమును స్వర్గమునుండి భూతలమునకుఁ జేర్చినచో స్వర్గఫలముల మర్త్యలోకముననే యనుభవించుచు స్వర్గమునకు రాఁగోరరనుట నిక్కము. నారద మునీ ! ఈపారిజాతమహీరుహావరగుణవిశేషముల మానవు లెఱుంగుదురేని యిఁక దేవతలు మానవులకంటె నధికులనుట కేమి హేతువు కలదు.

మర్త్యలోకమున నొనరించు కర్మములఫలముల మానవులీలోకమున ననుభవింతురు. పారిజాత మాలోకముననే యుండినచో స్వర్గలోకసుఖమును గోరి సత్కర్మముల నెవ్వరు నాచరింపరు. సర్వరత్నవరమగు నీపారిజాతతరువు మర్త్యమున నుండిన దేవతాసము లగుమానవు లుండుటచే నదియే స్వర్గమ గును. స్వర్గఫల మందేకలుగుట మానవులు యాగములు చేయఁ బూనరు. పూర్తములను సత్కర్మములను మానవులు దేవసమా నులగుట చేయరు. యజ్ఞములు, జపములు, ఆహ్నికములు నను సత్కర్మము లాచరించి మానవులు మమ్ము సంతృప్తులనుగాఁ జేయుదురు. ఎందులకు ? స్వర్గవాసమును గోరియే. శ్రద్ధగాఁ గష్టముల కోర్చియే యాచరింతురు. వానినెల్ల నీపారిజాతము వారికి దొరకినచో నేలచేయుదురు.? అవ్వృత్తు రాజమే లేకయున్న మేమెల్ల నిస్తేజస్కుల మగుదుము. ఉత్తమరత్నవిహీనుల మగు దుము. మానవులు దానయజ్ఞతపః ప్రభృతి సత్కర్మములమమ్ము సంతృప్తులఁజేయుచు మే మొసంగు సువృష్టిచే సస్యములు ఫలిం పఁగా వాని ననుభవింతురు. ఆకలియు డప్పియు మానవుల బాధింపవేని వారేల సస్యములఁ గోరి మ మ్మారాధింతురు ? రోగము జరామరణములు ధర్మజ్ఞరతియు దార్గంధ్యము ఘో

రాకారములగు నీతిబాధలు పారిజాతగుణము నెఱింగినవారల నెట్లు బాధించును? సర్వప్రకారములచేతను బారిజాతప్రసూనమును బంపుట తగినదికాదు. అని నారదమునీంద్రా! శ్రీకృష్ణునకుం దెల్పుము. మహావిష్ణు వితరులకుఁ గష్టములఁ గల్పించు కార్యముల నొనరించువాఁడుకాఁడు. మునిచంద్రా! నాసోదరుఁ డేయేపద్ధతులఁ బల్కిన సంతోషించునో యారీతి నాలోచించి యదనునకుం దగినట్లు మాటలాడి కార్యము సఫలముగా సాగింపుము. నాయందుఁగలప్రీతిని సార్థకముగాఁ జేయుము. మునీశ్వరా! ఇందుఁగల మణిహారములు, విలువగలరత్నములు, చందనము లగరువస్తువులు,విచిత్రవస్తువులు నామఱఁదలి తృప్త్యర్థము తీసికొనిపొమ్ము. మనుష్యులకర్హములగు నేయేవస్తువులు వలయునని శ్రీకృష్ణుఁడు కోరునో వానినెల్లఁ బంపెదను. స్వర్గరత్నమగుపారిజాతమును గొనిపోవకుండఁ జేయుము. కోరిన రత్నముల నొసంగెదను. దేవతాప్రియమగు నీపారిజాతము నెట్టులైన నీఁజాలను. అని పలికి యూరకుండెను

మహాశయులారా! ఈకథయందుఁ గలవిశేషము లంతగా వ్రాయఁదగినవికావు మహేంద్రునికపటమును వెల్లడిచేయుచున్నవియే. ఇంద్రునకు స్వకార్యధురంధరత్వము సహజగుణము. ఉపకారము మఱచుటయు స్వభావము. ఆతనిపుట్టుక దొట్టి యాగుణము కలదు. నరకాసురుని జంపఁ బురికొలిపినపుడు చూపిన సౌహార్దము పారిజాతమును బంపుమన్నపుడు చూపక పోయెను. ఆమాటకేమిగాని యొక్కవిశేష మీకథనుండి తెలుపవలయును.

"రుక్మిణీసహితం వీరం స్తువంతం వృషభధ్వజమ్."

అని నారదుఁడు పల్కెను. నారదుఁడు శ్రీకృష్ణదర్శనమునకుం బోయినపుడు రుక్మిణీసహితుఁడై శ్రీకృష్ణపరమాత్మ శంకరుని స్తుతించుచుండెనని హరివంశము చాటుచున్నది. అనఁగా శంకరుని ధ్యానించుచుం గృష్ణుఁ డుండెననికదా దీని భావము. శంకరుఁడు రామనామమును జపించుననియుఁ గనంబడియెడిని. పురాణము లిట్లు పల్కుచున్నవి. శంకరుఁడు రామనామమును జపించెననఁగా నంగీకరించి శ్రీహరి శివనామము జపించెననఁగా నంగీకరింపనివారు కలరు. హరివంశము ప్రమాణమని వా రంగీకరింతురు. అం దీశ్లోకము నంగీకరింపమందురు కాఁబోలు. ఈభేదము తత్త్వవేత్తలకుండదనుటసత్యము. వారిరువురకు భేదమే లేదు. పరస్పరము ధ్యానించుటఁ దన్నుఁదాను దలంచుట యని గ్రహింపవలయును. ధ్యానింపఁదగిన యితర వస్తువు వారికి లేదు. కావున శివకేశవులు పరస్పరము ధ్యానించుకొనుచుందురు. మనకుఁగల భేదజ్ఞానము వారికుండుటన వీలు లేదు. తత్త్వ మూరయ వారిరువు రొక్కపరబ్రహ్మాంశముగలవారే. కార్యాంతరములందీర్వ రెండురూపములుగాఁ గనఁబడుచున్నారు.

"శ్రుతి. ఏకో నారాయణః,
శ్రుతి. ఏకశ్చైవ రుద్రో న ద్వితీయాయతస్థే."

అని యిట్లు శ్రుతి రెండురూపములను దెల్పుచున్నది. ఇట్టిచోట శివుఁడన్న నదరిపడవలసినంతపని యేమో నాకుం దోఁపకున్నది. ఎవ్వరేమన్నను సకలశ్రుతులు సకలపురాణేతిహాసములు శివకేశవుల కభేదమును దెల్పుచుంట నిక్కము. వాని నంగీకరింపకున్నచో వారి నేమనవచ్చును. వారియిచ్ఛరీతి

గనే యొక్క దైవమును ధ్యానింపవచ్చును. కాని పరులయుపాస్యదేవతల నిందింపకున్నఁజాలును. అదియే యజ్ఞదానతపస్సుల నొనరించినపుణ్యము వారికింగల్గించును. కావునఁ దమదేవతను బ్రార్థించి విశ్వసించుచు నితరు లక్లేశపేయుదురుగదాయనిమాత్ర మాలోచించిన నట్టిపాపమున కొడిగట్టరని నమ్ముచున్నాను. భగవద్భక్తిగలవారెల్ల నిట్టియకార్యమును జేయకుందురుగాక. అట్టియుత్తమమార్గము నవలంబించి భగవత్కరుణకుం బాత్రులు కావలయునని కోరుచున్నాఁడను. ఇంకఁ దర్వాతిగాథ నవధరింపుఁడు.

## నారదుఁ డింద్రునకు హితము చెప్పుట.

* దేవాధిపతి యిట్లు పలుకఁగా విని వాక్యముల తెఱంగెఱింగిననారదముని ధర్మమతి గావున నిట్లు శతక్రతువుతో సంభాషించెను. బలనిషూదనా! ప్రీతిగలవానికి హిత మవశ్యముపదేశింపవలయును నీయందు నా కత్యంతవిశ్వాసము కలదు. జనార్దనునకు నీమత మెఱింగి నేను జెప్పఁదగురీతిఁ జెప్పెదను. ఈపారిజాతమును ము న్నీశ్వరుఁ డడిగినను నీవియ్యకపోతివి. శ్రీహరితో ననేకహేతువులను జెప్పితిని. లక్ష్యలక్షణపురస్సరంబుగా వచియించితిని. ఇంచుకంతయు నామాటల నంగీకరించిన భావమును గనఁబడఁజేయలేదు. ఇది సత్యము. నే నుపేంద్రుఁడను. తదనుజాతుఁడను. ఇంద్రునిచే లాలింపఁదగినవాఁడను. అని పుండరీకాక్షుఁడు బదులుచెప్పెను. మరల మరలఁ బారిజాతము కోరకుండుటకుఁ దగినకారణము లెన్నియో తెల్పితిని.

* ఈకథయుం, విష్ణుపర్వము డెబ్బదియవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వానిచేఁ గృష్ణునియూహ యించుకంతయేని మార్పనొంద దయ్యె. తుట్టతుదకు మధుసూదనుఁ డొక్కమాట రోషతా మ్రాక్షుఁడై పలికెను. దేవదానవగంధర్వాదు లెవ్వరేని నా ప్రతిజ్ఞను మరలింపఁజాలరు. నారదా! నీకు మేలగుఁగాక. నీమాటచొప్పున నింద్రుఁడు పారిజాతవృక్షమును నాకొసంగఁ డేని నాగదాయుధ మాతనివక్షమున వ్రాలఁగలదు. అనునదియే యాతని చివరమాట. మహేంద్రా! హరి నీకు ననుజుఁడు. ఆతనిశక్తి నెఱుంగుదువు. చక్కఁగా నాలోచించి యేమిచేయఁ దగునో యట్లొనర్పుము.

నే నొక్కవాక్యము నుపదేశించెద. అది సత్యము, హితము నై యుండును. నీమేలు గోరియే చెప్పెదను. పారిజాత మును ద్వారకానగరమునకుఁ బంపుటయే నీకు క్షేమమని నాకుఁ దోఁచెడిని. అని నారదుఁడు పలుకఁగా సువ్యక్తమగు నాతని భావము నెఱింగి శతక్రతువు రోషకషాయిత సహస్రాక్షుఁడై యిట్లుపలికెను. అనపరాధినయి జ్యేష్ఠసోదరుఁడనగు నాయందుఁ గేశవుఁ డిట్లు తగనివిధమునఁ బ్రవర్తింపఁబూనునేని చేయఁదగిన దేమియుండును? ఆకృష్ణుఁడు నాకు మేలుకలుగనికార్యములు పెక్కు లింతకుమున్నే యొనరించెను. సోదరుఁ డనియేకదా వానినెల్ల నోర్చుకొంటిని. ఖాండవవనమును దహించుకాలమున నర్జునునకు సారథియై నే నంపినమేఘములఁగూడ లెక్కింపక కాల్చెను. గోవర్ధనము నెత్తినపుడు నాకెంతయో యపకారము కల్గినది. మున్ను వృత్రాసురుని వధింపఁబోవుచు నేను దోడ్పడు మని ప్రార్థించితిని. నేను సర్వభూతసముఁడను. కావుననే రాఁ జాలనని పల్కెను. అత్తఱి నాబాహుబలమునే నమ్మి యుద్ధ

మొనరించి వానిని వధించితిని. పెక్కుతడవలు దేవాసురులకు ఘోరసంగ్రామములు తొడరఁగా విష్ణువు తనయిష్టానుసారము సంగరమొనరించెనుగాని నాయనుమతిం గొనఁడయ్యెను. ఇది నీ వెఱుంగుదువు కదా. పెక్కుమాటలేల ? నారదా! ఆయన యిచ్ఛానుసారము ప్రవర్తించుఁగాక. జ్ఞాతిభేదము నేఁజేయ రాదు. ఇందులకు నీవే సాక్షివి. నా పేరురమున గదాయుధ మును వైవ నాకేశవుఁ డుద్యమించునేని పౌలోమినిగూర్చిన యశుభము వినఁబడునని యేకదా లోకు లూహింతురు. నాతండ్రి కశ్యపుఁడు పత్ని యగునదితింగూడి యుదవాసగతుండై యున్న వాఁడు. వారియిచ్ఛానుసారము ప్రవర్తించువాఁడను. వా రిట్లు పలికిరి. తనయా! నీసోదరుఁడగు శ్రీకృష్ణుఁడు జితేంద్రియుఁడు గాక రజస్తమోగుణములకులోఁబడి కాముకుఁడై స్త్రీవాక్యాను సారము ప్రవర్తించుచున్నవాఁడు అనిరి. స్త్రీలనేమని నిందింప వచ్చును? ఎంతమోఱకుఁదనము వారికింగలదు ? రాజసమతి యెంత నీచమయినది ? ఆడుదానిమాటలకు లోఁబడి నన్నిట్లు నాసోదరుఁ డధిక్షేపించెనుగదా. ఇస్సీ! ఇంతకుమును పీకశ్యప వంశమున నిట్టి యపకీర్తి యెవ్వనికిని గలుగలేదు. మాతల్లి పుట్టినయిల్లు దక్షునివంశముకదా. అందు నిట్టి యపకీర్తి కలుగ లేదు. పెద్దవాఁడననికాని, దేవతాపూజితంబగు త్రిలోకాధి పత్యముకలదనికాని, యోజింపక కామరాగాభిభూతుఁడై శ్రీకృ ష్ణుఁడు నన్నుఁ దిరస్కరించెనుగదా. ఇంకేమనవచ్చును? మున్ను బ్రహ్మ నాతో మాటలాడుచుఁ బుత్త్రదారసహస్రములంగూడి సదవృత్తుఁడై జ్ఞానసంపన్నుఁడై నీసోదరుఁ డుండునని పల్కెను. లోకమున భాతృసమానబంధువింకొక్కఁడు లేఁడు. అని నాతల్లి

మున్ను పల్కెను. కశ్యపప్రజాపతియు నిట్లే చెప్పెను. సోదరు లందుఁగల గొప్పతనముకూడ నాతండ్రి నాకుం దెల్పెను. ఆగర్వమున నేను దానవులతో విరోధించితిని. వారు సదా పాప నిశ్చయులు. అట్టివారితో నే నీగర్వమ్మున విరోధము కల్గించు కొంటిని. ఒక్కరహస్యము కలదు. దాని నింతకుము న్నెన్నఁడు చెప్ప లేదు. అవసరముగావున వచించెదను.

మున్నొకఘోరాహవమున ధనుర్జ్యావల్లి ఛిన్నముకాఁ గా దానిచే విష్ణుశిరస్సు తెగిపోయెను. మొండెము నేను నిలిపి రక్షించితిని. రుద్రతేజస్సునఁ దెగినశిరస్సును మరల సంధించి తిమి. ఆ త్తఱి నమరులలో నేనే యుత్తముఁడనని హరి పలికెను. ధనుస్సెక్కుపెట్టి ధీరుఁడువలె నిలువంబడియెను. నాతల్లియుఁ దండ్రియు నేమేనందురని ముకుందు నందు స్నేహము నిలిపి యున్నాఁడను. అనుజాతుఁ డన్నప్రేమమునఁ గృష్ణుని జూచుచు న్నాఁడను. యుద్ధములయందుఁ దొలుతొలుతఁ దాను నిలువం బడి మార్కొనిపోరాడవలసినదికదా ధర్మము. నేను బ్రభు వు నే నైనను ముందునిలిచి మార్కొనుచుందును. నాతమ్ముని రక్షించుటకొంటె నిట్లు చేయుచుందును. నాశరీరమే యాతఁ డని నాతాత్పర్యము. నాయందు భక్తిగలవాఁడని నే నిన్నివిధ ముల రక్షించుచుండఁగాఁ దత్ఫలముగా నీతరుణమున నాయిం టికే కీడుమాడఁజేయ నారంభించెను. ఈలోకము సర్వలోక ములలో నుత్తమము. అవమానము వెనుకఁద్రోసి యీతని ద్రోహములఁ గప్పిపుచ్చితిని. చిన్నవాఁడు కావున లాలింపఁ దగినవాఁడనియే యింతకాల మోర్చుకొంటిని. నాకంటె బాలుఁ డని, పుత్త్రతుల్యుఁడని, నాతరువాతఁ బుట్టినవాఁడని, యిన్ని

కారణములచేత నీతని యపరాధముల లెక్కపెట్టకుంటిని. తల్లి దండ్రు లీతఁడు గర్వి యని చెప్పుచుందువారు. అందలిజను లకుఁ గేశవుఁ డిష్టుఁడే కావచ్చును. మేము ద్వేష్యులమే కావ చ్చును. స్నేహ మిట్టి ఫలముల నాకుం గల్గించెను. సర్వజ్ఞుఁడని బలవంతుఁడని శూరుఁడని పాత్రుల సన్మానించువాఁడని నీవు తలంపుము. నారదా! ఇఁకఁ జాలును. పొమ్ము. నామాటలుగా నతనితో నిట్లు పల్కుము. శత్రులు సమరము చేయ రమ్మనిపిలు వఁగా రాననిపలుకుట న్యాయసమ్మతము కాదు. కృష్ణా! నీకేది మదికి రుచించిన నట్లు చేయుము. ఇష్టమున్నచో రమ్ము. అనుభ వింపఁదగుఫలము ననుభవింతువు. భార్యాజితుఁడా! తొలుదొ లుత నీవే నన్నుఁ గొట్టుము. చక్రము చేనొండె, శార్ఙ్గమున నొండె. గదచేనొండె, నందకముననొండె, గరుడవాహనారూ ఢుఁడవై తొలుత నీకిష్టమున్న నన్నుఁ బ్రహరింపుము. నీచేఁ గొట్టఁబడి పిదప శక్తియున్న నిన్నుఁ బ్రహరింతును. ఔరా! నాస్నేహమే నాకెట్టియుపకారమొనర్చినది? విక్లబమును గల్పిం చెను. యుద్ధరంగమునఁ జక్రపాణిచే నోడింపఁబడక ముందుగఁ బారిజాతతరువరము నీఁజాలను. తమ్ముఁడు జ్యేష్ఠసోదరుఁడనగు నన్ను యుద్ధమున కాహ్వానించుచున్నాఁడుకదా. తపోధనా! నారదా! ఆడుదానికి లోఁబడినహరిని నేనెట్లు క్షమింతును.? మహాత్మా! నారదా! ఇప్పుడే ద్వారకానగరమున కరుగుము. అది శ్రీకృష్ణపాలితము కదా. అజ్ఞుఁడు వివాదమును గోరునని పల్కుము. నీచే నోడింపఁబడకముం దొక్కయాకులో సగమైన పారిజాతసంబంధము నీకు లభింపదని నమ్ముము. అని నామాట లుగా మధుసూదనునకుం దెల్పుము. నాయీమాటలు మఱువ

కుము అనుమానింపక నాయీమాట లటఁబల్కుట నాకెంత యుఁ బ్రియముకా నున్నదున్న యట్లు పల్కుము. మోసముచే నీవృత్తి రాజము కొనిపోవ శక్యముకాదనుము. యుద్ధమే సాగ నిమ్మనుము. మోస మింతటిపాటునకుఁ దెచ్చినదా యనుము. అనిపలికి మహేంద్రుఁ డూరకుండెను.

## స్వర్గవార్తలం దెలుప నారదుఁడు ద్వారకకు వచ్చుట.

*ఇంద్రునివచనములనాకర్ణించి వాగ్విదులలో నుత్తముఁ డగు నారదముని దేవతాధీశుని సభనుండి రహస్యప్రదేశము నకుం గొనిపోయి యిట్లుపలికెను. రాజులకు సర్వదా హితవచన ములనే చెప్పవలయును కాని సమయము క్రూరముగా మాఱి యున్నతఱి వారికి నప్రియమైనను హితమునే సజ్జనుఁడు చెప్ప వలయును. చక్కఁగా లోకనీతి నెఱింగిన నీతిశాస్త్రపండితుఁడు వినువాని కేదిహితమో యది వానికిఁ జెడుగును గల్గించుచు న్నను దుర్బుద్ధియై పలుకరాదని పండితులు పలుకుదురు. కార్యా కార్యముల నన్ను నీవు ప్రశ్నించితివి. కావున వచించెదను. అది హితమని మదికిం దోఁచెనేని పరిగ్రహింపుము మిత్రుఁడు తన్ను డుగకున్నను మేలుకలుగు నాలోచనము వచింపవలయును. న్యాయసమ్మతమును సంభవించు నాపదనుగుఱించి యతనిపరాభ వమున కిష్టపడక చెప్పవలయును. సాధుమతులు ఎదుటివాని కప్రియముగా నున్నను వానికి దాన మేలుగలుగునట్టి హిత ముపదేశింపవలయును. అట్లైనఁగాని మైత్రి ఋణము పోవ దని విద్వద్వతంసులు పల్కిరి. ధర్మభగ్న మగుకాలమందును

* ఈకథయం హరివంశవిష్ణుపర్వమునఁగల డెబ్బదియొకటవయధ్యా యమునుండి సంగ్రహింపఁబడినది.

అసత్యవృద్ధియందును, తన్ను సేవించువాని కప్రియముగనున్నను సత్యము ధర్మము నగునట్లు మాటలాడవలయును. శ్రోతకు నష్టముకలుగుతతేఁ బ్రియము హితమునగు పల్కైనను దానిం జెప్పరాదు. అని సజ్జనులభావము. దేవాధిపా! సర్వథా నీకు మేలొనఁగూర్చుమాటను వినుము. హితశ్రోతలలో నీవుత్తమోత్తముఁడవుకదా. వినినపిదప నావాక్యము నీకు శ్రేయస్కరము గావున దానిననుసరించి ప్రవర్తింపుము.

సహోదరులకుఁ బరస్పరభేదముకలుగుట మిత్రులకు మనస్పర్ధలు కలుగుటయు శత్రువుల కానందమును గలుగఁజేయునవగును. ఇందులకు సందియములేదు. హితను మైత్రినిబాటించునదియు నగువచనము నెఱుంగవలయును. విపరీతఫలప్రదమగు మాటను బుద్ధిమంతులు దూరముగాఁ ద్రోసిపుచ్చవలయును. వెనుక సంతాపమును గల్గించుకార్య మిపుడు నీచే నారంభింపబడినది. అట్టిదాని నారంభించుట బుద్ధిమంతుల లక్షణము కాదు. ఈకార్యము పరిణామకాలమందు శుభమును గల్గింపఁజాలదు. ఏలయందు వేని కారణము విన్నవింతు. ఆలకింపుము. జగత్కారణము మహావిష్ణువు. ప్రకృతికంటె నుత్కృష్టునిగా నెవని మహాత్ములుపల్కుదురో క్షేత్రజ్ఞునిగా నెవనిఁబిలుతురో ఆవిష్ణువే యీ శ్రీకృష్ణుఁడని యెఱుంగుము. ఆయవ్యక్తమూర్తియొక్కభాగమొక్కఁడే యీజగత్తని తెలియుము. ఆమహావిష్ణువునాత్మపరమము. *ప్రకృతి ప్రథమభాగమే ఉమానామమునఁ బ్రఖ్యాతింగాంచి శంకరునంతికమున వెలసినది. వ్యక్తరూపుఁ డగు

* ప్రకృత్యాగ ప్రథమోభాగ ఉమాదేవీ యశస్వినీ, వ్యక్తస్సర్వమయో విశ్వస్త్రీసంజ్ఞో లోకభావనః. రుక్మిణ్యా ద్యాస్త్రియస్తస్యా వ్యక్తస్య

పరమాత్మయే స్త్రీసంజ్ఞ నంది ప్రకృతి యనంబడును. అవ్యక్త రూప పరమాత్మ ప్రథమగుణమే రుక్మిణీప్రభృతి స్త్రీలుగా నయిరని తెలియవలయును. ప్రకృతి యవ్యయురాలు దేవియు ననంబడు. గుణి మహేశ్వరుఁడు దేవుఁ డనంబడు. కావున నమరాధిపా! శంకరునకు విష్ణువునకు విశేష మేమియులేదు. ఇద్దఱు నొక్కరూపమే. శంకరుఁడు గుణియు నవ్యయుఁడు శాస్తయు నగు మహాతేజుఁడగు. విష్ణువు సర్వకర్త. లోకరక్షకుఁడునగు. మహేశ్వరుఁడు భోక్తయనంబడు. విష్ణువు జగత్కర్తయనంబడు. పరమేశ్వరుఁడు బ్రహ్మాదిదేవతలను బిదప సృజించెను. మహాదేవుఁడు ప్రజాపతి గణమును సృజించెను. ఇట్లు పురాణ పురుషుఁడు విష్ణువని దేవతలలో నగ్రగణ్యుఁడని కీర్తింపబడును. ఆతనిమహిమ మచింత్యము. అప్రమేయము. గుణాతీతము. అదితి తపస్సొనరించి శ్రీమహావిష్ణువు నారాధించెను. వర మడుగుమని శ్రీహరి పల్కెను. పరితుష్టుఁడగుమహావిష్ణు విట్లుపల్కఁగా నదితి నీవంటికొడుకు నిమ్మాయని కోరెను. విష్ణు వాత న్విటో నమ్మా! నాకంటె నుత్తముఁడగు పురుషుఁ డీలోకజాలముల లేఁడు. ఒక యంశముతో నీకడుపునఁ బుట్టెదను. అని వరమిచ్చి యంతర్హితుండయ్యెను.

ఆమహావిష్ణువే యదితికడుపున నవతరించెను. మహాతేజుఁడగు నారాయణమూర్తియే యుపేంద్రుఁ డనంబరఁగు. వలయుననియే శ్రీహరి కాశ్యపుఁడనం బ్రఖ్యాతిం గాంచెను. భూతభవ్యభవుండగు నాపరాత్పరుఁడే యాయాయిరీతులఁ

---

ప్రథమోగుణః, అవ్యయా ప్రకృతిర్దేవీ గుణీ దేవో మహేశ్వరః. నవిశేషోఽస్య రుద్రస్య విష్ణోశ్చామరసత్తమ ౧౭ = అని మూలము.

గార్యములఁ దీర్చుచుండును. జగద్ధితమును గోరియే యిపుడు మర్త్యలోకమున నవతరించెను. మనోహరరూపమున వెలసిన యాశ్రీకృష్ణుఁడు సృష్టిస్థితి సంహారముల నొనరించును. మాంస పిండము స్నేహముచే వ్యాప్తమగు నట్లు జగద్వ్రజమెల్ల నా పరాత్పరునిచే వ్యాప్తమైనది. బ్రహ్మణ్యదేవుఁడు శ్రీహరి యా యాయిభావముల నాశ్రయించి వికారమును గల్పించును. కావున శ్రీహరి సర్వదేవతలకుఁ బూజ్యుఁడగు. ప్రజాసర్గకరుఁ డగువాఁ డతఁడే. ఆ యనంతుఁడే భూభారమును దీర్పఁగోరి ధర్మమును భరింపఁగోరి యవతరించి తనపనిచేయుచున్నాఁడు. వేదవేత్తలెల్ల నతని యజ్ఞమని వినుతింతురు. కృతయుగమున శ్వేతవర్ణుఁడై, త్రేతాయుగమున రక్తవర్ణుఁడై ద్వాపరమునఁ బీతవర్ణుఁడై కలియుగమున గృష్ణవర్ణుఁడై యుండును. దివ్యరూప ధారియై హిరణ్యాక్షుని వధించెనుగదా. జలములనుమునుఁగు చున్న భూమి నుద్ధరించిన దీ శ్రీహరియేకదా. జగత్తుమేలుకోరి వారాహరూపమును ధరింపలేదా. నరసింహాకృతిం దాల్చి హిర ణ్యకశిపుని వధించిన దీ శ్రీనారాయణ మూర్తియేకదా. వామ నరూపమును ధరించి భూమిని జయించి నీకొసంగిన దీ హరియే కాదే. పన్నగబంధనముల బలిచక్రవర్తిని గట్టినదీ విష్ణువు కాదా దానవులు దేవతలు పాలకడలిం ద్రచ్చుచుండఁగా నందుఁబుట్టిన శ్రీదేవిని మరలించిన దెవరు? నీకు శత్రువులగు దానవుల దునిమిన దెవరు? నీప్రియార్థమై ఘోరాహవ[illegible] దనుజ[illegible]జంపిన దెవరు? రామావతారమున రా[illegible]ం డయి ద్విరదుని వధించెను.

యిపుడును మర్త్యలోక

డగు నుపేంద్రుఁడే కృష్ణుఁడని నమ్ముము. జటియుఁ గృష్ణాజిన ధరుఁడు, దండధారియు నై మహావిష్ణువు దానవులనడుమఁ దిరుగుచుండఁగా నేను జూచితిని. ఏకార్ణవమగు జగంబునం దిరుగుచు లోకహితమును గోరి గోవిందుఁ డసురుల వధించెను. నీపారిజాతమును దప్పక ద్వారకానగరమును జేర్చును. నాయీమాట యనృతము కాదని నమ్ముము. సోదరస్నేహాభిభూతుఁడవై యతని మాఱొకండు వేని జ్యేష్ఠుఁడవగు నిన్నామహాత్ముఁడు ప్రహరింపఁడు. ఎట్లో నామాట హితమని యాలకింతువేని నీమేలు గోరుమంత్రులం బిలిచి యడుగుము.

అని నారదుఁడు పలుకఁ నాలకించి దేవేంద్రుఁ డామునిచంద్రునితో నిట్లు పల్కెను. మునీంద్రా! ఇంతటి ప్రభావము గలవానిఁగా నీవు కృష్ణునిం బ్రశంసించితివి. ఈస్తుతిని బెక్కుసారులు విన్నాఁడను. శ్రీకృష్ణుఁ డిట్టి వాఁడేయగుంగాక. పారిజాతమును మాత్రము నే నీయను. పూర్వమహాత్ముల ధర్మము ననుసరించి నేనీయనని చెప్పుచున్నాఁడను. మహాప్రభావముగల వా రిట్టియల్పకార్యమున నాగ్రహింప రనుమాటను స్మరింపుము. నేను సిద్ధముగ నున్నాఁడను. నీకు మేలు గలుగుంగాక లోకమున మహాత్ములు ఇతరుల యపరాధములను గూడ సహింతురు. జ్ఞానచక్షువులగువృద్ధు లిట్లు పలుకుదురు. ధర్మభృద్వరిష్ఠుఁ డగుకృష్ణుఁ డీ యల్పకార్యార్థమై తాసర్వజ్ఞుఁడయ్యును, జ్యేష్ఠసోదరునియెడలఁ బగపూన న్యాయము కాదని యెఱుంగకుండుట విచిత్రముగ నున్నది. నాతల్లికి నేరీతి వరమిచ్చెనో యట్లే యామెపుత్రులము తనకంటె జ్యేష్ఠులమగు మావిషయమున నోరుగలిగియుండవలయును. అట్లే తానుగోరి యుపేం

ద్రత్వ మొందినందున నన్ను నగునన్ను బహుమానముగాఁ జూడఁదగును. నాకంటెఁ బెద్దవారియందు బహుమానము నేనే నునిచితిని. అట్లే నాయం దాకృష్ణుఁడు గౌరవమునుపం దగును. మధుసూదనుఁడు తానే జ్యేష్ఠుఁడు కాఁగోరునేని యట్లేయగుఁగాక అని తనదృఢతమ మనోభావమును దేవేంద్రుఁడు నారదునకుం దెలిపి పోయిరమ్మని వదలిపెట్టెను. ధృతిమతి మంతుఁడగు నారదమునియు యాదవేంద్రపరిపాలితమగు కుశస్థలీ నామాంతరవిలసద్ద్వారకానగరమున కరిగెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు తోఁచెడిని. నిష్పక్షపాతమతులరై యవధరింపుఁడు. పక్షపాతము విషద్రుమమువంటిది. దానిం దొలుత ఛేదింపవలయును అది మరినాటియుండుదనుక మనస్సునఁ బుట్టుతలంపులు నిర్మలములుగావు. మతాభిమాన ముండవలదా యని కొందఱు నన్నే ప్రశ్నించిరి. అది వలదని చెప్పువాఁడు బుద్ధిహీనుఁడు. మతాభిమాన మనఁగా నితరుల దూషించుటకాదు. అది దుర్మతాభిమాన మగును. పరమతధర్మసహిష్ణుతయే మతాభిమాన మనునది. మతస్థాపకు లన్యమతముల దూషించిరిగదా యని ప్రశ్నించువారు కలరు. అన్యమతములఁ గలచెడుగులను శ్రుతిస్మృతి పురాణేతిహాస విరుద్ధములగునాచారముల నాక్షేపించిరనియే నాకుంగల మూఢవిశ్వాసము. పరమతముల దూషింపుఁడని యుపదేశించువాఁడు మతాచార్యుఁ డనంబడఁడు. అట్లు మతస్థాపకు లొనర్పలేదని నా కింకను విశ్వాసము గలదు. ఇంక విశేషముల నాలకింపుఁడు.

నారదముని లోభగుణమున నంతర మెఱుంగక మోఁఅకుఁదన మూని యున్న దేవేంద్రునకు హితమెఱింగింపం గోరి కొన్ని ధర్మము లుపదేశించెను. అందు ముఖ్యము భగవత్స్వరూపమును దెలుపునదియే. ప్రకృత్యతీతుఁడు భగవంతుఁడనియుఁ బ్రకృతియందు మొదటిభాగమనఁగా దొలికళ పార్వతి యనియుఁ గావున నదిగుణమనియు, శంకరుఁడు గుణియనియు, రుక్మిణీప్రభృతి కృష్ణపత్నులందఱు ప్రకృత్యంశసంజాతలనియు, శ్రీహరి గుణియనియు నదియే యెఱుంగఁదగిన విషయమనియు నీనియమము ప్రకార మాలోచింపఁగా శంకరునకుఁ గృష్ణునకుఁ భేదము లేదనియు పార్వతికిని రుక్మిణిలోనగువారిని భేదము లేదనియు రూపము వేరు కారణాంతరమున వచ్చునని యు వీరెల్లఁ బ్రకృత్యంశజనితలే యనియు, బ్రకృతిం గూడి శివకృష్ణులు తమతమయవతారఫలములను వేఱువేఱఁ జేయుచున్నారనియు వారియందు భేదబుద్ధి నునుపరాదనియు నారదోపదేశసారము. ఔరా! వైష్ణవు లిది మాదియని చెప్పుకొను హరివంశముకూడ శివకేశవాద్వైతమునే తెల్పుచున్నది. ఇఁక వారివాదమునకు గతియేది యనిన మోఁఅకుఁదనమే యనక తప్పదు. అష్టాదశపురాణములు భారతాదీతిహాసములు శివకేశవులకు భేదము కలదని తెల్పవు. ఎవ్వరికథలో వారిని హెచ్చని చెప్పుట కథాధర్మము. భక్తుఁడిర్వురను సమానభక్తితో నారాధింపవలయునా యన్న నదిసరికాదు. ఒక్కరినే మది నమ్మవలయును. "ఏకో దేవః కేశవోవా శివోవా" యన్నన్యాయమే యవలంబించి తానొక్కచోటనే భక్తి యునిచి యితరులయందు నల్పత్వబుద్ధి యునుపక సమత్వబుద్ధి నునిచి సేవించిన ముక్తి కలు

గార్యములఁ దీర్చుచుండును. జగద్ధితమును గోరియే యిపుడు మర్త్యలోకమున నవతరించెను. మనోహరరూపమున వెలసిన యాశ్రీకృష్ణుఁడు సృష్టిస్థితి సంహారముల నొనరించును. మాంస పిండము స్నేహముచే వ్యాప్తమగు నట్లు జగద్బీజ మెల్ల నా పరాత్పరునిచే వ్యాప్తమైనది. బ్రహ్మణ్యదేవుఁడు శ్రీహరి యా యాయిభావముల నాశ్రయించి వికారమును గల్పించును. కావున శ్రీహరి సర్వదేవతలకుఁ బూజ్యుఁడగు. ప్రజాసర్గకరుఁ డగువాఁ డతఁడే. ఆ యనంతుఁడే భూభారమును దీర్పఁగోరి ధర్మమును భరింపంగోరి యవతరించి తనపని చేయుచున్నాఁడు. వేదవేత్తలెల్ల నతని యజ్ఞమని వినుతింతురు. కృతయుగమున శ్వేతవర్ణుఁడై, త్రేతాయుగమున రక్తవర్ణుఁడై ద్వాపరమునఁ బీతవర్ణుఁడై కలియుగమున గృష్ణవర్ణుఁడై యుండును. దివ్యరూప ధారియై హిరణ్యాక్షుని వధించెనుగదా. జలములమునుఁగు చున్న భూమి నుద్ధరించిన దీ శ్రీహరియేకదా. జగత్తుమేలుకోరి వారాహరూపమును ధరింపలేదా. నరసింహాకృతిం దాల్చి హిర ణ్యకశిపుని వధించిన దీ శ్రీనారాయణ మూర్తియేకదా. వామ నరూపమును ధరించి భూమిని జయించి నీకొసంగిన దీ హరియే కాదే. పన్నగబంధనముల బలిచక్రవర్తిని గట్టినదీ విష్ణువు కాదా దానవులు దేవతలు పాలకడలిం ద్రచ్చుచుండగా నందుఁబుట్టిన శ్రీదేవిని మరలించిన దెవరు? నీకు శత్రువులగు దానవుల దునిమిన దెవరు? నీప్రియార్థమై ఘోరాహవమున దనుజులఁ జంపిన దెవరు? రామావతారమున రావణుం జంపెను. కామపాలుం డయి ద్వివిదుని వధించెను. లోకమునకు హితమును గోరియే యిపుడును మర్త్యలోకమున నున్న వాఁడు. సర్వభూతోత్తముఁ

డగు నుపేంద్రుఁడే కృష్ణుఁడని నమ్ముము. జటియుఁ గృష్ణాజిన ధరుఁడు, దండధారియు నై మహావిష్ణువు దానవులనడుమఁ దిరుగుచుండఁగా నేను జూచితిని. ఏకార్ణవమగు జగంబునం దిరుగుచు లోకహితమును గోరి గోవిందుఁ డసురుల వధించెను. నీపారిజాతమును దప్పక ద్వారకానగరమును జేర్చును. నాయీమాట యనృతముకాదని నమ్ముము. సోదరస్నేహాభిభూతుఁడవై యతని మార్కొందువేని జ్యేష్ఠుఁడవగు నిన్నా మహాత్ముఁడు ప్రహరింపఁడు. ఎట్లో నామాట హితమని యాలకింతువేని నీమేలు గోరుమంత్రులం బిలిచి యడుగుము.

అని నారదుఁడు పలుకఁ నాలకించి దేవేంద్రుఁ డామునిచంద్రునితో నిట్లు పల్కెను. మునీంద్రా! ఇంతటి ప్రభావము గలవానిగా నీవు కృష్ణునిం బ్రశంసించితివి. ఈస్తుతిని బెక్కుసారులు విన్నాఁడను. శ్రీకృష్ణుఁ డిట్టి వాఁడేయగుంగాక. పారిజాతమును మాత్రము నే నీయను. పూర్వమహాత్ముల ధర్మము ననుసరించి నేనీయనని చెప్పుచున్నాఁడను. మహాప్రభావముగలవా రిట్టియల్పకార్యమున నాగ్రహింప రనుమాటను స్మరింపుము. నేను సిద్ధముగ నున్నాఁడను. నీకు మేలు గలుగుంగాక లోకమున మహాత్ములు ఇతరుల యపరాధములను గూడ సహింతురు. జ్ఞానచక్షువులగువృద్ధు లిట్లు పలుకుదురు. ధర్మభృద్వరిష్ఠుఁ డగుకృష్ణుఁ డీ యల్పకార్యార్థమై తాసర్వజ్ఞుఁడయ్యును, జ్యేష్ఠసోదరునియెడలఁ బగపూన న్యాయముకాదని యెఱుంగకుండుట విచిత్రముగ నున్నది. నాతల్లికి నేరీతి వరమిచ్చెనో యట్లే యామెపుత్రులము తనకంటె జ్యేష్ఠులమగు మావిషయమున నోరుగలిగియుండవలయును. అట్లే తానుగోరి యుపేం

ద్రత్వ మొందినందున నన్న నగునన్ను బహుమానముగాఁ జూడఁదగును. నాకంటెఁ బెద్దవారియందు బహుమానము నేనే నునిచితిని. అట్లే నాయం దాకృష్ణుఁడు గౌరవమునుపం దగును. మధుసూదనుఁడు తానే జ్యేష్ఠుఁడు కాఁగోరునేని యట్లేయగుఁగాక అని తనదృఢతమ మనోభావమును దేవేంద్రుఁడు నారదునకుం దెలిపి పోయిరమ్మని వదలిపెట్టెను. ధృతిమతి మంతుఁడగు నారదమునియు యాదవేంద్రపరిపాలితమగు కుశస్థలీ నామాంతరవిలసద్ద్వారకానగరమున కరిగెను.

మహాశయులారా! ఈభాగమునఁ గొన్ని విశేషములు తోఁచెడిని. నిష్పక్షపాతమతులరై యవధరింపుఁడు. పక్షపాతము విషద్రుమమువంటిది. దానిం దొలుత ఛేదింపవలయును అది మరినాటియుండుదనుక మనస్సునఁ బుట్టుతలంపులు నిర్మలములుగావు. మతాభిమాన ముండవలదా యని కొందఱు నన్నే ప్రశ్నించిరి. అది వలదని చెప్పువాఁడు బుద్ధిహీనుఁడు. మతాభిమాన మనఁగా నితరుల దూషించుట కాదు. అది దుర్మతాభిమాన మగును. పరమతధర్మసహిష్ణుతయే మతాభిమాన మనునది. మతస్థాపకు లన్యమతముల దూషించిరిగదా యని ప్రశ్నించువారు కలరు. అన్యమతములఁ గలచెడుగులను శ్రుతిస్మృతి పురాణేతిహాస విరుద్ధములగునాచారముల నాక్షేపించిరనియే నాకుంగల మూఢవిశ్వాసము. పరమతముల దూషింపుఁడని యుపదేశించువాఁడు మతాచార్యుఁ డనంబడఁడు. అట్లు మతస్థాపకు లొనర్పలేదని నా కింకను విశ్వాసము గలదు. ఇంక విశేషముల నాలకింపుఁడు.

నారదముని లోభగుణమున నంతర మెఱుంగక మోఁఱకుఁదన మూని యున్న దేవేంద్రునకు హితమెఱింగింపం గోరి కొన్ని ధర్మము లుపదేశించెను. అందు ముఖ్యము భగవత్స్వరూపమును దెలుపునదియే. ప్రకృత్యతీతుఁడు భగవంతుఁడనియుఁ బ్రకృతియందు మొదటిభాగమనఁగా దొలికళ పార్వతియనియుఁ గావున నదిగుణమనియు, శంకరుఁడు గుణియనియు, రుక్మిణీప్రభృతి కృష్ణపత్నులందఱు ప్రకృత్యంశసంజాతలనియు, శ్రీహరి గుణియనియు నదియే యెఱుంగఁదగిన విషయమనియు నీనియమము ప్రకార మాలోచింపఁగా శంకరునకుఁ గృష్ణునకుఁ భేదము లేదనియు పార్వతికిని రుక్మిణిలోనగువారిని భేదము లేదనియు రూపము వేరు కారణాంతరమున వచ్చెననియు వీరెల్లఁ బ్రకృత్యంశజనితలే యనియు, బ్రకృతిం గూడి శివకృష్ణులు తమతమయవతారఫలములను వేఱువేఱఁ జేయుచున్నారనియు వారియందు భేదబుద్ధి నునుపరాదనియు నారదోపదేశసారము. ఔరా! వైష్ణవు లిది మూదియని చెప్పకొను హరివంశముకూడ శివకేశవాద్వైతమునే తెల్పుచున్నది. ఇఁక వారివాదమునకు గతియేది యనిన మోఁఱకుఁదనమే యనక తప్పదు. అష్టాదశపురాణములు భారతాదీతిహాసములు శివకేశవులకు భేదము కలదని తెల్పవు. ఎవ్వరికథలో వారిని హెచ్చుని చెప్పుట కథాధర్మము. భక్తుఁడిర్వురను సమానభక్తితో నారాధింపవలయునా యన్న నదిసరికాదు. ఒక్కరినే మది నమ్మవలయును. "ఏకో దేవః కేశవో వా శివో వా" యన్నన్యాయమే యవలంబించి తానొక్కచోటనే భక్తి యునిచి యితరులయందు నల్పత్వబుద్ధి యునుపక సమత్వబుద్ధి నునిచి సేవించిన ముక్తి కలు

గును. అంతియకాక భగవత్స్వరూపములలో విశేషాంశము గలవారిలో నొకరిని భక్తిం బూజించి ఆటొకరిని దూషించిన నాసర్వేశ్వరుఁడు సంతృప్తుఁ డగునా. ఆలోచించినచోఁ దేటప డియెడి ఏవిధమున నైనను భక్తియేకస్థలమున నునిచి యాదైవ మును సర్వవ్యాపకునిగా నమ్మి సేవింపవలయును. ఇదియే యిప్ప ట్టునంగల సారము. ఇంకఁ దరువాతికథను వ్రాయ లేఖిని నాజ్ఞా పించెదను.

* నారదముని యింద్రుననుమతింగొని ద్వారక కరిగి యరిందముఁడగు శ్రీమన్నారాయణమూర్తిని దర్శించెను. అత్తఱి శ్రీకృష్ణమూర్తి సత్యభామాసహితుఁడై యామె యం తఃపురమునందేయుండెను. అమహానీయుని తేజము సకలతేజం బులఁ దిరస్కరించునది. దేవలోకవార్తలనే మదిఁ జింతించుచు దృఢవ్రతుఁడై యుండెను. రాఁబోవువార్తలను మాత్ర మేయో జించుచుండెను. అత్తఱి నాకసమునుండి వచ్చుచున్న నారదుం గాంచి యెదురేగి తోడితెచ్చి విధిదృష్టమార్గమునబూజించెను. సుఖాసనాసీనుఁడై యున్న నారదుంగాంచి నవ్వుచు మధుసూద నుఁడు పారిజాతవృత్తవార్త యేమని ప్రశ్నించెను. మునియు నందు జరిగిన సంవాదమును విడువకుండ నింద్రానుజ్ఞన కెఱిం గించెను. ఆమాటల నాలకించి శ్రీహరి నారదమునితో నిట్లనియె. ధర్మవిద్వరా! రేపు స్వర్గపురిం గూర్చి ప్రయాణము సాగిం చెదను. అనిపలికి నారదమునిం గూడియే సాగరమునకుం బో యెను. అది విజనస్థలము. కావున నందుఁ గూరుచుండి నారదుని

* ఈభాగము విష్ణుపర్వము డెబ్బదిరెండవ యధ్యాయమునుండి సంగ్ర హింపఁబడినది.

జూచి మునీంద్రా! యిపుడే యమరావతికిం బోయి నేను నమ స్కరించితినని తొలుతఁ బలికి పిదప నామాటలుగా నిట్లు చెప్పుము. మహేంద్రా! యుద్ధరంగమున నాయెదుట నిల్వఁజా లవు. పారిజాతతరువును దెచ్చువిషయమున నన్ను దృఢసంకల్పు నిగా నెఱుంగుము. ఇదియ యచ్చటఁ దెల్పఁదగినమాట. అన విని నారదుఁ డంబరగమనంబున నమరావతి కరిగెను. శ్రీకృష్ణసందే శమును దేవేంద్రునకుఁ దెల్పెను. ఆవార్త నాదేవేశ్వరుఁడు బృహస్పతికిం దెల్పెను. ఆవార్త నాలకించి యాబృహస్పతి దివస్పతింగాంచి శతక్రతూ! నేను బ్రహ్మను దర్శింపఁ బోయి యుండఁగా నీవు చెడు సంకల్పమును బూనితివే ఏల? మీారి రుపురకుం గల్గిన యీాభేదము భయంకరము. నాకుం దెలుపకయే యీాకార్యమున కేల ప్రారంభించితివి? దీనికిం గారణ మేమి? కాఁగలకర్మముచే నిట్లు పురికొల్పఁబడితివా! వృత్రఘ్నా! దీనిని వారింప నెట్లును సాధ్యముకాదు. త్వరపడి యేకార్యమును జేయఁబూనరాదు. ఈకార్యము త్వరపడియే యారంభింపఁబడి నది. చులకదనము గానుండును. అన విని బృహస్పతింగాంచి యాదేవపతి యిట్లు పలికెను.

మహాత్మా! జరిగినదానికిఁ బశ్చాత్తాపపడిన లాభము లేదు. కర్తవ్య ముపదేశింపుము. అన బృహస్పతి గతానాగత ముల తత్త్వమెఱింగినవాఁడుకావున నించుక యధోముఖుండై యాలోచించి మతిమంతులలో మేటిగావున నిట్లు హిత ముపదేశించెను. దేవేంద్రా! నీకుమారుంగూడి యుద్ధప్రయ త్నము నొనరింపుము. జనార్దనునితోఁ బోరాడుము. ఏదినాయై య్యమో యట్లు ఫలము కాఁగలదు. నీకు మేలు గలుగఁ

ప్రయత్నింతును. అని పలికి యప్పుడే పయనమై క్షీరసాగరమున కరిగెను. అందుఁ దపంబొనరించు కశ్యపున కీవిధ మెఱింగించెను. ఆమాటలు విని క్రుద్ధుఁడై కశ్యపుఁడు బృహస్పతిం గాంచి యిట్లు భాషించెను. ఆర్యా! కర్మము బలవత్తరము. ఇట్లు కావలయునని విధియుండఁగా మాన్పరాదు కదా. దేవశర్మభార్యను పెండ్లి చేసికొనఁగోరి యపధ్యానము చేయఁ దద్దోషము పొడ సూపెను. ఇంద్రున కాదోషబాధ కలుగకుండవలయుననియే శాంతిచేయ నారంభించితిని. ఉపవాసము చేయుచున్నాఁడను. ఆదోషము భయంకరరీతిం బొడకట్టెడిని. కావున నే నీయదితిం గూడి యీసాగరము మధ్యభాగమునకుం బోయెదను. మేమిరువురము పరమేశ్వరుం బ్రార్థింతుము. అన విని బృహస్పతియు నాకశ్యపమహర్షిం గాంచి యిట్లు పల్కెను.

తపోధనోత్తమా! ప్రాప్తకాలమును మాన్పఁదరమా. అట్లే చేయుము. అనుటయుఁ గశ్యపుఁడు బృహస్పతిని స్వర్గపురమున కనిపి భార్యం గూడి భూతనాయకుఁ డైనరుద్రు నారాధింపఁ బోయెను. ఆక్షీరసాగరాంతర్భాగమున సౌమ్యరూపమున విలసిల్లుచు మహాత్ముఁడై వృషభధ్వజుఁడై సర్వదేవతాధితుఁడై యున్న మహాదేవునిం గాంచి వరార్థియై కశ్యపముని యిట్లు స్తుతించెను. ఆస్తుతి వేదప్రతిపాదితమై జగద్గురువగు శంకరు మహిమమునకుఁ దగియుండెను. వేదవేద్యుఁ డనియు,

---

కశ్యపకృతమహాదేవస్తుతిః.

ఉరుక్రమం విశ్వకర్మాణ మీశం జగత్స్రష్టారం ధర్మదృశ్యం వరేశం,
వసర్వం త్వాం ! ధృతిమద్ధామదివ్యం విశ్వేశ్వరం భగవంతం నమస్యే. ౧.
యో దేవానా మధిపః పాపహర్తా తు తం విశ్వం యేన జగన్మయత్వాత్,

వేదాంతగమ్యుఁడనియు, సృష్టిస్థితిసంహారముల కొక్కఁడే కర్త యనియు, యజ్ఞము యజ్ఞకర్త యజ్ఞభోక్తయు ననియు, తత్ప్రీ

---

ఆపో గర్భం యస్య శుభాం ధరిత్రీ విశ్వేశ్వరం తం శరణం ప్రపద్యే. ౨. శాలావృకాస్యేన్యోయతిరూపో నిజఘ్నే దత్తానింద్రేణ ప్రణుదోహితానామ్, విరూపాక్షం సుదర్శనం పుణ్యయోనిం విశ్వేశ్వరం శరణం యామి మూర్ధ్నా. ౩. భుంక్తే య ఏకో విభుర్జగతో విశ్వమగ్ర్యం ధామ్నాం ధామ సుకృతిత్వాన్న ధృష్యః, పుష్యాత్స మాం మనసా శాశ్వతేన సోమపానాం మరీచిపానాం పరిత్రః. ౪. అథర్వాణం సుశిరసం భూతయోనిం కృతినం వీరం దానవానాం చ బాధం, యజ్ఞైహుతిం యజ్ఞియం సంస్కృతం వై విశ్వేశ్వరం శరణం యామి దేవమ్. ౫. జగజ్జాలం వితతం యత్ర విశ్వం విశ్వాత్మానం ప్రీతిదేవం గతానాం, య ఊర్ధ్వగం రథ మాస్థాయ యాతి విశ్వేశ్వరస్సుమనా మేఽస్తు నిత్యమ్. ౬. అంతశ్చరం రోచనం చారుశాఖం మహాబలం ధర్మనేతార మీడ్యమ్, సహస్రనేత్రం శతవర్త్మాన ముగ్రం మహాదేవం విశ్వసృజం నమస్యే. ౭. శుచిం యోగం శంసనం శాంతపాపం సర్వం శంభుం శంకరం భూతనాథం, ధురంధరం గోపతిం చంద్రజిహ్వం వృషీకాణామయనం యామి మూర్ధ్నా. ౮. ఆశుక్షిశానం వృషభం రోరువాణం కృతం ధర్మం వితథం చాశువేషం, వసుంధరం సమ్మృజీకం సమం త్వాం ధృతవ్రతం శూలధరం ప్రపద్యే. ౯. అనంతవీర్యం ధృతకర్మాణ మాద్యం యజ్ఞవేషం జయతాం చాభియోజ్యం, హావిర్భుజం భువనానాం సదైవం జ్యేష్ఠం ద్విజం ధర్మభృతాం ప్రపద్యే. ౧౦. పరం గుణేభ్యః పృశ్నిగర్భస్వరూపం యశశ్శృంగం వ్యాహానం కాంతరూపం, శుద్ధాత్మానం పురుషం సత్యధామం సమ్మోహనం దుష్కృతినాం నమస్యే. ౧౧. యుక్తోంకారం స్వశిరసం చారుకర్మ దృఢవ్రతం దృఢధన్వాన మాజం, శూరం వేత్తారం ధనుషోఽస్త్రాతిరేకం పతిం పశూనాం శమనం నమస్యే. ౧౨. ఏకోరాతిదైవభూతం భవిష్యం స.

భావం బనిర్వచనీయమనియు బ్రహ్మాది దేవతలే యెఱుఁగఁజాల
రన నీకుఁ దక్కుఁగలవారి కెఱుఁగ శక్యమే కాదనియు సక
లాపత్పరిహారకుఁడనియుఁ బరమపూరుషుఁడు, వేదస్వరూ
పుఁడు, వేదమయుఁడు నగుననియు నీస్తుతిసారము.

---

ర్వాతిథిర్యోహి జామత్యరిఘ్నః, అరింతుదోఽనుత్తమః సంవిభాగీ విభాజకో
మాం భగవాన్ పాతు దేవః. ౧౩. య ఏకో యాతి జగతాం విశ్వమీశో
య ఏకోఽదాన మరుతాం ప్రాణ మగ్ర్యమ్, యేనానృశంస్యా చ్ఛాశ్వతం
సామజుష్టం సమాం జుష్యాత్సుకృతిశ్రేయస్యేఽద్య. ౧౪. బ్రహ్మాసృజద్యో
భువనోత్తమోత్తమం తృప్తో విద్వాన్ బ్రాహ్మణ్యషడ్గుణస్య, సృష్ట్వా రసం వ్యా
వృత్తిస్థం సమగ్రం సమాయాదిహ బహురూపో రిహంగైః. ౧౫. వ్యంజనోఽ
జనోఽఘ విద్వాన్ సమగ్రః స్వ్యశిశ్వంభుః ప్రాణదః కృత్తివాసాః, రసో
ధ్రువః పవమానస్య భర్తా సపత్నీశశ్వంకరః సారధాతా. ౧౬. త్ర్యంబకం
పుష్టిదం వో బ్రువాణం ధర్మవిప్రాణాం వరదం యజ్వనాం చ, వరాద్వరం
రణజేతార మీశం దేవ. దేవానాం శరణం యామి రుద్రమ్. ౧౭. ఆస్యం
దేవానా మంతకం దుష్కృతీనాం త్రివృత్ స్తోమం వృషహాం కర్మసాక్ష్యం
భూతాయనం భూతపతిం గుణజ్ఞం గుణాకారం శరణం యామి రుద్రం. ౧౮
అనుద్ధృతం యజ్ఞకర్తార మంతం మధ్యం చాద్యం యజ్ఞకృతాం సామ్య
రూపం, వేదవ్రతేషు బహుధా గీతమీశ మభిత్రివిష్టపం శరణం యామి
రుద్రం. ౧౯. మహాజినం ప్రతినం మఖలాలం సుతోషణం క్రోధధవం విపా
పం, భూతం క్షేత్రజ్ఞం గుణినం వా కపర్దినం నతోఽస్మీశం వందనం వంద
నానాం. ౨౦ దేవం దేవానాం పావనం పావనానాం కృతిం కృతీనాం
మహతో మహాంతం, శతాత్మానం సంస్తుత గోపతీనాం పతిం దేవం శర
ణం యామి రుద్రమ్. ౨౧. అంతశ్చరం పురుషం గుహ్యసంజ్ఞం ప్రభాస్వం
తం ప్రణవం విప్రదీపం, హోతుం పరం పరమస్యాక్షరస్య శుభం దేవం గు

ఆర్యులార! కశ్యపముని వామనమూర్తితండ్రి. ఆపత్ప

---

ణినం సన్నతోఽస్మి. ౨౨. ప్రసూతి రుభయో ర్నప్రసూతశ్చసూత్మః పృథ
గ్భూతేభ్యో న పృథక్చైకభూతః, స్వయం భూతః పాతు మాం సర్వపాదః
ప్రదః స్వాద స్సంమదః పాతు రత్నమ్. ౨౩. ఆసన్నస్సన్నతరస్సాధనానాం
శ్రద్ధావతాం శ్రాద్ధవృత్తి ప్రణేతా, పతి ర్గణానాం మహతాం సత్కృతీనాం
పాయాన్మేషః పూరణష్షడ్గుణానాం. ౨౪. అంతర్బహిర్వ్రజినానాం నిహంతా
స్వయంకర్తా భూతభావీ విధుర్వాక్, ధృతాయుధః సుకృతీనా ముత్తమాజాః
ప్రణుద్యాన్మే వృజినం దేవదేవః. ౨౫. యేనోద్ధృతాస్త్రైః పురామాయినో
వైదగ్ధాఘోరేణ వితథాంతాశ్వరేణ, మహాత్కార్యంతో వృజినం దేవతానాం
జ్యాయా నీశః పాతు విశ్వోద్భధాతా. ౨౬. భాగీయసాం భాగమతోంతమి
చ్ఛన్ మఖోదక్షో యేనకృతోన్వధావత్, విద్వాన్ దిజ్ఞస్యాదిరథాంత
స్సదేవః పాయా దీశో దక్షయజ్ఞాంతహేతుః. ౨౭. అన్యోఽధన్యః సం
స్కృతశ్చోత్తమశ్చ జగత్సృష్ట్వా యోఽత్తి సర్వాలిగుహ్యః, సమాంముఖప్ర
ముఖేపాతునిత్యం నిచిన్వాన్యః ప్రథమః షడ్గుణానాం. ౨౮. గుణత్రైకాల్యం
యస్య దేవస్య నిత్యం సతోద్రేకో యస్య భావాత్ప్రసూతః, గోప్తా గో
ప్త్రూణాం సన్నమోదుష్కృతీనా మాద్యో విశ్వస్య బాధమానస్య క్రుద్ధః.
౨౯. ధామ్నా యస్య హరిరగ్రోఽథ విశ్వో బ్రహ్మా పుత్రైస్సహితశ్చాద్వి
జాశ్చ,పరాభూతా భవనేయస్య సోమో జామత్యేష శ్రేయసే సాధుగోప్తా
౩౦. యస్మాద్భూతానాం భూతిరంతోఽథ మధ్యం ధృతిర్భూతిర్యశ్చ గుహాః
త్రుతిశ్చ, గృహాభిభూతస్య పురుషేశ్వరస్య మహాత్మన స్సంవృదవేఽద్య
తస్య. ౩౧. యల్లింగాంగంత్ర్యంబక స్సర్వమీశో భగలింగాంగం యద్బ్ర
మాసర్వధాత్రీ, నాన్యత్తృతీయం జగతీహాస్తి కించిన్మహాదేవా త్సర్వసరే
శ్వరోఽసౌ. ౩౨.

కశ్యపమునికృతా శివస్తుతిస్సంపూర్ణా.

రిహారార్థము శంకరుని వినుతించెను. దీనిభావమేమి? మహాత్ము లగు కశ్యపాదిమహర్షులకు మన కున్నంతభేదము కానరాదు కారణమేమనఁగా వారిబుద్ధి సత్వగుణప్రధానమైనది. మానవులబుద్ధులు రజస్తమోగుణప్రధానమైనవి; కావున సత్యమసత్యముగాఁ దోఁచెను. అంతియగాక స్వమతాభిమానము దానికిఁ దోడుపడ మత్సరాసూయత యిత్యాదులు గల్గుటంజేసి శంకరుఁ డన్నఁగొందఱకు శ్రీమన్నారాయణమూర్తియన్నఁగొందఱకుఁ గిట్టదు. వారివారి పూర్వకర్మవిశేషమే యిందులకుం గారణం బనుట తగునుగాని వేఱొకమాట చెప్పనక్కఱలేదు. ప్రకృత మనుసరించెదను.

అని యిట్లు కశ్యపముని వినుతింపఁగా నానందించి వృషభధ్వజుండు ధర్మస్వరూపుఁడగు శంకరుఁడు సాక్షాత్కరించెను. ప్రసన్నాంతరంగుఁడై యిట్లు పలికెను. ఏకార్యమునకై నన్నిస్తుతిచే నలరించితివో ఆకార్యము నెఱుంగుదును. ఇంద్రోపేంద్రులు మతిమంతులే. ప్రకృతి నొందిరి. జనార్దనుఁడు పారిజాతమును గొంపోవఁగలఁడు. పూర్వ మింద్రుఁడు దేవశర్మ భార్యను బొందఁగోరెను. అది యెఱింగి యాదేవశర్మముని యింద్రునకుఁ గీడు కలుగవలయునని ధ్యానించెను. ఆదోషఫల మిపు డంటివచ్చినది. దీనికిఁ జింతింపకుము. అదితింగూడి స్వర్గనగరమున కరుగుము. నీతనయుల కిర్వురకు శ్రేయస్సు గలుగును. నిర్విచారమనస్కుఁడవై యరుగుము కష్టములు తొలఁగును. నీకును మనశ్శాంతి కలుగును. అని శంకరుఁడు పలుకఁగా విద్వాంసుఁడు బ్రహ్మపుత్త్రుఁడు నప్రమేయుఁడు నగు కశ్యపము

హార్షి దేవతాధీశుఁడగు శంకరునకు నమస్కరించి సంతసించి సురపురమునకుం బోయెను.

జ్ఞానధనులారా! ఆర్యులారా! ఇంచుక యీకథాసార మును జిత్తగింపుఁడు. ఒక్కవిషయమే యిందుఁ బ్రధానము. అది కర్మము బలవత్తరమను నీతిని దెలిపెడిని. ఇంద్రుఁడు సకల భోగముల ననుభవించుచు దేవశర్మయనుమునిపత్నిం గవయం గోరెను. అది యెఱింగి యతఁడు కీడుగలుగుఁగాకయని భగవం తుని బ్రార్థించుచు స్మరించెను. దానిఫలము తరుణము ననుస రించి కలుగవలయునని నియమము కాన నిపుడు కలిగెను. ఈదు ష్కర్మఫల మింకేమి యాపద కల్గించునోయని కశ్యపముని తప స్సొనరించి శ్రీమన్మహాదేవు నారాధించెను. భగవంతుఁడు ప్రత్య క్షమై పారిజాతము శ్రీకృష్ణుఁడు కొనిపోవునుగాన నంతటితో దొల్లింటిపాపము నశించునని యానతిచ్చెను. ఇంద్రునకు నశ్రేయ స్సుకలుగకుండుగాక యని దీవించెను. ఇదియేకథాసారము పరదారాభిగమనము పాపమని స్మృతులు పలుకుచున్నవి.

శ్లో. "గోవధోఽయాజ్యసంయాజ్య పారదార్యాత్మవిక్రయాః
గురుమాతృపితృత్యాగస్స్వాధ్యాయాగ్న్యోస్సుతస్యచ.
(మనుస్మృతి. ౫౯. అధ్యా. ౧౧.)

భృతాదధ్యయనాదానం భృతకాధ్యాపనంతథా,
పారదార్యం పారివిత్త్యం వార్ధుష్యం లవణక్రియా." ౨౩౭
(యాజ్ఞవల్క్యస్మృతి ప్రాయశ్చిత్తకాండము.)

ఈపాపఫల మనుభవింపక తప్పదు. కావునఁ దనకుఁగల రత్నములలో బ్రధానమనందగు కల్పవృక్షరత్నము నింద్రుఁడు కోలుపోయి యాచింత ననుభవించెను. ఈశ్వరుని బ్రార్థించినను

గర్మఫల మనుభవింపక తప్పదని యానతిచ్చెను. ఇంద్రుఁడు పర దారగమనము చేయలేదుకదా స్మరించినమాత్రమునఁ బాపము గలుగునా యని ప్రశ్నింపవచ్చును. భగవద్గీతాశాస్త్రమునందు

శ్లో. "ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తుసః. ౪౨
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదం." ౪౩
౩. అధ్యా.

అని చెప్పఁబడినది. మనస్సుచేఁ జేసినకర్మము ఫలము నీయక పోదన్నభావ మాగీతావాక్యము దృఢపఱచుచున్నది. త్రికరణములనంబడు మనోవాక్కాయములలో మనస్సు ప్రధానముకదా. దానిచేఁ జేసినపాపము జ్ఞానులకుఁ గలుగకపోదని యీగీతావాక్యము హెచ్చరించుచున్నది. వలయునని చేసిన పాపములకుఁ బ్రతిఫలము తప్పక కలుగునని గ్రహించుటయే యీకథాపఠనఫలము. కొందఱు

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ."

అను గీతావాక్యమును బలుకుచుఁ గర్మములఁ జేయరాదందురు. వారలసులు, మందబుద్ధులు ననవలయు. గీతాశాస్త్రమునందే భగవంతుఁడు

శ్లో. "నిశ్చయం శ్రుణు మే పార్థ త్యాగే భరతసత్తమ,
త్యాగోఽపి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః. ౪
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ యత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. ౫
ఏతాన్యపితు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,

కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. ౬
నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. ౭
దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౮
కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః." ౯

అని స్పష్టపఱచిరి. సత్కర్మముల వదలుట పాపహేతువనిరి. ఆ త్యాగమునఁ గలుగునది దుష్ఫలమే యనిరి. భక్తులమని తెల్పుకొనుకొందఱు దేవానాంప్రియులు కర్మాచరణమున సోమరులై తమభక్తిని బ్రకటించుచు శిష్యుల నజ్ఞానులను సేకరించి వారికడఁ దమకుఁ గలమర్యాద చెడకుండుటకై కర్మము బంధహేతువగుననియు భగవంతుని శరణాగతియే కర్తవ్యమనియు భగవంతు నాశ్రయించుటకంటె భగవద్భక్తుల నాశ్రయించిన ముక్తి త్వరగా దొరకుననియు, బోధించుచు ద్రవ్యార్జనపరులై తిరుగుచుందురు. అట్టివారు పాషండులనుటకంటె వేఱొక్క మాట పలుక వలనుపడదు. నీచాతినీచులగు వారిమాటలఁ చాటింపరాదు. సత్కర్మముల నాచరించుచు వానిఫలములను గోరక భగవత్పాదముల కర్పించుచుఁ గ్రమముగా నీషణత్రయమును జయించి కాంతాకనకాదులయం దాశమాని నిర్మములై యపుడు కర్మములుచేసినను చేయకున్న నొక్కటియే యని భావించి సదా భగవంతుని గాంచువారికొఱ కా శ్లోకము చెప్పఁబడినది. కాని కుటుంబపోషణార్థ మర్థార్జనముచేయు పొంటెఁ బాటుపడువారికొఱకుఁ గాదు. అట్టివారు వంచకులు.

వారికిభక్తియన నేదో తెలియదు. కావున వారిమాటలు పాటింపక భగవంతుని ప్రీత్యర్థము నిత్యకర్మముల నాచరించుచు నైమిత్తికముల నాచరించి ఫలముగోరక ప్రవర్తింపవలయును. కలియుగ వేదాంతులమాటలు పుణ్యసేతుచ్ఛేదకములని యెఱుంగవలయునని పెద్దలు పలుకుదురు. ఇంక నీవిషయమును బెంచి వ్రాయక తర్వాతికథ వ్రాయఁ బ్రయత్నింతును.

### ఇంద్రోపేంద్రులయుద్ధము.

* శ్రీకృష్ణుఁడు ఆరేయిఁ బుచ్చి మఱుదిన ముదయకాలమునకుముందె మేల్కాంచి కరణీయంబులు దీర్చి సూర్యోదయమగుడు మృగయావ్యాజమున రైవతకాద్రికిం బోయెను. ఒక్కరథమున సాత్యకి నెక్కఁజేసి ప్రద్యుమ్నుని వెంటరమ్మాయని యాజ్ఞాపించి రైవతకాచలంబునకు నేగి యించుక యందందుఁ దిరిగి సారథియగు దారుకునితో నిట్లు పలికెను. దారుకా! నాయీరథము నీస్థలమునందే నిలుపుము. నారాకకై వేచియుండుము. అర్ధదినముదనుక నీయశ్వములను గాపాడుచుండుము. ఈరథమునెక్కియే ద్వారకాపురిం జొరఁ గోరెదను. అని యాజ్ఞాపించి జయాభిలాషము మనమున సంభ్రమించుచుండఁగా సాత్యకిం గూడి గరుడవాహనారూఢుఁడై వేఱొక్కరథమునఁ బ్రద్యుమ్నకుమారుఁడు తోడరాఁగా నారథమున కాకాశగతిని బ్రసాదించుచు నిమేషకాలముననే నందనోద్యానమును జేరెను. పారిజాతద్రుమమును జూచువాంఛతో దేవోద్యానమును

---

* ఈకథ హరివంశవిష్ణుపర్వము 2 3-వ యధ్యాయమునుండి వ్రాయుచు బ్రహ్మపురాణగర్గసంహితలం గలిపెదను.

జేరఁ బోయి యందు సమరసన్నాహముల సంసిద్ధులైయుండు దేవయోధులను జూడఁగాంచెను. వారు జయింప నసాధ్యులు. నానాయుధధారులు, వీరులు. నందనవనోద్దేశమున నుండిరి. వారు చూచుచుండఁగనే పారిజాతము నూడలాగి తనబలము గాంచి యెల్ల రచ్చెరువుపడ గరుడునిపై నుంచెను. గరుడునిపై నునుచునంతలో నావృక్షరాజము విగ్రహమును ధరించి పొడ సూపి చేతులొగ్గెను. వాసుదేవుఁ డావృక్షరాజమును సాంత్వనోక్తులఁ బ్రేమించి పలికి వృక్షరాజమా! వాసుదేవుని ద్వారా కీడుమూడునని భీతిల్లకుము. వృక్షరాజము నిడుకొని మధుసూదనుఁ డమరావతీనగరమునకుఁ బ్రదక్షిణాత్రయ మొనరించెను. నందనవనపాలకులు వాసుదేవుఁడు పారిజాతమును బెకలించుకొని పోయెనని మహేంద్రునికడకేగి విన్నవించిరి.

పారిజాతము కొనిపోయెనన్నవార్త శ్రుతివివరముల సోఁకగానే హరిహయుఁ డైరావతమునెక్కి రథమునెక్కి జయంతుఁడు కూడ రాఁగా హరి మార్గమున నరిగెను. అత్తఱిఁ గృష్ణుఁడు పూర్వద్వారసమీపమునఁ బోవుచుండెను. ఇంద్రుఁ డాహరిం జేర్కొని యీవిధమునఁ బ్రవర్తించుచున్నాఁడవేమని ప్రశ్నించెను. గరుడారూఢుఁడగుహరి యింద్రునకు నమస్కరించి యిట్లు బదులుచెప్పెను. దేవేంద్రా! నీమఱఁదలి కింగల పుష్పకార్యార్థ మీవరద్రుమము కొనిపోవుచున్నాఁడను. అనఁగా నింద్రుఁడు పుష్కరేక్షణా! యిటు చేయఁగూడదు. యుద్ధము చేయక దీనిని గొనిపోవ సాధ్యముకాదు. కేశవా! తొలుదొలుత నన్ను నీవే శరంబుల నొప్పింపుము. కౌమోదకిని నాపైఁ బ్రయోగించి నీప్రతిజ్ఞను సఫలము చేసి

శొమ్ము. అనుటయు శ్రీకృష్ణుఁడు నిశాతబాణములచేత నైరావతగజరాజమును నవ్వుచు నొప్పింప నాశరము లశనికల్పములై దానిం దాఁకెను. ఆవిధమెఱింగి శతక్రతుఁడు దివ్యబాణములచేత గరుడు నొవ్వనేసి వేగవంతములగుహరిశరములఁ దాఁకకుండఁ ద్రుంచెను. మాధవుఁడు నింద్రుఁడు ప్రయోగించిన శరములనన్నింటిని నడుమనే త్రుంచెను. మాధవుఁడు ప్రయోగించు వాడినారాచముల నింద్రుఁడును ఛేదించెను. ఇంద్రోపేంద్రుల చాపధ్వనులచే భీతిల్లి స్వర్గవాసులు తెలివి తప్పిరి.

ఇట్లు శతమఖశతపత్రేక్షణులు గెలుపోటములు కనఁబడకయుండ ఘోరముగఁ బోరుచుండ జయంతుఁడు పారిజాతమును గ్రహింప నుద్యుక్తుఁ డయ్యెను. ఆసన్నయెఱింగి మధుసూదనుఁడు ప్రద్యుమ్నకుమారునిం జీరి యాతని నాపుమాయని శాసించెను. ప్రతాపఖనియగు రుక్మిణీప్రియపుత్త్రుఁడు ప్రద్యుమ్నుఁ డాయింద్రపుత్త్రుని వారించెను. జయంతుఁడు చాపమ్మున నారి సంధించి నిశితపతత్త్రులం బ్రయోగించుచుఁ బ్రద్యుమ్నుని సర్వాంగముల నొవ్వఁజేసి నవ్వెను. ప్రద్యుమ్నుఁడు తగ్గిపోక యాతని నొప్పించెను. అంత నింద్రుని శ్రీహరి యాశీవిషోపమ సాయకముల నొవ్వనేయ నాతఁడు మూర్ఛిల్లెను. ఆసందడి భీకరముగ నుండెను. జయంతప్రద్యుమ్నకుమారులు ఘోర సంగ్రామ మొనరించుచుండిరి. మహాబలులగు వారిరువురు బదులుకు బదులుగా బాణముల వేయుచుండిరి. ఆయిర్వురు మహాస్త్రవిద్వరిష్ఠులు. ఆయిర్వుర సంగ్రామమును దేవతలు మునులు విస్మయాన్వితులై చూచుచుండిరి. ఆఘోరప్రవిదారణము సిద్ధచారణులకుం గూడ విస్మయావహమయ్యెను. ఇట్టులుండఁ బ్రవ

రుఁడను దేవదూత పారిజాతము నపహరింపఁ బ్రయత్నించెను. ఆతఁ డింద్రమిత్రుఁడు, అరిందముఁడు, మహాస్త్రవేత్త, బ్రహ్మాదత్త వరబలమున నవధ్యుఁడు నగు. ఆతఁడు జంబూద్వీపమునఁ దపం బొనరించి బ్రహ్మ నలరించి తద్వరమున స్వర్గముఁ జేరఁ గల్గెను. స్వశక్త్యనురూపముగ నింద్రునకుసాయమ్ముఁబూను స్వభావము గలవాఁడు. వచ్చుచున్న యాప్రవరునింజూచి హరి సాత్యకితో నిట్లు పలికెను. సోదరా! ఇందుండియే బాణములచే నాప్రవరుని దుష్ప్రయత్నమును నివారింపుము. నిర్దయుఁడవై బాణముల నీతనిపైఁ బ్రయోగింపకుమా. ఈతఁడు బ్రాహ్మణుఁడు. ఈతని చాపల్యము సహింపఁదగినదియే. అది విని గరుడునిపై నున్న సాత్యకి నలువదిబాణములచే నాబ్రాహ్మణుఁడు నొప్పించెను. శిని మనుమఁ డందులకుఁ గోపించి యాతని శరాసనము వ్రక్కలు చేసి తత్ప్రయుక్త నారాచముల నడుమన త్రుంచి యిట్లు పలికెను.

బ్రాహ్మణుఁ డవమానింపఁబడరాదు. నీకులధర్మము నను సరించి ప్రవర్తింపుము. యాదవు లపరాధముచేసినను బ్రాహ్మ ణుల హింసింపరు. అనవిని ప్రవరుఁడు నవ్వుచు సాత్యకితో నోర్పు చాలును. సర్వాత్మనా రణమున విక్రమింపుము. నేను పరశురాముని శిష్యుఁడ నైనను దేవేంద్రునకు మిత్రుఁడను. నా పేరు ప్రవరుఁడని. మధుసూదనుని దేవతలు మార్గాన నిచ్చ గింపరు. మైత్రికిఁ దగుబుణమును బాపుకొనవలయుఁగదా. అని పలికి వారిరువురు సంగ్రామము చేయఁబూనిరి. అది కనుఁగొన భయంకరముగా నుండెను. దివ్యాస్త్రములఁ బ్రయోగించుచుఁ బోరసాగిరి. స్వర్గ మల్లల్ల నాడెను. పర్వతము కంపిల్లెను. ఈసం

గరమిట్లుండఁగా జయంతప్రద్యుమ్నుల సంగరమును విచారిం తము. అస్త్రవిద్యాధ్యుఁడగు జయంతుని బ్రద్యుమ్నుఁడు మించఁ జాలకుండెను. జయంతుఁడా కృష్ణకుమారుని మాయావిశార దునిగా నెఱింగియు నించుకయేని దీసిపోవక పోరాడి నొప్పించు చుండెను. పరస్పరజయకాంక్షలు వరుసఁగాఁ బెరుగుచుండెను. అంతట నింద్రపుత్త్రుఁడు మధుసూదనకుమారుని దివ్యాస్త్రమున నొప్పించి యురవడించెను. ఆతఁడు వచ్చుచున్న యాయస్త్ర మును గాంచి నిశితవిశిఖసంతతుల నడుమనే స్తంభించెను. అది యందఱ కద్భుతమును గల్గించెను; కాని యాయద్భుతాస్త్ర మా బాణముల విదలించి పైఁబడరాఁగా దానిని బ్రద్యుమ్నుఁ డాపఁజాలక పోయెను. అది యతనిరథమును భస్మముచేయఁ జాలెను. కాని యతని దహింపఁజాలక పోయెను. అగ్ని నగ్ని దహింపదు కదా. కాలినరథమును జూచి ప్రద్యుమ్నుఁడు విర థుఁడై యాకాశమున మాయాబలంబున నిలువంబడి జయంతు నితో నిట్లు భాషించెను. జయంతా! నీవు ప్రయోగించిన యస్త్రమువంటి వెన్నినూఱులు ప్రయోగించినను నన్ను వధింపఁ జాలవు. బాణవిద్యయందుఁ గలనేర్పును గనఁబఱుచుచుఁ బ్రయ త్నింపుము. నా ప్రయత్నమును జూడుము. నన్నతిశయింపఁ జాలవు. రథమునఁ గూరుచుండి యాయుధములం బట్టుకొని యున్ననిన్నుం జూచి భయము గలుగలేదు. నీబల మెఱుకపడి నది. ఈపారిజాతముం గొనిపోవఁ జాలుదునాయని మనమున స్మరింపుము. ఇది నీవు స్పృశింపనుగూడ శక్తుఁడవుకావు. నీయ స్త్రమున మాయామయమగు నారథము దగ్ధమైనదికాని యిట్టి

రథములను సహస్రసంఖ్యాకములఁ గల్పింపఁజాలుదు సని తలంపుము.

ఆమాటలువిని జయంతుఁడు చిరకాలతపస్సుచేనార్జింపఁబడిన యస్త్రమును నారిం గూరిచి యతనిపైఁ బ్రయోగించెను. ప్రద్యుమ్నుఁ డాదివ్యాస్త్రము తన్ను సోఁకకుండఁ జేయఁజాలెను. మరల జయంతుఁ డిట్టి యస్త్రముల నాల్గింటిం బరఁగించెను. ఆయస్త్రము లంబరమున వ్యాపింప వాని నడుమ నైదవ యుల్కవలెఁ బ్రద్యుమ్నుఁ డగపడియెను. కాని వాని నేమియుఁ జేయఁజాలవయ్యెను. మరల జయంతుఁ డాగ్రహించి నిశితశరములఁ బ్రయోగించెను. అప్పుడు ప్రద్యుమ్నుని స్థైర్యము ధైర్యమును మెచ్చుకొనుచు నొకశబ్ద మంబరమున వ్యాపించెను. వీరియాహవ మిట్టులుండఁగాఁ బ్రవరశైనేయుల సమరము నించుక పఠింతము. ప్రవరప్రయుక్తబాణముల కాగ్రహించి సాత్యకి యతనికోదండము తునుకలుగావించెను. ప్రవరుఁడంతట నింద్రదత్తమగు వేటొకచాపమును బూనెను. అది మహాశనిసమనిస్వనముగలది. ఆవిప్రప్రవరుఁ డాచాపమున జ్యాలతిక నెక్కించి భానుభానుసమానబాణపరంపరలు పరఁగించెను. అంతియకాక శైనేయుధనుర్లతను శకలములు గావించెను. సాత్యకి యవయవములు సొమ్మసిల్ల బాణముల వైచెను. సాత్యకి భారవహమగు వేటొక విల్లంది ప్రవరుని నొవ్వఁజేయు కలంబబృందముల వైచెను. వారిరువురు పరస్పరకవచముల భేదించి విక్రమించిరి. మర్మములభేదింప నందుండి రక్తమాంసములు వెలువడియె. ఎనిమిదంచుల బాణములఁ బరఁగించి ప్రవరుఁడు శైనేయుచాపమును ద్రుంచి మూఁడింట సాత్యకి నొప్పించెను.

రెండవకోదండము నందుకొన నుంకించుసాత్యకిని బ్రవరుఁడు భూరితరగదాయుధమున నొవ్వఁజేసెను. ఆవ్రేటునకుఁ జలింపక సాత్యకి ప్రహాసభాసమానముఖుండై చర్మమును, ఖడ్గమును జేనందుకొనియె. గదచే మిగుల నొచ్చినవాఁడు కావున మరలఁ జాపదండము నందుకొనఁ బూనఁడయ్యె. ప్రవరుఁ డంత శరశతములఁ బ్రయోగించెను దాన సాత్యకి నొచ్చెను. ఆవిధమెఱింగి ప్రద్యుమ్నుఁడు నిర్మలాకాశసన్నిభంబగు ఖడ్గమును సాత్యకి కందిచ్చెను. నిశితభల్లమున నానిస్త్రింశమును బ్రవరుఁడు తునుకలుగా ఛేదించెను. ఆఖడ్గఖండములు పుడమిపైఁబడియెను. నవ్వుచు నాప్రవరుఁ డాఖడ్గపుంఖమునుగూడఁ బడఁగొట్టెను. అంతతో మానక సాత్యకి చేతనున్నచర్మము (డాలు)ను చూర్ణముగా దివ్యబాణములు పరగించెను. దాన నాచర్మము క్రిందఁ బడెను. మఱియు నొకశక్తిం బ్రయోగించి యావిప్రుఁడు సింహనాదము చేసెను. ఇట్లు సాత్యకి నొంచి యతఁడు చేడ్పడెనని యెఱింగి తనయరదమును దారుకున కభిముఖముగాఁ ద్రిప్పి పారిజాతమును గ్రహింపఁగోరెను.

ఆతనిభావ మెఱిఁగి వినతాప్రియనందనుఁడు స్వపక్షవాతమున గవ్యూతిమాత్రదూరమునఁ బ్రవరునిరథము పడఁజేసెను. ఆపాటువలనమూర్ఛాక్రాంతుఁడునయ్యెను. ఆవిప్రప్రవరుపాటుం గాంచి జయంతుఁ డచ్చటికింబోయి యాశ్వాసించి రథముపైఁ గూరుచుండఁజేసెను. ప్రద్యుమ్నుఁడును దనపిన్నతండ్రి నొచ్చి సొమ్మసిల్లుటం దెలిసికొని యతఁడు పలుమాఱుమూర్ఛిల్లుటయు, మరలఁ దెలివి తెచ్చుకొనుటయుం గాంచి చెంతకుంబోయి కౌఁగిలించుకొనియాశ్వాసించెను. శ్రీహరియు సవ్యహస్తమున సాత్య

కిని స్పృశించెను. శ్రీకృష్ణహస్తారవిందసంస్పర్శమున విజ్వరుఁడై యాశ్వైనేయుఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. శ్రీహరికి సవ్యపార్శ్వమున సాత్యకియు, దక్షిణపార్శ్వమునఁ బ్రద్యుమ్నుఁడును నిలిచి పారిజాతమును గాపాడుచు యుద్ధకుతూహలమున నొప్పియుండిరి. జయంతప్రవరు లేకరథారూఢులై యింద్రునకు బాసటలై నిలిచిరి. అత్తఱి నవ్వుచు నింద్రుఁడు వారిం గాంచి గరుడుని చెంతకుమాత్రము పోవలదు. పక్షిరాజితఁడు మహాబలశాలి. వినతాపుత్త్రుఁడు. ఈతని ప్రభావము నేనెఱుఁగుదును. నాసవ్యాపసవ్య పార్శ్వముల నిలిచి నాయుద్ధమును జూచుచుండుఁడు. అన నిర్వురు చెరియొకరథము నెక్కి యతనిపార్శ్వముల నిలువఁబడి వేడుకచూచుచుండిరి. జనార్దనదేవరాజులు మరల యుద్ధమున కుపక్రమించిరి.

ఇంద్రుఁడు గరుడునిపై నాగ్రహించి వజ్రకల్పసాయకముల సర్వాంగములు నొవ్వనేసెను. దివ్యాస్త్రములను బ్రయోగించెను. ప్రతాపనిధియగు నావినతానందనుఁడు త్ర్యంబకముల నస్త్రములను లెక్కింపక యింద్రుఁడెక్కియున్న యైరావతముపై యుద్ధమునకుఁ బోయెను. గరుడైరావతములు సాహసించి పోరసాగెను. ఆ రెండును యుద్ధదుర్మదములు; దురాసదములు; మహాప్రాణములు. దంతముల చేతను శిరస్సుచేతను దొండముచేతను ద్విరదవర్యమా పక్షీంద్రమునొప్పించి ఘీంకరించెను బలోత్కటమగు నాపక్షిశ్రేష్ఠము వాడినఖరముల చేతను బక్షనిపాతముల చేతను శక్రద్విపమును నొప్పించెను. మహాబలశాలిమా పక్షీంద్రనాగేంద్రముల సంగరము మహాఘోరాకృతిం దాల్చెను. చూచువారిలోఁ గొందఱు విస్మయంపడిరి. కొందఱు భీతిల్లిరి.

అత్తఱి గరుడుఁడాగ్రహించి కుంభస్థలమునఁ బ్రహరించెను. నఖాంకుశముల నలరు చరణాఘాతమునఁ దనబలము చూపి నొప్పింపఁగా నాయైరావత మాపీడ కోర్వఁజాలక పడిపోయెను. ఆయైరావతము పారియాత్రగిరివర్యమునఁ బడుచుండఁగాఁ దిలకించి యింద్రుఁడు క్రిందికిందిగక కరుణచేతను స్నేహముచేతను బూర్వపరిచయముచేతను దాని నాశ్వాసించుచుఁ గూడనుండెను. శ్రీహరియు దానిపాటుఁ గాంచి కరుణాతరంగితాంతరంగుఁడై వెనుకనె చని దాని నాశ్వాసించెను. గరుడుఁడు పారిజాతమునువహించుచు శ్రీకృష్ణునాశ్రయించి యైరావతము చెంతకుం బోయియుండెను. పారియాత్రపర్వతపృష్ఠమున నైరావతముంగూడి యింద్రుఁ డుండెను. ఐరావత మంతలో యథాపూర్వముగా నలరారెను. మరల యుద్ధ మారంభింపఁబడియెను. ఒండొరుల మీఱు పౌరుషముల నాశక్రకృష్ణులు రత్నఖచితములు నశనితుల్యములు నగుబాణములఁ బ్రయోగించుచు నని చేసిరి. ఇంద్రుఁ డైరావతమున కపకారముచేసిన గరుడునిపై వజ్రాయుధమును బ్రయోగించెను. ఇంద్రుని దివ్యాయుధఘాతము నాపక్షిరా జోర్చుకొనఁజాలెను. గరుడుఁడు స్వభావమున బలవంతుఁడు. వరదానమున నితరావధ్యుఁడు. కావున నావజ్రమును గౌరవించుచు నొక్కొక్కఘాతమున నొక్కొక్కపత్త్రమును వదలుచుండెను. వజ్రపతనమునకు భీతిల్లి నిలువఁజాలక కొండక్రిందికిం దిగఁబడుచు నాక్రోశించునట్లుండెను. ఆనాదము శ్రీకృష్ణుని వినుతించునట్లుండెను. చాలభాగము క్రుంగి యతిక్రాంచి చ్ఛేషముగనున్న యాపారియాత్రపర్వతమును శ్రీహరి తిలకించి దానిం గరుణించి యండమాని యాకాశమున గరుడుని

నిలువంబంచెను. ప్రద్యుమ్నుంగాంచి శ్రీహరి యపు డిట్లుపలి
కెను. త్వరగా ద్వారకకుంబోయి రథముం దెమ్ము. ఆలసింపకుము.
నా తేజోబలము నాశ్రయించి సదారుకమగు రథము వచ్చును.
బలభద్రుని గుకురాధిపతిని గాంచి యింద్రుని జయించి శ్రీహరి
రేపువచ్చునని తెల్పుము. రేపుతప్పకవత్తుననియుం దెల్పుమనిరి.
శ్రీహరివాక్కుల నాదలందాల్చి ప్రద్యుమ్నుఁడు ద్వారక కరిగి
పితృనానతి నెఱపెను. క్షణమాత్రమున మరలవచ్చి తండ్రిపార్శ్వ
మున నుండెను. దారుకుఁడు తెచ్చిన స్యందనము నెక్కి శ్రీహరి
యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

మహాశయులారా! ఇతరపురాణకథలకు దీనికిని సంబం
ధము లేకయున్నది. స్వర్గమునకుంబోయి యింద్రపూజితుండై
వచ్చుచుం బారిజాతముమాటసత్యభామస్మృతికిం దేఁగా నందనో
ద్యానమునకుంబోయి తెచ్చెనని బ్రహ్మపురాణమునఁ గలదు. హరి
వంశమున నీచరిత్రము ప్రధానముగా వ్రాయఁబడినందున నేను
దీనినాధారము చేసికొని యీకథవ్రాసితిని. ఈభాగమునఁ జెప్పఁ
దగినవిశేషములు గానరావు. కావున స్వల్పవిషయములం దడ
వక ప్రధానముగఁ గథనే వ్రాసెదను. తర్వాతికథ నాలకించు
టయే మీకుంగర్తవ్యము. ఇంద్రునితో నింతదనుక సంగరమొన
రించుట శ్రీహరికి నవసరము లేదు కానిలోకాచారమును బాటిం
చుట యాచారము కావున నట్లొనర్చెనని యెఱుంగుట మాన
వులకువిధి. అటులేకయున్న నీపారిజాతముల శతసహస్రములఁ
గల్పింపఁ గలభగవంతున కీమాత్రయేల? ఇంకఁ దర్వాతికథా
భాగము నాలకింపుఁడు.

## శ్రీకృష్ణుఁడు శంకరు నారాధించుట.

* దారుకుఁడు తెచ్చినస్యందన మెక్కి శ్రీకృష్ణుఁడు పారియాత్రగిరిపృష్ఠమున నైరావతము నాశ్వాసించుచు యుద్ధమునకై వేచియున్న యింద్రుని మార్కొనం బోయెను. శ్రీహరి మరల రథము నెక్కి తనపై నిలిచి యుద్ధము చేయవచ్చు టెఱింగి యాపారియాత్రపర్వతము భూమియం దణఁగి యించుకగాఁ బైభాగము కనంబడుచుండనుండెను. భగవంతుని మాహాత్మ్యము నెఱుంగునుగాన ఆతనిరథము తిరుగవలయునన్న యూహతో భూసమానముగా నుండెను. ఆపర్వతముతనయెడఁ జూపినభక్తి కానందించి శ్రీహరి దానిని గొనియాడెను. అరదము నెక్కి యుద్ధమున కరుగుచున్న శ్రీహరికి వెనుకఁ బారిజాతమును మోయుచు గరుడుఁడు నిలిచి చూచుచుండెను. ఆగరుడు నెక్కి సాత్యకియుఁ బ్రద్యుమ్నుఁడును హరి నాశ్రయించి యుండిరి. ఆ యరిందము లిర్వురు పారిజాతము నాశ్రయించి రక్షించుచుండిరి. అంత భానుఁ డస్తమించెను. రజని ప్రవృత్తి మార్గము నాశ్రయించెను. మిగుల దెబ్బలుదిని యలసి ప్రాణములను మాత్రము ధరించి తనతేజమును స్మరించుచు నేమి చేయుటకుం దోఁపని యైరావతమును గాంచి మధుసూదనుఁ డింద్రున కిట్లనియె. దేవరాజా! గరుడసమాఘాతమై యీ యైరావతనాగరాజము తూలుచున్నది. యుద్ధము చేయఁజాలదు. రాత్రియు నారంభించినది. రాత్రులయందు గజములకు విహారమునఁ బ్రీతియే కాని యుద్ధప్రీతియుండదు రేపు ప్రభాతకాల

---

* ఈకథ హరివంశము విష్ణుపర్వము డెబ్బదినాల్గవయధ్యాయమునుండి కైకొనఁబడినది.

మున యథేచ్ఛముగా యుద్ధ మొనరింపును. అన నిదియే యుత్తమమని యింద్రుఁడును బలికి యందే శతమఖుఁడు నుండెను. శ్రీహరియు వ్రజమున నున్నట్లే యాగిరి భూసమముగ నున్నందున నందుండెను.

అత్తఱి బ్రహ్మలోకమునుండి సరోజభవుండును సురపురినుండి కశ్యపుఁడును వచ్చిరి. భర్తనుగూడి యదితియు వచ్చెను. మునులు దేవతలును వచ్చిరి. సిద్ధచారణులు లోనగువారెల్ల నరుదెంచిరి. ఆదిత్యులు రుద్రులు వసువులునుగూడ వచ్చిచేరిరి. శ్రీహరియుఁ గుమారుఁడగు ప్రద్యుమ్నుని, సోదరుఁడగు సాత్యకింగూడి యుండెను. గిరివర మయ్యది యుత్తరణమున భూసమ్మితమై సుఖార్థము తానుండెను. దానికి సంతోషించి శ్రీహరి యాపర్వతమునకు వరమిచ్చెను. ఓపర్వతోత్తమా! నాసుఖనిమిత్తము శాణపాదసమానముగా నుంటివి. కాన నీవింక లోకమున శాణపాదనామమునం బ్రసిద్ధిం గాంచుము. పుణ్యాభివృద్ధుల హిమగిరికి సమానుఁడవగుదువు. బహుచిత్రశృంగములం గూడి మేరువుతోఁ బ్రతిఘటించుచుండఁగలవు. నేను నీపై విహారముసల్పుదును. అని వరమిచ్చి వృషధ్వజునకు నమస్కరించి గంగానదిని మదిని సంస్మరించెను. శ్రీకృష్ణుఁడు స్మరించినంతన విష్ణుపది రూపధారిణియై చనుదెంచెను. *దానికి సత్కరించి శ్రీహరియందుస్నానముచేసి యాచమనముచేసి బిల్వపత్రమును దీసికొని సర్వదేవాదిదేవుఁడగు నీశ్వరు నావాహన

---

*సంపూజ్యతాం తతః కృష్ణః కృత్వా స్నాన మధోక్షజః, ఉదకంచ గృహీయాథ బిల్వంచ హరిరవ్యయః, దేవమావాహయామాస రుద్రం సర్వేశ్వరేశ్వరమ్ అని మూలము.

ము చేసెను. తదాహ్లాదమగ్నుండై శంకరుండు ప్రవరుంగూడి సాక్షాత్కరించెను. గంగోదకమున కూర్ధ్వభాగమున బిల్వపత్రముపై నాసీనుండయ్యెను. ఆశంకరుని పారిజాతకుసుమముల శ్రీకృష్ణుండు

---

—○ శ్రీకృష్ణకృతశివస్తుతిః. ○—

రుద్రో దేవస్త్వం రుదనాద్ద్రావణాచ్చరోరూయమాణో ద్రావణాచ్చాపి దేవః, భక్తం భక్తానాం వత్సలం వత్సలానాం కీర్త్యాయుం త్వేకాద్య ప్రభవాద్యంతరేణ. ౧. గ్రామ్యారణ్యానాం త్వం పతిస్త్వం పశూనాం ఖ్యాతో దేవః పశుపతిస్సర్వకర్తా, నాన్యస్త్వత్తః పరమో దేవదేవ జగత్పతి స్సురవీరారిహంతా. ౨. యస్మాదీశో మహతామీశ్వరాణాం భవనాద్యః ప్రీతిదః ప్రాణదశ్చ, తస్మాద్ధిత్వామీశ్వరం ప్రాహురీశం సంతో విద్వాంసః సర్వశాస్త్రార్థతజ్జ్ఞః. ౩. భూతాదస్మాజ్జగద్యంతధీర త్వత్తోఽవ్యక్తాదక్షరాదక్షరేశ, తస్మాత్త్వామాహుర్భవ ఇత్యేవ భూతం సర్వేశ్వరాణాం మహతామప్యుదారమ్. ౪. యస్మాజ్జితైరభిషిక్తోఽసి సర్వైర్దైవాసురైస్సర్వభూతైశ్చ దేవ, మహేశ్వరం విశ్వకర్మాణమాహుస్త్వాం వై రే సర్వే తేన దేవాతిదేవ. ౫. పూజ్యో దేవైః పూజ్యసే నిత్యదా వై శశచ్ఛ్రియః కాంక్షిభిర్వరదామేయవీర్య, తస్మాద్విఖ్యాతో భగవాన్ దేవదేవస్సతామిష్టస్సర్వభూతాత్మభావీ. ౬. భూమిత్రయాణాం దేవయస్మాత్ప్రతిష్ఠా పునర్లోకానాం భావనామేయకీర్తిః, త్ర్యంబకేతి ప్రథమం తేన నామ తవాప్రమేయ త్రిదశేశనాథ. ౭. శర్వశ్శత్రూణాం శాసనాదప్రమేయ స్తథాభూయశ్శాసనాచ్చేశ్వరేణ, సర్వవ్యాపిత్వాచ్ఛంకరత్వాచ్చ సద్భిశ్శబ్దస్యేశానశ్శ్రీకరారాత్కృత్యతేజః. ౮. సంసక్తానాం నిత్యదా యత్కరోషి శమం భ్రాతృవ్యాన్యద్వ్యసైషీస్సమస్తాన్, తస్మాద్దేవ శ్శంకరోఽస్యప్రమేయస్సద్భిర్ధర్మజ్ఞైః కథ్యసే సర్వనాథః. ౯. దత్తః ప్రహారః శూలినేన పూర్వం తవేశానసురరాజ్ఞాఽతివీర్య, కంఠే నైల్యం తేన తే యత్ప్రవృత్తం తస్మాత్ఖ్యాతస్త్వం నీలకంఠేతి కల్పః. ౧౦. యల్లింగాంగం యచ్ఛాకే

పూజించెను. సర్వకర్తయై యీశ్వరుల కీశ్వరుఁడై యొప్పు నా మహాదేవుని వినుతించెను. ఆస్తుతి వేదసారమే. రుద్రాదిశబ్దములు లోకమున కుపకరించునవి యనియుఁ, బరమపవిత్రములైన వనియు స్మరించినంతన సకలపాపములు నశించుననియు నిందుఁ జెప్పఁబడినది. సృష్టిస్థితిసంహారములకుఁ గారకుఁడు శంకరుఁ డనియుఁ దదధీనులే తక్కిన దేవత లనియుఁ బరబ్రహ్మస్వరూపుఁ డగు శంకరుఁడు ప్రకృతింగూడి యిచ్ఛామెయి బ్రహ్మాండముల నిర్మించి పోషించి సంహరించుననియుఁ, బామరు లామహాదేవుని మహిమముఁ దెలిసికొనఁజాలరనియు, సకలవేదములు భగవంతుఁడు శంకరుఁడని బోధించుచున్నవనియు, యజ్ఞము యాజకుఁడు యజ్ఞఫలమాశివుఁడే యనియు నీస్తుతిసారాంశము. ఇందుఁ జేసియున్న నామనిర్వచనము కథాసారమున వ్రాయఁబడును. తరువాతికథను వినుఁడు.

ఇట్లు వినుతించి శ్రీకృష్ణుఁడు కరయుగము జోడించి నిలుచుండఁ గాంచి పరమశివుఁడు సంతుష్టాంతరంగుఁడై దక్షిణ

---

భగాంకం సర్వం సోమత్వం స్థావరం జగమంచ, ప్రాహుర్విప్రాస్త్వాం గుణినం తత్త్వవిజ్ఞాస్తథాధ్యేయామంబికాం లోకధాత్రీం. ౧౧. వేదైర్గీతా సాహి తత్త్వం ప్రసూతా యజ్ఞోదీక్షాణాం యోగినాం చాతిరూపః, నాత్యద్భుతం త్వత్సమం దేవభూతం భూతంభవ్యం భవదేవాథనాస్తి. ౧౨. అహం బ్రహ్మా కపిలో యోఽప్యనంతః పుత్రాస్సర్వే బ్రహ్మణశ్చాతివీరాః, త్వత్తస్సర్వే దేవదేవప్రసూతా ఏవం సర్వేశః కారణాత్మాత్వమీడ్యః. ౧౩. ఏవం సంస్తూయమానస్తు భగవాన్ గోవృషధ్వజః, ప్రసార్యదక్షిణం హస్తం నారాయణ మథాబ్రవీత్.

ఇతి హరివంశవిష్ణుపర్వాంతర్గత శ్రీకృష్ణకృతశంకరస్తుతిస్సమాప్తా.

హస్తమును బ్రసరింపఁజేసి నారాయణుంగూర్చి యిట్లు పలికెను. సురసత్తమ! నీవాంఛితములు నెఱవేఱుఁగాక. పారిజాతమును గైకొంటివి. దాన నీకు మనోవ్యథ లేకుండుఁగాక. *తొల్లి మైనాకపర్వతముననుండి నన్నుంగూర్చి ప్రభూ! తపస్సొనరించితివి. అప్పుడు ప్రత్యక్షమై నేయిచ్చినవరమును స్మరింపుము. అది ఫలించునని నమ్ముము. అవధ్యుఁడవని, యజేయుఁడవని, నాకంటె మిక్కిలి శూరుఁడవగుదువని నేఁ బలికియుంటినిగదా. అమాట యట్లే ఫలించును. వ్యతిరేకముగా నేల యగును? నీవు దివ్యస్తవమున నన్నలరించితివి. దానిచే ధర్మభాక్కువుకమ్ము. ఓవిష్ణూ! సంగరమున విజయమొందుము. సర్వోత్తమపూజ నొందుము. నీ విందు నన్నారాధించితివి కావున బిల్వేశ్వరుఁడనునామధేయ మీశివలింగమునకుఁ జెల్లుంగాక. దేవాధీశా! నీచే నిందు స్థాపింపఁబడిన యీలింగము దేవసిద్ధోపయాచితమై యలరఁగలదు. ఈమహాస్థలమున భక్తిభావముగల యేవిద్వాంసుఁ డుపవసించి త్రిరాత్రము లీలింగమును బూజించునో యాతఁ డీప్సితార్థముల నొందును. ఈప్రదేశమున నీచే నావహింపఁ జేయఁబడిన యీగంగ అవింధ్యానామమున వెలయుఁగాక. ఇందుఁ జేసినస్నానము గంగాస్నానసమఫలము నీఁజాలును. ఆ స్నానము విధిమంతముగాఁ జేయవలయును.

శ్రీకృష్ణా! షట్పుర మనుపేరుగల నగర మొకటి కలదు.

---

*యథా మైనాకమాశ్రిత్య తపస్త్వమకరోః ప్రభో, తథా మమ వరం కృష్ణ సంస్మృత్యస్థైర్యమాప్నుహి. 32. అవధ్యస్త్వ మజేయశ్చ మత్తశ్శూరతర స్తథా, భవితాసీద్యవోచం యత్ తత్తథా న తదన్యథా. 30=అని హరివంశము.

అది దానవులది. ఈ ప్రదేశమునకుఁ గ్రిందనున్నది. అందు మహా బలులగు దానవులు కలరు. వారెల్ల దురాత్మకులు. జగద్దేవ కంటకులు. ప్రచ్ఛన్నులై యుందురు. వారందుఁగల మహాపర్వతమున డాఁగియుందురు. దేవాదిదేవులకుంగూడ నవధ్యులు. అట్టివరము బ్రహ్మచే వారికి లభించెను. నీవు మానవదేహము గల శ్రీమహావిష్ణుమూర్తివి. కేశవా! నీ వా దానవులం బొలియింపుము. అని యాజ్ఞాపించి యందే యంతర్ధానమందెను. ఆ యంతర్ధాన మగుకాలమున శ్రీకృష్ణుం గౌఁగిలించుకొని కృపచే గారవించెను. ఇట్లు వర మిచ్చి హిత ముపదేశించి భగవంతుఁడు శివుఁడరుగఁగా నంతలో నారాత్రి చనుసమయము రాఁగా నా ప్రభాతకాలమున నాపర్వతమును వినుతించి పర్వతవర్యా! నీయడుగుభాగమున మహాసురులు కలరఁట. దేవతావర్యులకుఁ గూడఁ జంపరానియట్లు వారికి బ్రహ్మవరము కలదఁట. వారు బయలు వెడలక డాఁగియుందురఁట. ద్వారము నడ్డగించి యందే వారిని బొడవడఁగించెద. నీయందు సన్నిహితుఁడనై యుండెదను నీపై నెక్కి యామహాసురులను సంహరించెదను. నీశిఖరమున నుండెదను. అట్టి నిన్ను నెవఁడు చూచునో యాతఁడు గోసహస్రదానఫలము నొందఁగలఁడు. ఎవఁడు నీతనువున నున్న పాషాణములతో నొకయాకారమును జేసి భక్తిభావమునఁ బూజించునో వాఁడు వైకుంఠలోకమును బొందఁగలఁడు. అని యాపర్వతమునకు శ్రీహరి వరమిచ్చి యనుగ్రహించెను. ఆవరదానము ప్రకారము శ్రీహరి యాపర్వతమూర్ధమునఁ దనయాకృతి నంశమున నునిచెను. ఏమానవు లాపర్వతపాషాణములచే నొకవిగ్రహమును గల్పించుకొని పూజింతురో వారు విష్ణులో

కము నొందుదురు. ఇహలోకమున సకలమనోరథములు వారికి ఫలించును.

భక్తాగ్రగణ్యులారా! శ్రీకృష్ణమూర్తి శంకరు నారాధించినకథఁ జదివితిరి. దీనియందుఁగల విశేషములను జిత్తగింపుఁడు. దీనఁగల విశేషాంశములం జూచి న్యాయబుద్ధిం బరిశీలించినచో శివకేశవులకు భేదముగల దనువాదము తుదముట్టి నశించును. చక్కనిభక్తి కుదురును. అంతియె కాక,

శ్లో. "యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మా మేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్."

(గీత ౯ అ. ౨౩ శ్లో.)

అన్నగీతావాక్యమున నిమిడియున్న భగవంతుని భావము నెఱింగినవా రౌదురు. కావున నిందలిరహస్యముల నోపికమై నాలకించి భగవంతుఁ డొసంగినబుద్ధిని సన్మార్గమున నుపయోగించి పరిశీలింపుఁడు.

శ్రీకృష్ణుఁడు మహేంద్రునితో యుద్ధముచేయుచుండెను. సాత్యకి ప్రద్యుమ్నులు నొచ్చిరి. ఇంద్రుఁడు తగ్గక సమానముగాయుద్ధముచేయుచుండెను. గరుడునిప్రతాపముచాలదని హరికిఁ దోఁచెను. కావుననే రథమును దెమ్మనిపంపెను. ఇంద్రునకింతబల మేలాగుకలిగిన దను ప్రశ్నము రావచ్చును. కశ్యపముని క్షీరసాగరాంతర్భాగమున శంకరుంగూర్చి ఘోరతపస్సొనరించెను. శంకరునికరుణచే నింద్రునకుఁ బరాజయము తప్పకున్నను విశేషావమానము కలుగకుండెను. కావుననే గరుడుని శ్రీహరిని నొప్పింపఁజాలెను. అస్తమయ మయ్యెను. ఈరేయి యుద్ధమునాపి రేపుదయము ప్రారంభింతమాయని శ్రీహరియే

హరిహరయు నడిగెను. అతఁ డందుల కంగీకరించెను. వీరు యుద్ధముచేయు పారియాత్రపర్వత మాభారమును వహింపఁ జాలక భూమిం గ్రుంగెను. ఆసమయమున శంకరు నారాధింపక విజయము కల్గదని శంకరు నారాధింపఁబూనెను. గంగాదేవిని స్మరించెను. బిల్వపత్రమును గోసివైచి యందు శంకరు నావాహనముచేసెను. భక్తకల్పితరూపులుకదా హరిహరులు. లింగరూపమున నావాహనముచేసెను. భగవంతు నిరవయవుగా నుపాసించుట యత్యుత్తమమని శాస్త్రములు ఘోషించెడిని. విగ్రహరూపము నావాహనముచేయుట ప్రథమసోపానము. నిరవయవుగా నావాహనముచేసి పూజించు టుత్తమోత్తమమని శ్రీమహాభారతమున ద్రోణపర్వమున నశ్వత్థామకు వ్యాసు లుపదేశించు ఘట్టమునఁ గలదు.

శ్లో. "శుభ్రమార్వం హరం కృత్వా మహాపురుషవిగ్రహం,
ఈజివాం స్త్వం జపైర్హోమైరుపహారైశ్చ మానద. ౯౮
స తథా పూజ్యమానస్తే పూర్వదేహేప్యతూతుషత్,
పుష్కలాంశ్చ వరాన్ ప్రాదాత్తవ విద్వన్ హృదిస్థితాన్.
జన్మకర్మతపోయోగా స్తయోస్తవ చ పుష్కలాః,
తాభ్యాం లింగేఽర్చితో దేవత్వయార్చాయాంయుగేయుగే.
స ఏష రుద్రభక్తశ్చ కేశవో రుద్రసంభవః,
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభుః. ౯౭
ఆత్మయోగాశ్చ తస్మిన్ వై శాస్త్రయోగాశ్చ శాశ్వతాః,
ఏవ మేవాయజన్ దేవా స్సిద్ధాశ్చ పరమర్షయః. ౯౮
ప్రార్థయంతి పరం లోకే స్థాణుమేకం ససర్వకృత్,

కృష్ణ ఏవ హి యష్టవ్యో యజ్ఞైశ్చైవ సనాతనః. ౯౯
సర్వభూతమయం జ్ఞాత్వా లింగమర్చతి యః ప్రభుః,
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజః." ౧౦౦

(శ్రీమహాభారతము, ద్రోణపర్వము ౧౦౨ అధ్యాయము.)

ఈమహాభారతవాక్యములను జూచిన విగ్రహార్చనమునం గల యల్పత్వము తేటంబడంగలదు. మృత్తికతో లింగాకార మొనరించి పూజించుట యనంగా విగ్రహాత్మకము కాని పూజ యనిభావము. అది యుత్తమోత్తమమని స్పష్టము. ఈభాగము నుండి మఱొక్కవిశేషము కనుపట్టును. శ్రీకృష్ణుఁడు రుద్రాంశ మని, రుద్రభక్తుఁడనియుఁ, దదాజ్ఞనొందియే భూభారహరణార్థ మవతరించెననియు. నావిశేషము ఇది పాషండులకుఁ గంఠపాశ మగునేమో. ఎట్లైన నేమి శ్రీమహాభారతము హరివంశము ప్రమాణము లేదైనచో శ్రీకృష్ణుఁ డీశ్వరభక్తుఁడనియుఁ బెక్కు వరముల శివునివలనఁబొందెననియు స్పష్టము కాకమానదు. ఇంతియ కాక సైంధవవధకాలమున శ్రీకృష్ణుఁడు తనమిత్రు నర్జునుని శ్రీశంకరునికడకుం బిలుచుకొనిపోయి తత్కరుణకుఁ బాత్రు నేల చేయవలయునో యెఱుంగఁజాల కున్నాఁడను. ఆపగటి పూటపూజచేసిన కుసుమములన్నియు నాశంకరుని దేహముపై గనఁబడియెనఁట. ఈకథయు శ్రీమహాభారతముననే ద్రోణపర్వమునఁ గలదే. తా నస్త్రము లీయక శంకరునికడకుం బిలుచుకొని పోవనేల ? అను ప్రశ్నమునకు సమాధానము రానేరదు. "శేషం కోపేన పూరయేత్" అనవలయునేకాని గత్యంతరము కానరాదు. మహాభారతము ప్రమాణము కాదన్నచో భగవ

ద్విజులకుఁ దిలోదకములు విడువవలసినదియే. అందొకభాగము ప్రమాణమని తక్కినది ప్రమాణముకాదన్నచో నంత నిస్సారము నవివేకమూలము నగువాద మింకొక్కటి లోకమునఁ గానరాదు. ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను.

శ్రీకృష్ణుఁడు బిల్వముపై శంకరుని లింగమూర్తిగా నావాహనముచేసి తాఁదెచ్చిన పారిజాతకుసుమములఁ బూజించెను. ఏపదార్థము తనకుం బ్రియమో యాపదార్థమును భగవంతున కర్పించుట భక్తులధర్మ మనవలయు. దానియూల్యమక్కఱలేదు. కావుననే.

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

అని భగవంతుఁడు చెప్పెనని గీతాశాస్త్రము నుడువుచున్నది ఇట్లుపూజించి వినుతించెను. ఆస్తుతియందు విశేషముల నన్నింటిని జర్చింపఁబూనను గాని శంకరనామములను గొన్నింటి నుదాహరించి వానియర్థము లెట్టివని వేదము చెప్పుచున్నదని శ్రీవ్యాసులు వచించిరో దానిని దెల్పెదను.

శ్రుతి. "సోరోదీద్యదరోదీత్త ద్రుద్రస్య రుద్రత్వమ్,
ఏతేహీదం సర్వం రోదయంతి తస్మా ద్రుద్రాః"

"శోకాస్పదభూతో జీవః. ప్రకారాంతరేణావయవార్థావగమా ద్రోదనాదేః కారయితా. భయంకరః. ఏవం రుద్రస్య సముదాయార్థముక్త్వావయవార్థ మాహ.— రుదనా ద్ద్రావణాచ్చేతి. రుదనాన్మాయాపంజరేణ జీవపక్షిణో నిరోధనాత్.

'ఇమే త్విం ద్రింద్ర రోదసీమాయయా ఏహికాయే' ఇతి ధకారస్థానే దకారనిపాతనస్య దర్శితత్వాత్."

శ్రుతి. "తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః."

"రుణద్ధీతిరుద్రః. రావణాన్మాయయా హింసనాచ్చ. తస్యాభిధ్యానాద్యోజనా త్తత్త్వ భావాత్. భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః. ఇతి ధ్యాతృమాయానివర్తక శ్రుతేః. త్వమేవ సంసారదోషమోక్షప్రదశ్చాతో రుద్ర ఇత్యుచ్యతే. ప్రకారాంతరేణ నిర్వక్తి. రోరూయమాణో ద్రావణాచ్చేతి. రోరూయతే భృశం శబ్ద్యతే వా ఉచ్యతే వాగాలంబినీభూతః ప్రపంచోరుః తస్య ద్రావణాల్లవణోదకన్యాయేన ప్రవిలాపనాద్వా రుద్రః యద్వా రోరూయమాణశ్శబ్దేన ప్రతిపాద్యమాన ఏవ జ్ఞాతమాత్రస్సన్ సంసారస్య ద్రావణాత్ రుద్ర ఇత్యుచ్యతే. జీవ ఈశ్వరశ్చ జీవానాం రోధకో రోధనాశకః వాచ్యమాత్రలయస్థానం రుద్రో వాగేకగోచర ఇతి" అని వ్యాఖ్య.

"రోదయతిశత్రూన్ రుద్రః. స్వయంరురోదేతివా. రుధిర్ అశ్రువిమోచనే. ఏకదా బ్రహ్మోనురోధేన ప్రాప్తజన్మపరిగ్రహో ఽసౌ రురోదేతి పురాణప్రసిద్ధిః. రుదం రోదనం ద్రావయతీతి వా రుద్రతా." అని యమరము గురుబాలప్రబోధికా వ్యాఖ్య. రుద్రశబ్దమున కెట్టియర్థము వేదము తెల్పుచున్నదో. కొందఱు పాషండులు రుద్రుఁ డనఁగా నేడ్చువాఁడని యర్థము పల్కుదురు. వీరివంటివారు మఱికొందఱు పాషండులు గలరు. వారు అధోక్షజః అను శ్రీమహావిష్ణుపవిత్రనామమునకు బ్రహ్మణః అధః కాయజ్జాయత ఇత్యధోక్షజః అని సమాసము పల్కుదురు. జనార్దననామమునకు జనానర్దయతీతి అని సమాసము చెప్పుదురు. జనాన్ దుష్టజనానర్దయతీతి అని సమాసార్థము

చెప్పి విష్ణువు పరమపవిత్రనామమునఁ బరిహాసింతును. ఈయిరు దెగలవారును బాపండు లేకాని యిందుల కించుకంతయు శంక లేదు. పాపుల నేడ్పించువాఁడు లేక శోకార్తుఁడగుజీవుని దుఃఖమునుండి తొలఁగించువాఁడు అను మొదలగు నర్థములు శ్రుతి ప్రతిపాదితములు వ్యాకరణానుసారముగ నర్థము చెప్పుటకంటె శ్రుతిహితముగా నర్థము చెప్పుట యత్యుత్తమముకదా.

అతిదేవనామము:—"దేవం ప్రకాశకమతిక్రాంతః. స్వప్రకాశక ఇత్యర్థః" అని వ్యాఖ్య. ఇతరాప్రధృష్యప్రకాశము కలవాఁడు. అనఁగా నామహాదేవుని ప్రకాశము నెవ్వరు నోర్వఁజాలరని భావము.

పశుపతినామము:—"పశూనాం జీవానాం పతిః పశుపతిః." అనిగురుబాలప్రబోధికా వ్యాఖ్య. గ్రామారణ్యపశువులకుఁబతి కానఁ బశుపతి. గ్రామములనుండు పామరాదులకు, ఆరణ్యకులగు మహర్షులకు నీ వధిపతివిగానఁ బశుపతి యనునామము శివునకుఁ గల్గెను.

త్ర్యంబకనామము:—మూఁడుకన్నులుగలవాఁడనునది సామాన్యార్థము. సృష్టిస్థిత్యంతములు త్రిశబ్దార్థము "తాన్ అంబయాతి గమయతి ప్రకాశయతీతి యోగాత్ త్ర్యంబకనామ" అని వ్యాఖ్య. సర్వకర్త యని భావము. తక్కుంగల నామములు స్తుతియందే యర్థము కలదు.

"అహం బ్రహ్మా కపిలో యోఽప్యనంతః
పుత్రాస్సర్వే బ్రహ్మణశ్చాతివీరాః."

నేను, విరించియుఁ, గపిలుఁడును, అనంతుఁడును లోనగు

వారు నీపుత్త్రులమని శ్రీహరి పల్కెను. దీనిసార మేమో యెఱుంగుఁడు.

ఇట్లీశ్వరుని శ్రీహరి వినుతింపగా శంకరుఁడు ప్రసన్నుఁడై కృష్ణా! పూర్వము మైనాకాద్రియందు నన్నుంగుఱించి తపస్సొనరించితివి. (పూర్వ మనఁగా నరనారాయణు లనుపేర శ్రీకృష్ణార్జునులు బదరికాశ్రమమున నుండునపుడని గ్రహింప వలయును) అప్పుడు నేను నీకుఁ బ్రత్యక్షమై వరమిచ్చితినిగదా. దానిని స్మరింపుము. ఇతరులచే వధింపఁబడకుండ వరమిచ్చితిని. జయింపంబడకుండ వరమిచ్చితిని. నాకంటె బలశాలివి కమ్మని వరమిచ్చితిని. అది స్మరింపుము. ఇపుడు పారిజాతము నొరకునా మరల నింద్రుఁడే కొనిపోవునా యని సంశయింపకుమా యని శంకరుఁ డనియె. దీనింబట్టి చూడఁగా హరిహరులు పరస్పరము ధ్యానించుకొనువా రనియు నొక్కటియే యనియు, నొండొరులను గుఱించి తపస్సుచేయుట లోకుల కది మంచిమార్గమని బోధించుటకే యనియు, వారితరులనుండి పొందఁదగిన ఫలములు లేవనియు, నిరువురు స్వప్రకాశులేయనియు, నొక్కతత్త్వమే యారెండురూపముల నావిర్భవించెననియు, నీయిర్వురలో నెవరిని దూషించినను సమానముగాఁ బ్రతిఫలము గలుగుననియు నంతకంటెఁ బాపకార్యము లేదనియు నెఱుంగ వలయును. ఇదియే యిందలిసారము. ఇదియే వేదాంతసారము. ఇదియే భక్తుల సిద్ధాంతసారము. ఇదియే జ్ఞానులు నిష్పక్షపాతులు నగు మహాత్ముల సిద్ధాంతసారము. ఇట్టు లిష్టమునఁ దత్త్వము నెఱింగి భక్తజనులు మతాభిమానముచే దేవతల దూషింపక యభీష్టదేవతను సర్వదేవమయునిగా భావించి

ఖ్యానింపవలయునని వారక కోరుచున్నాఁడను. ఇఁక దరువాతి కథ నాలకింపుఁడూ.

## ద్వారకకుఁ బారిజాతమును దెచ్చుట.

*ఈశ్వరుఁ డిట్లు వరములొసంగి యంతర్ధానముకాగా శ్రీహరి రథమునెక్కి యుద్ధముచేయఁబోయెను. రణరంగమున కరిగి మహేంద్రా! ఇఁక యుద్ధమునకు రమ్మాయని యాహ్వానించెను. తదనుచరులగు దేవతలం గూడఁబిలిచెను. శతముఖుండును సర్వకామప్రదంబగు నరదమునెక్కి శ్రీకృష్ణుని మాఱ్కొన బయలు వెడలెను. పారిజాతనిమిత్తమే యాయిరువురకు మహాసంగ్రామము చెల్లెను. శ్రీహరి పరబలముల మర్దింపఁబూని తనజనార్దననామము సార్థకముగునట్లు పరప్రాణానిలములం గ్రోలునారాచములఁ బెక్కింటి నొక్కసారిగాఁగూర్చి ప్రయోగించి దేవతలఁ జిందఱవందఱఁ జేసెను. హరిహరిహయులు అన్యోన్యము శస్త్రముల నొప్పించుకొనఁ బూనిరి. హరి యింద్రుని రథ్యముల నొక్కొక్కదానిని బదేసి బాణములఁ బ్రయోగించి నొప్పించెను. ఆబాణములు దారుణాకారములుగ నుండెను. ఇంద్రుఁడును శ్రీకృష్ణరథ్యముల శైబ్యాదుల నాల్గింటిని ఘోరాస్త్రములఁ గప్పెను. శతమఖునైరావతమును హరియు గరుడునింద్రుఁడును విశిఖముల నొవ్వఁజేయసాగిరి. ఆరణరంగము సాంద్రద్రుమలతాన్వితము. ఆపగలంతయు నాచోట ఘోరసంగ్రామము చెల్లెను. ఆభూమి జలములపై భాగముపలె వడఁకెను. దిశలు ధూమజాలావృతము

* హాకథ హరివంశము విష్ణుపర్వము డెబ్బదియేనవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

లయ్యెను. చెంతనున్న శిఖరివరము లదరెను. మహాద్రుమములు భూమిపైఁ దొరలెను. అందుండు ప్రాణికోటి సొమ్మసిల్లి నేలం బడియెను. ఆకాశమునుండి వేనవేలుగా నిర్ఘాతములు భూమిపైఁ బడియెను. నదులెల్ల విపరీతగతిం బ్రవహింపసాగెను. వాయువులు విపరీతసూచకముగా వీవసాగెను. ఉల్కలు నిష్ప్రభలై పడెను. ఆరభధ్వనులకు భీతిల్లి భూతసంఘములు మాటికి మాటికి మూర్ఛిల్లసాగెను. జలములయం దగ్ని మండసాగెను. అత్తరుణమున నంబరమున గ్రహాయుద్ధము సాగెను. అంబరమునుండి జ్యోతిస్సులు పెక్కులు ధరబడియెను. దిగ్గజములు మోహమునమ్రగ్గెను. తక్కుంగల వనగజములు కొండలపిండు వుంబోలి పడిపోయెను. ఆకసమున గర్దభచ్ఛాయగల మేఘములావరించెను. అంతియగాక భయంకరగర్జారావముల నాజలదములు రక్తవృష్టి గురిసెను. ఇది యాకసము. ఇదిభూమి యనుజ్ఞానమెల్ల రకుంబోయెను. ఇంద్రోపేంద్రుల సంగర మీరీతి భయంకరముగా సాగుచుండెను. ఆయుత్పాతములందిలకించి మహర్షులు లోకములాకులత నొందకుండుఁగాకయని కోరుచు శాంతిమంత్రములఁ బఠింపసాగిరి. బ్రాహ్మణోత్తములు తదేకనిష్ఠ వేదమంత్రముల జపింపసాగిరి.

ఆకాలమీరీతి భయంకరముగాఁజూపట్టుడు బ్రహ్మకశ్యప ప్రజాపతిం గాంచి యిట్లు పలికెను. మహాత్మా! అదితింగూడి పొమ్ము. తనయులనిర్వుర యుద్ధము చేయకయుండ నివారింపుము' అనుటయుఁ గశ్యపమునివరుం డట్లే యని యంగీకరించి రథమునెక్కి పత్నియగు మహాసాధ్వి యదితి వెంటరాఁగా నాహవరంగమున కరిగెను. తల్లిదండ్రులు దయచేయు టెఱింగి

యుద్ధమును మాని యింద్రోపేంద్రులు రథములనుండి దిగి భూతలమున నిల్చి యరిందము లయ్యు శస్త్రాస్త్రధారులయ్యు నాయుద్యమమును మాని న్యస్తశస్త్రాస్త్రులై వందనముల నొనరించిరి. ఆపితరులు ధర్మతత్త్వవేత్తలు. సర్వభూతహితరతులు. కావున నాతనయులు పాదములపైఁ బడి నమస్కరింపఁగా లేవనెత్తి యాశీర్వదించిరి. అంత నదితి తనయులం గాంచి వత్సలారా! సోదరులు కానివారివలె నొకరినొకరు నొప్పించుచున్నారే.? ఏల? అల్పప్రయోజనము నుద్దేశించి యతి దారుణకృత్యము చేయంబూనితిరి. ఇది నాకొడుకులు చేయఁదగినపని కాదని తలంచెదను. మమ్ముఁ దల్లిదండ్రులమని గారవింతురేని యాయుధములవదలి మామాట లాలకింపుఁడు. అనఁగానే యట్లే యొనరించువారమని వారిరువు రాయుధములం బడవైచి యన్యోన్యము మాటలాడుచు గంగాస్నానమున కరిగిరి.

అత్తఱి శ్రీకృష్ణుంగాంచి దేవపతి యిట్లు భాషించెను. శ్రీకృష్ణా! నీవు సర్వలోకాధిపతివి. ముజ్జగములను బాలింప నన్ను నియమించి యభిషిక్తుం జేసితివి. నన్నింత గౌరవపదమున నునిచి మరల నీవే నన్నవమానపఱచెదవేల? నాభాతృత్వము నొందితివి. నా జ్యేష్ఠత్వము పరిగణింపవే. ఏల? శ్రీకృష్ణా! ఇట్లు నిర్వాణముంగూర్ప నెంచెదవేటికో! జాహ్నవీతోయముల మునింగి మనతల్లిదండ్రులు మరల నరుదెంచిరి. ప్రియసంగమన స్థలమే ప్రధానమని మునులు పలుకుదురు. ఏచోటఁ దల్లిదండ్రులతో నీయిరువురు కుమారులు కూడిరో ఆచోటుచేరిన వెంటనే శ్రీహరి యన్న కభయదాన మొసంగి వాగ్దానమున నలరిం

చెను. అందే ధర్మ చరణపరాయణు లగు దేవతలు కూడియుండిరి. హరి యభయదానము చేయఁగనే దేవతలు విమానారూఢులై తమతమ యిక్కలకుఁ బోయిరి. ఆసోదరులమైత్రిని బలు భంగులఁ బొగడిరి. అదితియుఁ గశ్యపుఁడు నింద్రోపేంద్రులు నొక విమానమునందే కూరుచుండి స్వర్గనగరమున కరిగిరి.

ఆనగరమున కలంకారప్రాయముగా సర్వగుణాన్వితంబై యొకహర్మ్యముండెను. ఆసౌధమున నంద ఉండిరి. భార్యం గూడియున్న కశ్యపమునిని శచీదేవి ధర్మవత్సలగావున నుపచారముల నలరించెను. ఆముని సర్వభూతహితనిరతుఁడు. మహాత్ముఁడు. ఆతెల్లవారుజామున ధర్మతత్త్వజ్ఞురాలగు నదితి హరిం గాంచి యుపేంద్రా! ఈపారిజాతమును గొని ద్వారకకుం బొమ్ము. నీపత్నికి దీని నొసంగుము. ఆమె దీనిం జూచి సంతసించునుగాక. మరల నీతరువును నందనోద్యానమున స్వస్థానమున నునుపుము. అని యశస్విని దేవమాత యదితి పలుకఁగాఁ దల్లీ! అట్లేయగుంగాకయని నారదుండు పలుకఁగా శ్రీహరియుఁ దల్లి దండ్రులకు నమస్కరించి మహేంద్రుని శచీదేవిని బిలుచుకొని ద్వారకకుఁ బయనము చేసెను.

శచీదేవి ద్వారకకుం బోవుతఱి శ్రీకృష్ణపత్నులకెల్లర కును దివ్యములగు రత్నములను వస్త్రములను మఱియుంగల కానికలను దీసికొనిపోయెను. ఎవ్వరెవ్వరి కేమే మాయవల యునని తాఁదలంచుకొన్నదో వానినెల్లఁ దీసికొనిపోయెను. శ్రీహరియు ఖచరగణస్తూయమానుఁడై సాత్యకియుఁ బ్రద్యుమ్నుఁడు కూడరాఁగా రైవతకాద్రికిఁ బోయెను. అందు శ్రీగోపాలబాలుఁ డాపారిజాతమును స్థాపించి ద్వారకకుం

బోయిరమ్మని చెప్పందలంచి సాత్యకిం గాంచి మహేంద్రసదనము నుండి పారిజాతమును దెచ్చితిని.బలరామాదుల కెల్లం దెల్పుము. ఈమహాద్రుమమును ద్వారకకుం దెచ్చెదను. కావున నగరమును జక్కఁగా నలంకరింపవలయు అని తెల్పుమని పంపెను. సాత్యకియు, శ్రీహరియానతిప్రకారము ద్వారకకుం బోయి యాశుభవార్త నెల్లరకుం దెలిపి మరలివచ్చెను. ఆవార్తలు సాంబుఁడు లోనగుహరికుమారు లాలకించి సిద్ధముగ హరిరాకకై యుండిరి; ప్రద్యుమ్నకుమారుఁడు గరుడునిపై నాపారిజాతము నునిచి ద్వారకం బ్రవేశించెను. దానివెంట దారుకుఁడు గడపుచుండ శైబ్యాదిహయరత్నములుగల దివ్యస్యందనమున హరి యరిగెను. ఆరథమునందే సాత్యకియు సాంబుఁడు లోనగువారును దక్కంగలవార్ష్ణేయులును గూరుచుండి పోయిరి. వారాయద్భుతకార్యమునకు శ్రీహరిని బెక్కుభంగుల వినుతించుచుం బోయిరి. సత్యకువలన నావృత్తాంతమెల్ల విని నాగరులగు యాదవులెల్ల నత్యాశ్చర్యనిమగ్నులై యప్రమేయమగు నాహరికార్యమును మెచ్చుకొనిరి. ఆనర్తనివాసులెల్లరు దివ్యకుసుమవిరాజితంబగు నాపారిజాతతరువరమును గాంచికాంచి తృప్తిపడఁజాలకుండిరి. ఆతరువరమున గండుఁ గోయిల లుండెను. వాని నినాదములు శ్రుతిమనోహరములై యుండెను. మదించిన కేళీలాలసపతత్త్రులందుఁ దమపిల్లలం గూడి యసంఖ్యములుగా నుండెను. ఆతరువరదర్శనముననే యందుగల వృద్ధులు వయస్సంకలితులైరి. గ్రుడ్డివారెల్ల నూత్నచక్షుష్కులైరి. రోగులెల్ల విరోగులైరి. ఆదివ్యతరుగంధము నాఘ్రాణించినంతన పూర్వోక్త మహాలాభము లొదఁగూడెను. తెల్ల

రంగుగల కోకిలములందుండఁ దిలకించి వానిపలుకుల నాలకించి యా యానర్తనివాసులందఱును హృష్టమనస్కులైరి. మఱియు శ్రీహరికి నమస్కరించిరి. నానావిధవాద్యముల మ్రోయించిరి. మధురగేయములఁ గావించిరి. ఆవృక్షరాజమహిమము నాలకించి సమీపముననున్న వారేయేసంకల్పములఁగాంచిరో యా దివ్యకుసుమగంధాఘ్రాణమున నావాంఛితములు ఫలించు చుండెను.

ఇట్లు శ్రీకృష్ణుఁడు ద్వారకానగరముం బ్రవేశించి దేవకీ వసుదేవులను, కుకురాధిపతిని, సోదరుఁడగుబలదేవుని, యాదవ వృద్ధులను మఱియు మర్యాద చేయఁదగువారినెల్లరను గాంచి యుచితరీతి సత్కరించి యనాదినిధనుఁడగు నాశ్రీహరి వారిని బంపి యథాన్యాయముగాఁ బూజింప వారు సంతోషించుచు బోవఁ దాను నంతఃపురమును బ్రవేశించెను. అంతట శ్రీకృష్ణుఁడు సత్యభామగేహమునకుం జని పారిజాతతరువరమును గొని వెంట భటులు రాఁగా నామెం గాంచెను. ఆదేవియు శ్రీహరిని బూజించెను. మహాద్రుమమగు పారిజాతముం గైకొనెను. భగవన్మహిమమునకంటె నాపారిజాత మల్పముగాఁ గను పట్టెను. ఆమహాద్రుమ మొక్కసారి ద్వారకానగరమునెల్ల నాచ్ఛాదించును. ఒకానొకప్పుడు చేతికి దొరకునంత యెత్తుగా నుండును. ఒకప్పు డంగుష్ఠమాత్రముగా నుండును. ఆతరువ రము దొరకినందున సంపూర్ణమనోరథయై యాసత్యాదేవి కరము హర్షించెను. పుణ్యకవ్రతమును జేయఁబూని సర్వసంభారముల సిద్ధపఱచు చుండెను. జంబూద్వీపమునఁ గలపవిత్రామూల్య వస్తువులనెల్ల శ్రీహరి సేకరించియిచ్చెను. పుణ్యకవ్రతమున

దానపరిగ్రహమొనర్ప జ్ఞానధనుండగు నారదుఁడే తగినవాఁడని శ్రీహరి నిర్ణయించెను.

ఆర్యులార! ఈకథయే యించుక భేదముగా బ్రహ్మపురాణమునందును గర్గసంహితయందును గలదు. హరివంశమునందుఁ గూడ నరకవధానంతరము శ్రీహరి యదితిదివ్యకవచములం గైకొని స్వర్గమునకరిగి యింద్రపూజితుఁడై యదితిని దర్శించి యాకుండలము లొసంగి*యామెయాశీర్వదింప నందుండి కదలు నపుడు సత్యభామ పారిజాతమువిషయము స్మృతిగోచరము చేయఁగా దానియున్నచోటున కరిగి పెకలించి గరుడునిపై నిడికొని వచ్చినట్లు నడుమ దేవత లడ్డుపడ వారిని దోలినట్లును, శచీదేవి పనుపున నింద్రుఁడు యుద్ధమునకుఁ బోయి యుపేంద్రుం గాంచి హితమెఱింగించి మరలిరండని యాదితేయులకుం దెలిపినట్లును శ్రీహరి ద్వారకాపురి కేతెంచినట్లును నన్నిపురాణ సారముగువిషయము. ఈకథలకుం గలభేద మింతయేకాని మిక్కిలి భేదము కానరాదు. హరివంశమున నీకథ వివరించి చెప్పినట్లితరపురాణములయందుఁ గానరాదు. కావుననే తదనుసారముగా వ్రాసితినని యెఱుంగవలయు. ఇప్పటికిఁ బారిజాతాపహరణమనుకథ పూర్తియైనది. ఇఁక దీనిసారమును వినుఁడు.

మహాశయులారా! ఈకథయం దొకవిశేషము గలదు. అదియే మానవులకు మిగుల ముఖ్యముగా గమనింపఁదగినది. శ్రీహరియు, హరిహయుఁడును మఱుదినము యుద్ధమున కారం

---

* సా దేవీ పూజయామాస ప్రహృష్టా వాసవానుజం, ప్రతిజగ్రాహతం చాపి పారిజాతం మహాద్రుమమ్ = అని మూలము.

భించిరి. కాని యొండొరుల నొప్పించుకొనుట మాని రథ రథ్యముల నొప్పింప నారంభించిరి ఏల? పారిజాతము దొరకి నది. జ్యేష్ఠసోదరుఁడగునింద్రుని నొప్పింపనేల యని శ్రీహరియు, శ్రీకృష్ణు నోడింప శక్యముకాదు పారిజాతమును మరలింపఁ జాలనని యింద్రుఁడును బీరమును గోపాడఁ బోరాడసాగిరి. బ్రహ్మపనుపున గశ్యపమునియుఁ దత్పత్నియు నరుదెంచిరి. వారిని జూచినంతనే యింద్రోపేంద్రానుజులు రథములను దిగి యస్త్రశస్త్రముల ధరింపక వారికి సాష్టాంగనమస్కారములు చేసిరి. వారిరువుర నాతల్లిదండ్రులాశీర్వదించిరి.తల్లి వత్సలారా! సోదరులు పరస్పరజయకాంక్షులఁ బోరాడుట న్యాయము కాదు. ఇతరు లట్లు పోరాడుదురు. ఇది నాతనయులకుఁ దగిన పనికాదే యనిరి. ఇంద్రకృష్ణు లిర్వురు గంగావారిస్నానమాడఁ బోయిరి. అందింద్రుఁడు శ్రీకృష్ణుని బ్రార్థించెను. నీవిచ్చినదీప దవి. నీవె యవమానించిన నేనేమిచేయువాఁడ ననిరి. అంత హరి ప్రమోదమందెను. తల్లిదండ్రులం గూడిపోయిరి. క్షణ మాత్రమున మనశ్శాంతి యెల్లరకుం జేకూరెను. కావున నెవ్వఁడు తనయపరాధమును దానెఱుంగునో యంతవఱకే యతనికి దండనముకాని యవ్వల నతఁడు జ్ఞానియేయని యెఱుం గఁదగు నన్ననీతి నీకథ మనకు బోధించుచున్నది. తల్లిదండ్రుల యాజ్ఞ నంగీకరించువారు సకలపురుషార్థముల నొందఁజాలుదు రని యీకథాసారము. పదార్థలోభమున గలుగువిరోధ మత్య ల్పమనియుఁ దెలివిగలవా రప్పదార్థమును దుచ్ఛముగా భావిం తురనియు మన మెఱుంగవలయును. ఎట్టిశక్తిగలవారైనను బెద్దలమాటకు జవదాఁటరాదనియు, నట్టివారు త్రిలోకవిఖ్యాతు

లగుదురనియుఁ, దనకుఁ గలగొప్పదనము తల్లిదండ్రులకడఁ జూపరాదనియు, వారిని జూచినపుడు వినయ మూనవలయు ననియు నీకథాసారము. గురువులయానతి మీఱినవారి కిహపర ముల సౌఖ్యము లభింపదని యిద్దానినుండి మనము గ్రహింప వలయును.

సత్యభామ శృంగారగర్వము గలదనియు జ్ఞానశూన్యు రాలనియుఁ గొందఱు మూర్ఖు లాదేవియం దపకీర్తి నారోపిం తురు. అట్టిదుస్స్వభావ మాదేవి కుండినచో శ్రీహరికిఁ బత్ని యగునా? ఆమెమాటల నాహరియాలకించునా? భగవంతుఁడు సుగుణములను బ్రేమించుఁగాని రూపమును బ్రేమింపఁడుగదా. అట్టిసుగుణవతియు, భక్తిపరవశయుఁ గాకయున్న నామెకొఱకు నింతపాటుపడి పారిజాతమును దెచ్చునా యని యాలోచిం చుట బుద్ధిమంతులలక్షణము.

"సా దేవీ పూజయామాస ప్రహృష్టా వాసవానుజమ్."

అను వాక్యము నాలోచింపుఁడు. పారిజాతమును దెచ్చితినని హరిపలుకఁగాఁ గేవలసౌందర్యవతియేయైన మగనిం గౌఁగిలించుకొనవలయును గాని సంతసమునఁ బూజించునా? పతిని భగవంతుఁడని భావించినదికనుకనే పారిజాతకుసుమప్రస్తావ మునఁ దపస్సుచేయఁబోయెద ననుజ్ఞనిమ్మని ప్రార్థించినది. తప స్సొనరించునిచ్ఛ కేవల కామాతురయగుస్త్రీకిం గల్గునా? పరమ సాధ్వికనుకనే యామెకోరికను భగవంతుఁ డవధరించి నెఱవే ర్చెను. ఇంతియకాక సత్యభామ భూదేవియని పురాణములు ఘోషించుచున్నవి. కావున సత్యభామకంటె రుక్మిణి భగవత్ప్రి యురాలని రుక్మిణికంటె సత్యభామ యధికప్రీతిపాత్రయని

తలంపక వాదింపక భగవత్పాత్ర్నులయం దొక్కరీతి భక్తి గలిగి యుండుటయే శ్రేయస్కరమని యెఱుంగవలయును. ఇంకఁ దరువాతి చరిత్రము నాలకింపుఁడు.

సత్యభామ పుణ్యకవ్రతమును జేయుట.

* భగవంతుఁడు తలంచినంతనే తపోధనుఁడగు నారద మహర్షి స్వర్గలోకమునుండి యరుదెంచెను. మునివరుని యథా విధిగఁ బూజించెను. వ్రతదానమును బరిగ్రహింపుమాయని వినయమునఁ బ్రార్థించెను. ఆముని యట్లే పరిగ్రహించెదనని యంగీకరించి స్నానముచేసి క్రియాకలాపములం దీర్చి వచ్చెను. ఆమునివరుని జక్కఁగాఁ బూజించి గంధమాల్యాంబరాదు లర్పించి మృష్టాన్నము నిడి భుజింపఁజేసెను. ఆయన్నము పరమ పవిత్రము, సర్వకామప్రదము. భోజనానంతర మాశ్రీకృష్ణ మూర్తి సత్యభామంగూడి మునియెదుట నిలిచెను. సత్యాదేవి భర్తృకంఠమునఁ బూలహారము వైచి పారిజాతవృక్షమునఁ గట్టివేసెను. భర్తయనుమతి నుండి నారదమహర్షి కుదకధారా పూర్వకముగా శ్రీకృష్ణుని దానమిచ్చెను. దానానంతరము పాఁడి యావుల వేయింటి నొసంగెను. కాంచనమును బర్వతాకార ముగాఁ బోసి యొసంగెను. రత్నముల నొసంగెను. సతిలధా న్యముల నొసంగెను. వానినెల్లఁ బరిగ్రహించి ప్రహృష్టాంత రంగుఁడై శ్రీహరిం గాంచి యిట్లు భాషించెను.

శ్రీహరీ ! నిన్నుదకధారాపూర్వకముగా సత్యభామ దానమిచ్చెను. కాన నావాఁడ వైయైతివి. నావెంటరమ్ము. నేఁజెప్పిన

* ఈకథ హరివంశవిష్ణుపర్వము డెబ్బదియాఱవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియవలయును.

ల్లెల్లఁ జేయుచుండుము. అనఁగా హరి మునివర్యా! ఇది ప్రథమపక్షమే. అట్లే చేయుచుండెదను. అని పలికి ముని పయనము చేయఁగా వెంటఁ బోవసాగెను. మునివరుఁడు పెక్కు భంగులఁబరిహాసములు పలుకసాగెను. హరీ! నీవుండుము నేఁబోయెదననియెం. పూలహారమును బట్టుకొని రమ్మని యీాశ్వసాగెను. ఆపుష్పదామమును దీసివైచి కృష్ణా! నిన్నువదలెదనుగాని సవత్సయగు కపిలధేనువు నిమ్ము. అది మూల్యముగా గ్రహించి నిన్నిచ్చెదను సతిలకృష్ణాజనమును బంగారుతో నిచ్చెదవా వదలెద నిన్ననియె. ఇదియే నీకుమూల్యముని శంకరుఁడు వాక్రుచ్చెను. అట్లే యిచ్చెదనని పలికి పరిహాసవచనముగా మరల శ్రీహరి నారదా! నీమదిఁగలకోరికఁ దీర్చెద. వర మడుగుము. దాని నిచ్చెద. నీయందుఁ నాకెక్కుడు ప్రీతి కలదుకదా. అన నారదముని యిట్లు బదులుచెప్పెను.

నిరంతరము నాయందుఁ బ్రీతుఁడవై యుండుము. నీవు శ్రీమహావిష్ణువవు. సనాతనుఁడవు. కాన నిరంతర ప్రీతుఁడవైన నదియే పదివేలు. నీయనుగ్రహమున నీసాలోక్యము నొందెదను. సాధువులకు నీవే పరమగతివి. కావున నయోనిజుఁడనై జన్మించునట్లును, బ్రాహ్మణవంశమునందే పుట్టునట్లులు ననుగ్రహింపుము. అన విని శ్రీహరి యట్లేయగుఁ గాక యనియె. ఆవరమునకుఁబరమానందమంది నారదముని హరిని వినుతించెను. సత్యాదేవి హరికాంతలనెల్ల నాహ్వానించియుండెను. వారినెల్ల నుచితరీతి గారవించి కానికల నొసంగెను. శచీదేవి స్వర్గనగరమున శ్రీహరికొసంగిన యుపాయనములనెల్ల నాపారిజాత మాసత్యాదేవి కొసంగెను. వాసుదేవాజ్ఞం దలఁదాల్చి పార్షదులెల్ల నచ్చటి

కరుదెంచి సన్మానితులైరి. ఆపారిజాతమహాత్మ్యము నెల్లరుం గొనియాడిరి. కన్నులార దానిం దిలకించిరి. ఆమహోత్సవమునకుఁ గుంతీదేవి తనయులంగూడివచ్చి చూచెను. ద్రౌపదియు సుభద్రయు వచ్చిరి. శ్రుతశ్రవయుఁ బుత్త్రసహితయై వచ్చెను. సపుత్త్రుఁడై భీష్మకుఁ డరుదెంచెను. తక్కుంగల బంధువులు మిత్త్రులు వచ్చిరి. కృష్ణార్జునులు పరస్పరమైత్త్రిని మెలంగిరి. ఆరేయియంతయుఁ బురమున నంతఃపురమున మిగుల మహోత్సవములు సాగినవి *ఒక్కసంవత్సర మిట్లు గడువగా మరల శ్రీకృష్ణుఁ డాపారిజాతమును స్వర్గమునకుఁ జేర్చి నందనోద్యానమున స్థాపించెను.

పారిజాతముం దీసికొని సురపురమున కరిగి శ్రీహరి తండ్రియగు కశ్యపమునిని, జననియగు నదితిని దర్శించెను. ఇంద్రుఁడు కూడనుండఁగా జననీజనకుల బహూకరించెను. నమస్కరించి యెదుట నిలువఁబడియున్న కృష్ణుంగాంచి యదితి వత్సా! మీసోదరులకెల్లపుడు నిట్లే సౌభ్రాతృత్వము వెలయుఁగాక. జనార్దనా! నాయీమనోరథమును బూరింపుమా అని యడుగ నాత్మవేత్తయగు శ్రీహరి యట్లే యొనరింతు ననియె. పిదప వారిచే సెలవంది కృష్ణపరమాత్మ మహేంద్రుం దిలకించి కాలోచితముగా నిట్లు పలికెను. సోదరా! పరశివుఁ డాజ్ఞాపించెను. అవధ్యులగు రాక్షసుల భూమ్యంతర్భాగమున నుండువారలం బొలియింపుమనియే యాయాజ్ఞ యని యెఱుంగుము. పదిదినములలోపల వారలం బొలియింతును. నాతోఁగూడి మహా

---

* సంవత్సరే తతో యాతే కేశిహాపరసత్తమః, పారిజాతం పునస్స్వర్గమానయత్సర్వభావనః అని మూలము.

త్తుఁడగు ప్రవరుఁడు జయంతుఁడు లోనగు శూరులు వత్తురుగాక. మానుషదేహధారిని నేనొక్కఁడనే. రెండవవాఁడు జయంతుఁడు నాకుందోడుండవలయు. ఆదానవులు బ్రహ్మవరగర్వమున నవధ్యులఁట. సురాసురలు వారిం జంపలేరు. మానుషదేహము గలవాఁడుగ నున్నాఁడనుగాన నేఁజంపక తప్పదు. అనుటయు మహానందమున నింద్రుఁ డట్లేయని శ్రీహరిని గౌఁగిలించుకొనియెను.

## పుణ్యకవ్రతవిధానము.

* పుణ్యకవ్రతనియమములను బూర్వము పార్వతీదేవి నిర్ణయించెను. వానినే యెల్లవారును స్వీకరింతురు. శ్రీహరి పారిజాతమహాద్రుమమును ద్వారకానగరమును జేర్చినపిదప నారదముని స్వర్గమునుండి ద్వారకకుం బోయెను. దేవాసురమహాయుద్ధము సాగనుండఁగా షట్పురదానవులను వధింపుమని శ్రీకృష్ణుని శంకరుఁ డాజ్ఞాపింపఁగా, శ్రీకృష్ణుని చెంతఁ గూరుచున్న నారదమహర్షిని వేదవేదాంగపారంగతుఁడని తెలిసికొన్నది గావున రుక్మిణి ప్రశ్నించెను. ఆ త్తఱుణముఁన జాంబవతియు, సత్యభామయు లోనగు కృష్ణపత్ను లందుండిరి. నారదమునీ! సకలధర్మతత్త్వజ్ఞుఁడవు. ధర్మానుష్ఠానతత్పరుఁడవు. కావునఁ బుణ్యకవ్రతనియమముల నుపదేశింపుము. దానఁ గలుగుఫలములను, దానకాలమును, దత్సిద్ధిని విన వేడుక యగుచున్నందున దయయుంచి వినిపింపుము. అన విని నారదుఁ డిట్లు తెలిపెను. ధర్మనిష్ఠగల యోరుక్మిణీ! సపత్నులం గూడి యున్న నీకా వ్రతరాజ

* ఈకథ హరివంశవిష్ణుపర్వము డెబ్బది యేడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

విధుల నుపదేశింతును. ఆలకింపుము. వ్రతరాజమును దీనిని దొల్లి పార్వతి యాచరించెను. వ్రతాంతమున నామె చెలికత్తియల కిట్టులాజ్ఞాపించెను. నాతోఁబుట్టువులగునదితిలోనగువారిని బిలువుఁడు.వారెల్లఁ జేయవలయు ననిరెు. పతివ్రతయని విఖ్యాతిని గాంచిన శచీదేవియు, మహాభాగయగు రోహిణియు ఫాల్గునీదేవియు, రేవతియు శతభిషాదేవియు, మఘాదేవియు వీరెల్లఁ బార్వతినారాధించి వ్రతవిధుల నెఱింగిరి. గంగా సరస్వతీ వేణీ గోదా వైతరణీ గండకీప్రముఖ నదీకాంతలెల్లరును, లోపాముద్రాదిపతివ్రతలును వ్రతవిధులనెఱింగిరి. హిమాలయాత్మజలును వహ్నికన్యలును, స్వాహాదేవియు, యశస్వినియగు సావిత్రియుఁ గుబేరకన్యయగు బుద్ధియు, వరుణపత్నియు, యమునిసాధ్వియు, వసువులపత్నులును, హ్రీశ్రీధృతాకీర్తులును, మేధయుఁ, బ్రీతియు, మతియు, ఖ్యాతియు, సన్నితియు, సర్వహితమును గోరు నితరకాంతలును బార్వతియొనరించువ్రతమును జూడఁబోఁగా వారినెల్ల బహూకరించెను. తిలరత్నధాన్యములును బర్వతాకారములుగాఁ బోసి దానమిచ్చెను. వస్త్రములు, భూషణములు, మాల్యములు లోనగువాని నొసంగెను. ఆమె యొసంగిన దానములను గైకొని యాపతివ్రతాశిరోమణులెల్ల ననేకకథలను జెప్పుచుఁ గూరుచుండిరి. ఆపుణ్యకవ్రతమునకు సంబంధించిన యనేకకథలను వారికెల్ల నాపార్వతి తెల్పెను. పుణ్యకవ్రత విధానమును వారి కాయంబిక తెలిఁగించెను. వారియందఱియను మతినొంది చంద్రపత్ని పార్వతింగాంచి పుణ్యకవ్రతవిధి దెలుపుమాయని ప్రశ్నించెను. రుక్మిణీదేవీ! నేనందుండివినుచుంటిని. పార్వతి యామెకు విధిందెల్పెను. దానమునకుగా నునిచిన రత్న

పర్వతమును బార్వతి నాకే యొసంగెను. వాని గ్రహించి నేను బ్రాహ్మణుల కొసంగితిని. నేను సంసారబాధలు కలవాఁడను గాను గావున నితరులకే యిచ్చితి. పార్వతి యరుంధతిం బిల్చి యేనియమములఁ దెల్పెనో, రుక్మిణీ! వానినెల్ల నీకుం దెల్పెదను. ఆపార్వతి చేయుచుండువ్రతమును నేనెట్లు చూచితినో యట్లే తెల్పెదను.

## పుణ్యకవ్రతవిధులు.

* రుక్మిణీ! తన్నడిగిన పతివ్రతం గాంచి నేను వినుచుండఁ బార్వతి యిట్లు పలికెను. ఓశుచిస్మితా! భర్త్రనుగ్రహమున నేను సర్వజ్ఞయే యగుదును. నన్నీవ్రతరాజ మొనరింప శంకరుఁడాజ్ఞాపించెను. ఈవ్రతము సనాతనమని యభివృద్ధిప్రదమని యెఱుంగుదువుగాక. ఓయరుంధతీ! మహాదేవునను గ్రహమున నేనెఱింగితిని. శంకరునాజ్ఞను గొని పుణ్యకవ్రతనియమముల నన్నింటిని వదలక యనుసరించితిని. దానిఫలమున సతీత్వము, ధర్మాచరణపరాయణత్వము శాశ్వతముగ నుండును. తన్నియమములను బురాణములు విశేషించి తెల్పుచున్నవి. దాన ముపవాస పుణ్యములు చక్కఁగా నాచరింపఁబడినను బతివ్రతలు కానివారలకు నిష్ఫలము లగును. †ఏస్త్రీలు భర్తను వంచింతు

---

* ఈభాగము హరివంశవిష్ణుపర్వము డెబ్బదియెనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

† యా వంచయంతి భర్తారం యోనిదుష్టాశ్చ యాః స్త్రియః యోనిదోషాత్పుణ్యఫలం నాశ్నంతి నిరయంగమాః. ౧. సాధ్వ్యో హి జగద్ధారయంతి సుశీలాః పతిదేవతాః, అనసూయా ధర్మనిత్యాశ్చ సతీపంథానమాశ్రితాః. ౨. అవాగ్దుష్టా శౌచయుక్తాః ధృతిమత్యః శ్శుభవ్రతాః, సతతం సాధువాదిన్యో ధారయంతి జగత్త్రయం. ౩. అనుశాసనము.

రో, ఎవ్వతుకలు వ్యభిచారము చేయుచుందురో వారు వ్రతము నాచరించినను బుణ్యఫలములను బొందరు. నరకమున కరుగుదురు. మంచినడవడిక గలిగి పతియే దేవతయని భావించునట్టి పురంధ్రులు జగంబుల నిలువరింపఁ గలరు. ఇతరపురుషులం గోరక ధర్మకార్యనిరతలై పూర్వపతివ్రతల మార్గము ననుసరించుచు, దుష్టవాక్కులం బలుకక, సదాచారము గలిగి సద్వ్రతముల నాచరించుచు సర్వదా శుభవాక్కులం బలుకుచునుండు స్త్రీలు జగంబుల నిలుపఁజాలుదురు.

భర్త వ్యాధిబాధితుండైనను, బతితుఁడైనను, దీనుఁడైనను, భార్య తూలనాడక భగవంతునిగా భావింపవలయును. ఇదియే సనాతనస్త్రీధర్మము. ఒక్కప్పుడు చేయరానిపను లొనరించినను నిర్గుణుఁడైనను భార్య పతివ్రతయగునేని, యాభర్తను దనను దరింపఁజేయఁ గలదు. వ్యభిచారిణియగు స్త్రీలకుఁ బ్రాయశ్చిత్తము లేదు. ఆవనిత మృతినొందినట్లే. కఠినవాక్కులు పలుకుట దోషమేయైనను బ్రాయశ్చిత్తము చెప్పఁబడినది. ఏవ్రతమునైనను భర్త యిచ్ఛానుసారము చేయవలయు. ఉపవాసమునట్లే చేయవలయును. లేకున్న సద్గతి యాస్త్రీలకు దొరకదు. ఎన్నికల్పములు భర్తయనుమతిం గొనక యుపవాసాది నియమములఁ బూనినను నిష్ఫలమేయగును. వ్యభిచరించినచో నాస్త్రీ పశుపక్ష్యాదిజన్మములం గాంచును. అనేకకల్పముల కాయపత్కర్మపరాయణురాలు మనుజత నొందినను జండాలయోనిం బుట్టువుం గాంచును. నీచమృగములనంబడు కుక్కలం దినును. ఓయరుంధతీ! స్త్రీలకు భర్తయే దైవమని పెద్దలు చెప్పిరి. ఏయబలామణిశుశ్రూషలవలన భర్త సంతోషించునో యాస్త్రీ పతి

వ్రతయు ధర్మచారిణియు నగు. కౌతూహలహతలగు నారులకు లోకము శుభము గల్పింపఁజాలదు. భర్తయందే సర్వదా మన స్సెవరికి నిలిచియుండునో మనోవాక్కాయకర్మముల నెవరు భర్తలను మీఱరో వారికే పుణ్యకవ్రతఫలము లనంతంబులుగాఁ గల్గును. పుణ్యకవ్రతవిధుల సంపూర్ణములుగా నావలన విందువుగాక. తత్ఫలంబుల నేఁ జక్కఁగాఁ గాంచితిని.

పురంధ్రి ప్రాతఃకాలమున లేచి స్నానము చేయవలయును. పతియనుమతి నొందవలయును. ఉపవాసము చేసి వ్రతము చేసెదనని పతికిం దెలుపవలయును. అత్తమామల పాదములు శిరముసోఁక నమస్కరింపవలయు. పెద్దలందుండినచో వారికి నమస్కరింపవలయును. ఔదుంబరపాత్రముం గొని కుశాక్షతలం దానితోఁ జేర్చి గోవు దక్షిణశృంగమును దడుపవలయును. ఆజలమును గ్రిందపడకముందే పట్టుకొని వానిని స్నానముచేసి నియతుఁడై యున్నపతి కొసంగవలయును. తా నాజలముల శిరస్సున జల్లుకొనవలయును. గోశృంగాభిషేకజలములను శిరమునఁ జల్లుకొనిన సర్వతీర్థముల స్నానముచేసినఫల మబ్బు. త్రిలోకనదీస్నానఫలము కలుగును. ఉపవాసములయందు సర్వవ్రతములయందు నీస్నానమే ప్రధానముగా నాచరింపవలయును. ఈ స్నానము స్త్రీలకుఁ బురుషులకును సామాన్యమే కాని భేదము గాదు. నాతపోబలముచేతను, ఈశ్వరతేజస్సుచేతను దీనిం గాంచితిని. శల్యవిద్ధముగాని శయ్యపైఁ బరుండవలయు. ఆసన మట్టిదిగానే యుండవలయును. పాదప్రక్షాళనముశబ్దముకలుగక యుండఁ జేయవలయును. ఆవ్రతకాలమున నశ్రుజలముల విడువరాదు. రోష మూనరాదు. ఎవ్వరితోడను గలహింపరాదు. ఇవి

యుపవాసఫలమును వ్రతఫలమును బాడుచేయును. ఈ కార్యములందుఁ దెల్లనివస్త్రము ధరింపఁదగినది. రెండవవస్త్ర ముప వాసవ్రతములయం దుండవలయును. తృణమయము లగుపాదుక లీవ్రతకార్యమునఁ బ్రధానములు. ఇదియే యుపవాసకర్తవ్య నియమము. *కాటుక, గోరోజనము, గంధము, పుష్పములు వ్రతోపవాసములయందు నిత్యత్యాజ్యములు. దంతకాష్ఠము, అభ్యంగస్నానము, నలుగుపెట్టుట వదలవలసినవి. పరిశుద్ధత గలుగుటకు మృత్తికతో నివియన్నియుఁ జేయఁదగినవి. బిల్వ ఫలములు, ఉసిరికపండ్లు, వెలగపండ్లుఅనువానిచే స్త్రీలు వ్రతోప వాసములయందు శిరస్స్నానము చేయవలయును. మృత్తికగలి పినజలము స్నానార్థ ముపయోగింపందగును. అరుంధతీ! తల యంటుకొని స్నానముచేయరాదనియు, నది వ్రతభంగహేతు వనియు నెఱుంగుము. పాదాభ్యంగముగాని నూనె దేహమునకు లేపనముచేసికొనుట తగదు. † ఎద్దులబండిగాని, ఒంటెలఁగట్టిన బండిగాని కంచరగాడిదలఁ గట్టినబండిగాని యుపవాసముల యందు వ్రతములయందు నుపయోగింపరాదు. వానిపైఁ గూరు చుండి పయనము సాగింపరాదు దిస్సమొలతో స్నానముచేయుట దోషమని వ్రతకాలమున నియమము. చంద్రపత్నీ! నదీజల

* అంజనం రోచనం చాపి గంధాన్ సుమనసస్తథా, వ్రతకే చోప వాసే చ నిత్యమేవ వివర్జయేత్. ౨౦. దంతకాష్ఠం శిరస్స్నాన ముద్వర్తన మథాపి వా, వివర్జితం మృదా సర్వం శౌచార్థం తు విధీయతే. ౨౧. బిల్వా మృతఫలైర్నిత్యం శ్రీఫలైశ్చ సమాచరేత్, ప్రక్షాళనం వై శిరసః సదా మృ న్మిశ్రితైర్జలైః = అని మూలము. † గోయానముష్ట్రయానం చ ఖరయానంచ వర్జితమ్=అని మూలము.

ములుగాని, సెలయేళ్ల జలముగాని స్నానమునకుఁ బ్రశస్తమని యెఱుంగుము. అవిసంభవింపనిచోఁ దటాకముగాని, బావిగాని, కమలములు గలకొలనుగాని పనికివచ్చునని నిశ్చయించుకొనుము. పై జలముండుకడకుం బోయి స్నానముచేయవలయుఁగాని యాజలములం దెప్పించి యందు స్నానముచేయుట మంచిదిగాదు. ఆజలములు సంభవింపనిచో, నంతఃపురవాసము గలవారు మాత్రము వానిం దెప్పించి మట్టికుండలయందుఁ బోసి వానితో స్నానముచేయవచ్చును. మఱియు నాజలములఁ దెప్పించి క్రొత్తకుండలలోఁ బోయించి దానితో స్నానము చేయవలయును. శిరస్స్నానము చేయవలయుంగాని కంఠస్నానము చేయరాదు. అది వ్రతభంగమును గల్పించును. అరుంధతీ! ఇవి వ్రతాంగనియమములని యెఱుంగుమని పలికి పార్వతి మరల నిట్లు చెప్పందొడంగెను.

## వ్రతవిధులు.

*ఈరీతిఁ బతివ్రతయగు పురంధ్రి నియమముగాని యొక సంవత్సరము, లేక యాఱునెలలు, ఒక్కమాసముగాని యుండవలయును. వ్రతమునకుఁ బతివ్రతలగుస్త్రీలను బదునొకండుమంది నాహ్వానింపవలయు. శ్రద్ధతో వారిని బిలువవలయును. తాను నియమములఁ బాటించియే యుండఁదగు. ఇట్లులైనఁగాని వ్రతఫలము రాదని యోగదృష్టి నెఱింగితిని. వ్రతము చేయఁబూనినకాంతామణి జలములచే వారిని నియమింపవలయు. కాలదేశానుసారము వారికి మూల్య మర్పింపఁదగు. పిదపఁ

* ఈకథయుం విష్ణుపర్వము డెబ్బదితొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

గృష్ణపక్షనవమియందు వారి నారాధించి వ్రతసమాప్తి చేయ వలయును. వ్రతోపవాస మొకయహోరాత్రముగాని పగలు మాత్ర ముపవసించినఁ జాలదు. ఈయుపవాసము తొలుతను వ్రతాంతదినమునందును రెండుపర్యాయములు చేయవలయుం గాని యొకపర్యాయముచేసిన వ్రతఫలము కలుగదు. *కత్తితో నఖములు తీసివేయవలయును. భర్తయు నట్లే చేయవలయు. నఖవిసర్జనమున క్షురము(కత్తి) ప్రధానముకాని మఱియొకపద్ధతి పనికిరాదు. ఆపగటియందే నలుఁగుపెట్టుకొనుట స్నానము పూర్వోక్తప్రకారము చేయఁదగినది. ఈ పుణ్యకవ్రతమున స్నానము వివాహకాలమునఁ జేసినట్లు చేయఁదగునని నియమ ముకలదు. అలంకారము పుష్పమాలాధారణము చేయఁదగినది. కుంభములనున్నయుదకమున స్నానముచేయునపు డీమంత్ర మును బఠింపవలయును. ముందు భర్తృపాదముల స్పృశించి మానసికముగఁగాని వాక్కుగాఁగాని యామంత్రమును బఠింప వలయును.

మంత్రము. "ఆపోదేవ్య ఋషీణాం హి విశ్వధాత్ర్యో దివ్యా మదంత్యోయాశ్శంకరా ధర్మధాత్ర్యః, హిరణ్యవర్ణాః పావ కాశ్శివతమేన రసేన శ్రేయసో మాం జుషంతు."

అనునదియే తన్మంత్రమని యెఱుంగుము. ఇది యుదక మంత్రము. ఇది వ్రతాంగస్నానమందే కాక యితరస్నానముల యందును బఠింపవలయును. అరుంధతీ! ఈమంత్రము స్త్రీలకుగాఁ బురాణములయందుఁ జెప్పఁబడినది. మఱియుఁ బురాణముల

---

* క్షురకర్మ తతో భర్తురాత్మనశ్చైవ కారయేత్ = అనిమూలము. ఆత్మనశ్చ కేశవర్జం నఖమాత్రనికృంతనమ్. అనివ్యాఖ్య.

యందుఁ గొన్నిమంత్రములు స్త్రీలకుమాత్రమే చెప్పఁబడినవి. వానిని బఠించుచు స్నానముచేయవలయును.

## పురాణమంత్రములు.

"శుభావ్యయా గుణినీ యుక్తధర్మా
భర్త్రా సాకం మమ దాస్యావరేణ,
మాకర్మణా మనసావాపి వాచా
భర్తుర్భవేయం రుషతీస్వాంవశంగా.
సపత్నీనామధినిత్యం భవేయం
సపుత్రా స్యాం సుభగా చారురూపా,
సంపన్నహస్తా గుణవాదినీచ
సర్వాత్మనా స్యాం మా దరిద్రా భవేయం.
పతిశ్చమే స్యాత్సుముఖో మత్ప్రితీష్టో
నిత్యం మద్భక్త స్యాన్మన్మతిర్మద్గతిశ్చ,
ప్రీతిశ్చ నౌ స్యాచ్చక్రవాకానురూపా
మనోవిరాగో న భవేత్సాధువత్స్యాత్.
లోకేషు సాధ్వీనాముత్తమానాం వ్రజేయం
యాభిస్సర్వం ధార్యతే విశ్వరూపం,
ఉభే కులే యాశ్శుభాః పావయంతి
పితుర్భర్తుశ్చ పతిభక్త్యార్జితాశ్చ.
భూమిర్వాయుర్జలమాకాశమగ్ని
రంతఃక్షేత్రజ్ఞః ప్రకృతిర్యో మహాంశ్చ,
అహంకారశ్చ మమ సాక్ష్యే నియుక్తాః
స్మరేయుర్మే నిశ్చయంచ వ్రతంచ.
య్యైరారబ్ధో దేహినాం భౌతికోయం

విధిస్సతావ్రదైర్యర్ఘాతయుక్తైః స్వబీజైః,
సంత్వేతే మే సాక్షిణస్సర్వసంస్థా
వ్రతే చాస్మిన్నిశ్చయే చాపి నిత్యమ్.
చంద్రాదిత్యౌ పుణ్యసాక్షీ యమశ్చ
విశస్సర్వా దశ చాత్మా చ మేయమ్,
సంత్వేతే వై సాక్షిణస్సర్వసంస్థా
వ్రతేచాస్మిన్నిశ్చయే చాపి నిత్యే."

అరుంధతీ! ఈపురాణమంత్రముల చేత సర్వపూజాద్రవ్యముల నభిషేకింపవలయును. వ్రతారంభము మొదలు మంత్రము లివ్వి పఠింపందగినవని పురాణములయందుఁ జెప్పఁబడినది.

ఇట్లు మంత్రములఁ బఠించుచు స్నానము చేసి ధౌతవస్త్రములను గట్టుకొని భర్తకు నట్లే ధౌతాంబరములఁగట్ట నిచ్చి యేవిధమునన్నైన నాత్మానుకీర్తనము చేయక యుండవలయు. వస్త్రములు క్రొత్తవి కావలయును. వానిని భార్య యుదుకరాదు. భర్తకట్టుకొనువస్త్రమునందుఁ దనచీరయంచు దారమును గూర్చవలయు. ఆవల శుచిర్భూయై మనోనిగ్రహముగలిగి జ్ఞానవిజ్ఞానకోవిదుఁడగువిప్రునకుయథాశక్తి న్యాయము ననుసరించి భోజనము పెట్టవలయును. భర్తకుంగూడ నాయనతోఁ గూడుచుండఁ జేసి భుజింపఁజేయవలయును, ఆబ్రాహ్మణునకు వస్త్రద్వయము నీవలయును. విభవానుసారముగ శయ్యాసనగృహధాన్యదానదాసీజనముల నీవలయును. శక్తియున్న రత్నభూషణముల నీవలయును. సర్వధాన్యముల దాన మిచ్చునపుడు తిలలు కలుపవలయును. వస్త్రములకు రంగుల నిష్టానుసారము వేయవచ్చును. ఏనుఁగులు గుఱ్ఱములు గోవులుగూడ నీయఁదగినవి. లవణప్రతి

మను నవనీతప్రతిమ నీయవలయును. గుడమధుస్వర్ణప్రతిమలను గూడ నీయఁదగు. సర్వపరిమళవస్తువులప్రతిమల నిచ్చిన బహు ఫలములు గలుగును. పుష్పహారములు రౌప్యోదుంబరప్రతిమల నీఁజను. ఫలములు వస్త్రములు దారువిచిత్రశిల్పభాసమానప్రతిమల నొసరించి యనుకూలమున్న దానమియ్యఁదగును. దధి పయస్సుల దానమిచ్చిన మహాఫలంబు గలుగును. నేయి దూర్వలు దానమీయ మహాఫలము. దేశకాలానుసారముగను శక్తిననుసరించియు నిందుఁ గొన్నియే నన్నియే నీయఁదగు. ఈదానములు భర్తయిష్టానుసారము చేయవలయుఁ గాని తదనుమతిం గొనక యిచ్ఛానుసారము చేయరాదని యొలుంగుము. తిలపాత్రము దానమీయరాదని కొందఱిమతము. కపిలాధేనుదానము తప్పకయీఁదగినది. కాంస్యదానము ముఖ్యము. వాసస్తిలాన్వితకృష్ణాజినదానము వ్రతఫలమును మూఁడింతలొసంగును. దర్పణము కూర్చయు నిచ్చుట మంచిది. ఈదానముల నొసంగిననాతిమిన్న సర్వకామముల నొందఁగలదనుట ధ్రువము. మఱియు ముందు వృద్ధిగలుగు. పుత్త్రసంతతి వృద్ధియగు. అదృష్టము రూపము గలుగును. మృష్టహస్తయు ధనాఢ్యయునై యాపతివ్రత ప్రఖ్యాతింగాంచును. రూపగుణాన్వితలగు కన్యకలఁగోరునేని కలుగుదురు. ఆకొమరితలును బహుపుత్త్రికాపుత్త్రకులం గాంతురు.

---

ఓయరుంధతీ! ఈమహావ్రతమును దొలుత నేనే చేసితిని. ఇది పుణ్యకవ్రతమనియు సుమావ్రతమనియుఁ బ్రఖ్యాతింగాంచినది. స్త్రీలకుఁ జెప్పఁబడిన వ్రతములలో నిదియే యుత్తమోత్తమము. కావున నీవ్రతరాజమును దప్పక యాచరింపవల

యును. ఈవ్రతకర్త దేవదేవుఁడగు శంకరుఁడు. పూర్వము నేను గోరఁగా నీవ్రతమున నాచే శంకరుఁ డభిషేకింపఁబడెను. ఈవ్రత మొనరించి తదవసానంబున బ్రాహ్మణభోజనము చేయవలయును. ముత్తైదువులకుఁ గాలదేశానుసారము వారు కోరినవస్తువులు నీవలయు. యథాశక్తిగను యథారుచిగను విప్రభోజనము చేయింపవలయు. ఏదానము చేయకున్నను బరమాన్నముమాత్రము దానమీయవలయును. *ఈవ్రతమున నించుకేనియుఁ బ్రాణివధ మొనరింపరాదు. అని పురాణములు శ్రుతులు పలుకుచున్నవి. రెండవదానమును దెలిపెద. పుష్పములు ఫలములు సంపాదించి సకలదానములు చేయవచ్చును. ఫలములు పుత్రసంతతి నొసంగునవి. ఈవ్రతము నాచరింప జ్యేష్ఠాషాఢమాసములు శుభములు. లేక యీరెండింటిలో నొకనెలయందే చేయవచ్చును. మాసముగాని మాసద్వయముగాని సంకల్పించిన ప్రకారము పూర్తికాఁగా శర్కరోదకసంభృతపాత్రము నీవలయును. నెయ్యి పెరుగు పాలు నింపిన పాత్రముగాని, లేక జలసంభృతపాత్రముగాని యీయవలయును. ఆదానప్రతిగ్రహీత జ్ఞానవృద్ధుఁడై సువ్రతుఁడై యింద్రియనిగ్రహము గలవాఁడుగా నుండవలయు. ఆయనకు సపుత్రకరకముల దానమీయవలయును. వ్రతముచేయుసీమంతిని కొమరితం గోరున్నేని యత్కాంచిత్సువర్ణముంగలిపి యాదానమునే చేసినలభింపఁగలరు. దక్షిణగా గోవునుగాని బంగరుగాని యీయవలయును. విప్రునకు గొడుగు జన్నిదముసీవలయును. వడగండ్లను నేకరించి యిచ్చుటమంచిది. ఒక్కసంవత్సర మీరీతి వ్రతధర్మమును బాలించుచు

---

* నాత్ర ప్రాణివధః కార్యః పురాణే నియతా శ్రుతిః=అనిమూలము.

యజ్ఞోపవీతములు గరకములు యథాశక్తి దక్షిణతోనిచ్చిన శుభము లబ్బును. ఈదానములు పతియనుమతి నీవలయును. వెన్నెలవేళయందు సువర్ణసూత్రమును జ్ఞానికీవలయును. సర్వకామములు దానఫలించును. నవీనఫలధాన్యముల నితరులకీయక తానను భవింపరాదు. ఈవ్రతముచేయక పుష్పములఁ దాధరింపరాదు. పుణ్యైకవ్రత నియమకాలమం దేకభుక్తము విధివిహితము. తొలుత సేకరించిన వస్తువులను బ్రాహ్మణున కొసంగుచునవల భర్త కీవలయును. ఇట్టు లొకసంవత్సరము చేసినయెడల రూపయౌవనములు గల్గును. ఏజన్మమునఁగాని వైధవ్యము చేకూరదు. ధనసమృద్ధి కలుగును.

ఒక్కసంవత్సర మీవ్రతనియమ మూని యంతదనుక వార్తాకముల (వంకాయలను) భక్షింపకుండువనిత పుత్రనాశనరూపదుష్ఫలమును గాంచదని యెఱుంగుము. కుందేటిమాంసము జింకమాంసము సదా వర్జింపవలయును. చిరకాల మాస్త్రీ జీవించును. భర్తృసుఖమునుగాంచును. సొరకాయను భక్షింపరాదు. భర్తసుఖము గోరినకాంత యలాబువును గాంచనిని దానముచేయవలయును. సంవత్సరమునిండుదనుకఁ బ్రతిదిన మొక్కొక్క శాకమును దాన మీయవలయును. సదక్షిణగా నీయవలయును. అట్లిచ్చినచోఁ బుత్రసంతానము కలుగును. పగటియందు భుజించి రాత్రియందుపవసించినకాంత యొకసంవత్సరముననే సకలకామములఁ గాంచును. ఆమెకు సంతానశోకము కలుగదు. దేవతాస్త్రీమర్యాదనుగాంచును. సపత్నులందఱియందు నుత్తమురాలగును. సంశయమిందు లేదు. సంవత్సరనియమము కాఁగా బంగారుతో సూర్యబింబమును

జేసి దానమీవలయును. ఆదానము దరిద్రుఁడు కీర్తిమంతుఁడు శాంతుఁడు నగుబ్రాహ్మణున కీవలయును. ఫలములు పుష్పములు భక్ష్యములు లోనగునవి సూర్యాస్తమయమునకుముందే దానమీవలయును.

ఏపురంధ్రి నియతురాలై పగ లుపవసించి రాత్రి భుజించునేని చంద్రనక్షత్రపూతములగు భక్ష్యముల భుజింపవలయును. బంగారుతో చంద్రునినక్షత్రములను గ్రహములను జేయించి యీయవలయును. సత్కులజాతుఁడగు విప్రునకు వస్త్రముల లవణముతోఁగూడ నీయవలయును. ఆకాంత చంద్రునివలె శాంతశీతలస్వభావము గలదగుటయేకాక దేవతావినుతిం గాంచును. రూపవతియు బహుపుత్రవతియు నగును. పూర్ణిమాతిథియందుఁ జంద్రోదయకాలమున దేవతలకు సాక్షతము సకుశమునగు నర్ఘ్య మీయవలయును. దధిగూడినయావకమును బలియీయవలయును. ఏకాంత యిట్లులోనర్చునో యామె సకలకామములఁ బొందును. ఏనారీమణి సూర్యుఁడు మేఘములచాటున నుండఁగా దుర్దినం బనంబడు నాదినమందు సూర్యదర్శనము చేయక పగటిపూట భుజించునో యాస్త్రీ యిష్టలాభముల నొందదు. ఆపాపము పోవ జ్ఞానధనుఁడగు బ్రాహ్మణునకుఁ గాంచనమును యథాశక్తి నీయఁదగు. దానిచే నాకాంతామణి దోషములుపోవ సజ్జనులకరుణాదృష్టికిఁ బాత్రురాలగును. దేవతాస్త్రీవలె నుత్తమతేజస్వినియు నగు. అని పలికి యాపార్వతి వ్రతవిషయక నియమముల నింకనుం జెప్పఁబూని యాయరుంధతిం గాంచి యిట్లు పలికెను.

## పుణ్యకవ్రతఫలము.

* అరుంధతీ! మఱికొన్ని విశేషములు గలవు. వాని నెఱింగించెద వ్రతము నొనరించువా రింద్రియముల జయింప వలయును. శ్రీకృష్ణాష్టమి రాఁగా మూలముల ఫలములను భక్షింపవలయును. పతియే దైవమని భావించు పురంధ్రి యొక విప్రప్రవరునకుఁ దనయాహారమంత ప్రమాణమగు నాహారమును బెట్టవలయును. తెల్లవస్త్రము నే కట్టి సదాచారముల వర్తించుచు గురువులను దేవతలను బూజించుచు నాఁడు మొదల లొక్క సంవత్సర మీరీతి వ్రతనియమముల నవలంబింపవలయును. గోవాలరజ్జుకృతమగు చామరమును ధ్వజమును స్వశక్త్యను రూపమగు నాహారమును బరిశుద్ధాంతరంగుఁడగు బ్రాహ్మణు నకు నిడవలయును. ఎవ్వతుక యిట్లు దానమిచ్చునో యామె వెండ్రుకలు మనోహరములై నునుపు గలిగి పెరుగునని యెఱుంగుము. కాని దానముమాత్రముగాక భర్తయందు భక్తియుండవలయును. గోపు యోదకమున శిరస్సు దడిపి బిల్వ శ్రీఫలచూర్ణమున నిర్మలకేశములుగా నొనరింపవలయును. శిర స్స్నానము చేయునపుడు గోమూత్రమును స్నానజలములం గలుపవలయును. ఈరీతిఁ బ్రతికృష్ణపక్ష చతుర్దశియందును జేయ వలయును. ఆస్త్రీ వైధవ్యము నొందక యదృష్టవతియై కీర్తిమం తురాలై మనఃకష్టముల నొందక యుండునని నమ్ముము. ఏజ న్మమునందు నాకాంతకు శిరోరోగము లుండవు. శరీరతాప ములు గలుగవు. ఆమె భాలభాగ మధికతేజోవంతమయి యుం

* ఈకథయు విష్ణుపర్వమునందలి యెనుబదవ యధ్యాయమునుండి వ్రాయఁబడినది.

డును. ప్రతిపత్తిథియం దొకపూట భుజింపవలయును. పాలుకలి
పినయన్నమునే భుజింపవలయును. ఒక్కసంవత్సరము వ్రత
మిట్లు సాగింపవలయును. ఇట్లు వ్రతమాచరించి సంవత్సరాంత
మున సద్ద్విజున కొకవస్త్రమును రజతమయముగ నొసరించి
యీయవలయును. ఆమెముఖము దివ్యప్రకాశము కలదగునని
యెఱుంగుము. ఏస్త్రీ కనుబొమలు సొగసుగ నుండవలయునని
కోరునో ఆకాంత ప్రతిపద్ద్వితీయయందు నుపవసించి శాకా
హారమున వర్తించుచు సంవత్సరమును బుచ్చి యవ్వల జ్ఞాని
యగు భూమిసురుం బ్రార్థించి పరిణతఫలంబులను మాషము
లను దక్షిణతోడ నిచ్చి లవణము ఘృతపాత్రము దానమియ్య
వలయును. ఆమెకనుబొమలు సుందరాకృతిం దాల్చును. ఎవ్వ
తుక తనకర్ణములు సుందరాకృతులుగ నుండవలయునని కోరునో
యాపురంధ్రి ప్రతిమాసమునందును శ్రవణ నక్షత్రము
రాఁగా నలసందలు పరిపక్వము చేసి భుజించుచు నొకసంవత్స
రము గడపి హిరణ్మయకర్ణములను జేయించి ఘృతమున నునిచి
దానిని బయస్సంభృతపాత్రమును దానమిచ్చిన మంచికర్ణములు
గలుగును. వ్యాధిలేని నాసికను గోరినచో దిలలను బూవుల
యందుఁ దడిపి దానమీవలయును. నేత్రములు సొగసుగ
నుండవలయునను కోరిక కలదేని పాలు నెయ్యి యాహారముగా
నొకవత్సరము జరపి కమలపత్రముల నుత్పలపత్రములను
బాలలోనునిచి దానమీవలయును. హరిణనయనముల మించిన
నయనములు గలుగును. పెదవులసౌందర్యమును గోరినమృన్మ
యపాత్రమున జలపానము చేయవలయును. ఒక్కసంవత్సర
మయాచితాన్నమును భుజింపవలయును. ప్రతినవమియందు నిక్షే

చేయవలయును. సంవత్సరాంతమునఁ బ్రవాళముల దానమీయవలయును దానఁ బెదవులు దొండపండువలె నుండును. దంతసౌందర్యము నేస్త్రీ యభిలషించునో కృష్ణాష్టమియందు రెండుపూటలు భుజింపకయుండి సంవత్సర మీలాగునఁజేసి రౌప్యమయదంతముల నొనరించి ఆవుపాలయందు వాని నునిచి దానమిచ్చిన జాజిపూవులవంటిదంతములు గలుగును. ఏకాంత ముఖసౌందర్యమును గోరునో యామె పూర్ణిమయందుఁ జంద్రోదయంబుతఱి స్నానము చేసి యలసంద లుడికించి పాలుపోసి విప్రవరునకు దానమిచ్చి సంవత్సరాంతమున వెండితోఁ జంద్రబింబమును జేయించి వికసించినపద్మము నునిచి దాన మీయవలయును. దాన ముఖసౌందర్య మబ్బును. స్తనసౌందర్యము గోరుభామిని వాఙ్నియమముగలిగి దశమీతిథియం దయాచితాన్నము నొక్కపూట భుజింపవలయు. వత్సరము నిండఁగా బంగారుతో రెండుబిల్వఫలములు చేయించి దాన మీయవలయును. కుక్షి చక్కఁగా నుండవలయునని కోరిన నేకాంతముగ భుజింపవలయును. పంచమియందు నన్నము నీరుతోఁగలిపి భుజించుచు నియమాంతమగు వత్సరము కొసయందు జాతిలతను బూవులతోడ దాన మీయ వలయును. బాహువుల చక్కఁదనమును గోరిన ద్వాదశియం దుత్తమశాకముల నాహారముగా నొనరించుచుఁ బదుమూఁడవనెల రాఁగా స్వర్ణపద్మముల నీయవలయు. శ్రోణీగరిమను గోరినకాంత త్రయోదశియం దేకభుక్త మొనరించి వ్రతాంతమగు సంవత్సరము చివరన లవణదానము చేయవలయును. కాంచనము నీవలయును. యథావిభవముగ రత్నముల నీయవలయును. మధురవాక్కులఁ

గోరినచో లవణమును మాని సంవత్సరముగాని యొక్కమాస
ముగాని యుండవలయును. పిదప లవణదానము చేయవల
యును. దాన వాక్మాధుర్యము గలుగును. అరుంధతీ! సకలావ
యవసౌందర్యమును గోరిన నిట్లే కల్పోక్తనియమముల ననుస
రించి యొనరించిన నాయాయవయవముల సౌందర్యము కలు
గును. అనిపలికి మఱియు నిట్లనియె.

## వ్రతాచరణవిశేషములు.

* అరుంధతీ! వ్రతాచరణవిశేషముల నాలకింపుము.
సాధువులగు బంధువులను గోరిన సప్తమియం దొంటిపూట
భుజింపవలయును. హిరణ్మయవృషమును దక్షిణతోటి దాన
మీయవలయును. సౌవర్ణదీపము దాన మిచ్చిన భర్త కిష్టమగు
రూపము గలుగును. సపత్నులలో నెల్ల నుత్తమరాలును సుంద
రాంగియు నగు. భర్త భుజించినపిదప భుజించుచుఁ బతి కెట్టి
మనఃకష్టములను గల్గింపక యేకవారమే భుజించి పతిని దైవ
ముగాఁ దలంచుచు సదాచారములఁ బాటించుచుఁ గఠినవా
క్కులం బతితోఁ బలుకక యత్తమామలకు శుశ్రూష లొనరిం
చుచు నుండుపురంధ్రికి వ్రతములతోఁ బనిలేదు. ఉపవాసము
లక్కఱలేదు. పతిని బూజించుచు ధర్మశీలయున వర్తించుచు
నుండినను వైధవ్యము విధివశమునఁ బ్రాక్కర్మము ననుసరించి
కలిగిన నాస్త్రీకిఁ గావలసినధర్మముల నాలకింపుము. అవి పురా
ణోక్తములు. వైధవ్యము దుర్భరము గావున నది రాకుండుట
కుఁగాఁ జేయవలసినవిధులుగలవు. విధవ యగుస్త్రీ మృణ్మయ

* ఈకథ విష్ణుపర్వమున నెనుబదియొకటవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

భర్తృప్రతిమను జేయించిగాని చిత్తరువున వ్రాయించిగాని యాప్రతిమను సాధుమార్గమునఁ బూజింపవలయును. ప్రతి దినము తదనుజ్ఞను బ్రార్థించియే సర్వవిహితకార్యములు చేయ వలయును. వ్రతమునందును నుపవాసమందు భోజనమునం దును దదనుజ్ఞ నొందవలయును. ఆప్రతిమను దూషింపకయుం డెనేని భర్తృలోకము నొందును. అరుంధతీ! ఇదిమొదలుకొని స్త్రీలు పుణ్యకవ్రతమును జేయఁగలరు. ఇది పురాణప్రతిపాది తము. సకలపురాణముల నారదుం డెఱుంగును. ఉపవాసఫల ములను వ్రతఫలములను గూడ నారదముని యెఱుంగును. అదితియు నింద్రపత్నియు నీవు నీవ్రతమును జేయఁబ్రయత్నిం తురుగాక. ఈవ్రతవిధానమును మీరెల్ల పురంధ్రీమణులకు వినిపింపవలయును. ఈవ్రతోపవాసవిధిని విష్ణుపత్నులు భూమి నవతరించునపుడెల్లఁ దెలిసికొందురు. వా రాచరించి యితర స్త్రీల నాచరింపఁజేయుదురు. స్త్రీలకు విధింపఁబడిన ధర్మముల యందెల్లఁ బతిభక్తి ప్రధానముగఁ జెప్పఁబడినది. పతిభక్తి యనఁగా దుర్వృత్తి లేకుండుట. దుర్వాక్యములు పలుకకుం డుట యని యెఱుంగుము.

అంబా! ఇట్టు లాపార్వతీదేవి యాసాధ్వీమణులు విను చుండ నరుంధతికిం దెల్పిన వారెల్ల హర్షమున నాదేవికి నమ స్కరించి వెడలిపోవ ననుమతివేఁడిపోయిరి. దేవమాత యగు నదితి పార్వతిచెప్పినట్లే యీవ్రతము నొనరించెను. పారిజాత వృక్షమునకుఁ గశ్యపముని గట్టివేసి నాకే దానమిచ్చెను ఆవ్ర తమునే సత్యభామయు నాచరించి శ్రీకృష్ణుని నాకొసంగెను. సావిత్రికీవ్రతమే యుపదేశింపఁబడినది. ఆనియమములఁ బాటిం

చియే యెల్లవా రొనరించిరి. సంధ్యాకాలము రాఁగా నేస్థాన మునసైనను బూజయు జపము నమస్కారము ద్విగుణఫలముల నొసంగును. సావిత్రియు నదితియు నొనరించినట్లే యీవ్రతము నాచరించుస్త్రీలు భర్తృపితృవంశముల నుద్ధరింపఁగలరు. తన్నుఁదా నుద్ధరించుకొనఁజాలును. పార్వతి యొనరించినవ్రతమునే శచీదేవియు నొనరించెను. భేద మేమన శచీదేవి రక్తవస్త్రమును పామిషభోజనము నొసంగెను. ఈవ్రతమునకు నాల్గవ దినమునఁ బుణ్యాకవ్రతాంగవిధి కలదు. ఆదినమున నహోరాత్ర ముపవాసము సలుపవలయును. కుంభశతముల నీయవలయును. గంగాజలముల నుషఃకాలమున స్నానముచేయవలయు. గంగా జలములు సంభవింపనియెడల నితరపవిత్రోదకముల స్నాన మొనరింపవలయును. మాఘమాసశుక్లపక్షమున నీగంగాప్రోక్త వ్రతము నాచరించిన సర్వకామములు సిద్ధించును. ఇరువదొక కులములవారి నీగంగావ్రత మాచరించినస్త్రీ తరింపఁజేయఁ గలదు. ఈగంగావ్రతమున సహస్రకుంభముల నీయవలయును. సంసారసాగరమునుండి తరింపఁజేయును. ఈగంగావ్రతమును యమునిభార్య యొనరించెను. హేమంతర్తువునం దీగంగావ్రత మాచరింపందగు. ఆకాశముననుండి యీమాటలు పలుకవల యును. స్నానముచేసి సదాచార మూని పతికి నమస్కరింపం దగు. ఈవ్రతమునకు యమరథమని పేరుగలదు. "నేను యమ రథవ్రతము చేయ నుంకించితిని. హిమమును బృష్ఠభాగమున ధరింతును. పవిత్రనై జీవపుత్రనై యుత్తరోత్తరాభివృద్ధిగలిగి యుండున ట్లనుగ్రహింపుము. సపత్నులలో గౌరవముగా బ్రదుకఁజేయుము. యమదర్శనము నాకుం గాకయుండుఁగాక.

భర్తయుఁ బుత్త్రులు చక్కఁగా నుండ బ్రదుకఁగోరెదను. సుఖము గలుగవలయుననియు నాకిష్టము. అంతమునఁ బతిలోకమునకుఁ బోవఁగోరెదను! బ్రదికియుండునంతదనుక భర్తకు సంతోషమును గలిగించుచుండ నాకాంక్షించెదను." అని యిట్లు పలికి విప్రునిచే స్వస్తివాచనము చెప్పించి కృష్ణతిలలు పాయసము పెట్టి భుజింపఁజేయవలయును. ఇట్లు వ్రతము లామెచేఁ జేయఁబడినవి. ఇవన్నియు మహాదేవుపత్నిచేఁ జెప్పఁబడినవి. నేను నాతపోబలమున నెఱింగి చెప్పుచున్నవాఁడను. పార్వతి యన్ని వ్రతముల నాలోచించి యేవి యుత్తమములో వానిం జేయవలయునని యెల్లస్త్రీల కుపదేశించెను. వాని నాచరించిన సకలకల్యాణములు గలుగును.

* ఇట్లు నారదముని పలుకఁగా విని రుక్మిణి విధివిధానమున నాపుణ్యకవ్రతము నొనరించెను. పార్వతీవరదానమున దృష్టి గల్గెను. ఉమావ్రతములయందెల్ల వృషభదానము ప్రధానము. రత్నమాలాదానము అన్నదానము నీమూఁడును సర్వవాంఛల నొసఁగును. రుక్మిణింగాంచి జాంబవతియు నీవ్రతము నాచరించెను. ఆమె రత్నవృక్షమును జేయించి దానమిచ్చెను. సత్యభామయు నీయుమావ్రతమును జేసి పీతవస్త్రమును దానమిచ్చెను. రోహిణీప్రభృతి చంద్రపత్నులీవ్రతము నాచరించి యనేకదానములు చేసిరి. వారెల్ల నీవ్రతమాహాత్మ్యమున నక్షత్రరూపముల నంబరంబున శాశ్వతముగ నుండఁగల్గిరి.

---

* రుక్మిణీ వ్రతకం చక్రే దృష్ట్వా వ్రతకవిస్తరం, ఉమాయావరదానేన దృష్ట్వా దివ్యేన చక్షుషా. అని మూలము.

ఆర్యులారా! సత్యాన్వేషణతత్పరులారా! పారిజాతాపహరణానంతరము పుణ్యకవ్రతమును సత్యభామ యాచరించినంతదనుకఁ గలకథ యింతటఁ బూర్తియైనట్లు భావింపుఁడు. ప్రధానముగా నీపారిజాతాపహరణవృత్తాంతము హరివంశము నాధారము చేసికొనియే వ్రాయఁబడినది. బ్రహ్మవిష్ణుపురాణములు గర్గసంహితయు నీకథను మిగుల సంక్షేపముగాఁ జెప్పినవి. పుణ్యకవ్రతకథయు హరివంశమునందే విస్తరించి వ్రాయఁబడినది. తదనుసారమే వ్రాసితిని. దీనిసారమును సంక్షేపరూపముగా వ్రాయుచున్నాఁడను. సత్యభామ పుణ్యకవ్రతముచేసి కృష్ణుని దానమీయ నారదుఁడు పరిగ్రహించెననియు మరల నాతనియెత్తు ధనమిచ్చి తీసికొమ్మనఁగా నామె తనద్రవ్యమునంతయుఁ బోసినను సరితూఁగకపోవఁగా రుక్మిణికడకుంబోయి యీవార్త సత్యభామ తెలుపుకొనఁగానే దేవి వచ్చి తులసిదళమున హరిం దూఁచెననియు దాన సత్యభామకుం గలగర్వము పోయి భక్తురా లయ్యెననియుఁ గొందఱు కల్పించి వ్రాసిరి. హరివంశానుసారము పరికింపఁగా నీకథ కవకాశమే లేదని స్పష్టమగుచున్నది. ఎందేనుండునేమో! నాపరిశీలించిన పురాణములలో నీకల్పనము కానరాదు. సత్యభామకంటె రుక్మిణి మిన్నయని యెన్నువారు చాలమంది కలరు. వారు చమత్కృతిగాఁ గల్పించిరని నాభావము. దీనికి హరివంశ మాధారము. తెనుఁగున ముక్కుతిమ్మనయు,

చ. అపుడు విరించిసూనుఁడుజ•నార్దను నెయ్యపువాలుఁగంటిఁజూ
చి పడఁతి నీమనోరమణుఁ•జేకొను మిచ్చెద నంచుఁ బల్కు చో
నపరిమితప్రమోదభరి•తాననయై వెస నిచ్చె వేలుపుం

దపసికినాత్మభూషణవి॥ తానము లన్నియునిష్క్రియంబుగన్
క. ఇచ్చి కయిఁ గొని యోం గ్రమ్మఱ
నచ్చిగురుంబోఁడి విభుని॥ నావైభవమున్
మెచ్చి కురియించి రపుడు వి
యచ్చరు లచ్చెరువుగాఁగ॥ నలరులవానన్.
అని హరివంశము ననుసరించియే వ్రాసెను.

శ్రీభాగవతమునందు,

శ్లో. చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి
ఆరోప్య సేంద్రాన్ విబుధాన్నిర్జిత్యోపానయత్పురమ్. ౩౯
స్థాపితస్సత్యభామాయా గృహోద్యానోపశోభనః,
అన్వగుర్భ్రమరాస్స్వర్గాద్యద్గంధాసవలంపటాః. ౪౦
(౧౦. స్కం ౫౯. అధ్యా.)

అనిమాత్రమే కలదు. దీనింబట్టి యాలోచింపఁగా హరికి సత్యభామయందు మిక్కుటమగుమైత్రి కలదనియే స్పష్టమగును. సత్యభామకు భక్తిం గల్పింపఁబూని రుక్మిణి సామర్థ్యమీ మెకుం దెలిపి గర్వము పోఁగొట్టి భక్తిభరితస్వాంతం జేసి హరి కాపాడెనన్నకథ యసంగతమనియే తోఁచును. అటులే యైనచో సత్యభామను రుక్మిణి నొక్కతావునఁ జేర్చి మీరు స్మరించినఁ బారిజాతము వచ్చును. భక్తిగలవారలైన స్మరింపుఁడని యేల పరీక్షింపరాదు. సత్యభామ కాంక్షందీర్చుటకై స్వర్గపురమునకుంబోయి మహాహవ మొనరించి దానిం దెచ్చెననుట యేలొకో తెలియరాకున్నది. ఇంతటి పక్షపాత మీసత్యాదేవియందు హరికిం గలుగఁగా నామె భక్తురాలు కాదని యెట్లు చెప్ప నోరాడునో యెుఱుంగఁజాలకయున్నాఁడను. మఱియు

భాగవతాదులయందు సత్యభామం గూడియే స్వర్గమున కరిగి పారిజాతముం దెచ్చెనని యున్నది. హరివంశమునందు సత్యభామకోరికను దీర్ప నెంచి సాత్యకిప్రద్యుమ్నులం గూడి తానే పోయి పారిజాతమును దెచ్చి సత్యభామయింటికిం బోవఁగా నాదేవి భగవంతు నారాధించి పారిజాతమును గైకొనియె నని గలదు. ఇదొక గొప్ప భేదముకాదు. కాని కథాసార మొక్కరీతి గనే యీపురాణములు తెలిపినవనుట సత్యము.

పారిజాతము నొకవత్సరము సత్యభామగృహమున నునిచి సంవత్సరము దాఁటగనే మరల స్వర్గమునఁ జేర్చెనని హరివంశము చాటున్నది. శచీదేవికిఁ బ్రతిదినము పారిజాతకుసుమములు కావలయును. ఎట్లీకథ సరిపడు ననరాదు. మనుష్యమానమున నొకవత్సరకాలమైన, నదియే దేవమానమున నొక్కయహోరాత్రమగును. కావున నింద్రలోకమున మఱుదిన మాతరువర ముండెను. ఇఁకఁ బుణ్యకవ్రతమునుండి మనము గ్రహింపదగువిశేషము లెన్నియో కలవు. ప్రాచీనకాలమున స్త్రీధర్మము లెట్టివో యించుక యాలోచింపవలయు. ఇపు డెట్లున్నవో చింతింపవలయు. ఈరెండింటికిం గలభేదము పరిశీలింపందగు. ఈవ్రతము పార్వతి యరుంధతి కుపదేశించినట్లు కలదు కదా. సత్ప్రవృత్తి కనుగుణమగుమార్గములు లోకులకుఁ బార్వతీపరమేశ్వరులనుండియే లభించినవి.

## ప్రాచీనకాలస్త్రీధర్మములు.

పతిని వంచించినకాంత నరకము నొందును. పతికంటె వేఱుపురుషునింగూడిన నరకమే. సత్ప్రవర్తనము గలిగి పతినే దైవతముగా భావింతురేని ప్రపంచమునంతటిని గాపాడఁజాలు

దురు. ఇదియే పతివ్రతాధర్మములు. వారై ష్ణపుణ్యము పరుని యెదుటఁ గనఁబఱుపరాదు. సదాచారము గలిగియుండవలయు. ధైర్యముగలిగి మంచివ్రతమనఁగా నియమము గలిగి సాధువాదము లొనరించుచు నుండువారు పతివ్రత లనఁబడుదురు. అను మొదలగునవి ప్రాచీనధర్మములు స్త్రీలవిషయమునఁ జెప్పఁబడినవి. పతియనుమతిలేక వ్రతోపవాసములు సలుపరాదనియు నొకప్రధానధర్మ మాకాలమునఁ గలదు. ఈకాలమున నీవిషయమునమాత్ర మెల్లవారును భర్తలయాజ్ఞ నొందుచున్నవారనియేనాభావము. వ్రతము లుపవాసములు పతులకే పనికిరావు. కావున స్త్రీలు చేయరన్నదూషణము చేయఁగాదుకదా. భక్తికి దురుట కేయేకార్యము లుక్తములో వానికన్నింటికి వేదాంతవాక్యములచే నిపుడు తిలతర్పణము చేయఁబడుచున్నది. ఉపవాసములవలన లాభమేమన్న ప్రశ్నమే వినఁబడుచున్నది. మనస్సు చక్కఁగా నున్నఁజాలదా? యన్నకుతర్కము చెవులఁ జొరఁబడుచున్నది. కాని యామనస్సు భక్తిరసౌషధసేవనమునఁగాని చంచలత్వమనురోగము నెడఁబాసి యారోగ్యస్నానము చేయదని యెఱుంగరు. స్వేచ్ఛగాఁ బ్రవర్తించినగాని వారికి మర్యాద లేదనువాదము లుపన్యాసవేదికలపై నాట్యము సల్పుచున్నవి. స్త్రీలు పురుషులు భేదములేక కలిసి యుండినఁగాని దేశాభివృద్ధికి మార్గములేదని చేతులు త్రిప్పుచున్నారు. పరగృహప్రవేశము పనికిరాదను పూర్వాచారమునకుఁ బరపురుషసంగతియే ప్రధానమను సమాధానము నొకకొందఱినోట వినఁబడుచున్నది. తపశ్చరణము ప్రధాన మనుపూర్వశాస్త్రమునకు స్వచ్ఛందగమన ముపన్యాసము లిచ్చుట మంచిదను

దుర్వాదము సమాధానముగనున్నది. వరునియందుఁగల సద్గుణములఁ బరీక్షించి కన్యక నిచ్చువారు తల్లిదండ్రులేయన్న ప్రాక్తన సదాచారమును యువతివరుని, వరుఁడు యువతినిబరీక్షించుకొని పెండ్లియాడవలయునే కాని తల్లిదండ్రులకేమి యధికారమున్నను వాదకోలాహలము నోరుమూయించుచున్నది. ప్రాతస్స్నానాది నియమము లారోగ్యమార్గములన్న పెద్దలమాటలకు వలసినపుడు స్నానము చేయవలయు ఉదయమే చేదుపానకము త్రాగుట మంచిదను నీచవాక్కులు సమాధానముగా నొప్పుచున్నవి. భక్తిశ్రద్ధలుగలిగి వైరాగ్యసంపదగలిగి ప్రార్థించువారికి భగవద్గీత నుపదేశింపవలయు నను పూర్వులయభిప్రాయములను బలవంతముచేసి పిలుచుకొనివచ్చిరైనను భగవద్గీతలను జెప్పవలయునను నల్పులయాశయము పాఱఁద్రోలుచున్నది. వేదాంతము తరణోపాయసాధనమని పెద్దలు పలుకుచుండ నది జీవికకే యుపయోగమని దాని నాధారముచేసికొని విక్రయించి ద్రవ్యార్జనముచేయు కపటవేదాంతనాటకసూత్రధారు లుపన్యసించుచుఁ దమకీర్తిని వెలిఁబుచ్చుచున్నారు. పాపభూయిష్ఠమగు కాలమున ధర్మరక్షణార్థము భగవంతుఁడొకరూపమున భూమిం బొడసూపునని పురాణములు ఘోషించుచుండఁగాఁ బరిశుద్ధాంతరంగులైయుండుఁడు. ఇదిగో యవతారపురుషుఁడు వచ్చుచున్నాఁడని కోఁతికి కుళ్లాయిపెట్టి యాడించి జీవించునట్లు కొందఱొక్కని మహాపురుషుఁడని వాపోవుచున్నారు. ఔరా! కలికాలము! ఎంతటిదురూహాలు గలుగుచున్నవి! సత్య మసత్యముగా నెంతవేగముగా మాఱుచున్నది! కపటవృత్తి నిష్కపటవృత్తిగా నెంతత్వరగా మార్పఁబడుచున్నది! స్వేచ్ఛాప్రవృత్తి

గౌరవపాత్రత నెంతవేగముగాఁ గాంచుచున్నది! కలియుగమా! నీమహిమ యింతింతయని పొగడ శక్యముగాదు. తల్లీ! కృత త్రేతాద్వాపరములు నీకు సమానములు కానే కావమ్మా! అధర్మమున నాచారములు నిన్నాశ్రయించి నేటికి ధన్యతం గాంచుచున్నవి. ఎంతకాలము మిట్టిపడుదువో చూతము! నీకాలమున నెంద అవతారపురుషులు పుట్టుదురో చూతము! నీయందెంత దనుక సురాపానము గంగోదకముగాఁ గలదో పరికింతము!

స్త్రీధర్మము లిట్లు మార్పునొందఁగా నిఁకఁ బూర్వశాస్త్రముల జోలియేల? అట్లని యూరకుండక యుపన్యాసములందు భగవద్గీతలఁ బ్రస్తావించుచుందురు. కులధర్మములు కల్పితము లనుచుందురు. ఆగీతలయందే,

శ్లో. "కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మేనష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత. ౪౦
అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨
దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩
ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ." ౪౪

(౧అధ్యాయము.)

జాతిధర్మములు కులధర్మములు కల్పితములన్న పెద్దల నేనొక్కచిన్నిప్రశ్న మడుగుచున్నాఁడను. 'కులధర్మాస్సనాతనాః'

'జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతా' అన్న భగవద్గీతావాక్యములు ప్రమాణములని యొప్పుకొందురేని యవి శాశ్వతములనియంగీకరింపవలయు. 'సంకరో నరకాయైవ' అన్న వాక్యము ప్రమాణమన్నచో జాతిసంకరము పనికిరాదని యంగీకరింపవలయును. కులధర్మముల వదలుకొన్నచో వారికి నరకమున శాశ్వతనివాసము కలుగునని యున్నదే. ఇపు డేమందురు? అనఁగా వర్ణసంకరము చేయరాదు. కులధర్మములు సనాతనములు. వానిని వదలినఁ బాపహేతువగును. కావున వర్ణసంకరము మంచిదనరాదని గీతాశాస్త్రము తాత్పర్యము. వర్ణములలో హెచ్చుతగ్గులు కలవన్న విచార మీచోట నక్కఱలేదు. భగవద్గీతలు ప్రమాణములన్నవారు పై వాక్యముల నంగీకరింపవలయును. లేదా గీతలే తప్పు లనవలయును. గీతలను సభాముఖమునఁ బ్రయోగించి చేతులఁ ద్రిప్పుచు నందలియాశయములకు విరుద్ధములుగా జాతిధర్మములు కల్పితములనుట యవివేకమునఁగాక మఱేమిటి? గీతలలోఁ గొన్ని వాక్యములు ప్రమాణములు కొన్ని కావు అనుపెద్దలు కొందఱు కలరు. వారికంటె లోకమున నజ్ఞానులు లేరని చెప్పక తప్పదు. ఏలయనఁగా వారు భక్తులు కారు. నీతిజ్ఞులునుగారు. సమయోచితముగ మాటలాడువారు. కాలానుసారము మాటలాడువారును, సమయోచితముగా భుజించువారును, అవసరమునుబట్టి ప్రవర్తించువారును ఇహపరములకు దూరులనుట నమ్మకము. కావున వారినిగాని వారివాక్కులనుగాని ప్రమాణముగాఁ బ్రస్తావింపరాదని వదలవలయు. ఇంక మఱొకవిషయమును బరిశీలింతము.

వ్రతోపవాసములయందు శృంగారముగా దేహము నుంచుకొనఁ బ్రయత్నింప రాదనుట యుక్తియుక్తము కదా. అట్టికాలములయందు స్త్రీల కారోగ్యమునకు భంగముకలుగఁ గూడదని యెట్టిపదార్థములతో స్నానము చేయవలయునని పెద్ద లాదేశించిరో పరిశీలించిన వేయినోళ్లఁ గొనియాడవలయుఁ గదా. వ్రతోపవాసనియమము లన్నియు ముఖ్యముగా స్త్రీలకు వైద్యధర్మముల ననుసరించి కల్పింపఁబడినవి. ఆరోగ్యమున కుపవాస మొకయౌషధము వంటిదని యందరిపుడుకూడ నంగీకరించు చున్నవారు. కావున నాయాయివ్రతములయందు స్త్రీలకు శుష్కోపవాసము చెప్పఁబడలేదు. ఫలాహారాదులు చెప్పఁబడినవి. విధవలకు యతులకు శుష్కోపవాసము చెప్పఁబడినది. ప్రతోపవాసము.

"నక్షత్రదర్శనాన్నక్తం గృహస్థస్య తు వై స్మృతం,
నక్తం నిశాయాం కుర్వీత గృహస్థో విధిసంయుతః,
యతిశ్చ విధవా చైవ కుర్యాత్తత్సదివాకరం."

(కాలమాధవీయము.)

దీనింబట్టి యుపవాసనియమమున భేదము గలదనిమాత్రము తెలియవచ్చెడిని.

శ్లో. "నక్తం హవిష్యాన్నమనోదనం వా
ఫలం తిలాః క్షీరమథాంబు చాజ్యం,
యత్పంచగవ్యం యది వాపి వాయుః
ప్రశస్తముత్రోత్తర ముత్తరంచ."

(నిర్ణయసింధువు.)

శ్లో. అష్టాబ్దాదధికో మర్త్యో హ్యపూర్ణాశీతిహాయనః,

భుంక్తే యో మానవో మోహా దేకాదశ్యాంస పాపకృత్.

(నారదః.)

"అష్టవర్షాధికో మర్త్యో హ్యపూర్ణాశీతివత్సరః,
ఏకాదశ్యా ముపవసేత్పక్షయోరుభయో రపి."

(కాత్యాయనః.)

గృహస్థస్య తు శుక్లైకాదశ్యామే వోపవాసః.
"ఏకాదశ్యాం న భుంజీత పక్షయో రుభయో రపి,
వనస్థయతిధర్మోఽయం శుక్లా మేవ సదాగృహీ."

(కూర్మపురాణమ్.)

"ఏకాదశ్యాం న భుంజీత పక్షయో రుభయో రపి,
బ్రహ్మచారీ చ నారీ చ శుక్లామేవ సదా గృహీ."

(భవిష్యోత్తరపురాణమ్.)

"నారీ విధవా. తస్యా ఏవ యతిధర్మత్వాత్."

(అని మాధవాచార్యులు.)

"పతివత్న్యాసూపవాసం నిషేధతి."

(విష్ణుః.)

"పత్యౌ జీవతి యా నారీ ఉపోష్య వ్రతమాచరేత్,
ఆయుష్యం హరతే భర్తుః నరకం చైవ గచ్ఛతి.
నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణం,
పతిశుశ్రూషణాదేవ తాసాం పుణ్యం విధీయతే."

(మనుస్మృతి ౫ అధ్యా. ౧౫౫ శ్లో.)

"నారీ ఖల్వననుజ్ఞాతా భర్త్రా పిత్రా సుతేన వా,
నిష్ఫలం తు భవేత్తస్యా యత్కరోతి వ్రతాదికమ్."

(మార్కండేయః.)

అను నీవాక్యములన్నియు స్త్రీలకు శుష్కోపవాసమును నిషేధించుచున్నవి. గతభర్తృలకు దేహపోషణ మసంగతము గాన వారికే శుష్కోపవాసము చెప్పఁబడినది.

వ్రతములయందుఁ బ్రాణివధ మశాస్త్రసమ్మతమని పార్వతి యుపదేశించెను. ప్రాణిహింస వ్రతపుణ్యమును హరించి సహస్రగుణపాపము నొసంగునని పూర్వులభావము. ఎంత గొప్ప విషయ మాలోచించి నియమించిరి ప్రాణివధము మహాపాపము. దాన భగవంతుఁడు తృప్తుఁడు కాఁడు. కావుననే మనుస్మృతి యందు

శ్లో. "స్వాధ్యాయేన వ్రతైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయాసుతైః,
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః."

(౨ అ. ౨౮)

'మహాయజ్ఞైః పంచభిర్బ్రహ్మయజ్ఞాదిభిః. యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః.' అని వ్యాఖ్య. బ్రహ్మయజ్ఞాదులయం దించుకంతయుఁ బ్రాణివధము లేదు కావునను, ఫలముఁగోరి చేయఁదగినవి కాక నిత్యములు కాఁబట్టియు నవి మహాయజ్ఞములని పేరుఁగాంచినవి. ఇట్టు లీపుణ్యకవ్రత మెంతయో మనోహరముగ వచింపఁబడినది. దీనియం దెన్నియో మార్పులు గావించి గ్రంథములు వ్రాసి సత్యభామకంటె రుక్మిణి పతిభక్తికలదనికల్పించుట సమంజసమనరాదు. భగవత్పత్నులందఱు మహాలక్ష్మికళాసంజనితలే యని భావించి వారిని బూజింపవలయును. ముఖ్యముగా నీభాగము స్త్రీలప్రవృత్తిని దెలుపును. వారిపురోవృద్ధిమార్గముల బోధించును. ఈవ్రతము నాచరించినను మానినను దీనఁగల

సారాంశమును గ్రహించి ప్రవర్తించిన కాంతామతల్లిక లిహపర లోకసౌఖ్యములఁ గాంతురనుట నిర్వివాదాంశము. భర్తకెదురుగఁ గూరుచుండి నాకంటె నీ వెక్కువ యనుకొనుట కేమి కారణమని వాదము చేయునవకాశము గలుగదు. కావున నారీమణులెల్ల నీధర్మముల ననుసరించిన భగవద్భక్తి చేకూరుటయు, లోకమున నుత్తమఖ్యాతి గలుగుటయు లాభములు. ఇంక నీవిషయమును వదలి యనంతరకథను వ్రాయఁబూనెదను. పారిజాతాపహరణానంతరము భగవత్కథను జదువఁబూనుచో నా మహానుభావునివినుతి నొక్కసారి చేయుట మంచిది. అదియే కథాపఠనఫలము.

శ్లో. "హే దేవ హే దయిత హే జగదేకబంధో
హే కృష్ణ హే చపల హే కరుణైకసింధో,
హే నాథ హే రమణ హే నయనాభిరామ
హాహా కదాను భవితాసి పదం దృశోర్మే." ౪౦
(శ్రీకృష్ణకర్ణామృతము. ౧ ఆ.)

## షట్పురదానవులవృత్తాంతము.

*మున్ను మహాదేవుఁడు త్రిపురాసురులను సంహరింపఁగా నాపురదానవులకుఁ బరమబంధువులు బలశాలురు నగు రాక్షసులు హరశరాగ్నిచే దగ్ధులుగాక మిగిలిరి. వా రఱువదివేల మంది. ఇంచుకయు హెచ్చుతగ్గు లందు లేవు. వారందఱు జ్ఞాతివధజనితక్రోధంబునఁ దమపూన్కి నెఱవేర్పం దలంచి తపంబు

*ఈకథ హరివంశవిష్ణుపర్వమునం దేనుబదిరెండవయధ్యాయమునుండి సంగ్రహీతము.

చేయఁబూనిరి. జంబూద్వీపము మహర్షిగణసేవితము కావున నందొకపవిత్రతమస్థలమునఁ గూరుచుండి సూర్యాభిముఖులై యావీరులు లక్షవత్సరములు తపం బొనరించిరి. వాయువును భక్షించుచు బ్రహ్మదేవుని వినుతించుచు వారు తపస్సొనరించుచు నొకయుదుంబరద్రుమము నాశ్రయించి యుండిరి. అందుఁ గొందఱు కపిత్థవృక్షము నాశ్రయించిరి. మఱికొందఱు శ్మశాన భాగములం గూరుచుండిరి. ఇంకను గొందఱు వటవిటపి నాశ్రయించి యుగ్రతపం బొనరించుచుండిరి. అందఱొక్కొక పర్యాయ మావట మహీరుహాముకడకుం బోయి పరమకరుణాంత రంగుని వినుతించుచుండిరి.

వారి తపోనియతికి బ్రహ్మ తుష్టి నొంది ధర్మవేత్తలలోఁ బ్రధానుఁడు కావున వర మీయఁ దలఁచి యచ్చోటికింబోయి దానవులార! వర మడుగుఁ డనియె. పంకజాసనుని యావాక్యము నాలకించి వారెల్లఁ దమకు విరోధియగునీశ్వరు జయింపవలయునని కోరిరి.సకలజ్ఞానుల యనభివృద్ధి నాకాంక్షించిరి.వారి వాంఛితముల నెఱింగి వాణీపతి యిట్లుపలికెను. దానవులారా! ఈశ్వరుఁడు, జగత్కర్తయు సంహర్తయు నగు. ఆమహాదేవుని క్షీణతనొందింప శక్యముగాదు. వృథాశ్రమము లేల ? అనాది మధ్యలయుఁ డామహాదేవుఁడు. అన విని యందుఁ గొందఱు స్వర్గసుఖమును గోరిరి. కొంద ఱాస్వర్గాధిపత్యము నిష్టపడ కుండిరి. వారలంజూచి శతధృతి యిట్లుపలికెను. రాక్షసులారా! రుద్రునిపై నాగ్రహమును దీర్చుటతప్ప నింకొక్కవరముఁ గోరుఁడు. అనఁగా వారెల్లనట్టులేని మే మవధ్యులముగావలయు నని కోరెద మనిరి. మహీతలాంతర్భాగమున నాలుపురంబు లుండవలయును. సర్వకామసమృద్ధులు గలుగ నాలుపురములు

మాకుం గావలయుననిరి. మే మాయాయాఉపురములం బ్రవేశించి సుఖముగా నుందుము. ఎవ్వనివలన నూజ్ఞాతులు మృతినొందిరో యారుద్రునివలన మాకు భయ మేతరుణమందును లేకయుండుంగాక. అనిరి. త్రిపురములఁ గాల్చుటం గాంచి భీతిల్లితిమి. అని వినయమున నడిగిరి. అసురులారా! మీరు దేవతలకు శంకరునకు నవధ్యులరు గందు. ఎపుడు మీరు సన్మార్గమున నుండువిప్రులను బాధింతురో, అజ్ఞానమున వారిమహిమముల నెఱుంగక మీరు విప్రోపఘాతము చేయుదురో యపుడు నాశము మీకుం గలుగు. వారేకదా జగములకుఁ బరమగతి. విప్రబాధవలన మీకు శ్రీమన్నారాయణమూర్తివలన భయము సంభవిల్లును. సర్వభూతములకును హితము కోరువాఁడు విష్ణుమూర్తి.

అని పలుకుచు వారినిబంపఁగాఁ గొందఱు పోయిరి. కొందఱు ధర్మప్రవర్తకులై మహాదేవు నారాధించిరి. వారికిం బ్రసన్నుఁడై శంకరుఁడు దర్శనమిచ్చెను. శ్వేతవృషభవాహనారూఢుఁడై ప్రమథగణములు ప్రవరుఁడు వెంటరాఁగా నచ్చటికింబోయి తాను సన్మార్గరక్షకుఁడు కావున వారి కిట్లు పలికెను. నాయందు వైరమును వదలి దంభమును మాని హింసాకర్మవిముఖులై నన్నే యాశ్రయించితిరి. కావున మీకు వరమిచ్చెదను. తపస్సుచేయ నెవరు మిమ్ముఁ బ్రోత్సహించిరో యాసాధుకార్యనిరతులంగూడి స్వర్గమునకుం జనుఁడు. ఇచ్చోటనే తపస్సానరించుచు నెవరుజ్ఞానధనులై యుందురో వారికెల్ల నాలోకమే దొరకును. ఈకపిత్థవృక్షము నాకుఁ బరమసమ్మతము. దీనిక్రిందఁ గొన్ని నెలలుగాని కొన్నిపక్షములుగాని యెవరు తపము సల్పు

దురో వాన ప్రస్థనియమమున నన్నుఁ బూజింతురో వారు వేయి వర్షము లాతపఃఫలము ననుభవింతురు. మూఁడురాత్రు లిందుఁ బూర్వోక్తనియమానుసారము తపస్సొనరించిన నిష్టార్థసిద్ధి గలుగును. అర్కద్వీపమునఁ గూరుచుండి యిట్లే తపస్సొనరించిన ద్విగుణతపఃఫలము గల్గును. ఏదేశమునందును మీకుఁ గష్టములు కల్గవు. ఇదియే వరమిచ్చితిని. శ్వేతవాహననామముగల నన్నే మానవులు పూజింపఁగలరో సర్వతోభయచిత్తుఁడైనను నా గతియే యామానవులకుఁ గల్గును. ఔదుంబరకాపిత్థసృగాల వాటులయందుండి ధర్మచిత్తములుగల్గి దృఢవ్రతముల నలరుచునుండుమునులను బ్రహ్మవాదులను బూజించు మహాత్ముల కీప్సితము లెల్ల ఫలించును. అనిపలికి శ్వేతవృషభ వాహనారూఢుఁడైన యాశంకరుఁడు వారలంగూడి తనధామమునకుం బోయెను. ఏనరుఁడు జంబూమార్గము ననుసరింతును, జంబూమార్గమున నివసింతును. అని సంకల్పించునో వానికి రుద్రలోకనివాసము కలుగును.

## శ్రీహరి షట్పురముపైకి దండెత్తుట.

*ఆతరుణమున నాల్గువేదములు నేర్చి షడంగముల నిష్ణాతుఁడై యాజ్ఞవల్క్యమునికి శిష్యుఁడై ధర్మగుణాన్వితుఁడై తగుబ్రాహ్మణుఁడు బ్రహ్మదత్తుఁ డనువాఁడు వాజసనేయివంతుఁడుండెను వసుదేవుఁ డశ్వమేధమును జేయఁబూన నతఁడే చేయించెను. సంవత్సరదీక్షాదీక్షితుఁడు. షట్పురాలయుఁడు. ఆబ్రహ్మదత్తుఁ డావర్తానదీతీరమున మహర్షిసంఘము నివసింపఁగా

*ఈకథయుఁ బూర్వోక్తగ్రంథమున నెనుబదిమూఁడవయధ్యాయము నుండియే గ్రహింపఁబడినది.

నందుండి తపస్సు చేయుచుండెను. విశేషించి వసుదేవునకు మిత్త్రుఁడు, సహాధ్యాయియు నగు. ఉపాధ్యాయుఁడై పెక్కు మందికి వేదములఁ జెప్పెను. వసుదేవుఁ డాతఁడున్న తావునకు దేవకీదేవింగూడి పోయెను. షట్పురదానవులకు నతఁడు పురోహితుఁడై దేవతలకు బృహస్పతివలె నున్నవాఁడని విని యచటికిం బోయెను. ఆతరుణమున నా బ్రహ్మదత్తుఁడు క్షీరహోత యగుచుండెను. ఆయజ్ఞము సత్త్రయాగమనం బరఁగుచు బహ్వన్నము భూరిదక్షిణాకము నయియుండెను. ఆసత్త్రయాగమును మహాత్ములు దృఢవ్రతులునగు మును లాశ్రయించియుండిరి. నేనును (వ్యాసుఁడు) యాజ్ఞవల్క్యుఁడు, సుమంతుఁడు, జైమినియు, ధృతిమంతుఁ డగుజాబాలియు, దేవలాదులందుండిరి. ఆసత్త్రయాగమున దేవకి వసుదేవు నిచ్చచొప్పున నెల్లరకు ధనము నిచ్చుచుండెను. సకలరత్నముల నొసంగఁజాలుభాగ్య మాదేవికి వాసుదేవుఁడగు శ్రీకృష్ణప్రభావముననే కలిగెను. ఇట్టులా సత్త్రము సాగుచుండఁగా షట్పురవాసులగు దానవు లరుదెంచి వరలాభగర్వితులై యిట్లుపలికిరి. ఈయజ్ఞము సాగనీయుఁడు; సోమపానము మేము చేయుదుము. యజమానుఁడగు బ్రహ్మదత్తుఁడు మాకుఁ గన్యల నిచ్చుఁగాక. ఇందు రూపమున నలరారుకన్యకలు పెక్కుమందిగలరు. వారినెల్ల నిటకు రప్పించి యీయందగును. తప్పక మామాటప్రకారమే యీవలయును. మిగిలినశ్రేష్ఠరత్నముల మాకీఁదగు. అట్లుచేయ సమ్మతింపరేని యీయజ్ఞము సాగఁగూడదని యాజ్ఞాపింతుము.

అనవుడు బ్రహ్మదత్తుఁ డామాటలు విని యిట్లుపలికెను. యజ్ఞభాగము దనుజులకు విహితముగాదు. కావున నీసత్త్రయాగ

మున సోమపానముచేయ నెట్లు వలనుపడును? నే నెట్టులీఁగలను? వేదభాష్యార్థకోవిదులగు మహర్షుల నడుగుదును. నే సంకల్పించుకొన్న కన్యకల నంతర్వేదియందుఁ దగినవారి కీయవలయును. సంశయములేదు. రత్నములను మీ కొసంగెదను. ఆలోచింపుఁడు. దేవకీపుత్త్రు నాశ్రయించినవాఁడనుగాన బలవంతముగా నీయను. షట్పురవాసులగు నికుంభాదులు పాపాత్ములై కోపించి యీయజ్ఞవాటమును బ్రవేశించి కన్యకల గ్రహించిరి. అది గాంచి యీయానకదుందుభి కుమారుని స్మరించెను. వాసుదేవుఁడు మహాబలశాలి యగు రాముఁడు గదుఁడు వసుదేవుని తలంపెఱింగిరి. అంత వాసుదేవుఁడు కుమారుఁ డగు ప్రద్యుమ్నుం గాంచి కుమారా! త్వరగా బోయి కన్యారక్షణమున శ్రద్ధాదరుఁడవు కమ్ము. మాయాశాలివికదా. నేను యాదవసేనతో నచ్చటికి వచ్చెదనుక నీవు కాపాడుము. అనఁగాఁ దండ్రియానతిం జేయఁజాలు ప్రద్యుమ్నుఁడు షట్పురములకుంబోయి మాయచే నాకన్నియలం గైకొని మాయాస్వరూపలగు కన్యకు నొసంగెను. అనుచుండ నాదానవులు గర్వించి మాయాస్వరూపలగు కన్నియల నెత్తుకొని పురముల కరిగిరి. యజ్ఞమేషము విధిమంతముగా నందు సాగెను.

ఇట్టిసమయమున బ్రహ్మదత్తునిచే సత్త్రరక్షణార్థము నిమంత్రితులగు రాజు లరుదెంచిరి. జరాసంధదంతవక్త్రులు శిశుపాలుఁడు పాండవులు ధార్తరాష్ట్రులు మాలవదేశాధీశులు ససైనికులై వచ్చిరి రుక్మియు నాహూతియు నీలధర్ములు విందానువిదులు శల్యుఁడు శకునియు నింకనుగలబలయుతులు దృఢవ్రతులు నగురాజులెల్లరు నరుదెంచిరి. షట్పురముల కనతిదూర

మున నుండిరి. వారలం గాంచి నారదముని యిట్లు చింతించెను. యాదవులకు నీక్షత్రియులకు నిట సమాగమంబగు. యుద్ధము జరగ నేను హేతుభూతుఁడనై వారిం బ్రోత్సహించెదను. అని యాలోచించి నికుంభుని యింటికిం బోయెను. నికుంభుఁడు లోనగువా రామహర్షి నారాధించిరి. సముచితాసనాసీనుం జేసిరి. అత్తఱి నారదముని నికుంభుం గాంచి యసురవర్యులారా! యాదవులతోఁ బగగొని స్వస్థమనస్కులరై యిటు లుందురే ఇదిమంచిదియా? బ్రహ్మదత్తుఁడే హరియనుకొనుఁడు. హరియే బ్రహ్మదత్తుఁడు. హరి యతనికి సఖుఁడు బ్రహ్మదత్తున కయిదు వందలు భార్యలుగలరు! అందు బ్రాహ్మణకులజలు రెండుశతములు. రాజన్యకన్యలు శతసంఖ్యాకలు. వైశ్యశూద్రకన్యలు చెరి యొకశతము. వారందఱు దుర్వాసుని సేవింప నియమింపఁబడిరి. వారిశుశ్రూషల కానందించి యమ్మునివరమిచ్చెను. ఒక్కొక్క భార్య కొక్కదుహితయు నొకపుత్త్రుఁడును గలుగునట్లును వారెల్ల రూపబలముల నలరారునట్లును వరము. ఆకన్యకలు పుణ్యగంధమును వెదఁజల్లుచుందురు. సర్వదా యౌవనమున నలరారుదురు. పతివ్రతలు నగుదురు. గీతనృత్యముల వారచ్చరల మింతురు. గుణసంపన్నలు. ఎల్లకన్యకలు మునివరదానమున నన్నివిషయముల నెఱుంగుదురు. కొడుకులు రూపవంతులు మాత్రమేకాక శాస్త్రార్థకుశలులు. తమతమకులధర్మముల ననుసరించుచుందురు. వారినెల్ల భైమప్రభృతుల కిచ్చెను. మిగిలిన వారు నూఱుగురు, మీచేఁ దేఁబడిరి. వారికొఱకు యాదవులతోఁ బోరాడవలసియుండును. కావున వచ్చినరాజుల నెల్ల సహాయముగోరుము. సహేతుకముగా నీవేఁడికొలుందును.

బ్రహ్మదత్తసుతార్థమై రాజులు నీకుఁ దోడ్పడవలయుఁ గావున రత్నముల వారికిమ్ము. ఆతిథ్యముచేయుము. అని నారదముని పలుక నికుంభుఁ డంగీకరింప నారక్కసులెల్లరు వారి కాతిథేయ సత్కారము లాచరించిరి. అయిదువందలకన్యకలను రత్నములను వారివారి యోగ్యతానుసారము రాజులు పంచుకొనిరి. నారదానుమతిచేఁ బాండవు లందుఁ బాల్గొనరైరి. నారదుఁడా రాజులకడకుంబోయి మీరెల్ల నర్చింపఁబడితిరి. మీక్షత్రము రాక్షససహాయార్థ ముపయోగింపవలయును. క్షత్రియులారాధింపఁబడి సాయముచేయవలసినది యాచారముకదా! నికుంభుఁడును వారు సాయపడుట కానందించెను. మఱియు రాజులం గాంచి రాజేంద్రులారా! మాకు శత్రువులతో యుద్ధము కాఁగలదు. మీసహాయము. కోరెదము. అని వేఁడగనే యత్లే తోడ్పడుదుమని రాజులు వాగ్దానమొసఁగిరి. పాండవులు తక్కినభూపతులెల్ల రాడినమాటల నారదముని యాకర్ణించి వారిని మఱింత ప్రోత్సహించెను. యజ్ఞదత్తునిభార్యలు యజ్ఞవాటము జేరియుండిరి.

శ్రీకృష్ణుఁడు శంకరు నానతిం దలంచుచు సేనాసమేతుఁడై పోయెను. ద్వారకానగరమున నాహుకు నునిచెను. సేనాసమేతుఁడై యాహుకుఁడు పౌరరక్షణమున నాయత్తుఁడై యుండెను. యజ్ఞవాటమునకుఁ జెంత వాసుదేవుఁడు విడిసెను. ఆచోటు శుభదాయకమని వసుదేవుఁడు తెలుప నందులకు సమ్మతించి యందు సేనాసమేతముగా నుండెను. యుద్ధధర్మము ననుసరించి సేనల నయ్యైతావుల నునిచెను. ప్రద్యుమ్నుని వారి

రక్షింప నాజ్ఞాపించెను. ప్రద్యుమ్నుఁడు సకలమాయల నెఱుంగును గావున నా ప్రయత్నమున బద్ధాదరుఁడై యుండెను.

—నికుంభాదులు యుద్ధముచేయుట.—

*ఆరేయి యందుఁ గడపి శ్రీకృష్ణుఁడు సూర్యోదయముకాఁగాఁ గాల్యములను దీర్చి సాత్యకియు బలరాముఁడు తోడనుండ గరుత్మంతు నధిష్ఠించెను. ధనుర్వరములం దాల్చి సకలాస్త్రసంభృతతూణీరములం గట్టుకొని † బిల్వోదకేశ్వరుని ధ్యానించి నమస్కరించిరి. యజ్ఞవాటమును గాపాడఁ బాండవులను శ్రీహరి నియోగించెను. మిగిలినసైన్యమును గుహాద్వారమున నుండఁబనిచి జయంతుని బ్రవరుని స్మరించెను. స్మరించినంతనే వారు పొడసూపిరి. వారు వియత్తలమునందే ప్రద్యుమ్నునివలె నిల్చిరి. కృష్ణానుమతి రణదుందుభి మ్రోసెను. ఇతర రణవాద్యములు మ్రోఁగఁజేయఁబడియెను. సాంబుఁడు గదుఁడు మకరవ్యూహమును బన్నిరి సారణభోజోద్ధవవైతరణానాధృష్టి పృథువిపృథు కృతవర్మదంష్ట్రనిచక్షువులు సనత్కుమారుఁడు చారుదేష్ణుఁడు ననువీరనిరుద్ధసహాయులై వెనుకభాగమును గాపాడుచు నుండిరి. తక్కిన యాదవవాహినులు నడుమ నిల్చెను చతురంగబలములు సమరోన్ముఖములై యుండెను.

ఈకోలాహలము నాలకించి షట్పురములనుండి దానవులసంఖ్యలుగా వెడలివచ్చిరి. మేఘనాదములగు గార్దభములను

---

* ఈభాగము పూర్వోక్తహరివంశమునఁగల యెనుబదినాల్గవయధ్యాయమునుండి సంగ్రహింఁబడినది. † బిల్వోదకేశ్వరం దేవం నమస్కృత్య సురోత్తమమ్. అని మూలము.

గజములను మకరశింశుమారములను మహిషముల ఖరముల నుష్ట్రములఁ గచ్ఛపముల నెక్కి కొందఱును, వీనింగట్టినరథముల నెక్కి కొందఱును సకలాభరణభూషితులై బయలువెడలిరి. శంఖములఁ బూరించిరి. ఆదానవవీరులకు ముంగలిరై నికుంభుఁడు బయలువెడలి దేవేంద్రునివలె నుండెను. ఆదానవుల సేనలు భూమ్యంతరిక్షముల నావరించిన ట్లుండెను. అట్టహాసములఁజేయువారు కొందఱును వాద్యముల మ్రోయించువారు కొందఱునయి వెడలివచ్చిరి. శిశుపాలుఁడు ముందునడువఁగా రాజసేనయు దానవులకుఁ దోడ్పడఁ బయనము సాగించెను. దుర్యోధనుఁడు నతని తమ్ములు చేదిరాజు ననుసరించి నడచిరి. వారిరథములు గంధర్వనగరోపమానములుగా నుండెను. రుక్మియు వారివెంట నడచెను. అతనిధనుస్సు తాళవృక్షమునకు సరిపోల్పఁదగియుండెను. శల్యశకుని భగదత్తులు జరాసంధత్రిగర్తులు విరాటుఁడు తత్తనయుఁడు నికుంభసహాయార్థమై యనికి నడచిరి యాదవుల మార్కొని కయ్యముచేయ నాతురపడుచుండిరి.

నికుంభుఁడు పరాక్రమాటోపంబున వివిధమార్గణముల నాశీవిషములంబోనివానిం బ్రయోగించి శత్రుసేనల నొంచెను. యాదవసేనాధిపతియగు ననాధృష్టి రోషావేశంబున విచిత్రపుంఖములగు సాయకముల వైరుల మథించెను. నికుంభునిరథరథ్యములు కానరాకపోయెను. ధ్వజాదులుకూడఁ గానరాకపోయెను. అంత నికుంభుఁడు మాయాబలమున నాతని బంధించెను. వానిం దీసికొనిపోయి షట్పురములు గలగుహాలో నునిచెను. క్షణమాత్రమున మాయాబలసహాయమున మరల నికుం

భుఁడు యుద్ధమునకు వచ్చెను. కృతవర్మను జారుదేష్ణభోజవైతరణసనత్కుమార నిశఠోల్ముకులను భోజసేనానాయకులం బెక్కుమందిని మాయాబలమునఁ గనరాకుండఁ జేసెను. కాని యానికుంభుని దేహము మాయాసమాచ్ఛాదితంబు గానఁ గానరాకుండెను. వాఁడు వీరి నెత్తుకొని గుహలో నుంచుటయుఁ దెలియరాకయుండెను. ఆరంగము మహాభయంకరముగా నుండెను. యాదవసేనలకు భయమును గల్గించు నాకుంభునిం గాంచి శ్రీహరియు బలదేవసాత్యకులు నాగ్రహించిరి. సాంబప్రద్యుమ్నులు మఱింత పౌరుషమును జూప నెంచిరి. అనిరుద్ధుఁ డంతకంటె రోషించెను. తక్కినవీరులందఱు యుద్ధసన్నద్ధులైరి.

శ్రీకృష్ణుఁడు శార్ఙ్గకోదండము నెక్కుపెట్టి తృణమును హుతాశనుఁడు కాల్చినట్లు దానవుల శరాగ్నిచే భస్మముచేయసాగెను. ఆకృష్ణునిం దిలకించి దానవులు చుట్టుకొని పరిమార్ప నెంచి కాలపాశబద్ధములై శలభములు దీపముపైఁ గ్రమ్మునట్లు విజృంభించిరి. హరిపై సురవైరులు శతఘ్నులను బరిఘములను హుతాశనకీలలం గురియుశూలములను బరిశ్వధములను వైచి నొప్పించిరి. కొందఱు పర్వతశృంగములం బెకలించి వైచిరి. మఱికొందఱు గండశిలలు గురియించిరి. ఏనుఁగులనుగుఱ్ఱములను రథములను విసరివైవసాగిరి. ఆయాటోపము నోర్వక శ్రీకృష్ణాగ్ని వారలంగాల్పఁబూని విస్ఫురజ్జ్వాలలఁ బర్వఁజేసెను. శలభములంబోలి కొందఱు రూపడంగిరి. వారలు గురియించుబాణముల వానచినుకుల వృషభరాజు లెక్కింపనట్లు గణింపక బాణజాలముల రూప నాయుశూన్యులనుగాఁ జేసెను. హరికరవిముక్తశరపరంపరల నాయసురవరులు తీవ్ర

వర్షము నిసుకకట్టలవలె నోర్వఁజాలక మ్రందసాగిరి. తుదకు శ్రీహరి యెదుట నిలువనైనఁ జాలకపోయిరి. నిలువఁజాలక పాఱిపోవక స్వర్గమునకే కొందఱు పరుగిడిరి. నారాయణభయార్తులై పరుగిడు నాయసురుల నంబరమునన్నున్న జయంతప్రవరులు పోనీయక ప్రాణములం గైకొనుచుండిరి. వారిశిరస్సులు భూతలంబునఁ బడఁగా మొండెములు వెనుకఁబడుచుండెను. కొండశిఖరమునుండి వృక్షాగ్రములు భూమింబడునట్లు వారితనువులు పడుచుండెను.

రుక్మిణీపుత్త్రుఁడగు ప్రద్యుమ్నుఁడు ఘోరతరమనం జను మాయను గల్పించి యందొకగుహను గనఁబడంజేసి రణము చేయ నుంకించి కర్ణుని బీడితాంగునిగావించి యాగుహాలోవైచెను. దుర్యోధనుని విరాటద్రుపదులను శకునిశల్యసీలు లను నదీతనయుని విందానువిందులను జరాసంధుని త్రిగర్తదేశాధీశులను మాలవులనుగూడ నాగుహాలోఁ బడఁజేసెను. ధృష్టద్యుమ్నాదిపాంచాలవీరుల నస్త్రకోవిదులను రుక్మిని శిశుపాలుని భగదత్తుని గాంచి సంబంధమును గారవించెదను. మాయామయమగు నీ ఘోరతరగుహాలో మిమ్ముం బడవైచెదను. విశ్వేశ్వరుఁడగు శంకరుఁడు నాకిట్టు లాజ్ఞాపించెను. ఈగుహాలోఁ బడవైవుమనియె. శాంబరి నాశ్రయించి నికుంభుఁడు బంధించిన మాయాదవ్వులనెల్ల విడిపించెదను. అని పలుకు ప్రద్యుమ్నుని గాంచి సేనాపతియగు శిశుపాలుఁడు తీవ్రాంబకాసారమున సాంబాదులను విశేషించి ప్రద్యుమ్నుని నొప్పించెను. ప్రద్యుమ్నుఁడాశరాసారమున నొచ్చియు విశ్వేశ్వరునకు నమస్కరించి శిశుపాలునిమాయచే నావరించి కట్టివేయఁ

బూనెను. అంతఁ బ్రవరుఁ డిట్లుపలికెను. ఓప్రద్యుమ్నా! బిల్వేశ్వరాజ్ఞయైనది. ఈరాత్రియంతయు నీపూన్కి ననుసరించి కార్యము నెఱవేర్పుము. రత్నలుబ్ధులగు నీరాజుల నీపాశబద్ధులను నీవే విడిపింపవలయును. రాక్షసులను మిగులకయుండఁ జేయుము. జనార్దనునితో నిట్లే తెల్పుము. అని ప్రవరుఁడు శంకరు నాజ్ఞం దెలుప నట్లే యని యాప్రద్యుమ్నుఁడు శిశుపాలునాభృతిని రుక్మిని మఱియు నందుంగలరాజులను శంకరదత్తఘోరపాశముఁలబంధించెను. మాయామయమగు గుహాలోనునిచెనునిట్టూర్పులం బుచ్చుకాలభుజంగంబులం బోలె నారాజేంద్రులను గట్టివైచి తనపుత్రుఁడగు ననిరుద్ధుని వారికిఁ గాఁపుంచి మిగిలిన రాజులనుగూడ బంధించెను. సేనాపతిని గోశాధిపతిని హస్త్యశ్వముల నట్లే బంధించి యవశములుగా నొనరించెను. హతశేషులగు రక్కసులం జంపక నుద్యుక్తుఁడై యజ్ఞముచేయుబ్రహ్మదత్తునితో నిట్లు పలికెను.

విప్రోత్తమా! నిస్సంశయముగా యజ్ఞము సాగింపుము. రక్కసులకు భయపడకుము. ధనంజయుఁడు రక్షకుఁడై యుండ దేవదానవగంధర్వాదులవలన భయము రాదు. నీపుత్రికలు మాయాకల్పితాకారలు. నేనే వారిని మాయచేఁ గల్పించితిని. యజ్ఞవాటమున వారి జూతువుగాక. అనిపలికి తనపరాక్రమమును గనఁబఱచి రాక్షసుల భయభ్రాంతులనుగా నొనరించి బ్రహ్మదత్తుని భయముపోఁగొట్టి తాను విజృంభించుచుండెను.

* ప్రద్యుమ్నమాయాప్రభావమున రాజులందఱు బల

* ఈకథయు విష్ణుపర్వము నెనుబదియేనవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

ములతో బంధింపఁబడఁగా రాక్షసులనుగూడ నామాయ యావ రించెను. యాదవవీరులు నలుప్రక్కల నిలిపి యుద్ధముచేయుచుఁ జంపుచుండఁగాఁ దాళఁజాలక యాదనుజులు నలుదెసలకుఁ బరుగిడిరి. కృష్ణానంతప్రభృతులు చెలరేఁగ వధింపసాగిరి. వారి యాటోప మోర్వరానిదయ్యెను. రాజ్యము దేవుఁడెఱుఁగునని వారు పాఱసాగిరి. వారిం గాంచి నికుంభుఁ డుచ్చైస్స్వరంబున నిట్లు పలికెను. దానవులారా! ప్రతినమాని భయార్తులై పరుగి డుచున్నారే. ఇదితగునా! పరుగెత్తి ప్రతినమాని యేలోకము లకుఁ బోవ నెంచితిరి? ఇఁకనైనఁ బాఱిపోవక జ్ఞాతివధము నాలోచించి ప్రతిన నెఱవేర్పఁ బ్రయత్నింపుఁడు. పురుషుఁడు పగతుర జయించి సుఖము నొందవలయు. జయము చేకూరదేని మృతినొంది స్వర్గమునఁ జిరకాలము సుఖింపవలయును. పరుగిడి యింటికింజని యెవ్వరిమోములఁ జూడఁగలరు? సిగ్గుమాలి భా ర్యలఁ జూడఁజాలుదురా. యుద్ధమేమాయెనన్న బదులుచెప్పఁ గలరా. అనిపలుకఁగా నికుంభునిపలుకు లాలకించి సిగ్గుపడి దాన వులు మరలిరి. ద్విగుణీకృతపరాక్రమమున మరల యుద్ధము సాగించిరి. యజ్ఞవాటముఁ జొచ్చి హింసింపఁ దలంచుకొన్న దానవుల నందున్న యర్జునుఁడు చంపుచుండెను. నకులసహదేవులు ధర్మరాజు భీముఁడు చెలరేఁగి యజ్ఞవాటముప్రక్కకుఁ దిరుగు వారిని రూపడంచుచుండిరి. ఆకసమున నెగిరిపోవఁదలంచుకొన్న రక్కసుల జయంతుఁడు వధించుచుండెను. ప్రవరుఁ డాపనియే చేయసాగెను. అత్తఱి నారణరంగమున నొకనది ప్రవహించెను. అందు రక్తమే జలము. వెండ్రుకలే నాచుతీఁగలు. చక్రకూర్మ రథములేసుడులు. గజములే పెద్దపాషాణములు. ధ్వజములుకుం

తాయుధములే తరుచ్ఛాయలు. సింహనాదములే ప్రవాహధ్వనులు. ఇట్టి రక్తప్రవాహము శ్రీకృష్ణశైలమునఁ బొడమినది. భీరువులచిత్తములను మథించుచుఁ బ్రవహింపఁబూనెను. అందు ఖడ్గములను బెళుకుచేఁపలు తిరుగుచుండెను. వర్షాకాలజలదమువలె రక్తనది యకస్మాత్సంభూతిం గాంచి పాఱుచుండెను. ఆరక్తనదిని జూచి వృద్ధినొందుచున్న శత్రువులఁ బరికించి తనమిత్రులు సాయముఁజేయఁ బూనివచ్చి తాఁ గాంచుచుండ మృతినొందుటం గాంచుచు మహత్తర రోషమునఁ బరువిడెను. ఆతనిని జయంతప్రవరులు నిల్పిరి. కులిశనిష్ఠుర బాణములఁ బ్రయోగించిరి. దాని కాగ్రహించి వెనుకకు మరలి దష్టోష్ఠుఁడై పరిఘమునఁ బ్రవరుని గొట్టెను ఆవ్రేటున కాతఁడు ధర నొరంగెను. జయంతుఁడు పడుచుండునాతని రెండుచేతులఁ బట్టుకొనియెను. ప్రాణములున్నవని యెఱింగి ప్రవరుని వదలి రాక్షసునిపై కరిగి యెదిగి ఖడ్గమున దానవు నొంచెను. ఆపరిఘముననే జయంతుని నికుంభుఁడు కొట్టెను. నికుంభునవయవములెల్ల సొమ్మసిలునట్లు జయంతుఁడు నొప్పించెను. ఆదెబ్బలకు నొచ్చియు జ్ఞాతులం బొలియించిన కృష్ణునితో యుద్ధము చేయువాఁడై యిట్లు చింతించెను. ఈయింద్రసూనునితో నాకేమిపని ? కృష్ణుని మాఱ్కొనియెద. అనితలంచి మాయంగొని యందే యదృశ్యుఁడయ్యెను. శ్రీకృష్ణుఁ డున్నయెడకుం బోయెను.

శ్రీకృష్ణనికుంభుల సంగరమును జూడఁగోరి యైరావతము నెక్కి శతమఖుఁడు దేవతలు పరివేష్టించిరాఁగా వచ్చెను. మేల్మేలని కొడుకును జయంతుని కౌఁగిలించుకొనియెను. మూర్ఛఁబాసియున్న ప్రవరు నాలింగనమున నలరించెను. దేవదుందు

భులు ధ్వనించెను. జయశ్రీవిరాజితుఁడగు జయంతు నెల్లరు వినుతించిరి. అట్టితఱి నికుంభుఁడు రణదుర్జయుఁ డగు కేశవుని గనుంగొనెను. అత్తఱి హరి యర్జునుంగూడి యజ్ఞవాటమునకు నాతిదూరమం దుండెను. సింహనాద మొనరించుచు గరుడుని జావఁగొట్టెను. దురాసదంబగు పరిఘమున బలదేవసాత్యకుల నొప్పించెను. కృష్ణార్జునుల భీమయుధిష్ఠిరుల నకులసహదేవులనొంచెను. సాంబప్రద్యుమ్నుల నొప్పించెను. మాయాసంగరమున నొంచువానికుంభు నెవ్వరును గనుఁగొనఁ జాలకపోయిరి. వానిని గనుఁగొనఁజాలమని తోఁచగానే బిల్వోదకేశ్వరుని ధ్యానించిరి. విశేషించి హరి స్మరించెను. భగవంతుఁడగు నాబిల్వోదకేశ్వరునిఁ మహిమమున మాయాచ్ఛాదితుఁడగు నికుంభునిం గనుంగొనఁజాలిరి. కైలాసపర్వతాకారముగలిగి వాఁడుండెను. తనజ్ఞాతులనాశనముచేసిన శ్రీకృష్ణుని రణమునకు రమ్మని పిలుచుచుండెను. అర్జునుఁడు గాండీవమెక్కిడి పరిఘమును వానియవయవములను బాణములచేఁ జిందఱవందఱగాఁ జేసెను. కాని యాబాణములు వానిమేనును జీల్పఁజాలక మిట్టిపడెను. తనబాణములు నిష్ఫలములు కాఁగా ధనంజయుఁడు విస్మితుఁడై శ్రీకృష్ణా! యిదేమి చిత్రమని యడిగెను. నాబాణములు పర్వతమునైన భేదించునవి. వజ్రసంకాశములు గదా. వీనిశరీరమును దాఁకి యెగిరిపడినవే. ఏల? అన విని నవ్వి కేశవుం డిట్లనియె.

ఫల్గునా! యీనికుంభుఁడు మహాభూతము. విశేషించి వచియించెద. ఆలకింపుము. ఈదానవుఁడు పూర్వ ముత్తరగోసలములకుంబోయి తపస్సుచేసెను. దురాసదుఁ డగునీశాంక్షుఁడు శతవర్షసహస్రములు నిష్ఠసలిపెను. హరుఁడు ప్రత్యక్ష

ముకాఁగా వీఁడు వరమును గోరెను. సురాసురులచే నవధ్యము లగు మూఁడురూపముల నిమ్ము అని యడుగఁగా భగవంతుఁ డగు వృషభధ్వజుఁడు రాక్షసా! నాకుఁగాని బ్రాహ్మణులకుఁ గాని విష్ణువునకుఁగాని యప్రియ మొనరింపఁబూనితివేని విష్ణువువలన మృతిగల్గఁగలదు. నేనును విష్ణువును బ్రాహ్మణులరక్షింతుము. అని శంకరుఁ డనియె. ధనంజయా! వీఁడు సర్వశస్త్రాస్త్రాభేద్యుఁడు. త్రిదేహుఁడు, శత్రువులఁ బీడించువాఁడు, వరమత్తుఁడునగు వీఁడు సమరదుర్జయుఁడు, భానుమతీ వివాహకాలమున వీనిదేహ మొకటి నాచేఁ దెగియె. ఈషట్పురమునుదేహ మవధ్యము. తల్లి యగుదితిని దపశ్చర్యచే నొకదేహము సేవించుచున్నది. మూఁడవదేహమే యిది. దీనిం దాల్చియే షట్పురంబుల నేలుచున్నాఁడు. వీనిచరితంబు దెల్పితి. వీని వధింపఁ ద్వరపడుము. మిగిలినకథ వెనుక వినుదువు. అని కృష్ణార్జును లిట్లు మాటలాడుకొనుచుండఁగా నారాక్షసుఁడు గుహను బ్రవేశించెను. వానిని వెదకి మధుసూదనుఁడు తాను నాగుహలోఁ జొరఁబడియెను. అది షట్పురసంజ్ఞగలది. అతిభయంకరాకృతి కలది. శత్రువులకు ధర్షింపఁ దరముగానిది. అందుఁ జంద్రసూర్య ప్రభలు వెలుఁగవు. స్వతేజస్సమాభాసురము. సుఖదుఃఖశీతోష్ణములఁ గోరినయట్లది యీయఁగలదు.

ఆగుహలోఁ బ్రవేశించి జనార్దనుఁ డారాక్షసుం గాంచెను. వానితో బెట్టిదముగాఁ బోరెను. కృష్ణునితోఁటి బలదేవాదులును బ్రవేశించిరి. పాండవులు నందుఁ బ్రవేశించిరి. కృష్ణానుమతినందియే యందు వారెల్లం బ్రవేశించిరి. కృష్ణానుమతుఁడై ప్రద్యుమ్నుఁ డతనితోఁ బోరాడెను. మాయాబల

మున నున్నతఁడు కట్టివైచిన యాదవులనెల్లం దెచ్చెను. ప్రద్యు మ్నుఁడు బంధముక్తులఁ గావింపఁగా వారు కృష్ణునంతికమును జేరిరి. వారెల్ల నికుంభవధమును గోరుచుండిరి. వారెల్లఁ బ్రద్యు మ్నకుమారా! రాజులను వదలింపుమా యని కోరిరి. వారి నెల్ల విముక్తులఁ గావించెను. వారెల్ల నధోముఖులై మౌనము నవలంబించి సిగ్గు తమ్ముముంప నష్టతేజస్కులై నిలువఁబడిరి. జయింపఁ బ్రయత్నించునికుంభుని శౌరి పొడగాంచి మార్కొని ఘోరముగాఁ బోరెను. కృష్ణుని బరిఘమున దనుజుఁడు బిట్టు ప్రహరించెను. మరల గదచే హరిచేఁ బీడింపఁబడి యాదను జుఁడు నొచ్చెను. హరియు నొచ్చెను. ఇట్లన్యోన్యప్రహారముల నొచ్చియుఁ బోరుచుండఁగాఁ బాండవులును యాదవులు నొచ్చి చూచుచుండఁగా మహర్షులు శ్రీహరికి జయముం గోరి జపించిరి. వేదమంత్రముల వినుతించిరి. మరల స్మృతి చక్కఁగా రాఁగా దనుజుఁడు నట్టులే చేతననొందఁగా మరల నిరువురు మార్కొనిరి. గజద్వంద్వము వృషభద్వయము శాలావృకయు గ్మము పోరునట్లు పోరాడుచుండఁగా నశరీరవాక్కొక్కఁడు కృష్ణున కిట్లు హితము తెలిపెను. దానవాంతకా! ఈక్రూర రాక్షసుఁడు దేవబ్రాహ్మణకంటకుఁడు! కానఁ జక్రముచేఁ జంపుము. అని బిల్వజలేశ్వరుఁడే తెలిపెను.

ఆశంకరాలాపముల నాలించి యట్లే యొనరించువాఁడ నని లోకనాథుఁడు శివునకు నమస్కరించి దైత్యకులాంతకం బగుసుదర్శనమును బ్రయోగించెను. ఆచక్రము మణికుండలమం డితం బగునికుంభుని శిరస్సును దేహసంబంధము లేకుండఁ జేయఁ జాలెను. నికుంభునిచావునకు శంకరుఁ డానందించెను. హరిపైఁ

బూలవాన కురిసెను. దేవదుందుభులు మ్రోసెను. ప్రపంచమం తయు నానందించెను. *దైత్యకన్యకలను యదుకుమారుల కెందఱనో శ్రీహరి యొసంగెను. క్షత్రియులనెల్ల నాశ్వాసించి విచిత్రరత్నముల నొసంగెను. పాండవుల కాఱువేలరథములను సకలపరికరములం గూడినవాని నిచ్చెను. ఆషట్పురము నే బ్రహ్మ దత్తున కొసంగెను. ఆసత్రయాగము పూర్ణముకాఁగా శంఖ చక్రగదాధరుఁడు రాజులను బంధముక్తులఁ గావించి పంపించి పాండవులను బయనముచేయ నియమించి తాను బిల్వోదకేశ్వ రునికడకుంబోయి నైవేద్య మిడి మల్లయుద్ధవిశారదులకు బహు మతుల నర్పించి వారిబాహుబలముం గాంచి యానందించి తల్లి దండ్రులంగూడి యదువులు వెంటరాఁగా బ్రహ్మదత్తునకు నమ స్కరించి ద్వారకాపురి కరిగెను. ఇది షట్పురవధమనుగాథ. ఇది భగవచ్ఛక్తి ప్రబోధకము. దీనిం బఠించినను వినినను మాన వులు [7]జయలాభము నొందుదురు. సకలాపత్పరిహారము గోరి దీనిం బఠింపవలయు.

మహాశయులారా! షట్పురదానవులవృత్తాంతమునుండి యెఱుంగఁదగినవి కలవన్న సందియము లేదు గాని యొక్కవిష యముమాత్ర మెఱుంగవలయును. దానవులు త్రిపురసంహార కాలమునఁ జావక మిగిలినవారని యుండే కలదు. వారు తపం బొనరించి విరించివలన వరము లొందిరి. కాని యాబ్రహ్మ వర ప్రదానకాలమునందే,

శ్లో. "న బాధిష్యథ చేద్విప్రాన్ సత్పథస్థాన్ సతాం ప్రియాన్,
విప్రోపఘాతం మోహాచ్చేత్కరిష్యథ కథంచన,

---

*దైత్యకన్యాశ్చ భగవాన్ యదుభ్యశ్శతశో దదౌ—అని మూలము.

నాశం యాస్యథ విప్రాహి జగతః పరమా గతిః. ౨౧
నారాయణా ద్బిభేత్తవ్యం కుర్వద్భిర్బ్రాహ్మణాహితమ్,
సర్వభూతేషు భగవాన్ హితం ధత్తే జనార్దనః." ౨౨

అనిపలికెను. నావరములనుబట్టి గర్వించి తపోనిరతులగు విప్రులకు నహిత మాచరింతురేని మిమ్ముం బొలియించును. సర్వభూతపాలకుఁడు గదా విష్ణువని యెఱుంగుఁడనియె. ఎట్టి వరప్రభావముగాని సత్కార్యములకు హాని గల్పించినచో నశించునని స్పష్టమగుచున్నది.

శ్లో. "కామై స్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతే ఽన్యదేవతాః
తంతం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా. ౧
యోయోయాం యాం తనుం పార్థ శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధామ్యహమ్.
స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్.
అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్,
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి.
అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః,
పరంభావమజానంతో మమావ్యయమనుత్తమమ్" ౨౪

(గీతా. ౭ అధ్యా.)

అను గీతావాక్యములనుబట్టి యూహింపఁగాఁ దపస్సను నది సత్కర్మము. అది ఫలాభిలాషచేఁ జేయఁబడనిచో ముక్తి నొసంగును. ఫలాభిలాషమునఁ జేసినను స్వల్పఫలముల నొసంగును. ఆఫలము లనంతములు గావు. కొంతకాలమునకు నశించునవి. అని సారము కనఁబడును. అందును ఆతపస్సు

పరహింసాపూర్వకాత్మసుఖార్థ మగునేని యది కర్తకే మృత్యువును దెచ్చును. ఆమాటయే బ్రహ్మవాక్యమునందుఁ గలదు. తపస్సనఁగా నొకదేవతారూపమును మదినిలుపుకొని దాని నాకర్షించునట్టి బీజముల నామంత్రమున సంపుటీకరణముగ నొనరించి జపించుట. అదియే షట్ప్రయోగములలో నాకర్షణ ప్రయోగము. నియతిఁబూని జపింపఁగా నామంత్రాధిదేవత యాబీజముల బలమున నాకర్షింపఁబడి ప్రత్యక్షమగును. ఉపాసకునివాంఛ సద్వాంఛయే యైన నది యాదేవతకుఁ దృప్తిని గల్పించును. ఆవరము కరుణమై నిచ్చును. దుర్వాంఛయైనచో విధిలేక యీయవలసివచ్చునుగాని నాదేవత యొకవ్యాజము పన్ని యిచ్చును. దానవులతపస్సు లనట్టివే. మఱియు నాఫలము ననుభవించు యోగ్యత వీనికి లేకున్నచోఁ దపోబలమున నాకర్షింపఁబడినదేవత ప్రత్యక్షమైనను జిత్తవిభ్రాంతి లోనగువానిం గల్పించును ఆవాంఛకుఁ దగుఫలముల ననుభవించు సత్కర్మములను జేసియుండునేని తత్ఫలము లనుభవింపఁదగిన వరముల నాదేవతసుముఖుఁడై యొసంగు. ఏతపస్సుగాని పరుల బాధింపఁబూని చేయఁబడునదియే యైన నది కర్తకు హానిని గల్పించు. అందును జ్ఞానులను బాధించునేని భగవంతుఁ డేవిధముననైన వారిని వధించును. తప స్సొనరించి ఫలమును గోరకయున్నచో నాతపస్సే లోకోపకారక మగు. దాన భగవంతుఁడు సంప్రీతుఁ డగు. సర్వకామములు వాఁడు కోరకయున్నను ఫలించును. ముక్తియుఁ గలుగును. ఏలయన నాతపస్సు సత్త్వగుణప్రధానము. దానినే నిష్కామతపస్సందురు. అట్టితపస్సు చేయఁజాలకుంటిమిగదా యని సాధువులు పరితపింతురు.

శ్లో. క్షాంతం న క్షమయా గృహోచితసుఖం త్యక్తం న సంతోషతః
సోఢా దుస్సహశీతవాతతపనాః క్లేశా న్న తప్తం తపః,
ధ్యాతం విత్త మహర్నిశం నియమితప్రాణై ర్న శంభోః పదం
తత్తత్కర్మ కృతం యదేవ మునిభి స్తత్తత్ఫలై ర్వంచితమ్.

అని భర్తృహరి తెల్పి పరితపించెను. కావున దుష్టవాంఛాపూర్వకతపస్సపాయమున కాధారమని స్పష్టము కాకమానదు తపస్సాచరింపక యనఁగా భగవంతు నుపాసింపక మంత్రమంత్రార్థముల నెఱుంగక మనస్సును జయింపక తదాధారమగు యోగము నభ్యసింపక వేదాంతవాక్యములను బఠించుచుండువా రిహపరదూరులగుదురు. మహర్షులెల్లఁ దపోనిరతులు. వారు చేయుయజ్ఞములు సత్రయాగములు. అనఁగా లోకహితమును గోరి చేయునవి. కావున భగవంతుఁ డానందించును. ఈకాలమున నుపాసకులు గగనకుసుమములుగ నున్నవారు. ఉపన్యాసకులు త్రొక్కిన వెడలివచ్చుచున్నారు. కావునఁ దపస్సన కిఁకఁ దా వెక్కడిది? చచ్చుమాట లుపన్యసించిన లాభములేదు. భగవద్గీత లెన్నిమాఱులు వర్ణించినను ఫల మనంతము గలుగదు యోగవిద్య నభ్యసించి యుపాసకుఁడు కావలయును. కానిచో భగవదనుగ్రహము కలుగదనుట నిర్వివాదాంశము. మఱొక్కవిషయ మీకథలనుండి కనుఁగొనఁదగినది కలదు.

"దైత్యకన్యాశ్చ భగవాన్ యదుభ్యశ్శతశో దదౌ."

షట్పురదానవులను వధించినపిదప వారికన్యకలను వందలకొలఁదిగ యదువంశజనితులకు శ్రీహరి యిచ్చెనని హరివంశమునఁ గలదుకదా: నరకాసురుఁడు దేవకన్యలఁబట్టి తెచ్చెనన్న

నాక్షేపించుట యకార్య మక్రమమనియేకదా. ఇపుడు రాక్షసులు చావఁగా దిక్కులేకయున్న వారికన్యకల యదుకుమారుల కిచ్చుట యకార్య మేలకాదు? అనుప్రశ్నము రాకమానదు కాని ప్రశ్నముచేసినవా రాలోచించి ప్రశ్నింపలేదనియెదను. ఏలయన. రాక్షసులెల్ల మృతినొందిరి. కన్యకలందఱు మిగిలిరి. యువతులు నుందురు. వారు కొంతకాలము సంసారయాత్ర జరపినవారుకాన వారించుక వైరాగ్యము నీదుఃఖమునఁ దద్విషయమునఁ బొందఁగలరు. కన్యక లేమగుదురు? స్వేచ్ఛగాఁదిరుగుదురు. స్వాతంత్ర్యము వారికి నుండరాదనియు దాన ముప్పు తప్పదనియు మనపూర్వులయాశయము.

శ్లో. బాల్యే పితుర్వశేతిష్ఠేత్పాణిగ్రాహస్య యౌవనే,
పుత్రాణాం భర్తరి ప్రేతే న భజే త్స్త్రీ స్వతంత్రతామ్.
పిత్రా భర్త్రా సుతైర్వాపి నేచ్ఛేద్విరహమాత్మనః,
ఏషాం హి విరహేణస్త్రీ గర్హ్యే కుర్యాదుభే కులే. ౧౪౯

(మనుస్మృతి ౫ అధ్యాయము.)

"పితృమాతృసుతభ్రాతృశ్వశ్రూశ్వశురమాతులైః,
హీనా నస్యాద్వినాభర్త్రా గర్హణీయాన్యథా భవేత్."

(యాజ్ఞవల్క్యస్మృతి.)

"అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః."

(గీత ౧ అ. ४౧.)

ఈమొదలగు ప్రాచీనస్మృతివాక్యములు గీతయుఁ బై యభిప్రాయమునే తెలుపుచున్నవి. అర్జునుఁడు పైవిధముగాఁ బ్రశ్నించినపుడు సర్వసందేహములు తొలఁగునట్లు హరి బదు

లుచెప్పెనుగాని స్త్రీలు దుర్వృత్తలగుదురు. దాన వర్ణసంకరత ప్రబలును. అన్నయర్జునునిసందేహమును జక్కఁగాఁ దీర్పలేదు. ఏలయనగా నాభావము నిక్కమే యని హరి యెఱుంగును. కులధర్మములన్నియు స్త్రీలమూలముననే యున్నవనియు వారు చెడకయుండినఁగాని యవి యుండఁజాలవనియు నెఱింగియే యాప్రశ్నమును మెల్లఁగా జాఱవిడిచి తత్కాలోచితమగు యుద్ధకర్మాచరణమునకుఁ దగుభంగిఁ బురికొల్పెను. స్త్రీలు దుర్వృత్తలు కారని గాని, అయినను భయమేల యనిగాని యేల బదులిడలేదు ?

శ్లో. "యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి." ౨౪
(గీత. ౧౬ అధ్యా.)

శాస్త్రవిహితరీతిఁ బ్రవర్తింపవలయును. శాస్త్రములనఁగా మన్వాదిస్మృతులని భావము. తర్కవ్యాకరణములయందీయాచారకర్మతపస్సాధనములు చెప్పఁబడలేదు గాన స్మృతిశాస్త్రము లనియే యర్థము. అంతమాత్రమున శ్రీకృష్ణుఁ డూరకుండక,

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోష మపి న త్యజేత్,
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః" ౪౮
(గీత. ౧౮ అధ్యా.)

అని హరి యుపదేశించిరి. కావున భగవంతునిభావము తమతమధర్మములు తమరాచరింపవలయుననియే. ఈకాలమున గీతాశాస్త్రమును బలవంతముగా రమ్మని యుపన్యసించువారి కీగీతాశాస్త్రమునందు నమ్మకముకలదా యను నొకసందియము పొడమెడిని. ఏలయనఁగా నాభగవద్గీతాశాస్త్రమందే,

శ్లో. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.
(౧౮ అధ్యా.)

అని కలదు. తపస్సుచేయనివానికిని, అది చేసినను భక్తి లేనివానికిని, అదియు నున్నను శుశ్రూషచేయనివానికిని, అది యున్నను నన్ను ద్వేషించువానికి నుపదేశింపరాదని యున్నదే. ఈశ్లోకము కృష్ణోక్తము కాదందురా? లేక ప్రక్షిప్తమందురా? కానిచో "తుడుము దేవతార్చనమువఱకు" నన్నట్లు మాకీ యుపన్యాసమువలదు స్వామీ యన్నను ఒక్కసారి వినిపొండు. అని యుపన్యసింపఁజనునా. కాఁబట్టి యట్టివారికి మనస్సునందు నీగీతాశాస్త్రముపైఁ బ్రమాణబుద్ధి లేదనవలయును. ప్రకృత విషయమున శేషభాగము వినుఁడు.

శ్రీహరి యారాక్షసకన్యకలు స్వేచ్ఛగాఁ బ్రవర్తింతు రని యెఱింగెను. పురుషులయధీనమున నుండినఁగాని యుక్త ప్రవర్తనము కలవారు కారు. కన్యాదానము చేయువారు లేరు. విధవలగు స్త్రీలు దుఃఖసాగరమున మునింగియున్నారు. వారికిఁ గన్యాదానము చేయువారున్ లేదు. కావున నెవరు లేని యపుడు తానే కర్తయని తలంచెను. శూరులగు యదుకు మారుల కిచ్చెను. రాజులపద్ధతిప్రకారము గాంధర్వప్రముఖ

పద్ధతులలో నొక్కపద్ధతి వివాహము చేసికొనుఁడని భగవంతునియాజ్ఞ యైనట్లు మనము గ్రహింపవలయును. కావున నరకాసురుఁడు చేసిన కార్యమునకు శ్రీకృష్ణుని కార్యమునకు మేరువునకును మశకమునకుఁ గలంతభేదము కలదు. మొదటివారిది దుష్కృత్యములలో నగ్రగణ్యము. రెండవవారిది సత్కార్యములలో నగ్రగణ్యము, అని గ్రహించి లేనిపోనియాక్షేపముల కవకాశ మీయక భగవత్కార్యమున లోపము లుండవన్న నమ్మకమూని యాజగదేకరక్షకుని శరణు వేఁడవలయును. శరణాగతికన్న వేఱుకార్య ముత్తమోత్తమము కానరాదు. పాపభూయిష్ఠమగు కలికాలమున నిరపాయమగు నుపాయము భగవన్నామపారాయణము. దానికిఁ బ్రాయశ్చిత్తముఁలు లేవు. ఇంత చేయకయున్న నపరాధమను బాధలేదు. ఎంతచేసినను బుణ్యము. కొలఁదిగాఁ జేసినను మహాఫలము కలదు. కావున నట్టిసత్కార్యమునకుఁ బ్రయత్నింపుఁడు. ఇఁకఁ దరువాతి భగవత్కథ నాలకింపుఁడు.

ఆర్యులారా! ఈకథకుఁ దరువాతసంబంధము ననుసరించి పాండవులచరిత్రము వ్రాయవలయును. కాని యాగోడవలో దిగిన మరల నీకథలను వ్రాయువిశ్రాంతి చాలకాలమునకుఁ గాని దొరకదు. కావున నించుక పూర్వాపరవైషమ్యములను బాటింపక యీసంబంధమునఁ గొన్నికథలను వ్రాసెదను. ఇంతియకాక శ్రీకృష్ణుఁడు భూమిపైనున్నది నూటయిరువది సంవత్సరములు ఐదుదినములు. ఈకాలమున నీవత్సరమున నీమాసమున నీదినమున నిన్నిగడియలకాలమున నీకార్యముచేసెనని నిర్వచింప వీలులేదు. శ్రీభాగవతమునఁ గొన్నికథలకు వయస్సు

నిర్ణయించిరిగాని యదియు సరిగాలేదు. ఏలన భగవత్కథ లనేకము లితరపురాణములయందుఁ గలవు. వాని నిర్ణయించుట కీభాగవతనిర్ణేతలు పూనలేదు. భాగవతమునఁ గల శ్రీకృష్ణకథలే యతిస్వల్పములు. వానినిమాత్రము నిర్ణయించినచోఁ దక్కుంగల కథలన్నియు భగవచ్చరిత్రములు కావన వలసివచ్చును. అట్లనుటకంటె నవివేకము వేఱుగలేదు. ముందుకథ వెనుకవ్రాసితివే యేలయని నన్నుఁ దిట్టక నావంటియల్పమతి నాక్షేపింపక భగవత్కథల నాలకింపుఁడు. పలుమాఱులు ప్రార్థించు నాయీవేఁడికోలు 'అతివినయము ధూర్తలక్షణము' అన్నసూక్తి కుదాహరణము కాదనియు, నాయజ్ఞానము నేనే యెఱుంగుదుననియు, మీరు దానిని క్షమింపవలయుననియు విన్నవించి, తరువాతికథను వ్రాయ మొదలిడుచున్నాఁడను.

### అంధకాసురవృత్తాంతము.

* జనమేజయుఁడు ప్రశ్నింప వైశంపాయనుఁ డీవృత్తాంతము దెలుపుచున్నయ ట్లెఱుంగవలయు. దైత్యులకుఁ దల్లియగు దితి కశ్యపమహర్షికి రెండవభార్య. ఆమె షట్పుర దానవులమరణము నాలకించెను. పురపురఁ బొక్కెను. ఒక్కసారి యింతమంది యావిష్ణువు వధించెనే గతియేమని తల్లడిల్లెను. వేఱుగతి లేదని యూహించి తనభర్తనే తపమున నారాధించెను. పతియే పరదైవమని భావించెను. కాలమునఁ దపస్సు చేయుచు, సకాలమున శుశ్రూషలుసల్పుచు, భర్తహితమునేతా నాచరించుచు మనోహరవాక్కుల భర్తను సంతుష్టుఁజేయుచు

* ఈకథ హరివంశవిష్ణుపర్వమునందలి యెనుబదాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

నిన్నియుఁ దపస్సులే యని నమ్ముచు నారాధించెను. ఆమెశుశ్రూషల కానందించి మరీచిపుత్త్రుఁడగు నాకశ్యపముని యామెం బిలిచి యిట్లు పలికెను. సువ్రతమూని నన్ను సేవించుచున్న యోకల్యాణీ! పరితుష్టాంతరంగుఁడ నైతిని. వరమిచ్చెద కోరుము. అనుటయు నాదితి యిట్లు ప్రార్థించెను.

ధర్మవిద్వర్యా! దేవతలచే నిహతపుత్త్రకనైతిని. అవధ్యుఁడగుపుత్త్రుం బడయఁగోరెదను. దేవతలచేతను వానికి మృతిలేకుండవలయును. మహావిక్రమాఢ్యుఁడుగా నతఁడుండవలయు. అని ప్రార్థింపఁగా విని యమ్ముని దేవీ! నీకొమరుఁ డవధ్యుఁడగును. దేవత లాతనిని జయింపఁజాలరు. సంశయము వలదు. కాని యట్టిపుత్త్రుని నిగ్రహింప దేవదేవుఁడగు శంకరుఁడే సమర్థుఁడు. నీకొమరుని మూలమున నిన్ను రక్షించుకొన నెంచుట సర్వవిధములచేతఁ దగియున్నది. అని యాకశ్యపుఁ డామె నాశ్వాసించి పలికెను. ఆమె యంగుళ్యోదరదేశమునఁ బుత్త్రుని గనెను. సహస్రబాహువులు, సహస్రశిరస్సులు, రెండువేల కన్నులు. నన్ని పాదములు కలవాఁడుగా నాపుత్త్రుఁ డుండెను. * వాఁడు గ్రుడ్డివాఁడు కాకున్నను గ్రుడ్డివానివలె నడుచు నలవాటుకలవాఁడు. కావున నంధకుఁడనుపేరు గల్గెను. ఆ ప్రదేశమున నున్నవా రాపేరునఁ బిల్చిరి. కావున నంధకాహ్వయమే ప్రసిద్ధమయ్యెను. అవధ్యుఁడనన్నగర్వమున వాఁడు కన్నుమిన్నుఁ దెలిసికొనలేక లోకముల బాధింపసాగెను. వానికి రత్నములయందు ప్రీతియెక్కుడు కావున బాహుబలమున నెందున్నను లెక్కింపక రత్నములఁ బ్రోగుచేయసాగెను. భుజబలమున

* స ప్రజత్యంధవద్వృష్టావనంధోఽపి స భారత. అని మూలము.

నచ్చరలంబట్టి తనయింట నుంచుకొనెను. సర్వలోక భయంకరుఁడై యతఁ డొప్పెను. పరదారల నపహరించెను. పరరత్నములఁ గైకొనుచుండెను. ఈ రెండు కార్యములు మోహమున సర్వదా చేయుచుండెను. పాపనిశ్చయమున నతఁ డుండెను. ఆతఁ డొకసారి ముల్లోకముల జయింప నెంచెను. క్రూరరాక్షసులు సర్వదా సర్వథా పరహింసాపరాయణులు పెక్కుమంది తోడుసూపఁగాఁ బ్రయాణము సాగించెను.

ఆవృత్తాంత మెఱింగి శతమఖుఁడు జనకుఁడగు కశ్యపుని కడకుంబోయి తండ్రీ అంధకాసురుఁ డిట్టి యకార్యమునకుం బూనినాఁడు. నేఁజేయఁదగుకార్య మిపు డేమికలదో యానతిండు. తమ్మునిదుష్కృత్యము నే నెట్లు లోర్చియుందును? కోరి తమరు కన్నకుమారు నెట్లు మాన్పోకొని పోదుతును? ఆతఁ డొకవేళఁ దెగిన మాతల్లికి నాపై నాగ్రహము కలుగునే. అని వినయమున నడుగఁగా నింద్రవాక్యముల విని ముని యిట్లు బదు లిచ్చెను. ఆతని ప్రయత్నము నివారించెద. నీకు మంగళమగుఁగాక. అనిపలికి దితింగూడి యాతనియాటోపము నాకశ్యపముని యాపెను. తల్లిదండ్రులమాటల మీఱఁజాలక యాకోపమున కాహుతిగా నడవింగలవృక్షముల నాశనముచేసెను. స్వర్గమున నలలారు నుచ్చైశ్రవస్సను తురగోత్తమము సంతానమును బలవంతముగాఁ దెప్పించుకొనియెను. దిగ్గజసంతానమును బిలువనంపెను. తనయింట నునుచుకొనియెను. చూచుచుండఁగ దేవతల యైశ్వర్యమును హరించెను. యజ్ఞములను దపములను జేయువారికి విఘ్నములు కల్గించెను. దేవకంటకుఁడు దుష్టాత్ముఁడు కావున నన్నియకార్యములు చేయసాగెను.

భూలోకమున నాయంధకాసురభీతిచే ద్విజాతులు యజ్ఞతపస్సుల మానిరి. మొదలుపెట్టిన సత్కార్యములు సాగవనియుఁ బైఁగా భయము దానఁ గలుగుననియు వారు మానిరి. వాయు వాతని యిచ్ఛచొప్పున విసరును. సూర్యుఁడు తనను మతింగొనియే తపింపఁజేయును. వాఁడు సమ్మతించిననే నక్షత్రములంగూడి చంద్రుఁడుండును వానికి సమ్మతము కాదని తోఁచెనేని కనఁబడకుండును. అతనిభీతిచే విమానము లాకాశమున సంచరింపవు. మహాఘోరకార్యములను జేయుచు దుర్మతియై బలదృప్తుఁడగు నాయంధకాసురునిభీతిచే యజ్ఞకార్యములుగాని స్వాహాకారవషట్కారములుగాని సాగినవి కావు. ఉత్తరకురుదేశముల నాపాపాత్ముఁడు పాఱిపోవఁజేసెను. భద్రాశ్వకేతుమాలజంబూద్వీపములను బోరాడి భీతచిత్తములుగా నొనరించెను. సాధ్వసంబున నాలోకకంటకుని దేవదానవదైత్యులు గౌరవింపసాగిరి. సకలభూతములు నాతని మర్యాదగాఁ జూడకున్నఁ బ్రాణములుదక్కవని వినయము చూపసాగెను. ఋషులు మృతిలేనివారలైన నొక్కచోఁ జేరి యాజగద్ద్రోహిమరణమును గుఱించి యాలోచింపసాగిరి. వారిలో బుద్ధిమదగ్రగణ్యుఁడగు బృహస్పతి యిట్లుసంభాషించెను. మునులారా! అంధకాసురునకు రుద్రునివలనఁ దప్ప నితరునివలన మృతి కలుగదు. కశ్యపుఁ డట్టివరమునే దితి కొసంగెను. రుద్రునివలనఁ జావు నీకొడుకునకు లేకయుండ రక్షింపఁజాలననికూడ దితితోఁ బలికెను. సనాతనుఁడు తేజశ్శాలియు నగు శంకరుఁ డీయంధకుని దౌష్ట్యము నెఱుఁగునట్టి యుపాయము మనము చేయవలయును. సకలభూతములను వీఁడు పీడించుచున్నాఁడని యామహాదేవుఁ

డెలకింగిన: జాలును. వెంటనే యాభక్తలోకశంకరుఁడు సత్పురుషుల కన్నిటిధారలందుడువఁబూనును. కావున నామహాదేవునిం గూర్చి నియమముఁ బూనుదుము. సత్పురుషులఁ గాపాడుమా యని; విశేషించి దీనులయి బలహీనులగు బ్రాహ్మణులను రక్షింపుమా యని. ఆవ్రత మూనుటకంటె ముందు నారదమహర్షి నాశ్రయింతుము. శివమిత్త్రుఁడగు నారదముని యందులకుఁ దగిన యుపాయమును దెలుపును.

బృహస్పతిపలుకు లాలకించి మునులు వియద్వీథి నపుడే వచ్చుచున్న నారదమునిం గాంచిరి. విధివిధానమున నర్చించిరి. అత్తఱి ఋషులకంటె ముందు దేవత లిట్లు పలికిరి. మహాత్మా! త్వరగాఁ గైలాసమునకుంబోయి యామహాదేవునితో నీయంధకాసురుని దుశ్చేష్టలం దెల్పి వీని వధించునట్లు చేయుము. అన నమ్ముని యట్లే యని యంగీకరించెను. పయనము సాగించుచు నాపని నెఱవేర్చు టెట్టులని యాలోచించుచు నొక్కయూహ తోఁపఁగా నిదియే తగిన దనుకొనెను. పోయిపోయి కైలాస పర్వతశిఖరాగ్రమున మందారకాననమునడుమ వేంచేసియున్న వృషభధ్వజుని దర్శించెను. అందొకరాత్రి వుచ్చెను. అందుండి శంకరు ననుమతిని స్వర్గమునకు వచ్చెను. మందారమాలాగ్రథిత హారమును దెచ్చెను. అది స్వర్గనగరమునఁగల కల్పవృక్షకుసుమ వాసనల మించి యుండెను. ఆపూవులచేతనే సంతానమాల్యదామమును గట్టెను. దానిని గంఠమున ధరించెను. దాని యపూర్వపరిమళము లత్యద్భుతములు. ఆప్రయాణమున నంధకాసురుఁ డున్నతావునకుఁ దొలుతొలుతఁ బోయెను. ఆమునిం గాంచి యాయత్యద్భుతపరిమళము నాఘ్రాణించి యాయసు

రుఁడు సంతానగంధమును విశేషించి యాఘ్రాణించి "నారదా! ఈయపూర్వపరిమళమిళిత కుసుమము లెందుండును? గంధర్వ లోకమున నీకుసుమములు కలవా? లేక స్వర్గమునఁగలవా! వానికిఁ బ్రభు వెవఁడు? నాకుఁ దేశక్యమగునా? నాయందనుగ్రహ మున్నవచింపుమా" యని యడిగెను. నవ్వుచు నారదుఁ డిట్లుపలి కెను. దక్షిణహస్తమున మహతీనామముగల వీణియఁబట్టుకొని యమ్ముని "దానవేశ్వరా! మందరపర్వతమొక్కండు కలదుకదా. అందుఁ గామగమంబగు వనము గలదు. అందిట్టిపుష్పము లుండును. వానిని సృజించువాఁడు శూలపాణియగు సాంబ శివుఁడు. కాని యావనము నామహాదేవుని యనుమతిలేక యెవ్వఁడుం బ్రవేశింపఁజాలఁడు. దానిని బ్రమథులు విశేషించి కాపాడుచుందురు. నానాయుధములఁదాల్చి నానావేషములఁ గనఁబడుచు దురాసదులై సర్వభూతావధ్యులై మహాదేవుని యంశఁబాయక వారుందురు. నిత్యమావనరాజమున మహా దేవుఁడు సపరివారుఁడై మందారద్రుమఖండములందు విహరిం చుచుండును సకలేశ్వరుఁడుకదా. తపోవిశేషముల శంకరుని సకలలోకనాయకుని సంతుష్టుంజేసి యీకుసుమములం బడయ వలయు. మఱియొక్కవిశేషము గలదు. ఆద్రుమరాజములు స్త్రీరత్నములను మణిరత్నములను గోరినవానిని బుట్టింపఁజాలి యుండు. అందు సూర్యశశాంకులు వెలుంగరు. స్వతస్సిద్ధతేజ స్సావనమున వెలుఁగొందు. అందుఁజొచ్చిన దుఃఖమేయుండదు. అందుఁ గొన్నితరువులు సురుచిరగంధముల నీఁజాలు. మఱి కొన్ని జలముల నిచ్చును. కొన్ని మనోహరాంబరముల నుద్భ వింపఁజేయు. భక్ష్యభోజ్యలేహ్యచోష్యపేయము లాతరువుల

నుండియే కలుగుచుండు. ఏమికోరిన నవియెల్ల నందుండియే యుద్భవిల్లు. ఆమందారవనమున క్షుత్పిపాసాగ్లానిచింత లుండ వనుట నిక్కము. అందలిసుగుణములు వర్ణింప శక్యములా. స్వర్గమునఁగల సకలపదార్థములందుఁగలగుణములం దొక్కదాని సహస్రాయుతభాగమునకు సరిరావని నమ్ముము. ఆవనమున నొక్కదినమున్న నెన్నియోలాభములు కలుగును. సుఖనిధాన ములలో నదియే సుఖనిధానము. ఇది నానిశ్చితము.” అనిపలికి నారదుఁ డూరకుండెను.

## అంధకాసురసంహారము.

*నారదవాక్యముల నాలకించి యంధకాసురుఁడు మందర పర్వతమునకుంబోవ నిశ్చయించెను. మహాబలులగు రాక్షసులం దోడ్కొని మహత్తర కోపమునఁ బోయెను. ఆపర్వతము మహామేఘావృతము. మహౌషధిసమావృతము. నానాసిద్ధులట నుందురు. మహర్షిగణములందుఁ దపోనిరతి నుందురు. చందనాగరు వృక్షములు నిండి యుండును. కిన్నరు లందుఁ బాడుచుందురు. బహువిధనాగకులములందుండును. వాతోద్ధూతము లగు లతావిశేషములు నృత్యములు సల్పునట్లుండును. విచిత్ర ధాతువులందుఁగనంబడును. పక్షికులములుకలరవములు చేయు చుండ నాపర్వతము పాడుచున్నట్లుండును. హంసలు కొలంకుల మార్చుచు వచ్చుచుం బోవుచుండఁగాఁ జూడఁజూడ నొక వింత కనఁబడుచుండును. సకలమృగము లందున్నను బరస్పరము హింసించుకొనుచుండవు. ఆపర్వతరాజమును గాంచి దర్పితుం

---

* ఈకథ కృష్ణపర్వమున నెనుబదేడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

డగుట నాదానవుఁ డిట్లు మాటలాడెను. "పర్వతమా! తండ్రి వరదానమున నవధ్యుఁడ నగు దానవవర్యుఁడ నని నన్నెఱుంగు దువా? నావశమున సచరాచరంబగు త్రైలోక్యముండును. నాతో యుద్ధముచేయఁగోరినను భయమున నెవ్వఁడేని మార్కొనఁడు. నీసానువునందుఁ బారిజాతవనము కలదఁట. సర్వకామముల నొసంగఁజాలునఁట. దానిని జూపుము. ఆవనము ననుభవించెదను. నీవు కోపగించుకొని యేమి చేయఁగలవు? నామనస్సు త్వరపడుచున్నది. నేను బాధించుచుండు నిన్ను రక్షింపఁ గలవాఁడుండఁజాలఁడు." అని దానవుఁడుపలుక నామందరాద్రియందే యదృశ్యమయ్యెను.

అందుల కాగ్రహించి యాయంధకాసురుఁడు మహత్తర నాద మొనరించి యిట్లు పలికెను. "పర్వతమా! రూపము దాల్చి నామాటవిని మరల నదృశ్యమైతివి. నేను యాచింపఁగా గౌరవింపకపోతివి. కావున నిన్నుఁ జూర్ణముగ నొనరింతును. నాబలము నించుక చూడుము." అనిపలికి విశాలమగు నాపర్వతశృంగమును బెకలించి మర్దించెను. అందున్నరక్కసులు మృతినొందిరి. ఆవిధమెఱింగి పర్వతమును శంకరుఁ డనుగ్రహించెను. శివానుజ్ఞచే గిరిశృంగములులేచి పైఁబడి యాయసురునిబలములఁ జంపెను. వాఁడిని మరల లేచి యవి యరుగుచుండ వాని క్రిందనున్న రక్కసులు చూర్ణమగుచుండిరి. ఇట్లు తనబలములు హాతములగుచుండుట యతఁ డెఱింగి మహారోషమునఁ బెడబొబ్బలిడుచు నిట్లు బీరములు పలికెను. "ఓపర్వతమా! యుద్ధమునకు నిన్నుఁ బిలుచుచున్నాఁడను. మోసమున నాసేనలం జంపితివికదా." అని పిలువగనే మహాదేవుఁడు వృషభారూఢుఁ

పై శూలమును దాల్చి యెదుట నిలిచెను. అంధకాసురుంబొలి యింపఁగోరెను. ఆమహాదేవునిఁ బ్రమథగణములు పరివేష్టించి యుండెను. భూతనివహములాదేవదేవు నాశ్రయించియుండెను. అనేకోత్పాతములు కలిగెను. సధూమాంగారవృష్టులు గురి సెను. చంద్రుఁడు దుష్టకిరణుఁడుగ నుండెను. సూర్యుఁడు చల్లఁదనము వహించెను. ప్రపంచమున నన్నియు విపరీతచిహ్నము లుగఁ దోఁచెను.

అత్తఱి మహాదేవుఁడు కాలానలజ్వాలల నుమియు చుండు త్రిశూలమును దానవుపైఁ బ్రయోగించెను. ఆరౌద్ర సాధనము వానియురస్స్థలమునఁ దగిలి వానిశరీరమును భస్మముగ నొనరించెను. దేవతలు దుందుభుల మ్రోయఁజేసిరి. విరుల వానలు గురిసెను. మహర్షులు శంకరుని వినుతించిరి. జగచ్ఛత్రువు పొలియుటగాంచి యెల్లభూతములు పరమానందభరిత ములయ్యెను. రాజులు హాయిగా నిద్రపోయిరి. నృత్యములు సలిపి యచ్చరలు తమయానందమును వెలిబుచ్చిరి. మందరపర్వతము యథాపూర్వముగా విరాజిల్లెను. ఈవిధమున శంకరు నాజ్ఞను మన్నించి శ్రీకృష్ణుఁడును, శ్రీకృష్ణు నాజ్ఞమన్నించి శంకరుఁడును లోకోపకార మొనరించి తమ సర్వభూతనియంతృత్వ మును సార్థకపఱచుకొనిరి.

భక్తులారా! ఈకథనుగూర్చి రెండుమాటలు వ్రాసెదను. శంకరునానతి శ్రీకృష్ణుఁడు షట్పురదానవుల సంహరించెను. శ్రీహరియాజ్ఞచే శంకరుం డంధకాసురుని బొలియించెను. దీని భావమేమి? హరిహరులచేఁ జావనివారు కలరా యన వచ్చును. కర్మ మెవ్వనిచేఁజావవలసినట్లుండునో, తదనుసారముగ

నాతఁ డాతనిం జంపును. దీనిచే హరుఁ డెక్కుఁడనికాని, హరి యెక్కుఁడనికాని యన వీలులేదు. బ్రహ్మవర మంతశక్తిగల దియా యనరాదు. తపోబలమున నలరు కశ్యపునాజ్ఞను శ్రీహరి గౌరవించి తానూరకుండెను. హరునిచేఁ జంపించెను. కావునఁ గర్మ మెవ్వనిచే మృతిగల్గవలయునని యుండునో యది యట్లే సాగునని యీకథ మనకు బోధించును. భగవంతు నెదిరింపఁబూనినవారు జీవింపఁజాలరనుట నిక్కమనియెఱింగి మానవ ప్రయత్న మల్పఫలదమని నమ్మి దైవప్రయత్నమే ఫలించునన్న విశ్వాసమున గర్వమును బాసి భగవంతునిపాదముల నాశ్రయింపవలయుననియే యీకథాసారమని గ్రహింపవలయును. ఇఁక ననంతర భగవచ్చరితము నాలకింపుఁడు.

## సముద్రయాత్ర.

*జనమేజయుఁడు వైశంపాయనుంగాంచి నికుంభునిద్వితీయరూపము హరి యేతరుణమున నెట్లు వధించెనో వచింపుమని ప్రశ్నింప నమ్ముని యిట్లు చెప్పుచున్నాఁడు. భగవత్కథలు శ్రద్ధగలవారలకే చెప్పవలయును. నీవు మిగుల శ్రద్ధావంతుఁడవు. భగవంతునిచరిత్రము లత్యద్భుతములు. కావున నాలకింపుము. శ్రీకృష్ణమూర్తి ద్వారకాపురమున నివసించి సుఖముగా నుండఁగా సముద్రయాత్ర చేయవలయునని యెల్లరు నిశ్చయించిరి. అది పిండారకతీర్థమున సాగును. ఉగ్రసేనభూపతియు వసుదేవుఁడును నగరరక్షణార్థమునియుక్తులైరి. తక్కినవారెల్లఁ బ్రయాణముసాగించిరి. భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తియుఁ దన

* ఈభాగము హరివంశాంతర్గతవిష్ణుపర్వమునఁగల యెనుబదెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

పృథగ్బలమునుగూడి ప్రయాణము చేసెను. గోష్ఠమునఁగల రాజకుమారులెల్ల బయనముచేసిరి. వేశ్యలు వేలకువేలు నగరమునుండి వెడలిరి. వారింగూడి రూపవంతులై సకలాలంకృతులనలరు యాదవకుమారులు పెక్కుమంది బయలు వెడలిరి. ఆ వేశ్యలు షట్పురదానవులవధించినపుడు వారిచేఁ జెఱఁబెట్టఁబడియున్న వారే యని యెఱుంగవలయు. వారెల్ల రాజకుమారులకుఁ గ్రీడార్థము నియమింపఁబడిరి. రాత్రులయందు కాంతలు వేషభూషితలై యిచ్ఛాభోగ్యలుగ నుండువారు. ఇట్లుండవలయునని హరియే నియమించెను. *స్త్రీనిమిత్తమగువిరోధము రాఁగూడదనియే యీకట్టుపాటు స్వామి యొనరించెను. సకలభూతవ్యాపారముల నెఱింగినవాఁడు కావుననే యిట్టికట్టుపాటుల నొనరించెను. ఒక్కరేవతింగూడియే బలదేవుఁడు విహరించును. చక్రవాకపక్షులకుంగల యనురాగముననే యాదంపతులుందురు. ఆబలరాముఁడు కాదంబరీపానజనితాద్భుతతేజుఁడు. వనమాలాభూషితోరస్కుఁడు ఆయాత్రయందు బలదేవుఁడు రేవతింగూడి సాగరజలముల విహరించెను. గోవిందుఁడాసముద్రోదకములఁ బదాఱువేలగోపికాస్త్రీలంగూడి విశ్వరూపుఁడు కావునను సర్వద్రష్ట కావునను విహరించెను. † ఆభార్యలందఱు శ్రీకృష్ణునకు నేనే యిష్టురాలను. నన్నుంగూడియే హరి యీసాగరోదకముల విహరించుచున్నాఁడని యొక్కొక్కతు

---

*ఇచ్ఛాభోగ్యా గుణైరేవ రజన్యా వేషయోషితః, స్థితిరేషాహి భైమానాం కృతం కృష్ణేన ధీమతా. స్త్రీనిమిత్తం భవేద్వైరం మా యదూనా మితి ప్రభో. అని మూలము. † అహమిష్టా మయాసార్థం జలే వసతి కేశవః, ఇతి తామేనిరే సర్వా రాత్రౌ నారాయణ స్త్రియః. అని మూలము.

కయుఁ దలంచుచుండెను. ఆరాత్రియం దామురారిదార లీరీతి గనే భావించిరి. వారియలంకారములు విహారోచితములు. రతీ విగ్రహాలుగనే యుండిరి శ్రీహరియందుఁగల ప్రీతిచేతను హరి యొసంగిన ప్రేమభరంబునను, నేనేభగవంతునకుఁ బ్రియురాలని యూహింపనవకాశముగల్గెను. స్నేహమనఁగా నిట్లుండవలయుఁ గదా. ఇట్లు నారాయణపత్న్యలందఱును దలంచిరి. సంతోషాతి శయంబునఁ దమ్ముఁ బొగడుకొనిరి. అద్దము చూచుకొనుచుఁ దమయవయవసౌందర్యముల మెచ్చుకొనిరి. శ్రీహరిగోత్రము నుద్దేశించి పాడిరి. తమనయనారవిందములచే శ్రీకృష్ణముఖార విందమును బానముచేయసాగిరి వారిమనోదృష్టులు శ్రీకృష్ణుని యం దర్పింపఁబడియుండెను. హరియం దాకాంత లేకాగ్రచిత్త లైరి. అందఱుచిత్తము లేకవస్తువునం దే యర్పింపఁబడుటను వారి కన్యోన్యకలహములు కలుగకయుండెను. శ్రీహరి వారినెల్ల నొక్కరీతిగాఁ దృప్తిచేయుచుండెను.

*కేశవమయమగు వాల్లభ్యమును శిరసావహించిరి గాన మాశిరస్సు లుత్తమములని వారు గర్వించిరి. కావుననే వారు చారుదర్శనలైరి. ఆత్మస్వరూపుఁడగు నాశ్రీహరి వారితో నందఱు కన్నిరూపులై విహరించెను. ఆవిహారమున నాపర మేశ్వరుఁడు విశ్వరూపవిధిని గ్రహించెను. తదంగసంస్పర్శ

శిరాంసి గర్వితాన్యాహు స్సర్వా నిరవశేషతః, వాల్లభ్యం కేశవ మయం వహంత్యశ్చారుదర్శనాః. తాభిస్తుసహచిక్రీడసర్వాభిర్హరిరాత్మవాన్, విశ్వరూపేణ విధినా సముద్రే విమలే జలే. ఉవాహ సర్వగంధాఢ్యం స్వచ్ఛం వారిమహోదధిః, తోయం విలవణం మృష్టం వాసుదేవస్య శాసనాత్. అని మూలము.

మున నాసాగరోదకము సర్వగంధాఢ్య మయ్యెను. ఆచోట జలము లవణవిరహితమై పేయముంగూడ నగునట్లు శ్రీకృష్ణుఁడు శాసించెను.

భగవంతునింగూడి నిర్భయముగా నాపురంధ్రీమణులు గుల్ఫదఘ్నము, జానుదఘ్నము, నూరుదఘ్నము, స్తనదఘ్నము నగుజలములలోనికిఁ బోవసాగిరి. ఆజలములచే భగవంతుని ధీరలు గాన నభిషేకించిరి. గోవిందుఁడును వారి నాపావనమధురోదకముల మేఘమువి వికసించినలతలం దడుపునట్లు స్నానము చేయించెను. కొందఱు మృగనేత్రలు హరిని గంఠమునఁ గరముచే చుకొని విహరించిరి. "నాథా! నన్నుఁ గౌఁగిలించుకొనుము. లేకున్న నీజలములం బడిపోదును." అని యొకొక్కతుకయుఁ బలుకసాగిరి కొంద అంగనలు కొయ్యపడవలపైనఁ గూరుచుండి విహరించిరి. ఆనౌకలు క్రౌంచమయూరనాగాకారములం బోలియుండును. కొన్ని మకరాకారములు గలిగియుండెను. మఱికొన్ని మీనాకారములుగలవి. ఇంకను గొన్ని బహురూపముల నుండెను. వానినెల్ల మునుఁగుచుఁ దేలుచున్నయట్లితరులచేఁ జూడఁబడుచు నుండిరి. ఆసాగరాంభస్సులఁ గృష్ణునానందమున సంతుష్టుం జేయుచుండిరి. రుక్మిణీదేవింగూడి యొకచో హరి జలవిహారము చేసెను. ఏదో యొకకార్యమునకే హరి యాప్రయత్నమును జేసెనుగాని రిత్తప్రయత్నము చేయునా. హరి యెట్లో హరిపత్నులందఱు నట్లే విహరించిరి. సూక్ష్మతమ వస్త్రములం దాల్చి కొందఱుండిరి. ఎవ్వరెవ్వరిభావము లెట్లుండునో వారికిఁ దగినట్లు హరియు నభినయించుచుండెను. వారి మనస్సులం బ్రవేశించి వారిని లోఁగొనెను. దేశకాలానుసార

ముగా హరి కాంతావశంగతుఁడుగ నుండెను. కులశీలముల సమానుఁడు మాకీకృష్ణుఁడనియు యోగ్యుఁడనియు నాతరుణీ మణులు తలంచిరి. వారిదృష్టి కాతరుణమున వంశరూపమునఁ గనఁబడియెను. * అత్తటి దాక్షిణ్యయుక్తుఁడగు నాశ్రీహరిని స్మితపూర్వాభిభాషి గావున భార్యలందఱు సంతోషింపఁజేసిరి. భక్తిభావమునఁ బరమాత్మునిగాఁ దలంచిరి.

హరికుమారులందఱు పృథగ్గోష్ఠులుగలిగి స్త్రీలంగూడి జలముల నలంకరించిరి. మహానందమున విహరించిరి. గీతనృత్యవిధుల నెఱింగిన యాస్త్రీలకుఁ బతులతేజస్సమాహృతలకు దాక్షిణ్య మభివృద్ధియయ్యెను. సంగీతవిశేషముల నాలకించుచు నర్తనవిశేషములను దిలకించుచు వాద్యనిస్వనముల నాలించుచు మోదసాగరమున నాయంగనలు మునిఁగిరి. అంత నాజలజాక్షుఁడు పంచచూడ యనునచ్చరను, కుబేరనగరమునుండి యక్షకాంతలను, స్వర్గమునుండి యచ్చరమిన్నలను దాను విశ్వరూపుఁడగుటఁ బిలిపించెను. వారెల్ల నరుదెంచి భగవంతునకు వలగొని నమస్కరించిరి. లేచి యంజలులంబట్టి నిలువంబడిరి. హరి వారింగాంచి "మీరెల్ల నిర్విశంకస్వాంతముల నీజలములం బ్రవేశించి నాప్రియము నిమిత్తము యాదవులను సంతోషపెట్టుఁడు. నృత్యగీతవాద్యగుణవిశేషములను గనఁబఱుపుఁడు. ఇట్లు మీ రొనరించిన మీకు శ్రేయస్సును బ్రసాదించెదను. మీ వాంఛితములు ఫలించును. ఈయదుకుమారులెల్ల నాశరీరసమానులనియే భావింపుఁడు. సంశయింపకుఁడు." అని యాజ్ఞాపించెను.

---

* తదా దాక్షిణ్యయుక్తం తం స్మితపూర్వాభిభాషిణం, కృష్ణం భార్యాశ్చకమిరే భక్త్యా చ బహుమేనిరే. అని మూలము.

ఆ కాంతలెల్ల నాపరంధాముని యానతిని శిరసావహించి క్రీడాయువతులై. రుక్మిణీప్రభృతి హరిపత్నీకుమారులను సేవించిరి. వారందఱు ప్రవేశింపఁగనే యాపుష్పార్ణవము సౌదామినీలతికాసమలంకృత కాలాంబుదముభంగి మెఱసెను. వా రాజలముల స్థలమునందున్నటులుండి సంగీతముపాడిరి. నృత్తము సల్పిరి. వాద్యముల మ్రోయించిరి. పరిమళవస్తువులచేతను, దివ్యవస్త్రములచేతను, హేలావిశేషములచేతను, హాస్యభావములచేతను, వారిమనస్సుల నానందపరవశములుగా నొనరించిరి కటాక్షేంగితహాస్యములచేతను, క్రీడారోషములచేతను, మనోనుకూలములచేతను యాదవకుమారులమనస్సులఁ గరగించిరి. మదిరాపానవివశాత్మకులై యాకుమారులు పలువిధములగు వికారపుఁజేష్టలఁ జూపి యానందించుచుండిరి. శ్రీహరియు వారి ప్రీతికొఱకు నాకసముననుండి నవ్వెను. పదాఱువేల భార్యలం గూడి యంబరమందున్నట్లగపడినభగవంతుని గాంచి హరిమహిమము నెఱింగినవారు కావున నచ్చెరువొందక యాకుమారులుండిరి. అందుఁ గొందఱుకుమారులు మదిరాపానమత్తత రైవతకాద్రికింబోయివచ్చిరి కొందఱు గృహముల కరిగివచ్చిరి. కొందఱు వనముల కరిగివచ్చిరి. అపేయమగు నాసాగరోదక మపుడు పేయమయ్యెను. జలజాక్షులు జలముల నేలయందుఁబలెఁ బరుగెత్తుచుండిరి ఒండొరులహస్తములంబట్టుకొని వడివడిం బరుగిడుచుండిరి. ఆకాలమున వారాత్మల నేయే యాహారములఁ గోరుదురో యవియెల్ల వారికి లభించుచుండెను. ఆనౌకలు గృహములవలెనుండఁగా నందు విహరించిరి. విచిత్రతరాకృతులుగానుండు నానౌకలచేత నాసాగరోత్తమ

మత్యద్భుతముగా వెలుఁగొందు చుండెను బహువిధములగు నుత్సవసంభారములచేత సాగరము విచిత్రాకృతిం గనుపట్టెను. ఆకాశమునఁ గల గంధర్వనగరములు సముద్రమునకు వచ్చియు న్నట్లు నౌక లతిరమణీయములుగాఁ గానఁబడుచుండెను ఆ నౌకలయందే విశ్వకర్మ నందనవనముల బోలు వనముల నిర్మించి యుండెను. అవి కృత్రిమములేయైన నకృత్రిమములవలెఁ గనఁ బడుచుండెను. విశేషించి వచింపనేల? ఎవరి కేది కోరికయో వారి కది యగుచుండెను శ్రీకృష్ణప్రసాదమే దీనికింగారణము. ఆకలిదప్పులుగాని గ్లానిగానిచింతగాని వారికించుకంతయుఁగల్గఁ జాలకయుండెను. శోకవార్త లేనేలేదు. చక్రపాణిమహాత్మ్యము వలన సంతోషమే యెల్లెడలఁగల్గియుండెను. ఆసాగరక్రీడ సంగీత నృత్తవాద్యమయంబై నాదబ్రహ్మము ననుకరించుచుండెను. శ్రీ హరి రక్షకుఁడుగా నుండుటంజేసి యావిశాలసాగరమునఁ దత్పు త్రులందఱు స్వేచ్ఛగా విహరించిరి. శ్రీహరి వేంచేసియుండు యానపాత్రమునందుఁ ద్రిలోకములయందు వస్తువులన్నియు నుండినవి హరిభార్యలకెల్ల వేలువేలు నివాసములు కల్పింపఁ బడియుండెను. అన్నియు నొక్కవిధముగనే యుండెను. సర్వ రత్నాఢ్యములై సకలవస్తుపరిపూర్ణములై యవ్వి యుండెను. ఆసాగరయాత్ర మిగుల మనోహరమై వర్ణనాతీతమై యుండెను.

—— ఛాలిక్యకేళిని శ్రీహరియొనరించుట. ——

*ఆసాగరజలముల బలదేవుఁడు కాదంబరీపానజనితాద్భుత తేజస్సుగలిగి సిరి యలర రక్తాయతలోచనుఁడై రేవతీదేవి

* ఈవిషయము హరివంశాంతర్గత విష్ణుపర్వమునందలి యెనుబది తొమ్మిదవ యధ్యాయానుసారము వ్రాయఁబడినది.

యాశ్రయించియుండఁ బ్రలంబబాహుద్వయుఁడై విహరించెను. బలరాముని వస్త్రము నీలాంబుదాభము. దేహము చంద్రాంశు గౌరము. నేత్రములు మదిరాపానావిలములు. అత్తఱి మేఘమధ్యభాగమం దలరు చంద్రబింబమువలె నారాముఁడు చూడఁ దగియుండెను. శ్రీహరియాజ్ఞను శిరసావహించి యచ్చరలెల్ల నాబలదేవుని సేవింపఁబోయిరి. వా రా రేవతీరాములకు నభివాదన మాచరించి వాద్యానురూపముగా నాట్యముచేసిరి. కొందఱు పాడిరి. ఆనృత్యమునం దర్థముచెప్పకయే తెలియుచుండెను. రేవతియు నాగేయములను వానియర్థములను దెలుపు నభినయములను గాంచి యానందించెను. ఆయచ్చరమిన్నలు తద్దేశభాషాకృతి వేషయుక్తలై నవ్వుచు హస్తతాళములు మనోజ్ఞములుగానుండ మంగళకరగేయములం బాడి యారామమూర్తిని సేవించిరి. ఆగేయములు రామకేశవమహాద్భుతకార్యములను దెలుపుచు భక్తిభావమును శ్రోతలకుం గల్గించుచుండెను. అందుఁ గంసప్రలంబాదిదుష్టులవధపద్ధతు లుండెను. చాణూరముష్టికులను మల్లరంగమునఁ జంపినప్రకార ముండెను. యశోదకల్పించిన దామోదరత్వము తేటపడుచుండెను. అరిష్టధేనుకాదులవధచరిత్రము సువ్యక్తమగుచుండెను. యమళార్జునభంగము, వృకములను సృజించుటయు, కాళీయఫణిగర్వనిర్వాపణము, గోవర్ధనోద్ధరణరూపమున గోపులను గాపాడుటయుఁ, కుబ్జారక్షణము, మురదానవసంహారము, గంధారకన్యాహరణమునఁ బ్రవర్తించు రాజుల నోడించుట లోనగుచరిత్రము లాగేయములనుండి స్పష్టమగుచుండెను. బలరాముఁ డాగేయముల నాలకించుచుఁ గాదంబరీపానజనితమదమునఁ

గన్ను లెత్తువారిఁ జూచి కృష్ణుఁడు నానందించుచుఁ దాను సత్య భామాసహితుఁడై విహరించెను. అర్జునుఁడు నాజలకేళియందు ననుసరించి తాను నానందము ననుభవించుచుండెను. గదుఁడు సారణుఁడు ప్రద్యుమ్నసాంబులు సాత్యకియు సాత్రాజితీసూనుఁడగు చారుదేష్ణుఁడు నిశఠోల్ముకులు రామునికుమారులు అక్రూరసేనాపతిశంకరులు మఱియుంగల యాదవకుమారులెల్ల సాగరవిహారసుఖము ననుభవించుచుండిరి.

ఆయానపాత్రము శ్రీహరిప్రభావమున నెల్లరకు ననుకూలముగా వృద్ధినొందుచుండెను. ఎంద ఱెన్నెన్నిరీతుల విహరింపఁదలంతురో అందఱ కన్నిరూపములుగా నది మాఱుచుండును. అదియే రాసమండలము. అందున్న యాదవకుమారులందఱు దేవతలవలె నుండిరి. వారియానందమున లోకములన్నియు హర్షమయములయ్యెను. సకలపాపములు జగమునుండి వెడలిపోవుచుండెను. వారినడుమ నారదముని శ్రీహరిని సేవింప వచ్చి నిలిచెను. జటాకలాపాగళితైకదేశుఁడై యతఁడుండెను. బలరామునిపరిసరమున మహానందమున గేయములఁబాడి యానందింపఁజేసెను. సత్యభామను శ్రీహరిని బలరాముని రేవతీదేవిని దనివితీరఁ గాంచి కాంచి నవ్వెను. పరమానందమునఁ గృతార్థుఁడనని భావించెను. అందున్న నారీమణులను బరిహాస వాక్యములు పలికి పలికి నవ్వించెను. ఆనందపరవశలగునట్లు చేసెను. చేష్టానురూపహాసితములచేత వారి నారాధించెను. వారిసల్లాపముల నాలకించుచు నాదాతినాదములను భగవంతుఁడు వెలిపుచ్చెను. శ్రీకృష్ణవినోదనార్థ మామునియుఁ బరిహాసవాక్యములఁ దన్మహిమమును దెల్పెను. శ్రీహరి యానతి మెయి

నానారీమణు లామహర్షికిఁ బరార్థ్యవస్త్రరత్నాదిపదార్థములఁ దృప్తికిమించిన ట్లొసఁగిరి. పారిజాతప్రసూనమాలికలను మించినపుష్పధామములను శ్రీహరిప్రసాదలబ్ధముల నొసంగిరి. శ్రీహరికంఠమున నట్టిదామముల వైచి సేవించిరి.

ఆరాసావసానమున నప్రమేయమహిమమున విరాజిల్లి శ్రీహరి నారదమునిహస్తమును దనకరకమలమునఁ దెమల్చి యల్లెసముద్రమునఁబడియెను. అర్జునసాత్యకిప్రముఖులం గాంచి చిఱునవ్వు మోమునఁ గనఁబడుచుండ నిట్లు పలికెను. 'మీరెల్ల మీతనువుల రెండుగా విభజించి యిందొకతనువునఁబడుఁడు. స్త్రీలుగూడ నట్లేకావలయును. రేవతింగూడి బలదేవుఁ డట్లే యగుఁగాక. నాతనయులందఱు నట్లే పడుదురుగాక.' అనిపలికి సముద్రమును గాంచి తనయెదుట రూపధారియై దోసిలొగ్గి యుండఁగా "ఓసాగరరాజా! పరిమళతోయములుగలవాఁడవు గమ్ము. నీజలము మధురమై పానానుకూలమగుంగాక. మొసళ్లు లోనగుపల్లుజంతువు లుండకయుండుఁగాక. మఱియు నీయొడ్డు కాలినడక కనుకూలమై మనోఽనుకూలము నగుఁగాక. నాప్రభావము నెఱుంగుదువుకదా. ఎవ్వరెవ్వరి కేయేవిధముగా నీజలము త్రాగఁ గోరికకలదో వారివారి కాయావిధములఁదగునట్లు నీజలములమార్పు నొందింపుము. నీయందుమత్స్యములువైడూర్యయుక్తామణిహేమచిత్రములై సౌమ్యరూపములై యుండవలయును. కమలము నుత్పలములు సుగంధపుష్పర్ణరసపూమములై యుండవలయు. తుమ్మెదలందు గానముచేయుచుఁ దిరుగుచుండవలయును. నీజలములపైన మైరేయమాధ్వీకసురాసవములు కుంభములనిండ నునుపవలయును. వానిం ద్రాగుటకు

బంగారుపాత్రము లుండందగు. నాతనయు లాపాత్రములతో నాయాసవములఁ ద్రావుదురుగాక. సాగరమా! పుష్పోచ్ఛ్రయముల నీజలములు పరిమళవంతములు గావలయును. యాదవకుమారుల కెట్లప్రియము గాకయుండునో వారిస్త్రీలకుంగూడ నేదేది యప్రియము గాకుండునో యట్లు నీవుండవలయు. ఈ విషయమున జాగరూకుఁడవు కమ్ము."

అని సాగరమున కాజ్ఞాపించి తా నాజలముల నర్జునుం గూడి విహారము సల్పెను. శ్రీకృష్ణవాక్యములయర్థము నెఱింగినది కాన సాత్రాజితయు నారదమునిని సేవించెను. అంత మదావర్జితచారుదేహుఁడై బలరాముఁ డాసాగరజలములం బ్రవేశించెను. రేవతిని సాకారము నొందినదానిని గరమునం బట్టుకొని యుండెను. శ్రీకృష్ణపుత్త్రులందఱు బలరాముని వెనుక జలములందు పడిరి. మదిరావిలాక్షులై వివస్త్రులై వారెల్ల నాజలముల విహరించిరి. తక్కినహరిపుత్త్రులు నిశఠోల్ముకాదులందఱు విచిత్రవస్త్రాభరణాలంకృతులై మదిరాపానమత్తులై సంతానమాల్యావృతకంఠదేశులై యందు దిగిరి. స్త్రీలును జలపాత్రములం గైకొని యావేషమునకుం దగినగీతములను బాడుచు విహరించిరి. అత్తఱి సకలమంగళవాద్యస్వనములు వెడలెను. అచ్చరలే యావాద్యముల వాయించిరి. కృష్ణానుజ్ఞ నందియే వా రాకార్యమున నప్రమత్తులైయుండిరి. ఆవాద్యముల ననుసరించి సస్వరముగాఁ బాడిరి. కుశేశయా కోశవిశాలనేత్రముల నలరుచుఁ గుశేశయాపీడవిభూషితలై కుశేశయములపై నచ్చరలు నిలిచి నృత్తము సల్పిరి. ఆకాలమున నాసాగర మాస్త్రీలవదనచంద్రబింబముల చేత మిక్కిలి వెలుగొందెను. ఆకసము

చంద్రబింబసహస్రములం గూడినట్లు సాగరతరంగములు లోకాం తాముఖశీతాంశుబింబముల నలరెను. సాగరమను మేఘము కాంతాతనూలతా ప్రభలచేత సౌదామినీలతికాభిరామమైనట్లు ప్రకాశించెను.

శ్రీకృష్ణుఁడు నారదమునింగూడి చారుచిహ్నాభిరాముఁడై బలరాముఁడు తనవెనుకనుండఁగాఁ జూడంజూడ మనోహరుఁడై వెలసెను. కాంతామణులు దోసిళుల నాసాగరోదకమునుదీసి హరి నభిషేకించిరి. బలరాము నట్లే యభిషేకించిరి. వారెల్ల వారుణీపానప్రమత్తచిత్తలు. హరితనయులెల్ల నొడలెఱుంగక విహితమార్గమును మీఱి ప్రవర్తింపసాగిరి. అతిప్రసంగము నెఱింగి కృష్ణపరబ్రహ్మము వారిని వారించెను. తానుగూడ నా విహారమునుండి విరమించెను. శ్రీహరిభావముల నెఱింగి తక్కుం గలవారెల్ల నావిహారమును జాలించిరి. కాంత లంత నాట్యము సల్పుచుఁ దమనాయకుల నలరింపఁజేసిరి. నృత్తానపానమున జల విహారము చాలునని హరియాజ్ఞాపించెను. జలములనుండి బయ లువెడలి తదనుకూలవేషముం దాల్చి మునివర్యునకు నట్టివేష మునఁ బ్రవర్తింప నాజ్ఞనొసంగి యందఱ నట్లే చేయ నానతిచ్చెను. వారెల్ల యథాపూర్వవేషముల నలరారిరి. కృష్ణానుమతిం బొంది పానభూమిం జేరిరి. వయస్సునకు నభ్యాసమునకుఁ దగినట్లు వారు కూరుచుండిరి. రుచ్యములగు నన్నవిశేషముల భుజించిరి. యథానుకూలముగఁ ద్రాగిరి. పరిపక్వమాంసములు ఫలపానక ములను దాడిమీఫలరసపక్వపదార్థములను మఱియు విశేషించి సూదప్రహితాహారవిశేషములను భక్షించిరి. పలువన్నెలమృగ మాంసములు సిద్ధములై యుండెను. వాని నెయ్యిలో నద్దుకొని

భక్షించిరి. లవణపక్వములయి యున్న కొన్నిపదార్థములఁ గొందఱు తినిరి. వృక్షమూలరసముల చేతను దాడిమీరసముల చేతను సిద్ధము చేయఁబడిన కొన్నివస్తువులం దినిరి. ఇంక ననేక విధములుగ నలవరింపఁబడినవస్తువులను భార్యలంగూడి వినోదముగాఁ గూరుచుండి భక్షించిరి. పలువిధములగు శాకములను షడ్రసవికారములుగ నొనరించిరి. వానిని ప్రీతిమీఱఁ గొందఱు గ్రహించిరి. బహుప్రకారముల నలవరించినపానకములను శర్కరామిశ్రితశుద్ధోదకములను ద్రావిరి. పయోదధులచే సిద్ధపఱుపఁబడినయన్నముల సంతృప్తిగ మెక్కిరి. మరల నారీమణులు పాడుచున్నగీతముల నానందమున వినిరి.

అనంతర మా శ్రీహరి బహువిధసన్నిధానములుగల ఛాలిక్యగేయమును బాడుఁడని యాజ్ఞాపించెను. దానినే గాంధర్వమందురు. నారదుఁ డామాట విని తానే మహతి యను వీణియ నందుకొని షడ్గ్రామరాగాదిసమాధియుక్తముగఁ బాడెను. హల్లీసకమను గేయమును గృష్ణుఁడు తానే వంశీనాదము సాయపడఁగాఁ బాడెను. మృదంగాదిమనోహరవాద్యవిశేషముల నచ్చరలందున్న వారినెల్ల నానందింపఁ జేసిరి. అమీఁద నాయంగనామణులు చారుభంగిగా నృత్యకేళి సల్పిరి. ఆనాట్యమునకు రాముఁడు శ్రీకృష్ణుఁడును, మెచ్చుకొని పరమానందభరితులైరి. అత్తఱి నూర్వశియు, హేమయు, మిశ్రకేశియుఁ దిలోత్తమయు, మేనకయు, లోనగునుత్తమాప్సరోంగనలు శ్రీహరినిసంతోషింపఁ జేయుటే పురుషార్థమని తలంచి గీతములం బాడి యాడి తమమనోభావములను వెల్లడించిరి. వా రావాసుదేవునియం దత్యంతభక్తిభావము లలరార ననురాగ ముప్ప

తిల్ల స్వగీతనృత్యాభినయవిశేషములచేత సంతోషింపఁజేసి తదానందమున మహాపురుషార్థ మబ్బెనని తలంచిరి. తాంబూలముల నర్పించిరి. దేవలోకమునుండి దివ్యగంధము లోనగువస్తువులు హరి తలంచినంతన వచ్చెను. వానినెల్లఁ బ్రద్యుమ్నుఁ డందఱకొసంగెను. ఆఛాలిక్యగీత మతిమనోహరము. శ్రావ్యము. మానవుల కత్యంతసేవ్యమునగు శుభములను గల్గించును. బుద్ధివికాసము నొసంగును. ప్రశస్తమైనది. మంగళాలయము. యశస్కరము. పుణ్యము. పుష్టిని సంతోషము నొసంగును. నారాయణమూర్తి కత్యంతేష్టము. కష్టములఁ బోఁగొట్టును. ధర్మభారమును గలిగించును. దుస్స్వప్ననాశ మొనరించును. పాపరాసుల భస్మీకరించును. స్వర్గవాసము చేకూరఁజేయును. ఛాలిక్యగాంధర్వముదారకీర్తిగలహరి యొకదినము విన్నను సహస్రగుణము. చతుర్యుగములయందును దీని నాలకించుట యత్యుత్తమము. ఆరీతిగా నాకుమారు లాలకించిరి. గాంధర్వజాతియు నట్టివి. మఱికొన్నియు దీపమునుండి యొండొకదీప ముప్పతిల్లినట్లు వేవవే లుదయించినవి. శ్రీహరి యావిధ మెఱుంగును. నారదమునియు నెఱుంగును. ప్రద్యుమ్నాదులు నత్తఱి దాని నెఱింగిరి. ఛాలిక్యగీతము నాలకించినంతన యెల్లరకుఁ దదానందముదయించును. దానిమాహాత్మ్యమును దపోనిరతు లగుమహాత్ములు గూడ నెఱుంగఁజాలరు. దానిమూర్ఛనలయందుఁగల పారవశ్యము వర్ణనాతీతము. షడ్గ్రామరాగములయందు దానియే కావయవమునఁగలమాధుర్యము లేదు. సుకుమారజాతి. మిగుల శ్రమించినఁగాని దానినెఱుంగఁజాలరు. కావుననే యాఛాలిక్యగాంధర్వగుణోదయముల యందు దేవగంధర్వులు, సిద్ధులు,

మహర్షులు నిష్ఠనొందుదురు. కావున నామధుసూదనుఁ డాగీత శ్రవణాదరుఁడయ్యెను. ఆశ్రీహరి లోకానుగ్రహార్థము దానిని వ్యాపింపఁజేసెను. బాలురు వయస్కులు వృద్ధులు తదానందము ననుభవించిరి. ఎల్లరు దానినిబహూకరించిరి. యాదవులు వృద్ధాచారములను బాటించి ప్రతిష్ఠను గాంచిరి. ఆయాత్రయుఁ దన్మహోత్సవానందము ననుభవించినంతనె శ్రీహరి వారినెల్లఁ దమతమవిడుదులకుఁ బోవ ననుగ్రహించెను. అచ్చరమిన్నలు స్వర్గమున కరిగిరి. ఎల్లరు హరిపాదారవిందములకు నమస్కరించి కృతార్థులై తమతమ నివాసములకుం బోయిరి. దేవసంఘమూహరి యానందమును గాంచి మహానందము నొందిరి.

మహాశయులారా! సముద్రయాత్రను దెలుపునీకథను గూర్చి చర్చింపఁదగువిశేషాంశములుకలవు. వాని నూననయితి కాదు. కాన నాలకింపుఁడు. నికుంభునకు మూఁడురూపములు కలవని హరి మున్నే వచించె. ఇందు రెండవరూపమును వధించిన వృత్తాంతమును దెలుపుమన్న ప్రశ్నమునకు నుత్తరముగా నీసముద్రయాత్ర చెప్పఁబడినది, ముందు తద్వధవృత్తాంతము చెప్పఁబడును. శ్రీహరి సముద్రయాత్ర నొనరింప నందఱుంగూడి పోవుటయు నావిహారసమయమునఁగావించిన మధుపానాదులు లోనగువృత్తాంతముల నాలకించినఁ దొలుదొలుత నెట్టివారికే మదినసూయ పొడముక మానదు. ఇట్టికృత్యముల హరి గావింప నేల యనియుఁ దోఁచు. వలయునని శ్రీహరి యిట్టి యసంగత కృత్యముల నొనరించునాయని యాలోచింపవలయును. బాహ్యదృష్టిం జూడక యించుక తెలివిఁ గనఁబఱచి యూహించినఁ గాని యిందలిరహస్యములు బహిర్గతములు కావు. ఆయాత్ర

యందు ముఖ్యముగా వేశ్యలు పాల్గొనిరి. వారింగూడి యాదవులభార్యలు పాల్గొనిరి. వీరు చాలక దేవలోకమునుండి యచ్చరలు యక్షకాంతలు పిలిపింపఁబడిరి. ఏమి యిట్టి యవివేకము! అనియుఁ దోఁచును. ఇందేమియు నచ్చెరువులేదు. ఏనను గారణమేమియు లేక యిట్టి యవివేకులకార్యముల వంటిపనుల నొనరించునాయని మాత్ర మాలోచింపవలయును.

శ్లో. "ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩
ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి." ౬౭
(గీతా ౨ అధ్యా.)

అని భగవంతుఁడు చెప్పినట్లు ఈసముద్రయాత్రయందు సాగినవిషయములెల్ల సమ్మోహహేతువులే. ప్రజ్ఞాధ్వంసనకారణములే. అట్టివానిని గొడుకులు లోనగువారిచే భగవంతుఁడేల చేయించెను? అన్నసంశయముపొడమకపోదు. ఇందేదో యొక గొప్పకారణము కలదని యూహింపక యూరకుండుట బుద్ధిమంతులలక్షణము కాదు. యదుకుమారులకందఱకు భార్యలు కలరు. వారుకూడ వచ్చిరి. షట్పురములఁ గలదానవుల జయించినపు డందున్నకన్యకలను యాదవులకు భోగకాంతలగా హరి యొసంగెనని మున్నే చదివియుంటిరి. ఆకన్యకలే యిట వేశ్యాశబ్దమునఁ జెప్పఁబడిరి. వారిని యదుకుమారులకు భోగకాంతలగా హరి యొసంగెననియుం దెలియవలయును.

శ్లో. "ఇచ్ఛాభోగ్యా గుణైరేవ రజన్యా వేషయోషితః
స్థితిరేషాహి భైమానాం కృతా కృష్ణేన ధీమతా
స్త్రీనిమిత్తం భవేద్వైరం మా యదూనామితి ప్రభో."

అని హరివంశమునఁ గన్పట్టెడిని. దానవులవంశమందున్న కన్యక లవివాహితలు. ఎందుండియో దానవులచేఁ గొనిగాఁబడిరి. ప్రౌఢలేకాని యప్రౌఢలుకారు. కావున శ్రీహరి వారినెట్లు కాపాడవలయునా యని యూహించెను వీరక్షతసుభగలుగారు. కావున వీరి బుద్ధి చంచలతం గాంచును. యదుకుమారులను వివాహముచేసికొనుఁడని చెప్పుట పాడిగాదు. ఏలన వీరింతకుముందె పురుషసహవాసముగలవారు. కావున భోగకాంతలుగా నుండఁదగుదురు అని యూహించెను. వీరి ద్వారకయందొకచో నుంచిన నెవరినేని కోరవచ్చునని చెప్పినట్లగును. ఒక్కర్తుక నిరువురుపురుషులు కోరవచ్చును. పరస్పరేర్ష్యలు పొడమును. యదుకుమారుల కట్టివిరోధము కలుగఁగూడదు. అని చక్కఁగా నాలోచించి కృష్ణమూర్తి యదుకుమారులకుఁ బంచియిచ్చెను. ఎవరిస్వాధీనమందున్నది మఱొకరిని వాంఛింపరాదనియేకదా దీనిభావము. వారి నట్లే వారు పరిగ్రహించిరి. బ్రహ్మచారిణులుగానుండఁదగునని యాజ్ఞాపింపఁ గూడదాయని యడుగుదురేమో,

"బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి"

యన్నసూక్తి హరి యెఱుంగును. ఐశ్వర్యముగలవారలకుఁ బరకాంతావాంఛానిర్హరణార్థము భోగకాంత లుంచఁబడుట రాజకులమునఁగల ప్రాచీనాచారమే. కావున హరి యట్లొనర్చెను. వీనిచేఁ బరస్పరవైరము నశించుటయు ధన

మదాంధులగు రాకొమరులు పరదారలం గోరకుండుటయు లోకమునకుం గావలసినఫలములని యెఱుంగందగును. కావున నిందు దూషింపఁదగినది యించుకంతయు లేదు.

మఱియు నీసముద్రయాత్రయందు హరి తన సర్వవ్యాపిత్వమును గనఁబఱచెను. పదాఱువేలమందిభార్యలు వెంటనుండిరి. వీరు భోగకాంతలని పొరపడరాదు. వివాహితలే. వీరినందఱను సాగరయాత్రకుఁ దీసికొనిపోయెను. పట్పురకన్యకలను యదుకుమారుల కొసంగెను గాని తా నంగీకరింపలేదని మూలమునఁ గల కథను మాత్రము మఱువకుఁడు. వీరందఱు సాగరజలముల విహరింప నౌకలు సిద్ధపఱుపఁబడియెను. కొన్ని భగవదిచ్ఛాకల్పితములఁట. ఇఁక వానిసౌందర్యము నెంతవర్ణించినను అతిశయోక్తి యన వలనుపడదు. మనుష్యకల్పితములకేకదా పరిమాణము. భగవంతునిశక్తి యింతయని వచింపనెవ్వఁడు సమర్థుఁడుకలఁడు? ఆనౌకలయం దొక్కొక్కభార్యం గూడి శ్రీహరి జలవిహార మొనరించెను. అత్తఱి

శ్లో. "అహమిష్టా మయా సార్ధం జలే వసతి కేశవః,
ఇతి తా మేనిరే సర్వా రాత్రౌ నారాయణస్త్రియః."

అనికలదుకదా. జలములయం దొక్కొక్కభార్యయుఁ దనయాత్మయందు నాప్రాణనాయకుఁ డందఱ పత్నులకంటె నన్నెక్కుడుగా భావించును. కావుననే నన్నే గూడి జలముల నున్నవాఁడనుకొనుచుండెను. ఇట్లేపదాఱువేలమంది భావించిరి. అనఁగా, బదాఱువేలరూపములు దాల్చియుండెనని కదా దీనిభావము. ఇదొక మహత్తరకార్యమా. సకలబ్రహ్మాండాంతర్గతభూతకోటియందెల్ల నావేశించియున్న భగవంతునకుఁ బదాఱువేలబాహ్య

రూపములఁ గైకొనుట తుచ్ఛతమమగు కార్యము. ఇందతిశయోక్తి కలదనువారికంటె మూర్ఖులీజగమున లేరు. మనుష్యులు దేవతలులోనగువారివిషయమున నీకథ కల్పితమగు నేని నింద్యమే యగును. సకలలోకేశ్వరునివిషయమునఁ గానం బడు నీగాథ తన్మహిమము నల్పమతులకుఁ దెలుపుటకే కల్పితమని యెఱుంగుట బుద్ధిమంతులలక్షణము.

శ్రీకృష్ణకాంతలెల్ల మహత్తరగర్వభారమును శిరస్సులం బూనిరి. కేశవమయమగువాల్లభ్యమే యాగర్వభారము. "తాభిస్తు సహ చిక్రీడ సర్వాభిర్హరిరాత్మవాన్, విశ్వరూపేణ విధినా సముద్రే విమలే జలే" అనుమూలము నించుక విమర్శింతము. అందఱి కన్నిరూపులై ఆత్మవేత్త గావునఁ విశ్వరూపవిధిచే నానిర్మలసముద్రోదకముల నెట్లో విహరించెను. భగవద్గీతాశాస్త్రమునఁ బదునొకండవయధ్యాయమున,

శ్లో. "మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. ४७

శ్లో. న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః,
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. ४८

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,

ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా." ౫౦

అని భగవంతుఁ డాదేశించెను. అట్టివిశ్వరూపపద్ధతిం బూని పదాఱువేలరూపములుధరించెననిభావము కాఁబట్టి యీ సాగరక్రీడ భగవంతుని కత్యంతాహ్లాదప్రదమైనదని గ్రహింపవలయు. దీనిరహస్యార్థ మేమనఁగాఁ దాను నిర్గుణుఁడై యుండి లోకముల సృజింపఁబూని ప్రకృతిని గ్రహించునట్లు సాగరయాత్రయందుఁ బ్రకృత్యంశలగుపత్నులనెల్లంగూడి తనపరబ్రహ్మత్వమును వెల్లడిచేసెను.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్.
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా." ౬
(౪. అ. గీత.)

అనుగీతావాక్యమును సార్థకముచేసెను. సకలబ్రహ్మాండముల నిచ్ఛామాత్రమున సృజించినమహాత్మునకుఁ బెక్కురూపములుగానగుట యొకయబ్బురమా? కావున నాయాత్రయందుఁ దనసగుణబ్రహ్మత్వమును వ్యక్తపఱచి నారదమహర్షి నానందింపఁ జేసెనని యెఱుంగునది.

భగవదాజ్ఞచే సురాభాండము లాజలముల నిండియుండెనని కథయందుఁ గలదు. తనకుమారులకుఁ దత్పత్నులకు మద్యపానము నేర్పుట యొకసదాచారమా యనుప్రశ్నము కలదు. మద్యములయం దనేకభేదములు గలవు. అవి సంభోగాంగములుగాఁ గొన్ని క్షత్రియాదులకు పానార్హములుగాఁ జెప్పఁబడినవి.

## బృహస్పతిః.

శ్లో. పైష్టికం తాళజం వైరం మాధూకం గుడసంభవమ్. ౧౩౩
క్రమాన్న్యూనతరం పాపం తదార్ధార్ధార్ధత స్తథా.
వర్జ్యమాద్యం సదా సర్వై ర్వరాద్యయుగ్మం నృప స్త్యజేత్.
తృతీయమపి వైశ్యస్తు శూద్రోప్యాద్యద్వయం తథా,
తృతీయాదిత్రివర్ణానామాసవం పేయముచ్యతే. ౧౩౪
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీం వినా,
పతిహీనా చ కన్యా చ త్యజేదృతుమతీ తథా. ౧౩౬
అభర్తృసన్నిధౌ నారీ మద్యం పిబతి లోలుపా,
ఉన్మాదినీతి సా ఖ్యాతా తాం త్యజేదంత్యజా మివ. ౧౩౭
దశాష్ట షట్ప్రతప్రస్తు ద్విజాదీనామఘం భవేత్,
స్త్రీణా మఘం తదర్ధం స్యా త్పాదం స్యాద్భర్తృసంగమే.
మద్యం పీత్వా ద్విజో మోహా
త్కృచ్ఛ్రం చాంద్రాయణం చరేత్,
జపేచ్చాయుతగాయత్రీం జాతవేదసమేవవా. ౧౩౮
అంబికాహృదయం వాపి జపేచ్ఛుద్ధో భవేన్నరః,
క్షత్రియాదిత్రివర్ణానాం ద్విజాదర్ధార్ధతః క్రమాత్. ౧౪౦
స్త్రీణా మర్ధార్ధక్లప్తస్స్యాత్కారయేద్వా ద్విజై రపి,
అంతర్జలే సహస్రం వా జపేచ్ఛుద్ధి మవాప్నుయాత్. ౧౪౧
లక్ష్మీస్సరస్వతీ గౌరీ చండికా త్రిపురాంబికా,
భైరవో భైరవీ కాళీ మహాశాస్తా చ మాతరః. ౧౪౨
అన్యాశ్చ శక్తయస్తాసాం సేవనే మధు శస్యతే,
బ్రాహ్మణస్తు వినా తేన యజేద్వేదాంతపారగః. ౧౪౩

శ్లో. ఇతరే మధునా దేవీమర్చయేయుః పలార్థినః,
తన్నివేదితమశ్నంత స్తదనన్యా స్తదాత్మకాః. ౧౭౪
తాసాం ప్రభావాద్గచ్ఛంతి నిర్లేపా స్తే పరాంగతిం,
కృతస్యాఖిలపాపస్య జ్ఞానతోఽజ్ఞానతోఽపి వా. ౧౭౫
ప్రాయశ్చిత్తమిదం ప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః,
అనభ్యర్చ్య పరాశక్తిం పిబే న్మద్యంతు యోఽధమః.
రౌరవే నరకాబ్దాంస్తు నివసే ద్బిందుసంఖ్యయా,
భోగేచ్ఛయా యో మద్యంతు పిబతే బ్రాహ్మణాధమః.
ప్రాయశ్చిత్తం న వై వాచ్యం శిలాగ్నిపతనాదృతే.
ద్విజో మోహాన్నతు పిబేత్స్నేహాద్వా కామతోఽపివా.
(లలితోపాఖ్యానము. ౫. అధ్యాయము.)

తా. గౌరపిండితో సిద్ధమగును. తాటిచెట్టునుండి, టెంకాయచెట్టునుండి, ఇప్పపూలనుండి, బెల్లమునుండి సిద్ధమగును. ఈయాసవము లైదువిధములు. ఇందు మొదటిది యుద్ధసమయములయందుఁదప్ప వేఱొకప్పు డెవ్వరును త్రాగరాదు మొదటి రెండును క్షత్రియుఁ డెప్పుడును త్రాగరాదు. వైశ్యుఁడు మొదటిమూఁడును త్రాగరాదు. శూద్రుఁడు మొదటిరెండును వదలవలయును. చెప్పినవికాక మిగిలినవి క్షత్రియాదులకు మూఁడు జాతులవారికిని పానార్హములు. స్త్రీలకుంగూడి మూఁడవది మొదలుకొని పానార్హములు. బ్రాహ్మణస్త్రీల కేదియుఁబనికిరాదు విధవయుఁ గన్యకయు ఋతిమతియు నన్నిజాతులయందుఁ ద్రాగరు. భర్తృసన్నిధియందుఁ దప్ప నేస్త్రీ మద్యపానముచేయునో దానిని జండాలస్త్రీవలెఁ బరిత్యజింప

వలయు. బ్రాహ్మణుఁ డజ్ఞానమున మద్యపానముచేసిన విశేష ప్రాయశ్చిత్తము గలదు.

అనఁగాఁ గ్రీడాంగముగా నీపానము క్షత్రియాదులకు వారిస్త్రీలకుఁ జెప్పఁబడినది. విధవయుఁ గన్యకయు బహిష్ఠస్నాత యగుకాంతయు రతికిఁ బనికిరారు. కావున వారి కిది తగదు. అనఁగాఁ దదితరకాలములయందుఁ బనికిరావనిభావము. దీనిచేఁ బాపముకల్గుననియుఁ జెప్పఁబడినది. ఎవరెవరి కేయేపేరులు గల మద్యములు పానార్హములో వానిచే నాయాజాతులవారు దేవతల నారాధించవచ్చును. బ్రాహ్మణుఁడు చేయరాదు. దీనిసార మేమనఁగాఁ గులోక్తమగు నాహారమున దేవతల నారాధింప వచ్చును. విప్రున కేపేరుగల యాసవము పానార్హముకాదు కావున నతఁ డద్దానిని దేవతలకు నివేదింపరాదు. ఇట్లుండగా శాక్తులకు మద్యపానము విధివిహితమని యాక్రోశించుట తెలివితక్కువయేకదా. ద్వాపరాంతమువఱకు మద్యపానము బ్రాహ్మణేతరులకు సుఖాంగములుగాను దేవతార్థై వేద్యాంగములు గను జెప్పఁబడినది. ఈవిధులు పురాతనకాలమునఁ గలయాచారములు. తరువాతిస్మృతులను బరిశీలింతము.

శ్లో. "అజ్ఞానాద్వారుణీం పీత్వా సంస్కారేణైవ శుధ్యతి,
మతిపూర్వమనిర్దేశ్యం ప్రాణాంతికమితి స్థితిః. ౧౮౯
అపస్సురాభాజనస్థా మద్యభాండస్థితా స్తథా,
పంచరాత్రం పిబేత్పీత్వా శంఖపుష్పీశ్రితం పయః. ౧౯౦
స్పృష్ట్వా దత్వా చ మదిరాం విధివత్ప్రతిగృహ్య చ,
శూద్రోచ్ఛిష్టాశ్చ పీత్వాపః కుశవారి పిబేత్త్ర్యహమ్. ౧౯౧
బ్రాహ్మణస్తు సురాపస్య గంధమాఘ్రాయ సోమపః,

ప్రాణానప్సుత్రిరాయమ్య ఘృతం ప్రాశ్య విశుద్ధ్యతి. ౧౪౯
అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్టమేవ చ,
పునస్సంస్కారమర్హంతి త్రయోవర్ణా ద్విజాతయః.” ౧౫౦

“శంఖపుష్ప్యాఖ్యౌషధిప్రక్షేపేణ పక్వం క్షీరం న తూదకమ్. ‘శంఖపుష్పీవిపక్వేన త్ర్యహం క్షీరేణ వర్తయేత్.’ ఇతి బౌధాయనస్మరణాత్.” అని వ్యాఖ్య.

మనుస్మృతికాలమునుబట్టి యూహింపఁగా మద్యపానము సర్వవర్ణనిషేధముగఁ గన్పట్టెడిని. ప్రాయశ్చిత్తాదులుకూడఁ జెప్పఁబడినవి. పైయుపాఖ్యానమునకన్న మనుస్మృతి యర్వాచీన మని తేటపడియెడిని.

మద్యపాననిషేధము పరాశరస్మృతియందుఁ జక్కఁగాఁ గలదు. కలిధర్మములకుఁ బరాశరస్మృతియేకదా ప్రధానమని యార్యులు వచింతురు.

శ్లో. “మద్యపశ్చద్విజః కశ్చిన్నదీం గత్వా సముద్రగామ్,
చాంద్రాయణే తతశ్చీర్ణే కుర్యాద్బ్రాహ్మణభోజనమ్
అనడుత్సహితాంగాంచ దద్యాద్విప్రేషు దక్షిణామ్.”

(౧౨. అధ్యా.

“వ్యా. పనసాదిజన్యం మదకారణం ద్రవ్యంమద్యం. తదాహపులస్త్యః.—‘పనసద్రాక్ష మాధూకం ఖార్జురం తాళమైక్షవం, మధూత్థం సైరిమారిష్టమైరేయం నారికేళజం. సమానానివిజానీయా న్మద్యాన్యేకాదశైవతు.’ ఏకాదశానా మన్యతమస్యమద్యస్య పానే మహానదీతీరే చాంద్రాయణం చరిత్వా బ్రాహ్మణభోజనం కృత్వా దక్షిణాం దద్యాత్. తదేతత్కామకారవిషయం. అకామకృతే తు బృహస్పతిరాహ.—‘పీత్వాప్రమాదతోమద్య

మతిక్రుచ్ఛ్రం చరేద్ద్విజః, కారయేత్తస్య సంస్కారం శక్త్యా విప్రాంశ్చభోజయేత్' తదేతన్మద్యపాన ప్రాయశ్చిత్తం బ్రాహ్మణస్యైవనతు క్షత్రియవైశ్యయోః. మద్యపానస్య బ్రాహ్మణం ప్రత్యేవ నిషేధాత్. 'యక్షరక్షః పిశాచానాం మద్యం మాంసం సురాసవం, తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానామశ్నతా హవిః.' బృహద్విష్ణుః—మాధూకమైక్షవం సైరం తాళం ఖార్జూరపానసం, మధూత్థం చైవ మాధ్వీకం మైరేయం నారికేళజమ్. అమేధ్యాని దశైతాని మద్యాని బ్రాహ్మణస్య తు' రాజన్యవైశ్యయోస్తు మద్యపానమనుజానాతి బృహద్యాజ్ఞవల్క్యః 'కామాద్యది చ రాజన్యో వైశ్యోవాపి కథంచన, మద్యమేవ సురాం పీత్వా న దోషం ప్రతిపద్యతే' ఇతి. వ్యాసోఽపి. 'ఉభౌ మధ్వాసవం పీత్వా ఉభౌ చందనచర్చితౌ, ఏకపర్యంకశయితౌ దృష్టౌ మే కేశవార్జునౌ.'' ఇతి.

(అని మాధవాచార్యులు)

శ్లో. "సురాపానం సకృత్కృత్వా అగ్నివర్ణాం సురాం పిబేత్,
సపాతయే దథాత్మాన మిహ లోకే పరత్రచ."

పరాశరస్మృతికాలమునకు మద్యములని సురలని, యాసవములని మఱియుఁ బెక్కునామముల నున్నయట్లు స్పష్టములగు. అందుఁ గొన్ని యనఁగా విశేషమాంద్యమును గల్గింపనియాసవాదులు పానమున కర్హము లనిరి. ఆసవములు వైద్యశాస్త్రమునఁ గలవు. అవి బుద్ధి కపకార మొనరింపక రోగనాశనము చేయును. అరిష్టము లట్టివే. రోగనాశనార్థ మవి యౌషధములుగా శాస్త్రప్రహితములైనవి. సురాపానము సర్వవర్ణనిషేధమే. కాఁబట్టి శ్రీహరి యావిధ మెఱంగియే యాకాలము

విహారకాలము కనుక స్త్రీపురుషులందఱు కలిసి జలక్రీడలాడు తరుణము కావునను క్షత్రియాదులకు నట్టితఱిని బానార్హములగు నాసవములను శాస్త్రము విధించినందున నట్టు లొనరింప నాజ్ఞాపించెను. ఇంతియకాక స్వర్గలోకమునుండి యచ్చరలం బిలిపించి నృత్యగీతములచే వారెల్ల రానందింపఁజేసెను. నారద మహర్షియందుఁ బాల్గొనియెను. ఆయాత్ర రాత్రియందు సాగుటయు నాదము హాయిగ వినఁబడుటయు నారదముని నాదబ్రహ్మోపాసకుఁడగుటయు నాతనికోర్కికను దీర్ప నెంచియే శ్రీహరి యామునిని స్మరించెను. ఆసేవాభాగ్యము మునికి లభించెను. కృతార్థుఁడయ్యెను. దీనింబట్టి చూడఁగా శ్రీకృష్ణుని దపస్సుచే నర్చనాతిశయములచేఁ బ్రీతునిం జేయుటకంటె గానారాధనమున సత్వరంబ యలరింపఁజేయవచ్చునని యెఱుంగ వేణునాదమే యీవిషయమును దృఢపఱచుచున్నది. భజనరూపమున శ్రీహరి నారాధించుట యుత్తమోత్తమమార్గమని యిందుల రహస్యము.

శ్రీహరి సముద్రునిం బిలిచి నీరము మధురముగ నుండఁజేయుము. జలజంతువులు నిర్బాధములుగా నుండఁ జేయు మనియె. భగవదాజ్ఞ నతఁడశ్లేచేసెను. సముద్రుఁడే కాదు సర్వలోకములుఁ తదాజ్ఞను శిరసావహింప సిద్ధముగ నుండ నీసాగరుఁడేపాటివాఁడు? ఛాలిక్యగీతము భగవత్ప్రీతికర మనుట యొకటి గ్రహింపఁదగినది. ఎన్నివిధముల నాలోచించినను శ్రీకృష్ణారాధనము గానరూపమే యని తేలెడిని. అమరాంగనలు విహారకాంతలు కారనియు గానామృతమున నెల్లరఁ దృప్తిచేయవచ్చి సేవించి కృతకృత్యలై యథాపూర్వముగా

స్వర్గము నలంకరించిరనియు గ్రహించుటయే బుద్ధిమంతుల లక్షణము. ఇట్టు లీసాగరయాత్ర భగవదారాధనమును అప్పటి యాచారములను బోధించును. దురాక్షేపములచేఁ గాలమును వ్యర్థముచేయక తత్సారమును గ్రహించి భగవంతుని ధ్యానించి తదానందమయమూర్తిని మనఃపీఠమున నిలుకడఁ గాంచఁజేసి కృతార్థులు కావలయునని మనసార వాంఛించుచున్నాను. ఇంకను వ్రాయఁదగినవిషయము లనేకము లీగాథయందున్నవి. కాని గ్రంథవిస్తరభీతి మానితిని. తరువాతి భగవత్కథ నాలకింపుఁడు.

## భానుమతీరక్షణము.

*ఈరీతిగా శ్రీహరియాజ్ఞానుసార మందఱు సాగరజలంబుల విహరించి తదనంతరము నిర్మలస్థలములుగల నౌకలయందే కూరుచుండి యిష్టాహారముల సంతృప్తులయి యచ్చరల నృత్తగీతానందముల మనస్సులు పరవశములు కాఁగా నట్లే యుండిరి. ఆవిధమెఱింగి యిదియ యదనుకదా యనుదురూహాచే దుర్మతియు దేవవైరియు సాధుకంటకుఁడునగు నికుంభుఁడు భానుపుత్త్రికయగు భానుమతీకన్య నెత్తికొని పరుగిడెను. ఆతఁడాత్మవధము నే కోరెను. తనచావు తానేకోరి త్వరపడసాగెను. అదియేకదా కాలపాశవశంగతులై జీవులు పరుగెత్తుచుందురని పూర్వులు నిర్దేశించిరి. ఆదానవుఁడు మాయాబలంబున నేరికిఁ గానరాక యాదవుల వంచించి వనితాజనమును మోసపుచ్చి మాయావిశారదుఁడు గావునఁ బూర్వవైరమును దీర్చుకొన

*ఈకథ విష్ణుపర్వమునందలి తొంబదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

నెంచి యట్టు లొనరించెను. ఆతరుణమున నిట్లుచేయ నొక్క కారణము కలదు. ప్రద్యుమ్నుఁ డాతనిసోదరుఁ డగువజ్ర నాభునిపుత్త్రిక యగుప్రభావతిని మాయాబలంబున నపహరించుటయే కాక వజ్రనాభునింగూడ వధించెను. ఆత్తఱి నావజ్రనాభుఁ డరణ్యముల నుండెను. భానుప్రోత్సాహమునఁ బ్రద్యుమ్నుఁ డట్టు లొనరించెను. ఆవైరము మది నిడుకొని యానికుంభుఁడు తనరూపము తెలియఁబడకయుండ మాయాబలంబున నొనరించి యంతరము నెఱింగి బరులు చేయుస్వభావముకల వాఁడు కావున నట్టికార్య మకార్యమైన నొనరించెను. భానుమతి కానరాకపోఁగాఁ గన్యాజనమున నొకకోలాహలరవముదయించెను. భానుమతి యపహృతయయ్యెనని కొందఱు విలపించిరి. ఆరోదనధ్వని యతిశయించి యాయుత్సవానందమును జీకాకుపఱుపఁజాలెను.

శత్రుసూదనులగు వసుదేవాహుకు లిర్వురు కృష్ణమూర్తి ప్రోత్సహింపఁగా భానుమతీపరిజన ముండుచోటికిం బోయిరి. వా రాచోట నామె లేకుండుటెఱింగి మాయనుబన్ని యితరుల కగోచరులై కన్యాపహర్తను గనుంగొనిరి. వెంటనే భగవంతుఁ డెందున్నవాఁడో యాచోటికిం బరుగిడిరి. ఆవార్త శ్రుతివివరములఁబడఁగానే తనకు విమానముగాను వాహనముగనున్న నాగాంతకుఁ డగుగరుడు నెక్కి యర్జునుంగూడి యామురారి పయనముసాగించుచు రథారూఢుఁడవై రమ్మా యని ప్రద్యుమ్నున కాజ్ఞాపించి త్వరగ నరుగుమా యని గరుడున కాజ్ఞాపించి వజ్రనగరమునకు భానుమతిం గొని యరుగుచున్ననికుంభుని బొడఁగాంచి యాయరిందము లిద్దఱు వాని జేరఁగల్గిరి.

మహారథుఁ డగు ప్రద్యుమ్నుఁడును భగవదాజ్ఞం దలఁదాల్చి రథారూఢుఁడై వారివెనుకనె పోవుచుండెను. నికుంభుఁ డా వచ్చుచున్న కృష్ణార్జునప్రద్యుమ్నులం దిలకించి తనదేహమును మూఁడుభాగములుగా నొనరించి విలాసహాసమున వారిముప్వు రను బాణముల నొప్పించెను. భానుమతిని వామహస్తమునఁ బట్టుకొని దక్షిణహస్తమునఁగంటకచిహ్నానిబిడరూపముగనున్న గదాయుధమును గొని హరిని నొప్పించెను. భానుమతీరక్షణా దరమున నాదానవు నాముప్వురు మిగుల నొవ్వఁజేసిరి. వారు ముప్వురని పగవాఁడొక్కఁడని దయచూపక యెట్టులేనాకన్యను గాపాడఁబూని పోరాడిరి. వారొక్కరొక్కరే యానికుంభుని వధింపంగలరు. ఐనను శత్రు వొక్కఁడేయని నిట్టూర్పులువుచ్చి కరుణను జూపిరి. విజయుఁడు ధానుష్కులలో మేటి. యుద్ధ మున సర్వప్రకారములచేతను సమర్థుఁడు. కావున నాగోష్పి విధానము ననుసరించి బాణపంక్తిం బ్రయోగించి చిక్కుపడం జేసెను శ్రీకృష్ణతత్కుమారులు వైతస్తికములగు (పండ్రెండం గుళములపొడవుగలవి) బాణముల వాని నొప్పించిరి. ఒక్క బాణముగాని యందుఁ బదాఱవభాగముగాని భానుమతి తనూలత గాసినొందింపకయుండఁ బోరాడిరి.

అంతలో నాదానవుఁ డాసురీనామకమాయ నాశ్ర యించి భానుమతితోడ నదృశ్యుఁడయ్యెను. ఎవ్వరు నతనిం గనుఁగొనఁజాలకపోయిరి. ఆతనిని శ్రీకృష్ణార్జునులును బ్రద్యు మ్నుఁడును వెనుకొనిరి. ప్రద్యుమ్నునిసాయమున నాతనిఁ జూడఁగల్గిరి. అంత నాయసురుఁడు పక్షిరూపము నొందెను. అర్జునుఁ డావిధమెఱింగి తీవ్రాంబకముల నాకన్యకకుఁ దగులక

యుండ నొప్పించెను. ఆరక్కసుఁడా ముప్వురు వెనుకొనుచుండఁ సప్తద్వీపములుగల భూమండలమంతయుఁ బరిభ్రమించుచు గోకర్ణపర్వతోపరిభాగమున వ్రాలెను. గంగావేలాసమీపమున నొకపులినతలంబును జేరి కన్యంగాపాడుచు నుండెను. ఆచోటికి దేవతలు దానవులుకూడ నెగిరిపోఁజాలరు. ఆక్షేత్రము శంకర తేజస్సమావృతము. అందాతఁడు ప్రవేశించునపుడు ప్రద్యుమ్నుఁ డించుక యవకాశమునొంది భానుమతి నెత్తుకొని పరుగిడెను. అత్తరుణమున నాదానవుని శ్రీకృష్ణార్జునులు నిశితబాణముల నొవ్వఁజేసిరి. ఆగోకర్ణక్షేత్రమును వదలి దక్షిణాశకుఁ బాఱెను. గరుడారూఢులగు కృష్ణార్జునులు వెంబడించిరి. అందుండక దానవులకు నివాసభూతంబగు షట్పురమును బ్రవేశించెను. ఆగుహాద్వారమున శ్రీకృష్ణార్జునులు తెల్లవాఱుదనుకఁ గాచియుండిరి. ప్రద్యుమ్నుఁడా భానుమతిని ద్వారకానగరమునను నిచి ప్రహృష్టమానసుండై తండ్రికడకరుదెంచెను. గుహాద్వారమున నిలిచియున్న వారి నిరువ్వరం గాంచెను. వారు ముప్వురు నాద్వారమును గాపాడుచు నికుంభుని జంప నెంచియుండిరి.

అంత నారాక్షసుఁ డధికబలాధికుఁడుగాన గుహానుండి వెడలివచ్చెను. అర్జునుఁడు గాండీవకోదండనిర్గతప్రకాండములం గప్పెను. వాఁ డెందును బోవకయుండ నడ్డగించెను. బహుకంటకావృతమహాగదను దాల్చి యాఘోరదానవుఁడు బలముకొలఁది దానిం ద్రిప్పి యర్జును నుత్తమాంగమును బ్రద్ధలగునట్లు గొట్టెను. కనఁబడక వారు కొట్టఁగా నాగదాఘాతమున నించుక మూర్ఛిల్లెను. మఱియు రక్తము గ్రక్కెను. దానింగని నవ్వుచు నాదానవుఁ డాగదాఘాతమునఁ బ్రద్యుమ్నుని నొప్పిం

చెను. అత్తరిఁ బ్రద్యుమ్నుఁడు తూర్పుముఖముగా నుండెను. మాయావిశారదుఁడగు నాదానవుఁ డిట్లు గదచేఁ దలఁబగుల్పఁగా రుక్మిణీసూనుఁడు మూర్ఛిల్లెను. ఇట్లు లర్జునప్రద్యుమ్నులు మూర్ఛమునుంగుటం గాంచి శ్రీహరి యాగ్రహించి నికుంభుం బొలియింపఁ బరుగిడి కౌమోదకి యనుగదను ధరించెను. వారిరువురు గదాయుద్ధమున నొండొరుల నార్చుచు నొప్పించుచుఁ బోరుచుండఁగా నామహాసంగ్రామమును దిలకింప నైరావతారూఢుఁడై దేవేంద్రుఁడు దేవతలంగూడి యంబరమున నిలిచెను. దేవతల నింద్రునిం గాంచి శ్రీహరి విచిత్రయుద్ధములచే నాదానవుని బొలియించి సురహితము చేయఁబూనెను. ఆగదాయుద్ధమున విచిత్రమండలపద్ధతుల నవలంబించెను. అపుడపు డాకౌమోదకిని మెచ్చుకొనుచుఁ ద్రిప్పుచు వాని నొప్పించుచుండెను. ఆదానవుఁడును బహుకంటకచిహ్నములు గలగదను ద్రిప్పుచు వ్రేయుచు మండలగతులఁ గనఁబఱచుచుండెను. మదవృషభములవలె గర్జించుచు మదగజములవలె ఘీంకరించుచు నొకరినొకరు నొప్పించుకొనుచుండిరి. గదచేఁ గేశవునినొప్పించుచు నానికుంభుఁడు పెడబొబ్బపెట్టెను. ఆదానవునివ్రేటునకు నొచ్చి హరి మూర్ఛమునింగెను. లోకములన్నియు హాహాకారము లొనరించెను. ఎల్లరు దుఃఖసముద్రమున మునింగిరి. సోలియున్న శ్రీహరిని దేవేంద్రుఁడు గంగాతోయశీకరములచేఁ దడిపి శైత్యోపచారము లింక ననేకములొనరించి సేవించెను. శ్రీహరి వలయుననియే యామూర్ఛ నభినయించెను. లోకముల నెవ్వఁడేని భగవంతుని మూర్ఛమునుంగఁ జేయఁగలఁడా.

అంతట స్మృతిరాఁగా శ్రీకృష్ణుఁడు లేచి సుదర్శనమును గైకొని యీదానవు వధింపుమా యని యాజ్ఞాపించెను. అంతలో దురాత్ముఁడు మాయావియునగు నానికుంభుఁ డా దేహమునువదలి యదృశ్యుఁడయ్యెను. వాఁడెందున్నది హరి యెఱుఁగక యాతనవుంగని యీతఁడు మూర్ఛిల్లెనా మృతుఁ డయ్యెనా యని శంకించెను. ఇంతలో మూర్ఛమునింగిన యర్జున ప్రద్యుమ్నులు లబ్ధచేతనులై వచ్చిరి. నికుంభుం బొలియింపఁ బూని యా కేశవుచెంత నిలిచిరి. మాయావిశారదుఁడు కావునఁ బ్రద్యుమ్నుఁ డారాక్షసు నునికి యెఱింగి హరితోఁ, దండ్రీ! నికుంభుఁ డిట లేఁడు. ఎందో పోయెను. ప్రద్యుమ్నుఁ డీమాట చెప్పఁగనే యాకళేబరమును భస్మమునుచేసెను. అర్జునుం గాంచి ప్రహాసమొనరించెను. ఇంతలో నంతేరిక్షమున నికుంభకళేబర ములు లక్షలు మింటఁదోఁచెను. భూమియందును గనంబడెను. వారు వానిం గాంచిరి. అందుఁ గొన్ని కృష్ణుని, గొన్ని పార్థుని, గొన్ని ప్రద్యుమ్నుని జుట్టుముట్టెను. అది యొకయచ్చెరువుగానే యుండెను. కొందఱు నికుంభులు పార్థునికోదండమును, మఱి కొందఱు పార్థుశరములను గొంద ఱాయర్జునునిపాదములను మఱికొంద ఱాతనిపాదములను బట్టుకొనిరి. ఇట్టు లాతనిం బట్టుకొని యంబరమున కెగసిరి. ఆవిధముచూడఁగా నర్జున కోటులు దివంబుననున్నట్లు తోఁచెను. దాన నాతఁడు జీవించి మాయలు పన్నినట్లె యెఱింగిరి. వెంటనే శ్రీకృష్ణప్రద్యుమ్నులు నిశాతసాయకముల నర్జునునివదలి రాక్షసు నొంచిరి. ఒక్కొక్క దేహము ఛేదింపగా రెండుతనువులు కాసాగెను. దివ్యజ్ఞాన స్వరూపుఁడు కావున భగవంతుఁడు యథార్థదానవరూపము

నెఱింగెను. సర్వమాయలఁ బుట్టించువానిని బార్థు నపహరించిన వానిని గాంచి వానిశిరస్సును సుదర్శనముచే ఛేదించెను. ఆవిచిత్రవధము సకలభూతములు చూచుచుండెను. శిరస్సు ఛేదింపఁబడఁగా నర్జునుని వదలి ఛిన్నమూలద్రుమమువలె వాఁడుపడిపోయెను. ఆకాశమునుండి యాధారములేమిఁ బడుచున్నపార్థుని శ్రీకృష్ణానుమతిని బ్రద్యుమ్నుఁడు పట్టుకొనెను.

నికుంభుఁ డిట్లుపడఁగా శ్రీహరి యర్జును నాశ్వాసించి విజయప్రద్యుమ్నులను గూడి ద్వారకానగరమున కరిగెను. యాదవులెల్ల నుల్లాసమునఁ బొదలునట్లుచేసి యంతలో నారదముని యరుదేర నెదుర్కొని నమస్కరించెను. అంత నారదముని భానువనుయాదవ్రుం గాంచి యిట్లు పలికెను. భానూ! యాగ్రహింపకుము. నామాట నాలకింపుము. రైవతోద్యానమునఁ గ్రీడించుచు నీభానుమతి యేదో యపచారముచేయ దుర్వాసుఁ డాగ్రహించి నీకొమరితను శపించెను. ఈభానుమతి శత్రుహస్తమునఁ జిక్కఁగలదనియే యాశాపము. నేనును గొందఱు మునులు నందుండి బహుభంగులఁ బ్రార్థించితిమి. మునివర్య! అనపరాధిని. వ్రతనియతురాలు. ఏల శపించితివి? కన్యకకదా. ధర్మభృద్వర్యుఁడవయ్యు నిట్లు శపింపనగునా. ఐన ననుగ్రహింపుము. మేమెల్లఁ బ్రార్థించుచున్నారము. అని మేము ప్రార్థింపఁగా నాముని యాలకించి ముహూర్తము క్రిందు చూచుచుండి కరుణపొలయఁగా మునులారా! నావచనమమోఘము. అట్లే సాగవలయును. ఈకన్నియ శత్రుహస్తమును దప్పక పొందును. నిస్సంశయము. అదూషితయై త్వరగాఁ దగినభర్తను బడయఁగలదు. బహుపుత్రవతియగు. బహుధన

వతియునగు. సౌభాగ్యవతియుఁ గాఁగలదు. పరిమళమిళితాంగి యునై విఖ్యాతినొందునఁ. చాలకాలము శోకము ననుభవిం పదు. అని బదులు చెప్పెను. కావున నీభానుమతిని సహదేవున కీయఁదగును. ఆకుమారుఁడు ధర్మశీలుఁడు. విఖ్యాతకులుఁడు. పాండురాజతనయుఁడునగు. అని నారదముని పలుకుటయు నాభానువు పుత్రికను సహదేవుని రావించి చక్రపాణి యనుమతి నొంది వివాహముచేసెను. ఆసహదేవుఁడు భానుమతిందోడు కొని హాస్తినపురమున కరిగెను. ఇది శ్రీకృష్ణవిజయమును దెలుపుగాథ. చదివిన విన్న విజయలాభము కల్గును.

మహాశయులారా! ఈకథనుగుఱించి నాల్గుమాటలు వ్రాయకతప్పదు. నికుంభునిరూపములు మూఁడనియు ముఖ్యా ఱుగా వానింజంపి శ్రీహరి తనకృత్యము నెఱవేర్చెననియు ముందే మీరెఱుంగుదురు. శ్రీశంకరానుమతిని హరి షట్పుర దానవులఁ జంపినపు డీసూచనయందుఁ జెప్పంబడియె. అదియే యీగాథయందుఁ జక్కఁగా వర్ణింపఁబడినది. సర్వజ్ఞుఁడగు భగవంతుఁడు నికుంభుఁడు మాయారూపమునవచ్చి యింద ఱుండఁగా భానుమతినే దొంగిలించుకొనిపోవునని యెఱుం గఁడా? ఐనను ప్రారబ్ధ మనుభవింపక తప్పదన్న న్యాయమును సార్థకముచేయవలదా. ఆమెకుఁ గలశాపమును దొలఁగించినఁ దనశాసనమును దానుల్లంఘించినవాఁడు కాకుండునా. కావున నందఱుం గూడి యూరకుండెను. వాఁడామె నెత్తుకొనిపోయెను. కన్యకాసముదయమున భానుమతి కనఁబడకపోఁగా నందఱు హాహాకారములు కావించిరి. ఇఁక గతియేమని చేతులు పిసికి కొనిరి. వారా వీరా యనువారె కాని తదన్వేషణమునకై

కడంగినవారు లేరు. తుదకు హరికడకుం బరుగిడిరి. ఆపద్బాంధవుఁడు, అనాథరక్షకుఁడు భగవంతుఁడు కాక మఱెవ్వరు? వార్త నెఱింగించిరి. సర్వవేత్త కావున నర్జునునిఁదోడ్కొని గరుడునెక్కి వాని నరయుచుం బోయెను. ప్రద్యుమ్నుఁడు మాయావిశారదుఁడనన్న గర్వముకలవాఁడు. అర్జునుఁడు గాండీవము చేతనుండఁగా ముల్లోకముల నోడింపఁజాలనా యన్న యభిమానము కలవాఁడు. సూత్రధారుఁడు హరిగదా యని యెఱుంగఁడు. తానొక ప్రతిమారూపుఁడననియు నెఱుంగఁడు. ఈయిరువ్వరకుం గల యీదురభిమానమును దొలఁగింప హరి తలంచియే యీ యిరువురను దోడ్కొనిపోయెను. ఇదేదో స్వల్పకార్యమని వారును బీరమూనియే పోయిరి. సంగరము చెల్లెను. నికుంభుఁడు సామాన్యుఁడు కాఁడు. యుద్ధవిశారదుఁడు. హరితానూరకుండెను. అర్జునుఁడే సంగర మొనరించెను. ఆదానవుఁడు మూఁడు రూపములఁ దాల్చి మువ్వురితో యుద్ధముచేసెను. ప్రద్యుమ్నుఁడు శాంబరీవిద్యయందు నేనే సర్వంకషప్రజ్ఞగలవాఁడననుకొనువాఁడు. గాండీవము చేతనుండఁ ద్రిమూర్తులైన నన్నేమి చేయుదురు అనుకొనువాఁ డర్జునుఁడు. అట్టి యీ యిర్వురు మూర్ఛిల్లిరి. రక్తముం గ్రక్కిరి. హరి పరాక్రమించి యుద్ధము చేయుచున్నట్లు నటించుచుండెను. చాలసేపటికి మూర్ఛనుండి లేచి హరిచెంతకుఁ బోయిరి. అర్జునున కింకను గర్వము తగ్గలేదు. ఇంతలో వాఁడు గధాధారియై యడరి దాన నర్జునుని శిరస్సు నొప్పించెను. పాప మాగదాఘాతమున సొమ్మసిల్లఁగా వాఁడు మాయపన్ని యర్జునునెత్తుకొని మింటికింబోయెను. గాండీవ మేమయ్యెనో కాని యర్జునుఁ డూరక రక్షించువారు

గలరా యని నాలుకలు చాపుచుండెను. హరి వానిమూర్ఛంగని తానుకూడ మూర్ఛనొందినట్లు నటించెను. లేకున్న నర్జునునకు మఱింత చింతగదురును. కృష్ణమూర్తికూడ మూర్ఛనొందెను గదా. వీఁడెంతశూరుఁడో యనునూహ కలిగినఁగాని యతని చింత వాయదని హరి యెఱింగియే తా మూర్ఛపోయెను. తుది కాలమునఁ జక్రాయుధమున వానిశిరస్సు ఛేదించెను. అర్జునుఁడు దానవుఁడు చావఁగనే నిరాధారుఁడై క్రిందఁబడుచుండెను. ప్రద్యుమ్నున కాజ్ఞాపించి యాకసమునుండి దింపి యావిజయు నాశ్వాసించెను. అర్జునుని గాండీవముకాని ప్రద్యుమ్నుని శాంబరీవిద్యగాని యీదెబ్బరమున రవంతయైనం బనికిరాకపోయెను. భగవత్కరుణ యున్నంతదనుక నన్నియుం బనికివచ్చును. అది యించుకతగ్గిన నెందులకునుపయోగింపవు. ఈవిషయమే శ్రీహరి గీతోపదేశకాలమునందు నర్జునునకు,

శ్లో. "తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్." 34

(అధ్యా. ౧౧)

అనుశ్లోకములచేఁ దెల్పిరి. భగవచ్ఛక్తి యపారమని తెలిసికొని అది సాయపడునంతవఱకే మనుష్యశక్తి యుపయో-

గించును. గాని యది విముఖమైనచో నించుకంతయుఁ బనికిరాదని యెఱుంగవలయు. ఇట్టిజ్ఞానముచే గర్వము నశించును. దాన భక్తియు సర్వభూతదయయుఁ గల్గును. అవియే భగవత్సాన్నిధ్యము నొందింపఁగలవు. కాఁబట్టి మనుష్యశక్తి యత్యల్పమనియు భగవత్సేవచేసినఁగాని యీయల్పశక్తియుఁ బనికిరాదనియు నెఱింగియహంభావమును వీడి యాసర్వేశ్వరుని వేఁడినచో నర్జునునిగాపాడినట్లు భక్తులం గాపాడుననియు దీనిసారము. ఇంకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

## రుక్మిణీశ్రీకృష్ణసరసాలాపములు.

*సాగరయాత్రయు భానుమతీమానరక్షణము కాఁగానే శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమునఁ గొలఁదిదినములు నిర్వ్యాపారముగా నున్నయట్లు నటించెను. మనస్సున నేమియోజించుచున్నవాఁడో యెవ్వరెఱుంగుదురు. రుక్మిణీదేవిమందిరమున నొకనాఁడు హరియుండి యామెయుఁ దానును సరసాలాపములఁ బ్రొద్దుపుచ్చిరి. సత్యభామవాంఛం దీర్చుటకై దేవలోకమున కరిగి పారిజాతముం దెచ్చియిచ్చెనుగదా. పుణ్యకవ్రత మామెచేఁ జేయించెను. ఆవ్రతమునకు హరిపత్ను లెల్లరు నరుదెంచిరి. మహా వైభవముగా నావ్రతము సాగెను. దీనిచే రుక్మిణీదేవికి మది నించుకకోపము గలిగియుండునాయని హరి యూహించి దానిం దీర్ప నెంచి యీసంభాషణము గావించెనా యని యూహింప

* ఈకథ శ్రీభాగవతము ౧౦ స్కం. అఱువదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. ఇతరపురాణములయం దీకథ యీరూపముగాఁ గానరాదు. ఇందలివిశేషార్థములు చాలవఱకు వీరరాఘవీయవ్యాఖ్యానమునుండి కైకొనఁబడినవని యెఱుంగవలయు.

నవకాశముగలదు. కాని యీయూహ యాపరమేశ్వరుని కార్యస్వభావము నెఱుంగఁజాలదని నానమ్మకము. దానిం బరిశీలింతము. అది కేవలశృంగారమని భావింపరాదు. పరమార్థమందుఁ గలదు. కాఁబట్టి భక్తులెల్ల రద్దానిం బఠించి తదర్థమును గ్రహింపవలయును.

భగవంతుఁడు హంసతూలికాతల్పమున వేంచేసియుండెను. రుక్మిణీదేవి సర్వాభరణాలంకృతయయ్యెను. స్వభావసిద్ధాలంకారములే యామె కలంకారములుగ నుండ నీయాభరణజాలముల మోయు టేలని ప్రశ్నింపరాదు. ఏరత్నములు పుణ్యము నెంతచేసికొన్నవో యామెతనువున నలరారు భాగ్యము గలవాయెను. భూషణముల కాదేవి యవయవములు భూషణములు. భగవంతుఁ డవతరించిన శ్రీదేవియు నవతరించుచుండు. ఆమె యనన్యగతికురాలు. ఆసంబంధ మవిచ్ఛిన్నము. ఆయిరువురును సౌందర్యమున ననుపమానులు. ఆ రెండు కలిసియుండినపుడే జగన్మంగళము లొనఁగూడు. భగవత్సాన్నిధ్యము ననే యామె ప్రకాశించును. లేనిచో నెందుండునో యెవ్వరు నెఱుఁగఁజాలరు. చెలికత్తియలు వింజామరలు వీచుచుండఁగా వాని దాఁదీసికొని యల్లనల్లన వీచుచు శ్రీభగవంతు నారాధించెను. ఆవీవనలఁగదలు హస్తములనుండి కంకణనిక్వణనము వీణాకలరవము ననుకరించుచుండెను. లక్ష్మీనాథుఁడై పరమప్రీతుఁడయ్యెను. అత్తఱి ముంగురులు కర్ణాభరణములు వక్షమున గల దివ్యపదకము వీనితో నామెకంఠ మలంకృతమయ్యెను. ముఖమద్భుతసౌందర్యమున కునికిపట్టుగా నుండెను. సుస్మిత మామె మోమున విలాసముగా నటించుచుండెను. అట్టి యారుక్మిణీ

కాంతం గాంచి శ్రీకృష్ణుం డిట్లు భాషించెను. ఈఘట్టమున మూలము,

"లీలయా ధృతతనోరనురూపరూపా ప్రీతస్మయన్నలక కుండలనిష్కకంఠవక్త్రోల్లసత్స్మితసుధాం హరిరాబభాషే"

దీనికి మహాకవిపోతనగారు,

మ. "పతి యేరూపము దాల్చినం దదనురూపం బైనరూపంబుతో
సతి తా నుండెడునట్టిరూపవతి నాచంద్రాస్య నాలక్ష్మి నా
సుతనుం రుక్మిణి నాయనన్యమతి నాశుద్ధాంతరంగం గళా
చతురత్వంబున శౌరి యిట్లనియెం జంచన్మందహాసంబుతోన్."

అని వ్రాసిరి. "రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని" అన్నశ్లోకార్థమును వెల్లడించి రుక్మిణియే సాక్షాల్లక్ష్మియన్న తనమనోభావమును జక్కఁగా వెల్లడించిరి. కాని "అలకకుండలనిష్కకంఠ వక్త్రోల్లసత్స్మితసుధామ్" అన్నవాక్యమును మెల్లగా వదలి "చంచన్మందహాసంబుతోన్" అన్నముక్కచే దానిం దెల్పిరి. ఏటికో తెలియదు. రాజపుత్రీ! దిక్పాలకులగు నింద్రాదులవంటి యైశ్వర్యముగలిగి శ్రీమంతులనఁ బ్రఖ్యాతిం గాంచి రూపము ఔదార్యము దోర్బలము ననువానిచే మిన్నలనఁ గీర్తివహించి మహానుభావులనఁగా గొప్పలోకానుభవముగల వారని పొగడ్తకెక్కిన భూపాలకు లెందఱో నిన్నుఁ బరిణయమాడఁ గోరిరి. ఈసంభాషణమునఁగల విశేషార్థములు తెలియుటకై మూలములను గొన్నింటిని వ్రాసెదను.

శ్లో. "తాన్ ప్రాప్తానర్థినో హిత్వా చైద్యాదీన్ స్మరదుర్మదాన్,
దత్తా భ్రాత్రా స్వపిత్రా చ కస్మాన్నో వవృషేఽసమాన్." ౧౧

ఆరాజులు కోరఁగా నిన్ను నీయన్నయుఁ దండ్రియు

వారిభాగ్యప్రభృతి సంపత్తులను గాంచి నిన్నిచ్చిరి. సౌందర్య మున విఱ్ఱవీఁగు నాశిశుపాలాదులను మాని యేవిషయమునం దును వారితో సమానులనుగాని మమ్ము వరించితివి. ఏల! ఇది ప్రాతీతికార్థము. విశేషార్థము. రాజపుత్రియని పిల్వఁబడునో లక్ష్మీ! నీసౌందర్యాదులం గాంచి లోకసౌందర్యదుర్మదులగు శిశుపాలాదులు గోరిరి. అట్టియర్థులను గాంచి మోసపోయి నీ మహిమను నెఱుంగక యన్నయుఁ దండ్రియు నిచ్చిరి. మేము మానవమాత్రులతో సమానులము గామని భావింపరైరి. వారితో మేము సమానులము కామని నీవెఱింగితివి. అనుప మాన మద్భాగ్యము నీవుతప్ప మఱెవ్వ రెఱుంగుదురు? కావుననే తుచ్ఛభాగ్యమున విఱ్ఱవీఁగువారిని వదలి మమ్మే వరించితివి. నీపూర్వజన్మజ్ఞానము కలుగకయున్నను నాకనపాయి నివికదా. ఇతరుల నేలకోరుదువు?

శ్లో. "రాజభ్యో బిభ్యతస్సుభ్రు సముద్రం శరణం గతాః,
బలవద్భిః కృతద్వేషాః ప్రాయస్త్యక్తనృపాసనాః." ౧౨

రుక్మిణీ! సుభ్రూ! జరాసంధాదిరాజన్యులకు వెఱచి సము ద్రమును శరణుచొచ్చితిమి. బలవంతులతో ద్వేషించితిమి. రాజ్య పాలనాధికారము గలసింహాసనమును వదలుకొన్నవారము. ఇట్టి మమ్ము వరింప నేలొకో తెలియఁ జాలకున్నారము. ఇది ప్రాతీ తికార్థము. రహస్యార్థ మేమనఁగా, రాజభ్యః అబిభ్యతః అని పదవిభాగము. సుభ్రూ యనుటచేఁ గటాక్షవీక్షణముల వెల యింపఁజేయు కనుబొమల సౌందర్యముకలదాన వని హెచ్చ రించెను. జరాసంధాది తుచ్ఛభూపాలురకు భయంపడువార మా. ఆవిషయము నీవివాహకాలమునఁ దెలిసినదికదా. వారెల్ల

నొక్కక్షణకాలమైన నిలువఁజాలిరా. సముద్రమును శరణుచొచ్చితిమి. రుక్మిణీ! నీవు క్షీరసాగరపుత్త్రివి. కారణాంతరమున నీభూలోకమున మే మవతరింప నీవు నవతరించితివి. మీతండ్రి యేమనుకొనునో యని క్షీరసాగరముననుండు నవకాశము లేనందున నొకసముద్రమధ్యభాగమున వసించితిమి. అంతియ కాదు. మాకు సముద్రాంతర్వాసమే ప్రధానము. అత్తఱినే స్వస్వరూపానుసంధానము చేయనగును. బలవంతుల మను కొనుజరాసంధాదులకు భయంపడువారము. బలవంతులమను కొనువారు నీచులు. ఇంద్రియబలము బలముకాదు. దాని నాశ్రయించినవారనఁగా దానికి లోఁబడినవారు జితేంద్రియులు కారని భావము. అట్టివారికి మేము భయంపడుదుము. వారి చెంతనుండఁజాలము. తఱచుగా నన్నియవతారములలో సాధారణముగా సింహాసనము నధిష్ఠింపము. అది తుచ్ఛతమము. ప్రాయశ్చిత్తప్రయోగముచే రామావతారమున సింహాసనాధిష్ఠానము రక్షింపఁబడినది. ఇట్టి మమ్మెఱింగితివని విశేషార్థము.

శ్లో. "అస్పష్టవర్త్మనాం పుంసామలోకపథమీయుషాం,
ఆస్థితాః పదవీం సుభ్రు ప్రాయస్సీదంతి యోషితః." ౩౧

ప్రాతీతికార్థము. ఆచారస్వరూపమెఱుంగక అశాస్త్రపారతంత్ర్యపథము నాశ్రయించినవారిం జేపట్టి వనితలు సాధారణముగా శ్రమములకు లోనగుదురు. విశేషార్థము. వసుదేవకుమారుఁడైన క్షత్త్రియుఁడు. నందునికుమారుఁడైన వైశ్యుఁడగును. ఈరెండును లోకులకు సంశయములే. అట్టివారము. మాజాతినిర్ణయింప శక్యముకాదు. మాయాచార మిది యని యు నిర్ణయింప శక్యముకాదు. సత్పురుషులకును సాధ్యము కానే

కాదు. లోకు లనుసరించుకర్మమార్గము నొందువారముకాము.

శ్లో. "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం వర్తఏవచ కర్మణి."

(3 అ. 22 శ్లో.)

అనుగీతావాక్య మీయర్థమునే తెల్పుచున్నది. ఈ రెండువాక్యములు చెప్పినవాఁ డొక్క-కృష్ణమూర్తియేకదా. అనఁగాఁగర్మమార్గమునకు లోఁబడువారము కాము. కర్మముల నాచరించుచున్నారే అని యందువేమో.

శ్లో. "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే."

అన్న న్యాయానుసారమే చేయుదును. అంతియకాని కర్మవశంగతులము కాము. అట్టి మమ్మాశ్రయించిన స్త్రీలు సామాన్యముగాఁ గష్టములపాలగుదురు. కష్టపడి మామార్గము నెఱుంగుదురు. "పుంసామస్మాకమ్" అని యన్వయించుకొనవలయును. మమ్మాశ్రయించువారు కష్టములపాలగుదురు. కాని మరల నట్టికష్టములు కలుగనేరవని సారము.

శ్లో. "నిష్కించనా వయం శశ్వన్నిష్కించనజనప్రియాః,
తస్మాత్ప్రాయేణ న హ్యాఢ్యామాం భజంతి సుమధ్యమే."

సామాన్యార్థము. ఏమియు లేనివారము. ఏమియు లేని వారలకు హితులము. కావుననే సాధారణముగా ధనవంతులు మమ్మాశ్రయింపరు. రహస్యార్థము. పొందఁదగిన దించుకంతయు లేనివారు నిష్కించను లనఁబడుదురు సకలకామముల ననుభవించినవారని దీనిభావము. అట్టివారలకే మేము ప్రియులము. అనఁగా అవాప్తసర్వకాములే మాయందుఁ బ్రీతిగలవారని

భావము. కావుననే తెలుచుగాఁ గులశీలధనాదులచే మదించిన వారు మమ్ము సేవింపరు. అనఁగా నిష్కాములము మేము. నిష్కాములకే మేము హితులము. కాఁబట్టియే మత్తులగుజనులనఁగా సుఖానుభవమును గోరువారు మమ్మాశ్రయింపరని సారము.

శ్లో. "యయోరాత్మసమం విత్తం జన్మైశ్వర్యాకృతిర్భవేత్,
తయోర్వివాహో మైత్రీచ నోత్తమాధమయోః క్వచిత్."

ప్రతీతికార్థము. రుక్మిణీ! ద్రవ్యము కులము ఐశ్వర్యము చక్కదనము సమానముగాఁగలవారలకే వివాహము స్నేహము తగియుండునుగాని యుత్తమాధములకు నా రెండును దగవు. ఒకానొకప్పుడును బొసఁగవు విశేషార్థము. విదర్భరాజతనయా!

"వివాహశ్చ తథా మైత్రీ సమయోరేవ శోభతే."

అన్న న్యాయము ననుసరించి లోకాతీతద్రవ్యవంశసుందరాకృతులుగల మనకే వివాహమైత్రియుఁ దగునుగాని యుత్తమురాలవగు నీకును సర్వవిధముల నధముఁడగు శిశుపాలునకును వివాహముగాని మైత్రిగాని తగదు. కనుక నన్నివిధముల నీకుం దగిన నన్నే యీలోకమునందును మాయాసంవృతురాలవైనను బూర్వవాసనాబలమునఁ గోరికొంటివి. చక్కనికార్యమొనరించితివి. దీన లోకము నిన్నుఁ జూచి నేర్చుకొనుఁగాక యని సారము. ఈశ్లోకములఁగల యర్థవిశేషమును సంగ్రహించి మహాకవిపోతన,

"సీ. లోకులనడవడి•లోనివారము కాము
పరులకు మాజాడ • బయలుపడదు

బలమదోపేతులు ♦ పగ గొందురు, మాతోడ
రాజపీఠములకు ♦ రాము తెలిచు
శరణంబు మాకు నీ♦జలరాశిసతతంబు
నిష్కించనుల మేము ♦ నిధులు లేవు
కలవారు చుట్టాలు♦గారు నిష్కించన
జనబంధులము ము క్తి♦సంగ్రహులము
ఆ. గాఢవర్తనులము ♦ గుణహీనులము భిక్షు
లైనవారిఁగాని ♦ నాశ్రయింప
మిందుముఖులు దగుల ♦ రిటువంటి మముబోఁటి
వారి నేల దగుల ♦ వారిజాక్షి.
క. సిరియును వంశము రూపును
సరి యైనవివాహసఖ్య♦సంబంధమ్ముల్
జరగును సరికాకున్నను
జరగవు లోలాక్షి యెట్టి♦సంసారులకున్."

అని వ్రాసిరి. విశేషార్థసార మీపద్యరత్నములయందుఁ గలదని చూడఁగనే తోఁచును.

శ్లో. "వైదర్భ్యే తదవిజ్ఞాయ త్వయా౽దీర్ఘసమీక్షయా,
వృతావయం గుణైర్హీనా భిక్షుభిశ్లాఘితాముధా." ౧౬

సామాన్యార్థము. ఇంతమాత్రమేని విచారింపక దూరమాలోచింపక గుణహీనులము, భిక్షువులచే సమ్మానింపఁబడువారము నగు మమ్ము వరించితివి. విశేషార్థము. సామాన్యార్థమునందు, "త్వయా అదీర్ఘసమీక్షయా" అని పదవిభాగము. విశేషార్థమునందు, "త్వయా దీర్ఘసమీక్షయా" అని పదవిభాగము. వైదర్భి! దీర్ఘముగ నాలోచించితివి. నేను జగన్నాతను.

శిశుపాలాదులు నాకుఁ బుత్రస్థానీయులు. అట్టివారు కోరఁదగిన వారు కారు.అని విత్తాదులను లెక్కింపక యని భావము. తల్లినగు నన్నుఁ దెలివిలేక కోరుచున్నారు. అని దూర మాలోచించియే లోకసాధారణగుణహీనులమై అనఁగా నిర్గుణులమై భిక్షువులగు నారదాదిమహామునులచేఁ బ్రయోజనమును గోరక వినుతింపఁ బడుచు నుండుమమ్ము వరించితివి. దూరాలోచనముగలదానవే. ఇందు "గుణైర్హీనాః" అనుచోట కల్యాణగుణములచేఁ గూడిన యని యర్థమును వీరరాఘవీయమున వ్రాయఁబడినది. 'హీనాః' అనుచోట 'ఓహాఙ్గతౌ' అనుధాతువునుండి హీనశబ్దము నిష్పన్నమగునని వ్రాసిరి. విశిష్టాద్వైతమతమున భగవంతుఁడు నిర్గుణుఁడనఁగా అమంగళగుణరహితుఁడనియుసకలకళ్యాణగుణ యుతుండై సదా యుండుననియు సిద్ధాంతముగలదు. ఆధాతువు నుండి యాశబ్దము నిష్పన్నమగునుగాని యీయర్థము ద్రావిడ ప్రాణాయామమువలె నున్నది. ఈచర్చ చేయునంతటివాఁడను గాను. దీనిసారమును నాకుం దోఁచినట్లు వ్రాసెదను. దేవీ! నీవు మూలప్రకృతివని యెఱుంగక శిశుపాలాదులు గోరిరి. పుట్టుకచేతనే నీది మానవదేహముగాని యాత్మ చేతఁగాదు కదా. కావున నవతరించియున్న నన్నెఱింగితివి. నిర్గుణులమగు మమ్ము సగుణులనుగా నొనరించి లోకోపకారకార్యములను జేయింపఁబూనితివి. నీవు చెంతలేకున్న మేమేపనియుఁ జేయఁ జాలము. నీయావేశమున సగుణుల మగుదుము. కావున నే మమ్ము నారదాదిమహామునులు శ్లాఘింతురు. వారైనను బ్రతి ఫలమును గోరకయే శ్లాఘింతురు. కర్మఫలమును గోరువారు జ్ఞానులుగారు.

"సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్."
(గీత. 3 అధ్యా. ౨౫ శ్లో.)

అను గీతావాక్యము ననుసరించి నారదాదిమహర్షులు నన్ను స్తుతింతురుగాని ప్రతిఫలమును గోరరు. అట్టివారు నన్నుఁ బొగడుటం గాంచి యనఁగాఁ దత్త్వజ్ఞురాలవై నన్నే కోరితివి. అనునదియే దీనిసారము.

శ్లో. "అథాత్మనోఽనురూపం వై భజస్వపురుషర్షభం,
యేన త్వమాశిషస్సత్యా ఇహాముత్రాచ లప్స్యసే." ౧౭

ప్రాతీతికార్థము. రుక్మిణీ! ఇప్పుడైనను నీకు నర్హుఁడగు నుత్తమపురుషుని సేవింపుము. దానిచే నిహపరములయందు సర్వకామములం బొందుదువు. విశేషార్థము. వీరరాఘవీయ వ్యాఖ్యానమునందు, 'పురుషర్షభమ్' అనుచో 'క్షత్రియర్షభమ్' అనుపాఠమును గ్రహించిరి. రుక్మిణీ! ఇత్తఱి నీకు సర్వప్రకారములచేతను దగిన అనఁగా సృష్టిస్థితిసంహారములయందు నీకే సర్వాధికార మొసంగి నీకు లోఁబడియున్న నన్ను నిభావము. పురుషోత్తముని నన్ను సేవింపుము. నేను మూలప్రకృతి నన్ను మాట స్మృతికిందెచ్చుకొని భజింపుమని భావము. వనాతోఁ గూడిన నిహలోకమునందుఁ బ్రళయానంతరము నాయందు లీనమైనపుడును సత్యవాంఛలను బొందఁగలవో అట్టి నన్ను సేవింపుమా యని సారము.

శ్లో. "చైద్య సాల్వ జరాసంధ దంతవక్త్రాదయోనృపాః,
మమ ద్విషంతి వామోరు రుక్మీ చాపి తవాగ్రజః. ౧౮

తేషాం వీర్యమదాంధానాం దృప్తానాం స్మయనుత్తయే,
ఆనీతాసి మయా త్వంచ తేజోపహారతా సతామ్." ౧౯

భైష్మీ ! చైద్య సాల్వ జరాసంధ దంతవక్త్ర ప్రభృతులు నాతో ద్వేషింతురు. మీయన్న రుక్మియు నన్ను ద్వేషించు చుండును. వారెల్ల వీర్యమదాంధులు. మాకంటె నధికుఁడే లోకమున లేఁడన్న భావము కలవారు. అట్టివారి యహంకార మును దొలఁగింపఁగోరి నిన్నుఁ దెచ్చితిని. అసత్పురుషులపరా క్రమమును హరించుటయేకదా నాపని. ఇది ప్రాతీతికార్థము. భూభారప్రాయులుగాఁ బుట్టి ధర్మము నడంచుచు నిచ్ఛాను సారము ప్రవర్తించువారు శిశుపాలాదులు. వా రజ్ఞానమద మునఁ గన్ను లెఱుంగనివారు. విశేషించి మిట్టిపడుచు నాతో ద్వేషించువారు. సర్వదా అవిధిగా నన్నే స్మరించువారు. స్మయ మనఁగా నజ్ఞానమని యిట గ్రహించు టొప్పు. అట్టివారి యజ్ఞాన మును హరింపవలయు ననియేకదా నే నవతరించితిని. తుదకు వారి తేజస్సు లోఁగొనుటయే నాకృత్యము. అనఁగా వారిని నాలోఁ జేర్చుకొనుటయే. తేజస్సును హరించుట యనఁగా వారియందు నాకళను నేను మరల గ్రహించుటయే. అదియే వారలకు ముక్తి. అందులకై నిన్నుఁ దెచ్చితిని. నీవు నాచెంత లేకయున్న నట్టికార్యములు చేయ వలనుపడదు. కాఁబట్టియే నిన్నుం గైకొనివచ్చితి నని రహస్యార్థము.

శ్లో. "ఉదాసీనా వయం నూనం నస్త్ర్యపత్యార్థకాముకాః,
ఆత్మలబ్ధ్యాఽఽస్మహే పూర్ణా గేహయోర్జ్యోతిరక్రియాః."

సామాన్యార్థము. మేము సాక్షీమాత్రులము. నిశ్చ యము. కాంతాసంతానద్రవ్యములయం దాశగలవారము

కాము. జ్యోతిస్సువలెఁ గ్రియాశూన్యులము. ఆత్మలాభము నందుఁ బూర్ణులము. విశేషార్థము. వామనేత్రా! దేహగేహములయం దుదాసీనులము. ఆసక్తికలదు లేదు అన్నట్లు వర్తించువారము. దీపమువలె నేకార్యము చేయువారము కాము. సాక్షిమాత్రులముగా నుందుము. దీపము తా నేకార్యము చేయునా యన్నఁ జేయదు. చేయదా యన్న నంధకారాదిధ్వంసనరూపకార్యము చేయుచున్నది. ఏవాంఛయు లేనివారము. ఆత్మానుభవలాభముచేతనే పరిపూర్ణులము. ఈవిధ ప్రవర్తనముచే నున్నారము. అనఁగా నీవు సకలకార్యములు మత్సాన్నిధ్యమునఁ జేయుచుండఁగాఁ జూచుచుందుము. స్త్రీ సంతతి ద్రవ్యవాంఛలు మాకు లేవు. కొఱంత యేవిషయమునందును లేదు. జ్యోతిస్స్వరూపులము అని సారము.

ఆర్యమహాశయులారా! ఇదియే భగవంతునిసల్లాపములుం ఇందొక్కమాటయైనను గాముకసంభాషణలేశము కలదా. నీవు ప్రకృతివని తెలుపుచున్న శ్రీకృష్ణుని గాముకుఁడనుట యసంగత ప్రసంగముకాదా. తాను భగవంతుఁడ నని రుక్మిణీదేవికిఁ దెలుపుట యేల యని యడుగవచ్చును. మానవదేహసంప్రాప్తిచేఁ దనపూర్వవార్తల మఱచెనేమో యని తెలియఁజేసెను. ఒక్కొక్కమాటయు నిశ్లేషయున్నది. నేను నిర్గుణుఁడను. నీవు ప్రకృతివి. అనియే తెలుపుచున్నవాఁడు. అట్టి శ్రీకృష్ణపరబ్రహ్మమును జారుఁడని చోరుఁడని దూషించుటకన్నఁ బాపము వేఱుగ నున్నదా. జారచోరశబ్దములు స్తుత్యర్థపరములన్నచోఁ బరమానందము. స్త్రీలహృదయారవిందమున విహరించువాఁడు జారుఁడన్నమాట కర్థము. భక్తులహృదయముల దొంగిలువాఁడు

చోరుఁ డన్నమాట కర్థము. ఈయర్థమును మది నుంచుకొనుట యైనను మంచిది. ఇఁక నీవాక్యములకు రుక్మిణీదేవియిచ్చి నుత్తరము నాలకింపుఁడు.

*అని యీరీతి నాపరాత్పరుఁడు తానే ప్రియున కత్యంత వల్లభనని తలంచుచున్న రుక్మిణి గర్వము నడంపఁగా నూహించి యూరకుండెను. త్రిభువననాయకుఁ డగునాత్మేశ్వరుఁడు నగు శ్రీకృష్ణుఁడు పలికిన యాయప్రియవచనముల నారుక్మిణీదేవి మున్నెన్నఁడు విన్నదిగాదు. కావున నావాక్యములు శ్రుతివివర ములఁ జొరఁగా మనస్సున దురంతచింత పొడమెను. దాన దేహమంతయుఁ గంపించెను. దాన నామెకు విశేషదుఃఖ ముద యింపఁ గన్నుదోయినుండి ధారగా నశ్రుకణములు చెక్కుల నుండి ప్రవహింపసాగెను. ఆధారలు కుంకుమపంకసమ్మిళిత హృదయభాగములఁ దడిపెను. అప్పు డారుక్మిణి కోమలములగు పాదనఖాగ్రముల భూమి గీటుచు వగపెల్లిదంబున మాటలు వెడలమిఁ దలవాంచి మనశ్శాంతి దూరముకాఁగాఁ గరార విందమున నున్న చామరము తటాలునఁ గ్రిందఁబడఁగా జడముడి వీడఁగా స్మృతి తప్పఁగా మహావాతసమాఘాతమునఁ దటాలునఁ గ్రిందఁదొరలు నరఁటికంబమువలెఁ బడియెను.

ఆతరుణమున శ్రీకృష్ణమూర్తి హాస్యవాక్ప్రౌఢిమ యెఱుంగని ప్రియురాలి ప్రేమోత్కంఠతం గన్నులారఁ గాంచి కరుణాసాగరుఁడు కావునఁ ద్వరపడి శయ్యాతలమునుండి దిగి యానవశిరీషకుసుమకోమలాంగిని కరారవిందములం బట్టుకొని

*ఏతావదుక్త్వా భగవానాత్మానం వల్లభామివ, మన్యమానా మవి శ్లేషా త్తద్దర్పఘ్న ఉపారమత్ అని మూలము..

లేవనెత్తి కేశపాశము సవరించి, ముఖమును దడవి యశ్రుకణములఁ జెలువంబుతప్పినసయనములను వక్షోభాగములను జెలాంచలమునఁ దుడిచి చక్కఁజేసి చెంతకు దీసికొని తనదేహస్పర్శమున నామె యమ్మలికంబుఁ బాపి హాస్యవాక్పరిపాటి నెఱుంగక తన్నాక్షేపించెనని భ్రమపడు నాతో య్యలి యమ్మలికంబుపోవ నామె దుఃఖములకుఁ దగని కోమలాంగి యని యెఱుంగుఁ గావున సాంత్వనోక్తులపద్ధతి విశేషించి తా నెఱింగినవాఁడు కావున నూఱడించెను. భగవంతుఁడు దీనవత్సలుఁడు సత్పురుషులకు గతి యన నాతఁడే. కావుననే యామె మనోభావము నెఱుంగఁజాలెను. ఊఱడించి యామె కలఁతను బాప నెంచెను. మధురోక్తుల నిట్లుపలికెను. విదర్భరాజతనయా! నాపై నసూయఁ బూనకుము. నీవు మదేకపరాయణావని యెఱుంగుదును. అంగనామణీ! నీవచనముల ప్రౌఢిమను బరికింపఁగోరి నర్మగర్భముగాఁ బలికితిని. అంతియకాని నిన్నాక్షేపింప నెంచినవాఁడనుగాను. అంగనామణులు ప్రణయకలహముస భ్రూభంగములతోడఁ నూర్ధ్వాధరోష్ఠము లదరుచుండఁ గుటిలములై క్రీఁగంటిచూపు లొప్పఁ బలుకుదురు. అట్టివచనంబుల నీవలన వినంగోరియే యిట్లు విలాసవచనము లాడితిని. ప్రియురాండ్రతోడఁ బరిహాసములాడుట గృహస్థులకుఁ బరమలాభము. ఆమార్గమునే యనుసరించితిని. నీ వీభావము నెఱుంగక నిజముగా నిన్నాక్షేపించితినని పొరపడితివి. అంతియకాని వేఱుగాదు. మనయిరువురభావము లొక్కటియేయైనను నీ విట్లు భ్రమచెందినకతన నింత యావేగము నీకుం గల్గినది. చింత యుడుగుమా యని యామెవగపెల్లిదంబు నడఁగించెను.

ఈరీతి నాపరమేశ్వరుఁడు తన్నాడింపఁగనే యాయ న్నులమిన్న ప్రాణేశ్వరునిభావము సద్భావమని యెఱింగి తన్ను వదలునన్న భయము వాసి నిర్మలాంతఃకరణయై లజ్జచేఁగూడి సుస్మితయోగమున మనోహరములై సౌహార్ద్రమునఁ జెలువు మిగిలిన కటాక్షవీక్షణముల నాపరమేశ్వరుం దిలకించుచుఁ దన్ముఖ పంకరుహమును సంతృప్తియగునట్లు నిర్భరానందపారవశ్యమునఁ గాంచుచుఁ దాను జారుతరసర్వాంగశోభితగావునను భగవంతు నెడఁబాయని యాదిలక్ష్మి గావునను మందమందమధురాలాపముల నిట్లు సంభాషించెను.

శ్లో. "నన్వేతదేవ మరవిందవిలోచనాహం
యద్వై భవాన్భవతస్సదృశీవిభూమ్నః,
క్వ స్వే మహిమ్న్యభిరతో భగవాం స్త్ర్యధీశః
క్వాహం గుణప్రకృతిరజ్ఞగృహీతపాదా." 38

ప్రతీతికార్థము. కమలాక్షా! ఏవిషయమున సరిగాని మమ్మువరించితివికదా యని మీరు వచించినమాట యథార్థము. నీసౌభాగ్యమునకు నేనెట్లు సరియగుదును ? బ్రహ్మావిష్ణుమహేశ్వరుల కధిపతివి. స్వకీయమహిమంబుననే వెలయువాఁడవు. అట్టి నీవెక్కడ ? అజ్ఞులుగొలువ గుణప్రకృతియైయుండు నేనెక్కడ? వీరరాఘవీయవ్యాఖ్యయందు 'త్ర్యధీశః' అనఁగా త్రిలోకనాయకుఁడా యని. 'గుణప్రకృతిః' అనఁగా నీగుణముల ననుసరించుస్వభావము గలదాననవియు నర్థము వ్రాసిరి. విశిష్టాద్వైతమతమునఁ ద్రిపురుషులలోని విష్ణువే భగవంతుఁడను సిద్ధాంతము కలదు. కావునఁ దదనుగుణముగా వారు వ్రాసిరని తోఁచెడిని. రహస్యార్థము. కమలాయతనేత్రా! చక్కనివాక్యము

పలికితివి. ఏవిషయమునను నీగుణములకు సరివత్తును. నీకు నాకును సమాన మెట్లుగలుగు? నీవు నిర్గుణుఁడవు. నేను సగుణను. ? ఏకాలమునను నీతో సమానురాలనగుదునా. నీమహిమము నందే యభిరతుఁడవు. అనఁగా స్వాత్మానుసంధానపరాయణుఁడవు. బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ప్రకృతివశంగతులు. అనఁగా నాకు లోఁబడినవారు. ఆముప్పురను గల్పించి యీయీకార్యములు చేయుఁడని యాజ్ఞాపించినవాఁడవు. అనఁగా సర్వమునకు మూలాధారుఁడవు. ఇటులయ్యు నెద్దాని స్పృశింపకుండుదువు. ఇఁక నామాటవినుము. త్రిగుణములనుగూడి సృష్టిస్థితిలయముల నొనరించుదానను. నీవు గుణాతీతుఁడవు. అజ్ఞులు నన్ను సమాశ్రయింతురు. వారి యజ్ఞానముపోఁగొట్టగా నిన్నే యాశ్రయింతురు. కావున నీకు నాకు నేవిషయము సమానము గలదని చెప్పవచ్చును? అనఁగా నీపాదసేవకురాలను. కావున నీతో సమానురాలనుగానని దీనిసారము.

శ్లో. "సత్యం భయాదివ గుణేభ్య ఉరుక్రమాంత
శ్శేతే సముద్ర ఉపలంభనమాత్ర ఆత్మా,
నిత్యంకదింద్రియగణైః కృతవిగ్రహ స్త్వం
త్వత్సేవకై ర్నృపపదం విధుతం తమోంధమ్." 3

"సముద్ర ముపలంభనమాత్ర ఆత్మా" అని వీరరాఘవీయ వ్యాఖ్యాపాఠము. బాహ్యార్థము. రాజసమానగుణములకు భయంపడినట్లుగ నగాధమహాసాగరంబున నిశ్చలుండవై చైతన్య ఘనుండవై యాత్మస్వరూపుఁడవై యలరుదువు. నీ వనుమాట సత్యమే. నీచములగునింద్రియముల నిరోధముగలిగిన నీసేవకులే పరిత్యజంచిన తమోగుణాతిరేకమున నంధమగు రాజ్య

పదమును నీవు వదలుటయు సత్యమే. అనఁగా నీభక్తులే రాజ్య పదమును గోరరనఁగా నీ కాతుచ్ఛపద మేటికని భావము. అంతర్గర్భితార్థము. శ్రీకృష్ణా! రాజులకు భయంపడి సముద్రమును శరణమని గ్రహించితిమని నీవు పల్కితివి. దానికి సమాధానము వినుము. నీప్రయత్న మనన్యగోచరము. మహాత్ములకేని దుర్జ్ఞేయము. శబ్దాదులనుండి భయంపడినట్లు హృదయసాగరమున హాయిగా నుండువాఁడవు. నిశ్చలప్రకాశుఁడవై యుండువాఁడవని భావము. ఉపలంభనమాత్రమై చైతన్యముచే ఘనమగు నాత్మగలవాఁడవు. బహిర్ముఖములగు నింద్రియములుగలవారలచే నీవు కల్పింపఁబడిన విగ్రహముగలవాఁడవు. భక్తులు నీకొకరూపమును గల్పించుకొని ధ్యానింతురు. అంతియకాని నీ కొక్కరూపములేదని రుక్మిణిభావము మహాత్మా! నీసేవకులనఁగా నీపాదారవిందభజనాదరులగు భక్తులే తమోగుణముచేఁ గన్నుమిన్నెఱుంగకుండఁజేయుసింహాసనమును వదలుకొందురు. ఇఁక నీకేల? అనఁగా నీభక్తులు రాజ్యపదమునుగోరక నీపాదసేవనే కోరుదురు. కావున నది తుచ్ఛతమమైనది. అద్ది నీవేల కోరుదువు? కావున నీవన్నమాటలన్నియు సత్యములే. అందణుమాత్రముగూడ నసత్యములేదని రుక్మిణీతాత్పర్యసారము.

శ్లో. "త్వత్పాదపద్మమకరందజుషాం మునీనాం
వర్త్మాస్ఫుటం నృపశుభిర్నను దుర్విభావ్యమ్,
యస్మాద లౌకికమపీహితమీశ్వరస్య
భూమ్న స్తవేహితమథో అను యే భవంతమ్." 3౬.

బాహ్యార్థము. పరమేశ్వరా నీపాదారవిందమరందము సదా గ్రోలు మహాత్ములకుంగూడ నీగతి గోచరింపదు. ఇఁక నర

పశువులకుఁ దెలియశక్యమా. నిన్ను సేవించువారి యీహితంబే లోకంబునకు గోచరంబుగాకుండిన నిఁక భవదీహితము. లోకగమ్యంబగునని యెట్లు లూహింపవచ్చును ? అంతర్గతార్థమేమనఁగా,

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః"

అనుశ్రుతి వాక్యముచొప్పున సర్వత్ర వ్యాపించియుండు నీగతి నీభక్తవర్యులగు మహర్షులకే తెలియ శక్యముకాదు. ఇఁకఁ బశుప్రాయులగు ననఁగాఁ గుటుంభరులగు నరులకుఁ దెలియ శక్యమా. నీభక్తులభావమే లోకులకుఁ దెలియదనఁగా నీ యీహితంబు లోకగమ్యంబని యెంచువాఁ డెంతవెఱ్ఱివాఁడో? ఆచారస్వరూప మెఱుంగక యశాస్త్రపారతంత్ర్య పథము నాశ్రయించినవారిం జేపట్టినవనితలు శ్రమములకు లోనగుదురని నీవు పల్కినది సత్యమే యని రుక్మిణి సమాధానము చెప్పెనని తాత్పర్యము.

శ్లో. "నిష్కించనో నను భవాన్నయతోఽస్తి కించి
ద్యస్మై బలిం బలిభుజోఽపి హరంత్యజాద్యాః,
న త్వా విదంత్యసుతృపోంతకమాఢ్యతాంధాః
ప్రేష్ఠో భవాన్ బలిభుజామపి తేపి తుభ్యమ్." 32

సామాన్యార్థము. మేము ధనహీనులమని మున్ను హరి చెప్పినదానినే సత్యమని రుక్మిణి నుతించుచున్నది. మహాత్మా! నీకంటె నొండేదియు లేదుగాన నీ వకించనుఁడవే. లోకులచేఁ బూజలంబడయు బ్రహ్మాదులు నీ వకించనుఁడవేయైనను నిన్నే బలిప్రదానమున సేవింతురు. శక్తిసంపన్నులమని క్రొవ్విన యిం

ద్రియప్రియు లంతకాకారుఁడవగు నిన్నెఱుంగఁజాలరు. విశేషార్థమేమనఁగా,

శ్రుతి. "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే."

అను శ్రుతివాక్యము ననుసరించి నీవు కాని దీలోకమున నేదియులేదు. కావున నీ వకించనుఁడవే. అకించనులము కామనుకొను బ్రహ్మాదులందఱుచేఁ బూజలంగొనియు నిన్ను సేవింతురు. తమకు నర్పించినపూజలన్నియు నీ కర్పింతురు.

"ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం,
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి."

యన్న సూక్తి ననుసరించి వారి కాత్మరూపుఁడవగు నిన్నే యవియన్నియుం జేరునని సారము. ఇంద్రియపరవశులగువారు బ్రహ్మాదులు. వారు పురుషోత్తముఁడవగు నిన్ను సేవించియే కృతకృత్యులగుదురు. అట్టి నీ వకించనుఁడవు కాక ధనవంతుఁడ వగుదువా అని దీనిసారము.

శ్లో. "త్వం వై సమస్తపురుషార్థమయః ఫలాత్మా
యద్వాంఛయాసుమతయో విసృజంతి కృత్స్నమ్,
తేషాం విభో సముచితో భవతస్సమాజః
పుంసస్స్త్రియాశ్చరతయోస్సుఖదుఃఖినోర్న." 3౦

సామాన్యార్థము. ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములు నీరూపములేయగు. పరమాత్మస్వరూపుఁడవు ఇట్టి నిన్నుఁగోరి మతిమంతులు సర్వమును త్యజింతురు. అట్టి సత్పురుషులతో సేవ్యసేవకబంధము నీకుందగును. అంతియకాని

గ్రామ్యధర్మసంబంధముగలిగి సుఖదుఃఖములచేఁ గలఁతనొందు వారితోడఁ గూడిక నీకుఁ బొసఁగదు. విశేషార్థము. జన్మైశ్వర్యాకృతులచే సమానప్రతిపత్తిగలవారలకే వివాహసంబంధము తగునని భగవంతుఁడు చెప్పినమాటను సత్యమని దృఢపఱుపంబూని రుక్మిణి యిట్లు చెప్పుచున్నది. పరమేశ్వరా! నీవాక్యము సమంజసమే యనవలయు.

శ్రుతి. "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి.
ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్."

అను శ్రుతులప్రకారము నీవు ఫలాత్మకుఁడవు. అనఁగా నానందస్వరూపుఁడవు. పురుషార్థమయుఁడవు. అనఁగాఁ బురుషార్థములన్నియు నీవికారములే యని యామెహృదయము. నీసేవనుగోరియే బుద్ధిమంతులు సమస్తమును వదలుదురు. కుటుంబాదికమునందు విరాగమునొందుదురు. విభూ! అట్టివారితోటి నీకు సేవ్యసేవకరూపమగు ననుబంధము యోగ్యము కాని సంసారకూపనిమగ్నులతోటి సంబంధము తగదు. నేను నీసేవకపంక్తిలో నొకతుకను. కాఁబట్టియే నీతోడిసంబంధము నాకుఁ దగినది. ఇది యిపుడు వచ్చినదికాదు. అనాదిసంబంధము. దీనిని మఱల విమర్శింపనేటికి? అని రుక్మిణిభావమని సారము.

శ్లో. "త్వం న్యస్తదండమునిభిర్గదితానుభావ
ఆత్మాత్మదశ్చ జగతా మితి మే వృతోఽసి
హిత్వా భవద్భ్రువఉదీరితకాలవేగ
ధ్వస్తాశిషోఽబ్జభవనాకపతీన్ కుతోఽన్యే." 38

ప్రతీతికార్థము. భిక్షుకులు నీమహనీయత్వమును వేనోళ్లఁ గొనియాడుదురు. జగంబుల కాత్మవు. ఆత్మప్రదుఁడవు.

షు ణాణములనుబట్టియే నిన్నుం గోరి వరించితిని. నీవు కను బొమలు గదలించినంతనే కాలవేగముచే సకలభోగములను బాసి మృతినొందు బ్రహ్మాదు లెంతవారు? అట్టివారి నే నెట్లు వరింపఁదలంతును? వారికంటె నల్పులగు దేవతలు రాజులు లోన గువారిమాట యిటఁ జెప్పనేటికి? అంతర్గర్భితార్థ మేమనఁగా: మేము గుణహీనులము. భిక్షుకులచే శ్లాఘింపఁబడువారమని శ్రీహరి పలికెను గాన దానిని సత్యమే యనుచున్నది. పరమేశ్వరా! సకలలోకముల కాత్మస్వరూపుఁడవు. ఆత్మ నొసంగు వాఁడవు. అనఁగా సకలబ్రహ్మాండములయందు వెలసియుండు వాఁడవు. సకలభూతముల కాత్మనిచ్చువాఁడవని సారము. కావుననే సంసారమును ద్యజించి నీమహిమము నెఱింగినసన్న్యాసులు నీమహిమము నించుకయో మఱికొంతయో యెఱింగినంతదనుక వినుతింతురు. అట్టి మహిమాఢ్యుఁడవని యెఱింగియే నిన్నుఁ బెండ్లియాడితిని. నీమహిమము నేనెఱింగినంత యితరు లెఱుంగఁజాలరని భావము. నిన్ను వరించితిననఁగా నీచెంత వృద్ధినొందితిని. నిన్నుఁ గార్యకరణజాగరూకునిగా నొనరింపఁ దలంచితినని హృదయము. బ్రహ్మాదులున్నవారు కారా వారి నేల వరింపలేదని ప్రశ్నింతువా? నీభ్రూభంగమాత్రమున ననఁగా నొకత్రుటికాలముననే వారియాయుస్సునశించును. అట్టి యల్పతముల నే నెట్లు వరింతును? వారి నాశ్రయించువారి మాట యిటనేటికి? బ్రహ్మాదివందితపాదారవిందుఁడవని నేనే యెఱుంగుదును? నీకొక త్రుటికాలమగునంతలో బ్రహ్మాదు లెందఱో నశింతురు. ఆవిధ మెఱింగిన నే నితరుల నెట్లు వరింతును? ఇతరులవరించు టెట్లు? మనకున్న సంబంధ మనాదికదా.

వల యిట్లు నన్నుఁ బరీక్షించెదవు? అని రుక్మిణిభావమని గ్రహింపఁదగినది.

శ్లో. "జాడ్యం వచస్తవగదాగ్రజయశ్చభూపాః
విద్రావ్య శార్ఙ్గనినదేన జహార్థమాంత్వమ్,
సింహో యథా స్వబలమీశ పశూన్ స్వభాగం
తేభ్యోఽభయాద్యదుదధిం శరణం ప్రపన్నః." ౪౦

పై యర్థమునే విశేషించి యుపపాదించుటంబట్టి యింక వానినెల్ల వ్రాయక సారమును వ్రాసెదను.

పరమేశా! నీకోదండజ్యాఘోషమాత్రమున జరాసంధాదిమహావీరు లోడిపోయిరి. పశువులందోలి మృగేంద్రమాత్మ బలిని గైకొనుతెఱంగున నన్నుఁ గోరివచ్చిన నీచులఁ బాఱందోలి నీభాగమగు నన్నుఁ గైకొన్న నీ వానీచభూపాలకులకు భయంపడి సాగరమున డాఁగితివనుట సమంజసము కానిమాట. ఎవరే నట్టిమాట పలికినవారికన్న నజ్ఞాను లుండరు. నీసేవను మాత్రము గోరియే ఏకచ్ఛత్రాధిపత్యమగు సామ్రాజ్యము తుచ్ఛమని తలంచి విసర్జించి నీపాదసేవచేయు నంగరాజు పృథుచక్రవర్తి భరతుఁడు యయాతి గయుఁడు మొదలగుభూపాలకులు మేలుపొందక కీడుపొందిరా? సాధువులు వర్ణింపఁగా సకలభక్తజనులకు ముక్తినొసంగుచు శాశ్వతలక్ష్మీనివాసంబునై సకలసద్గుణాలయంబునగు భవచ్చరణసరసిజమరందము గ్రోలి యర్థజ్ఞానముగల యేవనిత నిన్నుం గోరక మరణభయము తప్పక యనేకవిధవ్యాధివ్యాకులములనడుమ జిక్కియుండు వానినెవ్వానిం గోరును? కాఁబట్టి నిహపరములయందు నఖిలవాంఛల నొడఁగూర్చుజగదీశ్వరుండవగు నిన్ను నాకెల్లభంగులం

దగినవాఁడవనియే కోరి వరించితిని ఈసంసారమున దిక్కు తెలి యక తిరుగుచుండు నాకు భక్తసుఖప్రదంబగు నీచరణారవింద ద్వంద్వము శరణంబయ్యెడును. మహాత్మా ! లోకమున నేవనిత హారసరసిజభవాద్యమరసత్తమసభాగీతంబగుభవచ్చరితంబును వినదో దానికి నీవు చెప్పిన శిశుపాలాదిరాజులు పతులగుదురు గాక. వారు కాంతాకనకగేహములయందును గజతురగఖరా దులయందును బ్రీతిగలిగి వానికి భృత్యప్రాయులై యుండు వారు కావున నట్టివారే యట్టికామినులకు భర్తలగుదురు గాక. మఱియుఁ జర్మము కేశములు నఖరోమాదులు వెలుపలఁ గప్పఁగా లోపల మాంసము, ఎముకలు, రక్తము లోనగునవి నిండియుండఁగాఁ బిత్తవాతాదినిబిడంబగు పురుషదేహమును నీపాదారవిందమరందము చవిగొననిదుర్భాగురాలు భర్తయని గోరి వరించును. కమలాక్షా ! నాపైఁ గరుణాదృష్టిం బొలయఁ జేయుచు నాత్మరతుఁడవగు నీపాదపద్మములమీఁద సర్వదా యనురాగము నాకుం గలిగియుండుంగాక.

ఈలోకంబున కభివృద్ధి నొడఁగూర్ప నీవు రజోగుణ మును బరిగ్రహించినపుడు నన్నుఁ గనుఁగొనుటయే నాపై దయగలిగియుండుట యని భావించెద. కొందఱకు మఱికొందఱి యెడ ననురాగంబు కలుగుటయు నీవాక్యముప్రకారము సత్యమే. భీష్ముఁడు హరించిన కాశీరాజదుహితలలో నంబ యను కన్య మఱొక్కని వరింపలేదా. ఒకరిని వరించి పెండ్లియాడియు స్వైరిణియగువనిత క్రొత్తక్రొత్తపురుషులం గోరుచుండును. సజ్జనుఁ డట్టినాతిని భరించుట న్యాయముకాదు. భరించినచో నుభయలోకంబులకుం గాక చెడును. అని యిట్లు భగవన్మహి

మను నెఱింగినప్రౌఢ గావునఁ దదనుకూలముగ సంభాషించిన విని పరాత్పరుం డారుక్మిణీవాక్యములకుఁ బరమానందమంది యిట్లు పలికెను.

*భీష్మరాజప్రియకుమారీ! సాధ్వీమణీ! ఈరహస్యార్థము లెల్ల నీవలన వినంగోరియే పరిహాసవచనంబులు పలికితిని. నా వాక్యములకు నీ వొనర్చినవ్యాఖ్యానము వాస్తవము. నాపై నిరంతరభక్తిగల నీవు కోరువాంఛలన్నియు నీకు ముక్తిని బర్యవసన్నంబు లగునని నమ్ముము. నావచించిన ద్వంద్వార్థ ప్రతిపాదకవాక్యములకు నీమతి యించుకేనియు మార్పునొంద కున్నది. కావున నీకుంగల భర్తృవాత్సల్యము, పాతివ్రత్యము స్పష్టము లయ్యెను. సంపదను, మోక్షము నొసంగు నన్నుఁ దపస్సుచేతను, వ్రతములచేతను జక్క నారాధించి మాయా విమోహితాంతరంగులై నరకమందుఁగూడఁ బొందందగు కామ సంపదలను గోరువారు నిక్కముగా మందభాగ్యులే యగుదురు. గృహేశ్వరీ! నన్ను ననువర్తించితివి. అది భవబంధవిమోచ నార్హము. ఇట్టివర్తనము నీచులకు శక్యముకాదు. నీవంటి ప్రేమాస్పదురాలగు కళత్రము నేఁగనను. దీనికిఁ దార్కాణ మేమన వివాహకాలమునఁ బెక్కండ్రు రాజులు గూడియుండఁగా వారిం దిరస్కరించి యెవ్వరికేఁ దెలియకయుండ నాకు బ్రాహ్మ ణోత్తమునిమూలమున సందేశ మంపితివికదా. నీయన్నకు నామూలమున వైరూప్యము కలిగెను. దానిని నావియోగభయ మున నోర్చుకొంటివి. అంతియకాక యింతదనుక నావిషయ

*సాధ్వ్యేతచ్ఛ్రోతుకామేన రాజపుత్రి ప్రలంభితా, మయోదితం యదన్వాత్థ తత్సర్వం సత్యమేవహి. అని మూలము.

మున నొక్కమాటయైనం బలికినదానవు కావు. దానిచే నీకు మేమోడితిమని నమ్ముము. వివాహకాలమున నీసందేశము ప్రకారముగా నేను రాక యాలసించినచో నే నీదేహమును దప్పక విడుతునని బ్రాహ్మణునిమూలమున వార్త నంపితివికదా. దానికే మే మానందసాగరమున నోలలాడువారము. అని యిట్లు భగవంతుఁడు శ్రీశ్యామసుందరమూర్తి పరిహాసముల నిజసాధ్వీమణియుల్లంబు నుల్లసిల్లంజేయుచు లోకాచారముల నెఱపుచుండెను. అంతియకాక లోకములకు గురువగు నాశ్రీకృష్ణమూర్తి తక్కుంగలభార్యల గేహంబులయందు నుచితప్రకారంబున గృహస్థధర్మముల నడపుచు నాపురంధ్రీమణులచిత్తంబుల ననురాగమయంబులుగా నొనర్చుచు విహరించుచుండెను.

భక్తవర్యులారా! రుక్మిణీ శ్రీకృష్ణసరసాలాపములన నెట్టివని లోకులు వాడుదురో యట్టి విందుఁ గనఁబడమి మీకే తెల్లంబకదా. ఇవియే భగవతీభగవత్సరసాలాపములు. ఆలాపములుమాత్రము కావు. సల్లాపములు. ఈసల్లాపములయందుఁగల గంభీరార్థము తేటపడినచో నీదంపతులవిచిత్రచరిత్రము మనస్సునకు గోచరించును. దాన నద్భుతానందము పొడము. దాన దేహస్మృతితొలఁగు. దాన భక్తిరసానందపారవశ్యముమైకొను. దాన సంసారబాధ లడంగు. దాన మనశ్శాంతి చేకూరు. దాన భగవద్దాస్యమున శ్రద్ధ యంకురించు. దానఁ బరమేశ్వరు కరుణ పొలయు. దానఁ బరమపురుషార్థము కరతలామలకమగును ఈసంభాషణమునందు ముఖ్యముగాఁ బరికింపఁదగిన దొకవిషయము కలదు శ్రీకృష్ణుఁడు పరబ్రహ్మమనియు, రుక్మిణి ప్రకృతియనియుఁ బ్రసిద్ధోదాహరణములతోడ స్పష్టము చేయఁ

బడినది. అదియే యిందు ముఖ్యతమము. కడపట శ్రీహరి రుక్మిణిని సాధ్వియని సంబోధించి యీమాటలు నీవలనఁ బలికించి వినఁగోరి యిట్లు పరిహాసించితి ననియె. కొందఱు చెప్పట్టిన వ్యాఖ్యాతలు శబ్దములపై నర్థములను గావలయునని కల్పించి రనియుఁ, బ్రాతీతికార్థమే ప్రధానముకాని యంతరార్థము "నాసికాత్కర్ణాకర్షణము" వంటిదనియు, మనవారి కిట్టిదుష్పాండిత్యము మెండనియు, ద్వైతవిశిష్టాద్వైతాద్వైతమతకర్తలిట్టియర్థము చెప్పిలోకమును బాడుచేసిరనియు వదరుచుందురు. వారి కీప్రపంచజ్ఞానమే లేదని నాభావము. కొందఱు శంకర భగవత్పాదులను సంకరాచార్యులని పరిహాసింతురు. రామ రామ! కృష్ణకృష్ణా! వారిని స్మరించుటయే తప్పు. వారు భక్తులుకారు. భుక్తులు. భక్తియన్న నేమో వారెఱుంగరు. వేదములను బ్రమాణములుగాఁ జూపి త్రిమతస్థాపకులు అర్థము తదనుగుణముగాఁ జెప్పిరి. వేదములు మూఁడుమార్గములను బోధించును. అన్నియు వేదప్రతిపాదితమార్గములే. వారియర్థముల నాక్షేపించువారు మానవులా దానవులా. రెండవవారే యనవచ్చును. వేదసమ్మతము మతముగాని తద్విరహితము మతమగునా యని పై ఆచార్యులందఱ అభిప్రాయపడిరి. వారి నామస్మరణమునఁ బవిత్రులు కావలయునుగాని, దూషించి నరకమునకుఁ బోఁగోరువారుందురా. ఏమన్న నేమి? సర్వదేశసాధుసమ్మతము లామతములు. ప్రకృతము ననుసరించెదను.

శ్రీధరాచార్యులు వీరరాఘవాచార్యులును పైశ్లోకములకాయర్థము చెప్పిరి. వారికిఁ దెలివితక్కువయనియే యందము. మన తెలివి యెట్లున్నదో విమర్శించుకొందము. భర్త భార్యను

బుత్త్రవతిని బిలిచి నీవు బుద్ధిలేక నన్నుం బెండ్లాడితివి? నిన్నుఁ జాలమందికోరిరి. వారిని బెండ్లాడక నన్ను నిర్భాగ్యుని బెండ్లియాడితివే. ఇప్పుడైన నింకొక్కని వరింపుమని పలుకునా? ఏల పలుకరాదన్నచో నట్టివారికి లోకజ్ఞానముకలదా. మర్యాదయైన వారికిం దెలియునా. శివశివా! వీరికన్న మూర్ఖులు లోకమున నుండరన్న నపరాధము లేదని చెప్పవచ్చును. అట్టివారు భగవద్గీతలప్రస్తావ మెత్తుచుందురే. ఏలాగో తెలయకున్నది.

శ్లో. "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ౮
మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. ౯
(గీతా. ౧౦ అధ్యా.)

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్." ౮
(గీతా. ౯ అధ్యా.)

ఈ శ్లోకములయర్థమే కదా యీకథయం దుండునది. తాను బరాత్పరుఁడని నమ్మినదో లేదో చూతమని హరి ప్రశ్నించెను. రుక్మిణి భగవత్కారుణ్యచే నంతయు నెఱింగి స్పష్టముగాఁ దెలిపెను. దాని కాహరి మహానందమందెను. ఇట్టిఘట్టముల యందు నిట్టియర్థము లుండక తప్పదు. వాని నెఱుంగక పండితమ్మన్యులగువా రాక్షేపింతురు వారియజ్ఞానమునకు మనము చింతింపవలయునే కాని వారిదూషణములకు భీతినొందరాదు.

ఆస్తికు లట్టినాస్తిక ప్రాయోక్తులకు జంకుపడరని నమ్ముచున్నాఁడను. ఇంక నీవిషయమును బెంపక తరువాతి భగవత్కథను వ్రాసి భక్తుల కానందము నందఁజేయఁ బ్రయత్నించెదను.

## సుభద్రావివాహము.

*ఆర్యులారా! శ్రీకృష్ణచరిత్రమున కికముందుఁ బాండవులసంబంధముం గలుపక తప్పదు. కృష్ణార్జునులు కలిసియే యిఁక భూభారమును హరింపఁబూనుదురు. కావున నేడవప్రకరణమున నక్రూరుని శ్రీహరి హస్తిపురమునకుఁ బంపి యచ్చటికుశలముల నెఱిఁగినంతదనుకఁ గలకథ సంగ్రహముగా వ్రాయఁబడినది. తదనుబంధముగా శ్రీకృష్ణార్జునులకు మైత్రి యెక్కుడుగఁ గల్గియుండఁదగు కారణములు వ్రాయవలయును. ద్రౌపదీవివాహాదులలో శ్రీకృష్ణసంబంధ మంతగ లేదు. కావునఁ బాండవులపుట్టుపుం దొట్టిచరిత్రమును వ్రాయుట యీగ్రంథమున ననవసరము. ఐనను సంక్షేపముగా వ్రాసితిని. తొలుదొలుత శ్రీహరి యర్జునుని మిత్రునిగా భావించి చేసినసహాయము సుభద్రాకల్యాణముననే. కావున దాని నించుక వ్రాసెదను. దానికి ముందు సంబంధము కలుపవలయునుగాన నాయనుబంధమగు కథను నాలుగుపంక్తులలో వ్రాసి యీకథను బెంచి వ్రాయక పరిమితపంక్తులలోనే వ్రాసి నాకృత్యమును నెఱవేర్తును.

పాండవులు కరినగరముననుండఁగా దుర్యోధనాదులు వారి కపాయంబ రోయుచుండిరి. ఇది యనేకమార్గముల సాగు

---

* ఈకథ శ్రీమహాభారతాదిపర్వమునందలి రెండువందలతొమ్మిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. ఈభాగమె ౨౧౩, ౨౧౪ మొదలగు నధ్యాయములనుండియుఁ గ్రహింపఁబడుననియుఁ దెలియఁదగు.

చుండెను. విదురాదులు వారిని గాఢ బద్ధకంకణులై యుండిరి. భీష్మద్రోణద్రౌణికృపాదులవ్వారియందుఁ బక్షపాతమూని సమత్వమున వర్తించినట్లు నటించుచువలయునపుడు పాండవపక్షము ధర్మపక్షముగాన సాయము ఏదో యొకరీతిని జేయుచు నితరులచేఁ జేయించుచు నుండిరి. ఆంబికేయుఁ డీవృత్తాంతములను విదురునివలనవిని పాండవులను గరిపురమున నునుచుట వారికి లగ్గుగాదని యూహించి యింద్రప్రస్థపురంబున వారి నునిచెను. ధర్మరా జా ప్రాంతములఁ బాలించుచుఁ బ్రజారంజకుఁడై యుండెను. ఆయింద్రప్రస్థము విశ్వకర్మ నిర్మించెను. శ్రీహరి యానతియే లేకున్న నతని కేమిపట్టినది ? ఆనగరము పాండవులకు వాసార్హమై యెల్లభంగులఁ దగియుండెను. అందుండి వారు సపత్నులవలని కష్టములు లేక హాయిగా నుండిరి. విదురాదులు పరోక్షమున వారికుశలములఁ బరీక్షించుచుఁ గరిపురమున దుర్యోధనాదులుచేయుదుష్ప్రియత్నముల వారి కెప్పటికప్పుడే తెలుపుచునుండిరి. ధర్మరాజు సోదరసహాయము, శ్రీకృష్ణానుమోదము, విదురాదులసహాయము తనకుఁ బెనుప్రాపుగానుండ రాజ్యమును బూజ్యభంగిఁ బాలించుచుండెను. కొలఁదిదినము లిట్లు హాయిగా నాకాలమున గతించెను. పాండవులు భూతలంబున నవతరించినది కష్టానుభవమునకే కాని సుఖానుభవమునకుఁ గాదని స్పష్టముకదా. వారు కష్టములపాలైనఁగాని భూతలము బాగుపడదు. భూభారము తగ్గదు. ధర్మము స్థిరతంగాంచదు. కావున వారు సకలకష్టములకు లోనుగావలసినదే. భగవంతుఁడు వారికింగష్టానుభవరూపమున శాశ్వతకీర్తిని గల్గించునూహా కలవాఁడుగ నుండవలసినదే. ఇన్నిసాగినఁగాని యొక్క ధర్మము

నిలువదు. అది నిల్చినఁగాని సాధుజనులు నిలువరు. వారు నిలిచినఁగాని లోకము లోక మనిపించుకొనదు. ఒక్కధర్మమును గాపాడుటకే భగవంతుఁడుకూడఁ దన నిర్గుణత్వమును మానుకొని సగుణత నంగీకరింపఁబూనును. ఔరా! ఏమి యాధర్మము సామర్థ్యము! ఏమి దానిమహిమము! ఏమి దానియౌన్నత్యము!

శ్లో. "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. ౭
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. ౮
జన్మకర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున." ౯

(గీతా. ౪ అధ్యా.)

అను నీగీతావాక్యములు పైయర్థమును బోధించుచున్నవికదా. ధర్మముననే సత్యము నిల్చును. అదియే భగవత్స్వరూపము. సకలసద్గుణములు సత్యాంశము లనక తప్పదు. అందు దేని కించుకలోపము గలుగునని తోఁచినను భగవంతుఁడద్దానిని గాపాడ నరుదెంచును ఏమి యామహాత్మునిపట్టుదల! ఏమి యాసర్వేశ్వరుని చమత్కారము! ఏమి యాసర్వాత్ముని జాగరూకత! ఔరా! వర్ణింప శక్యమా! తెలిసికొనఁదరమా! ఏమి కొంపమునిఁగినదనియో తననిర్వ్యాపారత్వ మహానందానుభవత్వముల వీటిఁబుచ్చి మానవరూపమెత్తుట! ఊరకుండ రాదా! అన్న నామహాపురుషుఁ డూరకున్న లోకములు నిలువవు. ఇఁకఁ దదంతర్గతజీవకోటులమాట యేటికి?

ధర్మరా జీరీతిగా రాజ్యమును బాలించుచుండ నారదుఁ డొకనాఁడు ధర్మరాజుకడ కరుదెంచెను. ఈముని నెవ్వరును రావయ్యా! పనియున్నదని పిలుచువారే లోకమున నేకాలమునందును లేరు. కాని పిలువని పేరింటముగా వచ్చును. వచ్చినవాఁడు భోజనముచేసి కావలసిన వస్తువుల నడిగితీసికొని పోఁగూడదా. అట్లు పోవఁడు. వారికి మహోపకారము చేసినట్లు హితముపదేశించును. దాన నేదో కొంప మునుఁగును దానిచే లోకమునకు మేలు కలుగును. ఇత్తరుణమున నారదుఁడు రాకయున్న భారతమే మనకు దొరకదేమో యని తోఁచెడిని. ఆవిషయము వినఁదగినదియే. ఒకనాఁడు ధర్మరాజు సామంతరాజులంగూడి పౌరులకార్యములు విచారించుచుం

"నారదస్త్వథ దేవర్షి రాజగామ యదృచ్ఛయా." డఁగాఁ దలఁపనితలంపుగా నారదమహర్షి యరుదెంచెను. వచ్చునని యెవ్వ రూహింపలేదు. మునిరాక యెఱింగి యందఱు లేచి రుచిరాసనము సమర్పించిరి. సకలవిధాతిథేయముల నాచరించి ధర్మరాజు చేతులుమోడ్చి యేమియానతి మహాత్మా యని ప్రార్థించెను. మునియానతిఁ గూరుచుండెను. కుశలప్రశ్నానంతరము నారదముని ధర్మజుం గాంచి మహారాజా! మిమ్ముంజూచి యానందింపవచ్చితిని. మీరు ధర్మాత్ములరు. మీ రాజ్యము ప్రాజ్యభంగి నెగడును. *అని మాటలాడుచుండ ధర్మరాజు మునిరాక ద్రౌపది కెఱింగింపుమని సేవకు నంపెను.

---

*ప్రేషయామాస కృష్ణాయై భగవంతముపస్థితం, శ్రుత్వైతద్ద్రౌపదీ చాపి శుచిర్భూత్వా సమాహితా, జగామ తత్ర యత్రాస్తే నారదః పాండవైస్సహా. అని మూలము.

ఆమె యావార్త నాలకించి పరిశుద్ధయై శ్రద్ధమిగుల నారదము నింగూడి పాండవులున్న సభాభవనమునకుఁ బోయెను. మునికి నమస్కరించి నిలువఁబడఁగా నాధర్మచారిణిం గాంచి యాశీర్వ దించి తల్లీ! ఇఁకఁబొమ్మని ముని యాజ్ఞాపించెను. తదనుజ్ఞచే నామెయు నంతఃపురమున కరిగెను. ఆమె యభ్యంతరమందిరం బున కరుగఁగా నేకాంతంబునఁ గూరుచుందమని పాండవులకు జెప్పి వారప్పగిది నొనర్ప నారదుండు వారికిట్లనియె. ధర్మరాజా! దిగంతవిశ్రాంతకీర్తిగల యీపాంచాలి మీకు నైదుగురకు

శ్లో. "పాంచాలీ భవతా మేకా ధర్మపత్నీ యశస్వినీ,
యథా వో నాత్ర భేదస్స్యాత్తథా నీతిర్విధీయతామ్."

నొక్కతయే ధర్మపత్ని. మీకీవిషయమున భేదము రాకుండ నొక న్యాయము ననుసరించిన మేలు. లేకున్నఁ గీడుమూడును లోక ముననెందఱో యన్యోన్యమైత్రి నీమూలమునవిడనాడిరి. పెక్కు కీడులు వారికి మూడినవి. కావున నట్లుగాకుండఁ గట్టుదిట్టములు చేసికొనిన మేలు. అని పలికి యూరకుండెను. ధర్మరాజాముని వాక్కులు న్యాయసమ్మతములుగా నున్నందునను, లోకాచార మునుబట్టి చూచినను సరిపోవుచున్నందునను శిరసావహించి తమ్ములతో నాలోచించి ద్రౌపది యొక్కొక్కరియింటి నొక్క సంవత్సర ముండునట్లును, ఆవత్సరములో నాయింటికి సోదరు లలో నెవరుపోయినను వారు పండ్రెండు వర్షములు బ్రహ్మ చర్యనియతి నడవుల నుండునట్లును నియమము చేసెను. సోదరు లంగీకరించిరి.

శ్లో. "సమక్షం తస్య దేవర్షే ర్నారదస్యామితౌజసః,
ద్రౌపద్యా నస్సహాసీనానన్యోన్యం యోభిదర్శయేత్." ౨౯

సనో ద్వాదశవర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్,
కృతే తు సమయే తస్మిన్ పాండవైర్ధర్మచారిభిః. 30
నారదోఽప్యగమత్ప్రీత ఇష్టదేశం మహామునిః.

(ఆదిపర్వము. ౨౧౩ అధ్యా.)

[అని మహాభారతమునఁ గలదు ఇట్లే రెండుస్థలములయం దున్నది. పండ్రెండువర్షము లనియుండఁగా నాంధ్ర భారతమున "పెఱవారు చనకుండ నెఱుఁగక చని రేని వెలయఁగఁ బండ్రెండు నెలలు తీర్థసేవచేయుచును విశేషవ్రతంబులు" అనియుండు టేలొకో తెలియఁజాలను. వర్షమనఁగా నెలయని యెందే న్నిఘంటువున నుండునేమో] ఆనియమము నాలకించి తావచ్చిన పని సాగినదన్న యానందమున నారదముని తనయిచ్చం బోయెను.

నారదముని యరిగినపిదపఁ బాండవులు తమతమయిండ్ల సుఖంబుండిరి. కాని దైవగతి విపరీతమగునెడ మానవులుచేయు ప్రయత్నములు ఫలింపవు. అవి యెట్లు మార్పునొందునో యెవ్వరు నెఱుంగరు. ఒక్కనాఁ డొక్కబ్రాహ్మణుఁడువచ్చి ధర్మ రాజునగరుచెంత నాక్రోశించెను. రాజా! నాహోమధేనువును మ్రుచ్చు లపహరించిరి. అనుచుండ నాయాక్రోశము శ్రోత్రులం బడఁగా నర్జునుండు విప్రునిరావించి యేమిచింతించెదవని యడి గెను. ఆబ్రాహ్మణుఁడు రాజకుమారా! ధర్మరాజు రాజ్యము పాలించు చున్నవాఁడు. ఇది మారాజ్యమే యని విప్రులు హా యిగా నీరాజ్యమున నున్నవారు. ఇట్టిరాజ్యమున నే నుండియు నా గోధనమును మ్రుచ్చులనోటిలోఁ బెట్టి చింతించుచున్నాఁడ. ఇట్టి యన్యాయముకలదా. రాజకుమారా! ఆమ్రుచ్చుల వధించి

నాహోమధేనువును దెచ్చియిమ్ము. దానివత్సము నిన్నటినుండి యఱచుచున్నది. ఇంక మాటలాడుచుండిన లాభములేదు. బాణబాణాసనములఁ గైకొని నాతోడరమ్ము. ఆలసింపకుము. ముచ్చులు దూరముపోవుదురు. అని త్వరపెట్టెను.

అర్జునుం డాబ్రాహ్మణుని దీనాలాపము లాలకించి పోవ నిశ్చయించెను. కాని యాసమయమున ధర్మరాజు ద్రౌపదియు నాయుధశాలయం దున్నట్లు తెలిసెను. ఆయుధశాల కరుగ రాదు. అరుగకయున్న బ్రాహ్మణకార్యము భంగమగును. అను నాలోచన మంకురింప నావీరుఁ డేమైనను విప్రు నాక్రోశరవం బును వినఁజాలను. ముందు విప్రప్రవరు కార్యముందీర్చి పిదప నాలోచించెదనని వడిఁబోయి యాయుధశాలయందున్న శర శరాసనములం బుచ్చుకొని యావిప్రునివెంటంబోయి యరణ్య మున నొకచోనున్న మహాశూరులఁ జోరుల వధించి బ్రాహ్మణు నకు గోధనం బిచ్చి సంతుష్టమతింజేసి క్రమ్మఱివచ్చి యన్నకు నమస్కరించెను. రాజా! లోకమర్యాదల రక్షించు మనయందు మర్యాదాభంగము గలిగినది యవశ్యము తొలఁగించు కొనం దగు. ఇంతకంటె దుర్యశం బొండెద్దియుండును? ఈదోషము నకుఁ బాచితం బుపదేశింపుము. *మర్యాదాభంగము మనమే చేసిన నిఁక జనులమాట చెప్పనేటికి? కావున మనమొనర్చిన నియమమురీతి నడువక తప్పదు.

---

*సమయః అనుప్రవేష్టు ర్ద్వాదశవార్షికోవనవాస ఇతి నియమః. అని వ్యాఖ్య. ఇచ్చోఁ గూడఁ దెనుఁగున, "ద్వాదశమాసికవ్రతంబు. అని యున్నది. నన్నయభట్టారకునివంటిమహానుభావుఁడు వ్రాయుటం జూడఁగాఁ నట్టిపాఠము కలిగియుండునని తోఁచెడిని.

శ్లో. "వనవాసం గమిష్యామి సమయో హ్యేష నః కృతః."
(అని మూలము)

కావున ద్వాదశవార్షికవ్రతంబు సలుపఁబోయెద. అనుజ్ఞ యిమ్మని ప్రార్థించెను. ధర్మరాజు తమ్మునిపూన్కి నెఱింగి వత్సా! బ్రాహ్మణ కార్యమునకు సహాయముచేయు క్రూరాత్ములంగూడఁ బాపములంటవని పెద్దలందురు. నీవు సద్బ్రాహ్మణ కార్యముందీర్చి మనమర్యాదను గాపాడితివి. కావున నాయనా! సమయభంగభయము వదలుము. అని చెప్పినను వాని కీయకొనక మర్యాదతప్పుట పాడిగాదని సోదరానుజ్ఞాతుఁడై తీర్థయాత్రకుం బోయి యందందుఁ దీర్థంబులసేవించుచుఁ బుణ్యక్షేత్రంబులఁ, బుణ్యనగంబుల దర్శించుచుం బోయిపోయి గోకర్ణక్షేత్రంబును గాంచి యందున్న మహాదేవు నారాధించుచుఁ గొంతకాలంబుండి పశ్చిమసాగరప్రాంతంబునం గలప్రభాసతీర్థంబునకుం బోయెను. ఆతీర్థంబునకు సమీపమునందె ద్వారకాపురము కలదు. ఆనగరంబున కరిగి శ్రీశ్యామసుందరచక్రవర్తిం గన్నులారం గాంచి నాజన్మమును సార్థకముగఁ జేయువాఁడ. అంతియగాక సుభద్ర ద్వారకయందలరునఁట. ఆమె యచ్చరమిన్నల మించిన రూపవతియఁట. ఇంతకుముందే గదుఁడీవార్త నాకుందెలిపెను. కావున నందుల కరిగి యామెఁ జూచెద. శ్రీహరి కరుణకలిగిన నావాంఛయు నెఱవేఱఁగలదు. అని నిశ్చయించుకొని యా ప్రభాసతీర్థమున గొలఁదిదినములుండి ద్వారకా నగరంబునకుఁ బోవ నిశ్చయించెను. ఆనగరంబునఁ దన్నితరులు చూచినను దెలియకుండు నట్లుండువాఁడ. యాదవులు సాధువుల గౌరవించువారు. చాలభక్తిగలవారు; కాన వారిమన్ననలకుం దగినవేష

మూనియుందును. అని తలంచి సర్వజనపూజార్హమగు యతి వేషమును ధరించి మనస్సునందు సకలబ్రహ్మాండ నాయకుండు గురువు గరుడధ్వజుఁడునగు రాధానాయకుని స్మరించుచు నుండెను.

సర్వద్రష్టయగు శ్రీహరి యర్జునునుదంత మెఱింగెను. ఆతనిసదభిప్రాయమును సార్థకముచేయఁ దలఁచి యొక్కరుఁడే ప్రభాసతీర్థమునకుం బోయెను. భక్తవత్సలుఁడుకదా పరమేశ్వరుండు! పరమాత్మంగాంచి విజయుఁడు తనకోర్కి సఫలమయ్యెనని యానందించి వలగొని నమస్కరించి చేతులొగ్గి యిట్లనియెను. మహాత్మా! నియమము ప్రకారము వ్రతము సాగించితి. గంగాదిపుణ్యనదుల దర్శించితిని. హిమాలయాది పావనభూధరవరంబులం గాంచితి. సర్వపాపంబులు తొలఁగెను. మీదర్శనమున నావాంఛలు ఫలించుననఁగాఁ దదభిప్రాయంబు సుభద్రను బెండ్లియాడుటయే కదాయని యెఱింగియాతని భీతింబాపి తోడ్కొనిపోయి ద్వారకంజేర్చి రైవతకపర్వతమున నొక యాశ్రమం బింతకుముందే కల్పించియుండెను; గాన నందు విడియించి సకలోపచారములొనర్పఁ దగువారిని యోగించెను. తానారాత్రి యాకపటయతికడఁ గడపి రైవతకయాత్ర చాటంబంచెను. దాని విని యాదవులందఱు మహోత్సాహంబున నరిగి యావేడుకం గాంచి యానందించిరి. సుభద్రయు రుక్మిణీప్రభృతి హరిపత్నులంగూడి యాయుత్సవమును జూడ నరిగి నేత్రపర్వముగా నందున్నయతిం గాంచెను. పర్వతమునకు నమస్కరించుచుఁ బార్థుఁడు భర్తగా ననుగ్రహింపుమా యని ప్రార్థించెను. ఆతరుణిని సుభద్రగా నెఱింగి విజయుఁడు బద్ధాను

రాగుండయ్యె. హరియు నాతని నాశ్వాసించి యిష్టసిద్ధియగు. ఊరకుండుమని విశ్వాసము పుట్టించబలికి చారుల నింద్రప్రస్థపురికిం బుచ్చి యర్జునుఁ డిందున్నవాఁడు. ఓడకుండుఁడని ధర్మజప్రభృతులకుం దెలియఁజేసెను.

బలదేవాదులు రైవతకాద్రియందు యతియున్నవాఁడని విని మహాభక్తియుతులై యరుదెంచి దర్శించి యాయతివలనఁ దీర్థయాత్రామహిమముల నాకర్ణించి సంతసించి మహాత్మా యీవర్షాకాలము నిందే కడుపవలయునని ప్రార్థించి యెట్టకేల కాయతి సమ్మతింపఁ దత్సేవార్థము సుభద్ర నియోగించిరి. మురారి సత్యారుక్మిణులకు నీయతి యర్జునుం డగునని తెలిపెను సుభద్రయు నాకపటయతికి విధివిహిత సకలశుశ్రూషలు చేయుచుఁ గ్రమక్రమముగా నాతనిం జూచినపుడెల్లఁ గామాతుర యయ్యెను. విజయుఁడును గామాతురత మిక్కిలి కాఁగా నొకనాఁ డాతరుణీమణితో నిజాభిప్రాయం బెఱింగించెను. ఆమె కన్యాదాత లున్నవారని యుక్తియుక్తముగా మాటలాడి తన యంతిపురమున కరిగెను. శ్రీహరి తత్పరిచర్యకై రుక్మిణిం బుచ్చి సాల్వాదుల కారహస్యముం దెల్పి యొకమహోత్సవంబు సాగునని యందఱకుం దెల్పి యందఁ రాపర్వతంబుననుండ సాల్వాదులంగూడి శ్రీహరి రుక్మిణియు వెంట రాఁగా ద్వారవతికింబోయి యందు యర్జునునకు సుభద్రకు బృహస్పతి ప్రోక్తసులగ్నమున వివాహంబచేయించి దీవించి రథంబెక్కి భార్యం దోడ్కొని పొమ్మని యాజ్ఞాపించి తా నెప్పటియట్లు యామహోత్సవము సాగుచోటఁజేరి దానఁ బాల్గొనుచుండెను. అర్జునుండును శ్రీహరినియోగంబున సుభద్రం దోడుకొని కాంచనరథం బెక్కి

పోవుచుండ నగరరక్షకు లావిధం బెఱింగి యడ్డగించి వారికి బల దేవునకుఁ దెలియకుండ దొంగతనంబున మనసుభద్రం దోడు కొని పోవుచున్నవాఁడని తాఁకి బాణంబులఁ గురియించిన నాతండవక్రవిక్రమంబున వారిం బాఱఁదోలి వడివడింబోయెను. ఆవార్త బలరామాదు లెఱింగి సభఁజేరి యోజింపసాగిరి. బల దేవుండు వాసుదేవా! అర్జునుండు నీకెఱుంగకయుండ నింతటి కార్యము సేయునే! యని హెచ్చరింప నాముర హరుఁ డతని శౌర్యంబును బొగడి తగుమాటల నాతనికోప ముడిపిన వార లాతని మార్గ్యంబుఁబోవు టుడిగిరి. అర్జునుఁడాసుభద్రంగూడి కతిపయ ప్రయాణంబుల నింద్రప్రస్థపురంబు చేరెను. నగరము చెంతఁ దానుండి యాదవాంగనలతోడ ముందు సుభద్రపోవున ట్లొనర్పనెంచి ప్రేయసీ! ద్రౌపది పరమపతివ్రత. మనమిద్దఱ మరిగిన నేమనునో. ఆమెపలుకు తప్పదు. కాన నీవు ముందరరిగి యామెకు నమస్కరించి యామెదీవనలం గైకొని కుంతియొద్ద నుండు మనియె. సుభద్రయు నట్లేపోయి ద్రౌపదికి నమస్కరింప నామె నాసుభద్రను గౌఁగిటంజేర్చి యమోఘాశీర్వాదంబు లొసంగెను. కుంతికి మ్రొక్క నామెయుఁ దగుభంగి దీవించెను. కుంతికడ నామెయుండెను. అర్జునుండును మఱికొలఁది దినము లకు నగరప్రవేశము విధిగా నొనరించిన నెల్లవారు నానందపర వశులైరి. దంపతులగుటకు మఱెంత యానందించిరి.

ద్వారకానగరమున శ్రీకృష్ణప్రోత్సాహమున బలరామా దులు నమూల్యవస్తువులను వాహనాదికంబులఁగొని తోఁబుట్టువు నకు విజయునకు నరణమీయ నింద్రప్రస్థపురంబున కరుదెంచిరి.

వారిరాక పాండవుల కుత్సాహకారణ మయ్యెను. ఆమహో త్సాహమున నెల్లరు సుఖపారవశ్యముం బొందిరి. పదుదినము లామహోత్సవము సాగెను. శ్రీహరి తోఁబుట్టువున కనర్ఘ మణి భూషణములు దాసీదాసజనంబుల నొసంగి బహూకరించెను. వచ్చినవారినెల్ల నుచితభంగుల ధర్మరాజు గౌరవించెను. కొలఁది దినములుండి బలభద్రాదులు ద్వారవతి కరిగిరి. అర్జును నందుఁ గల నెయ్యంబున హరి యందె నిలిచెను. కొలఁదిమాసములకు సుభద్ర యొకమగశిశువుం గాంచెను. ఆతఁ డభిమన్యుఁడను నామాంచితుండయ్యెను. ఆతనియాకారవిశేషమును గాంచి ధౌమ్యాదు లీతఁడు అభిమన్యు వనంబరఁగునని నామకరణ మొనరించిరి.

"అభీశ్చ మన్యుమాంశ్చైవ తత స్తమరిమర్దనమ్,
అభిమన్యుమితి ప్రాహురార్జునిం పురుషర్షభమ్." ౬౭
(ఆది ప. ౨౨౧ అధ్యా.)

సకలక్రియ లాబాలునకు హరి యొనరించెను. దినదినాభివృద్ధి నందుచు నాకుమారుఁడు పెరుగుచు నెల్లరకు విశేషించి విజయ నారాయణులకు సంతోషదాయకుఁడై యుండెను.

మహాశయులారా! దీనింగూర్చి నాలుగుమాటలే వ్రాసె దను. శ్రీకృష్ణమూర్తి తనసర్వకారణత్వమును వెల్లడింప నితరు లెఱుంగకుండ సుభద్రనర్జునునకిచ్చి వివాహముచేసెను. యుద్ధో న్ముఖులనెల్ల సామవాక్యముల నాశ్వాసించి సంగరముడిపెను. సుభద్రకడుపునఁ బుట్టఁగలకుమారునినుండి యేయే కార్యములు కావలయునో ముందే గణించెను. కావున నాతనికిం దదనుగుణ ములగుశక్తులు గలుగఁ దానే చెంతనుండి సంస్కారములు

చేసెను. కౌరవయుద్ధమున నీతనివలనఁగల కార్యము నిర్ణయించెను. జగన్నాటకసూత్రధారుఁడు కావున నన్నికార్యముల కందఱను బురికొల్పుచుండెను. అన్నికార్యములు తమంతన సాగుచుండును. కాని యాయావీరులను నిమిత్తమాత్రులై యుండఁ జేయుటయే పరమేశ్వరుని చమత్కారము. ఈవిషయ మెఱింగిన వారు దుర్యోధనాదుల దూషింపఁజాలరు. కర్మ మప్రతిహతముగా జీవులం బురికొల్పుచున్నది. వారు వారు తమతమ యిచ్చచొప్పున మృతినందుచున్నవారు. ఇందొకఁడు జేత ఒకఁడోడువాఁ డెవ్వఁడు గలఁడు? ఇదంతయు భ్రమమాత్ర మేకదా. ఈవిషయము నిట్లు గ్రహించిన భగవత్తంత్ర మెట్టిదో స్పష్టమగును. సంకల్పమాత్రముననే సకలకార్యములు సాగుచుండు ననుట దీన స్పష్టము. ఇఁక దర్వాతికథ నాలకింపుఁడు.

## ఖాండవదహనము.

*శ్రీకృష్ణుఁడు తానుగాఁ జేయుకార్యముల నొనరించి యొరులమూలమునఁ జేయింపఁదగినకార్యముల నొనరింపఁ బ్రారంభించెననియుఁ, దాను సాక్షిభూతుఁడుగ నుండుననియు, నందుల కిదియే మొదటిదనియు నెఱుంగవలయు. కాఁబట్టియే శ్రీకృష్ణావతారము తక్కుఁగల యవతారములవంటిదిగాదని యీగ్రంథమునఁ బ్రథమప్రకరణమునందు, నితరప్రకరణముల యందుఁ బఠించియేయున్నవారు. దానినిమాత్రము మఱువక కథను బఠింపుఁడు. శ్రీకృష్ణార్జును లింద్రప్రస్థపురమునఁ గొలఁది

*ఈగాథ శ్రీమహాభారతాదిపర్వమునందలి యిన్నూటయిరువదిరెండవ యధ్యాయమునుండియుం,నిన్నూటయిరువదిమూఁడవయధ్యాయమునుండియుఁ, దరువాతియధ్యాయములనుండియుం గ్రహింపఁబడినదని యెఱుంగుఁడు.

వత్సరము లుండిరి. ఒక్కనాఁడు భగవంతుఁడు భావిగతుల నూహించి యందఱకు వనవిహారమున నుత్సాహము గలిగించెను. విజయుఁ డద్దానిం గోరెను. హరి సమ్మతించెను. అందఱు ఖాండవవనముచెంత కరిగి యాకాననములఁ దిరుగుచుండిరి. హరియు నరుఁడు నొక్కపొదరుటింటిలోఁ గూరుచుండిరి. ఇష్ట కథాగోష్ఠిఁ బ్రొద్దుపుచ్చుచుండిరి. అత్తఱి నొక్కవృద్ధబ్రాహ్మణుఁ డరుదెంచి మహాశ్రాంతుఁడువోలెఁ గనంబడుచు వారిం గాంచెను. ఆతని తేజస్స్ఫూర్తిం గాంచి యచ్చెరువంది యతిభక్తిం బూజించిరి. వారిచేఁ బూజితుండై యావిప్రుం డిట్లు పలికెను. అయ్యలారా! నేను బహుభోక్తను. అహీనాగ్నిబలుండను. నాకు నిష్టాన్నము నోపుదురేఁ బెట్టుఁడు. దాన సంతృప్తుఁడనగుదు. అని యడిగిన వా రయ్యా! నీ కెట్టిభోజనమున నిచ్ఛగలదు. అడుగుము. పెట్టుదుము. అనుమాటవచ్చునంతలో నాభూసురుఁడు మహాత్ములారా! నన్నగ్నిదేవుంగా నెఱుంగుఁడు. నాకాహార మీయింద్రుని ఖాండవము కానగును. మున్ను దీనిం గాల్పంబూని తిని. కాని యింద్రుఁడు ధారాధరములంబంపి నన్నుఁ జల్లారఁ జేసెను. ఇంద్రునకుఁ బరమమిత్రంబగు తక్షకుఁడను పన్నగేంద్రుఁడు ఖాండవమునసుండును. గావున ఖాండవము నమృతమును రక్షించునట్లు శతమఖుఁడు కాపాడుచుండును. దానిచే సర్వసత్వంబు లిద్దానిం బాయక హాయిగనుండును. మీరు సత్వసారులు. మహాస్త్రకోవిదులు; కావున నింద్రుని విఘ్నముల నస్త్రబలంబున నాపనోపుదురు. నేను నిశ్చింతగా దీనిం గాల్చి కృతార్థుఁడనై యరుగుదు. అని బహుభంగులవారిని బ్రోత్సహించెను. ఖాండవ వనదాహమున నగ్నికేల యాశ కలుగవలెనో యాకారణమును

వినుండు. పూర్వము శ్వేతకియను రాజు శతవార్షికసత్త్రయాగము చేయఁబూని సమృద్ధపదార్థంబుల నాయాగము సాగించెను. తొలుదొలుత నాయాగముచేయింప ఋత్విజులఁ గోరఁగా వారలు రాజా! మేము నిరంతరకష్టముల కోపఁజాలము. నీ కట్టి శక్తి భగవదనుగ్రహమునఁ గలిగినది. కావున నీయాగంబునకు నీశ్వరుండే ఋత్విజుఁడుగా నోపు ననిరి. ఆరాజు నిరాశుఁడై కైలాసమున కరిగి శంకరు నుద్దేశించి తపం బొనరించెను. శంకరుఁడు ప్రత్యక్షంబై రాజా! ప్రసన్నుఁడనై నీకు వరమీయ నరుదెంచితిని. అన నాశ్వేతకి శంకరా! నాచేయుసత్త్రయాగంబునకు యాజకత్వంబు వహింపుము. ఒరులచేతం గాదని వరము కోరెను. శంకరుఁ డాతనిం గాంచి కరుణించి భూనాథా! యాజకత్వంబుచేయ బ్రాహ్మణుల కనుమతి నిచ్చితి. ఒరు లద్దానిని చేయరాదు. నీవు బ్రహ్మచర్యంబూని పండ్రెండువత్సరములు విశ్రామములేక ఘృతధారల హుతవహుం దృప్తుంజేయుముని యదృశ్యుండయ్యె. శ్వేతకి యట్లే యొనరించెను. మరల శంకరుఁడు సాక్షాత్కరించి దుర్వాసుని రావించి యీతనిసత్త్రయాగంబున యాజకత్వము వహింపుమని పంచెను. శంకరునానతి మెయి దుర్వాసుఁడు మునిగణంబుసాయంబుగాఁ గొని యాజకత్వము వహించి చక్కఁగా దాని నెఱవేర్చెను. శతవత్సరంబులు నిరంతరఘృతధారల నగ్నిం బ్రీతునిం జేసిరి. దాన నాయగ్నిదేవున కొకరోగము సంభవించె. దాన నాతని తేజస్సు తగ్గె. మితిలేనిడప్పియు గలిగెను. దానఁ బరితపించి యగ్నిదేవుఁడు విరించి పాలికింబోయి తనయాపదం జెప్పుకొని యంగలార్చెను. విరించియు శతవార్షికసత్త్రయాగఘృతధారాజనిత మహావ్యాధిగా

నెఱింగి ధనంజయా ! యీవ్యాధి వేఱొక్కయుపాయమునం బోదు. దివ్యౌషధులుగల దివిజవరేణ్యవనమును భక్షింపుము. దాన నీవ్యాధి నశించునని సమాధానము చెప్పిపంపెను. ఆ మాటను నమ్మి యగ్ని ఖాండవమును గాల్పఁబూనెను. ఇంద్రుఁడు మేఘములం బనుప నవి నిరంతరధారల నగ్నిం జల్లార్చెను. ఏడుపర్యాయము లిట్లు ప్రయత్నము విఫలము కాఁగా మరల నగ్ని బ్రహ్మకడకుంబోయి తనవిధిం దెల్పి వగచెను. బ్రహ్మభావిగతుల నాలోచించి యగ్నిదేవా ! కొంతకాలమునకు ధరాతలంబున నరనారాయణు లవతరింతురు. వారి నాశ్రయించిన దమయస్త్రబలంబున మేఘబాధలు కలుగకుండఁ జేయుదు రనియె, అందులకై యతఁడు కాచియుండెను. ఆసమయమువచ్చినందున నిపు డవ్వారిని బ్రార్థించెను. ఇఁక ననుబంధకథ నాలకింపుఁడు.

అగ్నిహోత్రుఁ డిట్లు ప్రార్థింపఁగా నర్జునుఁ డాతనిం గాంచి దేవా! నాకపరిమితశరములు గలవు. వాని నుపయోగించుటకు బాహుబలము కలదు. కాని దానికిం దగుధనుసు. లేదు. మంచిరథాశ్వములులేవు. శ్రీకృష్ణునకు నాయుధములు లేవు. ఈ కారణముననే నీకార్యమునకు సిద్ధపడఁజాలక యాలోచించుచున్నాఁడ ననియె. అగ్నియు మనస్సునందు వరుణదేవుని దలంచెను. తలంచినంతన యాపశ్చిమదిగధిపతి సాక్షాత్కరించెను. అగ్నిదేవుఁడు వరుణదేవా! మున్ను నీకు సోముండొసంగిన బ్రహ్మనిర్మించిన ధనుస్సును, అక్షయబాణతూణీరంబులును గంధర్వజహయంబులం బూనినయరదంబును బార్థున కిమ్ము.

*చక్రంబును వాసుదేవున కిమ్ము. అని వేఁడెను. వరుణుం డట్లే యొసంగెదనని భక్తియుక్తి వానిందలంప నవి యాసన్నములు కాఁగా వానిని వారలకిచ్చి హుతవహుచే సత్కృతుఁడై యదృశ్యుఁడయ్యెను. కృష్ణార్జును లాయాయుధంబులను బుచ్చుకొని రథంబెక్కిరి. ధనంజయుం డాపార్థునిం గని యార్యా! యిది గాండీవమనఁబడు ధనుర్వరము. ఎట్టియస్త్రములుగాని దీనిం దాఁకినంతన వెలుచన విగతవీర్యములై ధరఁదొరఁగును. ఈయరదము శత్రువీరదుర్భేద్యము. ఎట్టితెరుణములనఁగాని యిది చెడదు. ఈతురంగంబు లిట్టివే. వీనిం బొలియింప మానవుల కేరికే నశక్యంబగును. కాన వీనిమాహాత్మ్య మత్యద్భుతము. ఈచక్రము కృష్ణా! నీచే ధరింపఁదగినది. నీవు దీనిం బ్రయోగించినంతన వైరులం బొలియించి మరల నీహస్తమున నిల్చును. దీనిశక్తి యపారము. అని వానిమహాత్వములనెల్ల నగ్ని వారికిం దెల్పెను.

ధనంజయవాసుదేవు లవ్వానిమహాత్వములకు విస్మయం బందుచు గ్రహియించి యాయరదంబు నెక్కి హావ్యవాహా! ఇఁక ముప్పదిమూఁడుకోట్లు దేవతలు పరివేష్టింప నమరాధిపతి వచ్చినను జయింపఁగలము. నిర్భయంబున ఖాండవంబు భక్షించుమీ యని యభయమిచ్చిన †నాయగ్నియు నారూపమును వదలి తనదగుతేజోరూపము నవలంబించి ఖాండవవనదహన కర్మమున కుపక్రమించెను. కృష్ణార్జునులు చక్రగాండీవములం

* చక్రేణ వాసుదేవశ్చ తస్మాద్య ప్రదీయతాం. అని మూలము. ౨౨౫ అధ్యాయము. † తైజసం రూపమాస్థాయ దావం దగ్ధుం ప్రచక్రమే. ఖాం. ౨౨౬ అధ్యా. 3౮. శ్లో.

బూని యావనమున కిరుగెలంకుల నిలిచిరి. వారిసాయము గలుగఁ దన కార్యమున కించుకంతయు నంతరాయము గలుగదని శతానందవాక్యము గలదుగాన దానినే స్మరించుచు నాయిరువురనవతరించిన నరనారాయణులనుగా భావించుచుఁ దనరూపమును విస్తరిల్లఁజేసి ఖాండవమును నలుప్రక్కలఁ గాల్పందొడంగెను. అందు బహువిధమృగపతత్త్రులు గలవు. లోకములఁగల సమస్తౌషధులు గలవు. సకలవృక్షములును గలవు. వానినెల్ల నొక్కపెట్టునఁ గాల్పఁబూనెను. ఆచప్పుడు దిక్కుల నిండెను, ఆధూమము నభస్స్థలమున నిండి మేఘమావరించెనాయనుభ్రాంతిఁ బుట్టించెను. మృగములు విహంగములు భస్మములగుచుండెను. ఆఘోరము చూడ శక్యముగాక యుండెను. వనపాలకు లరుదెంచి దాని నార్పఁబూని పార్థగోపాలకుల బాణాగ్నిజ్వాలల కాహుతియైరి. ఆయగ్నిజ్వాలలు నాలుకలఁ జాపుచుఁ దప్పించుకొని పాఱిపోవుఖగనివహంబుల నాకర్షింపఁ బరుగిడఁజాలక యందుఁబడి భస్మములగుచుండెను. అత్తఱి నాయగ్ని ప్రళయకాలాగ్నివలెఁ దోఁచెను. ఆవనమునఁగల సర్పములన్నియుఁ జక్కిలములవలెఁ జుట్టుకొని ధూమమునఁ గన్నులుగానరామి మంటలు తమ్మావరింప నట్టె బుసగొట్టుచుఁ జచ్చెను. అది యొకప్రళయకాలముగనే తోఁచెను.

అత్తఱి దేవతలెల్ల నాధూమార్చులకుఁ బెనుభీతిం బాఱి యింద్రున కెఱింగించిరి. ఇది యొక యకాండప్రళయమని మొఱపెట్టిరి. ఆమాటల కాశతమఖుం డదరిపడి తక్షకఫణీంద్రసంరక్షణార్థము జలధరంబులనెల్ల రావించి వానిందోడుకొని దేవసేనలు వెంటరా నరిగి ఖాండవంబుపై నొక్కమొత్తముగా

వర్షధారలం గురియించెను. పెల్లురేఁగుచున్న హుతవహ జ్వాలల నావర్షధారలు పీల్చఁబడి యడంగుచుండెఁగాని యొక్క చినుకైన నందుఁ బడదయ్యెను. ఆరీతిం గాంచి యింద్రుఁడు మేఘములన్నింటికి నొక్కమొత్తముగా వర్షింప నాజ్ఞాపించెను. అవియుఁ బట్టుదలంబూని హస్తహస్తానుకారము లగుధారల నొక్కమొగి వర్షింపసాగెను. పార్థుఁ డస్త్రముల మంత్రసంయుత ములుగా నొనరించి ఖాండవవనముపై నొకగృహము కట్టెను. వర్షధార లాయస్త్రగృహముపైఁబడి మిట్టిపడుచుండెనుగాని యొక్కచినుకైనను లోఁబడకుండెను. ఆబాణనికేతమునుండి వెడలఁజాలక యందున్నజంతువులన్నియు దగ్ధమగుచుండఁగ నందున్నతక్షకతనయుఁ డశ్వసేనుఁడను భుజంగబాలకుఁ డా యగ్నిశిఖల కోర్వఁజాలక తల్లిని దనతోఁకఁ గఱపించుకొని యెట్లో తప్పించుకొని యంబరమునఁ బరుగెత్తుచుండఁగా నరుం డద్దానిం గాంచి వానితల్లిశిరముతోఁగూడఁ దోఁక తెగిపడు నట్లు బాణమువైవ నద్ది యప్పనిసే యొనరించెను. తోఁక తెగిన యశ్వసేనుఁడు పరుగెత్తుచుండఁగా నర్జునుం డలిగి వానిఁ బొలి యింప సమకట్టుటం గాంచి శతమఖుఁడు మోహిని యను మాయఁ గావించి యశ్వసేనుని విడిపించెను. దానిని దప్పించు కొని యర్జునుఁడు బాణప్రయోగముచేయఁ బూనునంతలో నశ్వసేనుఁడు సురనగరముం జేరెను.

ఇంద్రుఁ డాఖాండవమునఁ దక్షకుఁడు మడిసెనని తలంచి యాగ్రహించి కృష్ణార్జునులతో ఘోరంబుగాఁ బోరాడెను. దేవతలెల్లఁ దమయోపినంత యుద్ధముచేసిరి. కాని యించుకంత

ధైన వారల నోంపఁజాలకుండిరి. అట్టియెడ నొక్కయశరీర వాణి యుచ్చైస్స్వరంబున,

"శ్లో. న తే సఖా సన్నిహిత స్తక్షకో భుజగోత్తమః,
దాహకాలే ఖాండవస్య కురుక్షేత్రం గతో హ్యసౌ. ౧౬
న చ శక్యా యుధా జేతుం కథంచిదపి వాసవ
వాసుదేవార్జునావేతౌ నిబోధ వచనాన్మమ. ౧౭
నరనారాయణావేతౌ పూర్వదేవౌ దివిశ్రుతౌ,
భవానప్యభిజానాతి యద్వీర్యౌ యత్పరాక్రమౌ. ౧౮
నైతౌ శక్యౌ దురాధర్షౌ విజేతుమజితౌ యుధి,
అపి సర్వేషు లోకేషు పురాణావృషిసత్తమౌ." ౧౯
(మహాభారతము ఆదిపర్వము ౨౨౮ అధ్యా.)

శతమఖా! వీరిద్దఱు పురాణమునులు. నరనారాయణులు. వీరిని గెలువ శక్యముకాదు. తొల్లి దేవదానవులకు మహాసంగ్రామముకాఁగా మీకుఁదోడ్పడి విజయంబు చేకూర్చుటెఱుంగవా. వీరు పూజ్యులుగాని యుద్ధమొనర్పఁదగరు. నీవు గెలువఁజాలవు. నీపరమమిత్రముగు తక్షకుఁ డీవనదాహమునకు మున్నే కురుక్షేత్రమునకుం బోయెను. కాన నిందుఁ బడి మృతి నొందఁడు. వగ పుడుగుము. వీరిని సమ్మానింపుమని వినఁబడియె. ఆఖాండవదహనముకూడ ముగిసెను. అగ్నికామయబాధయుఁ దొలఁగెను. కృష్ణార్జునుల దీవించి యతఁడు యథేచ్ఛముగా నరిగెను. ఇట్టిమహాత్తరకార్యము నిర్విఘ్నముగా సాగించినందులకు సంతసించి దివిజగణంబులతో నింద్రుఁడు కృష్ణార్జునులకుం బొడసూపెను. వారలాదివిజేశ్వరునకు మ్రొక్కిరి. వారి నాశీర్వదించి

యర్జునునకు నాగ్నేయవాయవ్యాదిమహాస్త్రంబుల నొసంగి నాతని కెప్పుడు నిష్టసఖుండవై యుండుమని శ్రీకృష్ణుం బ్రార్థించి పరిజనులంగూడి స్వర్గంబునకుం బోయెను. ఆదాహకాలంబున శరణాగతుండగు మయుని గృష్ణార్జునులు కాపాడిరి. కావున వానిం దోడుకొని వారిరువు రింద్రప్రస్థపురంబున కరుదెంచి ధర్మజునకు మ్రొక్కి ఖాండవదహన ప్రకారం బెఱింగించిరి. యుధిష్ఠిరుం డానందాంబుధి నోలలాడెను.

మహామహులారా! సారతరార్థజిజ్ఞాసువులారా! ఈఖాండవదహనమునుగూర్చి యించుక వ్రాయక మాన వలనుపడినది కాదు. అగ్నికజీర్ణవ్యాధి యెట్లు? వనదాహమునఁ బ్రాణికోట్లు చచ్చునని యెఱింగి శ్రీహరి దాని కంగీకరించు టెట్లు? వరుణుఁడు పరమేశ్వరునకుఁ జక్ర మిచ్చు టెట్లు? అనునివి ప్రధాన సంశయములు. వీనిననుసరించి మఱికొన్నియుఁ గలుగవచ్చును. వానికిఁ దెలిసినంతదనుక సమాధానము వ్రాయు టనవసరము కాదు. అధికప్రసంగము కాదు. కాన నించుక వ్రాసెదను. లోకమున నొకయవాంతర ప్రళయము రావలసియుండఁగాఁ దత్కారణంబును భగవంతుఁ డారసి కల్పించును. ముందే యాపరాత్పరుఁ డెఱుంగును గావున దానికి వలయు పరికరముల నన్వేషించి యొక్కచో వానినెల్లఁ గూడఁ జేయును.

"శ్లో. కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 3౨

తస్మా త్త్వము త్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవై తే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్." 33

(గీత. ౧౦ అధ్యా.)

అని శ్రీహరియే వాక్రుచ్చియున్నాఁడుకదా. శ్రీహరి యవతరించినది భూభారము తొలఁగించుటకుఁగదా. అది మహాభారతయుద్ధమునఁ జేయంబూనెను. దానికిం దగుపరికరము లాలోచించెను. ఖాండవదహనముననొక్కసాధనము కావలసియుండెను. కర్ణునకు సర్పముఖశరము దొరకినఁగాని యతఁడర్జునునితో సంగరమునకుఁ బూనఁడు. వాఁడు పూనినఁగాని యుద్ధము పొసఁగదు. మయుఁడుపకారము నొందితినని యెఱింగినఁగాని ధర్మరాజునకు లోకాతీత మహిమముగలసభ దొరకదు. అది దొరకినఁగాని దుర్యోధనుఁడు మఱెంత యీర్ష్యఁబూనఁడు. దానఁగాని పని చక్కఁగా నెఱవేఱదు. రాజసూయయాగమున కాసభయే ప్రధానము. దానిచేఁగాని భూపాలకులు ధర్మరాజునెడ ద్వేషముకలవారుకారు. వారు విరుద్ధపక్షమునఁ జేరినఁగాని భూభారము తగ్గదు. ఇన్నియు భగవంతుఁడెఱుంగును. ఇన్నిపనులకుఁ గారణము వహ్నికజీర్ణవ్యాధి కల్గుటయే. దాన నాతఁడు కృష్ణార్జునులఁ బ్రార్థించెను. అద్దానిహేతువుననే గాండీవము, రథము, అక్షయబాణతూణీరములు నర్జునునకు లభించెను. ఆవనమున నుండి విలయముకాఁదగిన ప్రాణికోటి బ్రదుక వలనుపడదు. అగ్ని యావనముననే కాల్పఁగోరెను. ఇన్నికార్యము లొకసారి కావలయునని భగవదభిప్రాయము. విలయోన్ముఖము లగుజం

తువుల బ్రదికింప శక్యముకాదు. అక్షణమున సంఘాతమరణము నొందవలసినగతి వానికిం బట్టియుండఁగా మాన్పఁదరమా. అర్జునుఁడు మాతవమాఁడు నిమిత్తమాత్రముగ నుండిరి. ఈవనము కాల్చితినన్న విశ్వాసము కల్గినఁగాని యగ్నికి బాధ పోయిన దనునమ్మకము పుట్టదు. ఇన్నింటికిఁ గర్మ మొక్కటియే కారణము. దానిసూత్రమున నిన్నియుఁ గ్రుచ్చఁబడియున్నవి. అదియాడిన నివన్నియు నాడును. చర్మనిర్మితప్రతిమల సూత్రధారుఁ డాడించును. అట్లే కర్మసూత్రధారుఁ డాడించినట్లెల్ల నివి యాడుచుండును. ఇన్నింటికి మూలకంద మామకుందుఁడే.

చక్రము శ్రీహరికి వరుణుఁ డిచ్చెనన్న విషయమును గూర్చి సమాధాన మేమనఁగ.సుదర్శనము భగవంతు నెడఁబాయనిది. స్మరించినంతన దర్శనమిచ్చును. అగ్ని యిప్పించిన దదికాక వేఱని యెఱుంగవలయు.చక్రమందఱకు సాధారణముగానుండు నొకయాయుధము. వరుణదత్తమంతకంటె శ్రేష్ఠమైనది. సామాన్యకార్యములకుంగాక విశేషకార్యములకుం గూడ నిది పనికి వచ్చును. గదా చక్రముసలాదు లందఱకు నుండునట్టివియే. సుదర్శనము పంపునంతటి కార్యములకుంగాక సామాన్యకార్యముల కీసాధనము పనికివచ్చును. ఇట్లు మనము గ్రహించిన నేమియు బాధలుండవు. భారతాది గ్రంథములయందుఁ జక్రము సర్వభూపతులకున్నట్లు తెలియవచ్చెడిని. భగవంతుఁ డీకార్యము నర్జునుని చేతఁజేయించి తాను సాక్షిమాత్రుఁడుగానుండుట యర్జునుని చేఁ దెగఁగలభూతములకర్మములఁ దాను జూచుచుండుటకే యని యెఱుంగందగు. ఎవరెవరిచే నేవేవి సుఖపడవలయునో మృతి నొందవలయునో ఆయాకార్యములు సాగుచుండ సర్వేశ్వరుఁడు

చూచుచుండును. సర్వసాక్షి యనఁగా నిదే భావము. కర్మము భగవత్స్వరూపము. ఆరూపమున ఫలముల నిచ్చుచుండును. కావున నీయవతారమునఁ దనసర్వేశ్వరత్వమును వెల్లడిఁజేయుచుండునని యెఱింగి శ్రీకృష్ణపాదారవిందముల భజించుటయే సర్వప్రకారముల సమంజసము. ఇఁక నీవిషయమును వదలి వేఱొక్కవిషయమును వ్రాసెదను.

ఆర్యులార! భారతకథను ఇంక నొక్కకొంత వ్రాసినఁగాని తరువాతికథ సాగదు. జరాసంధశిశుపాలులఁ బొలియించుట వ్రాసి తరువాత ద్వారకా వృత్తాంతమును వ్రాసెదను. ఇపుడు ఖాండవదహనము కాఁగానే మయుని రక్షించి యాతని ధర్మరాజుకడం జేర్చినట్లు కథలు తెల్పుచున్నవి. జరాసంధునిమృతికి రాజసూయ ప్రయత్న మత్యావశ్యకము. కావున నాకథను సుంత వ్రాసి శిశుపాలవధకథను వ్రాసెదను. ఇట్టితావుల శ్రీహరి కృత్యము లుండుఘట్టములకథ వ్రాసినట్లుగాక మిగుల సంగ్రహముల వ్రాయ నెంచితిని. శ్రీకృష్ణున కెంతదనుక సంబంధముకలదో దానిని వ్రాయుటకుగా ననుబంధముగ నించుక భారతకథను వ్రాసెదను. అట్లు వ్రాయకున్న నాకథ చక్కఁగాఁ దెలియక యుండును.

## జరాసంధవధప్రయత్నము.

*కృష్ణార్జునులచే ఖాండవదహనకాలమున రక్షింపఁబడిన మయుఁడు విజయు నాదృతి కెంతయు నానందించి మహాత్మా!

---

* శ్రీమహాభారత సభాపర్వమునందలి మొదటి యధ్యాయమునుండియు, పదునాల్గవ యధ్యాయము మొద లిరువదినాల్గవ యధ్యాయము వఱకుఁ గల యధ్యాయములనుండియు, సంగ్రహింపఁబడినదనియు నెఱుంగనగు.

ప్రాణదాతమునకుఁదగిన యుపకృతి నెవ్వఁడును జేయఁజాలఁడు. కాని చేతనైనంతసాయము చేయఁదలంచితిని. నేను దానవుల శిల్పిని. మయుం డనఁబడువాఁడను. నాయెఱుంగని శిల్పము లే లోకమున నుండవు. కావున:మీ కిష్టంబైనదాని నిర్మించియిచ్చెద. ఇట్టి యుపకృతులకుఁ బ్రతిచేయనేరని నావలనఁ జంద్రునకు నూలుపోఁగనునట్లు లేదేని యొక్కశిల్పముచేయించి దానిం గ్రహించి నన్నుఁ గృతకృత్యునిగాఁ జేయుండని ప్రార్థించెను. విజయుం డామయునిభాషణంబుల నాలకించి శ్రీకృష్ణుని మోముఁగాంచెను. శ్రీహరియు నాతనిభావంబు తనసమ్మతమును గోరి యడుగఁ దలంచుటయే యని యెఱింగెను. అర్జునుఁడు శ్రీహరితో నెద్దియే నొక యపూర్వవస్తువు నిర్మింపఁ బంపుమా యని పలుక హరి మయునితో నార్యా! కురువంశాలంకార భూతుఁడగు ధర్మరాజునకు సకలరత్నసారసుందరమగు నొక్క సభ నిర్మించియిమ్ము. సకలరాజులు సేవింప నందు సుఖాసీనుండగును. దాన లోకమునకు శ్రేయస్సు గలుగు. నీకును మంచి విఖ్యాతి యొనఁగూడు. అనిపలికి యీకార్యమున నీశిల్పకలా నైపుణ్యము తెల్లంబుగావలయు ననియె. మయుం డాశ్రీ హరియానతిఁ దలం దాల్చి చేతులు మోడ్చి యీధర్మరాజు సకల రాజన్యమౌళిమణిప్రభారంజితపాదపీఠుఁడు. కావున సకలరత్నసారఖచితముగ నొకసభను నిర్మింతును. దేవ తలవిమానము లిద్దానికి సరిపోలవనుట నిర్వివాదాంశము. ఎల్ల రాశ్చర్యసాగరనిమగ్ను లగునట్లు లొనర్చెద. దానిం గాంచినంతన యిట్టి దేలోకముల నింతకుఁ బూర్వము లేదని

తలంతురు. దానింగాంచుట కెల్లరు వచ్చునట్టు లద్దానిశిల్పమును వెలయంజేసెద.

పూర్వము వృషపర్వుండను దానవనేతకొఱకు సపూర్వ సభ నొక్కదాని నిర్మింపంబూని వివిధరత్నమయములగు నుప కరణంబులు నాయత్త పఱచితిని. వాని బిందుసరం బనుకొల నున నుంచినాండ. ఏదో యొక కారణమున నిర్మింప వలనుపడ దయ్యెను. ఆయుపకరణములచే నీతరుణమున నొక్కసభను నిర్మించి తెచ్చి ధర్మరాజున కొసంగెదను మఱియు భౌవనాశ్వుం డనురాజర్షి నిర్మించినదియు, సకలశత్రుఘాతినియు నగు నొకగదను భీమసేనున కొసంగెదను. శత్రువులం జీకాకుపడం జేయంజాలి దారుణఘోషంబుగల దేవదత్తమను పేరుగల శంఖ ము నర్జునునకిచ్చెద ననిపలికి మయుండు వినీతుండై తనకృతజ్ఞ తను దెలుపుకొనియెను. ధర్మరా జాతనికృతజ్ఞత కెంతయు సంతోషించి విధియుతంబుగా నాతని సత్కరించెను. ఆసత్కార మున కెంతయు సంతోషించి మయుం డందఱచే సెలవొంది పోయెను. శ్రీహరియుం దలిదండ్రులు లోనగువారి సేమమరయ ద్వారవతికిం బోయెను. మయుండు ధర్మరాజానుమతుండై యరిగి హిమాలయంబు దాంటి కైలాసంబునుత్తరంబున మైనాకాచలం బున హిరణ్య శృంగంబునుజేరి యందుం బరమపావనంబై శంకర నివాసార్హంబై భగీరథాదిరాజర్షులు తపం బొనరించిన యా బిందుసరంబను తీర్థంబున దాను మున్నే సేకరించియుంచిన రత్న మయసంభారములం గొని యామహాకార్యంబునకు సమకట్టి భూదేవతల నర్చించి ప్రారంభించెను.

ఆతఁడు శిల్పచాతుర్యంబును జూప నెంచెను. శిల్పివరులలో మేటి యనుపేరుగల్గువాఁడు. అందును లోకోత్తరంబుగా దాని నిర్మింపఁబూనెను. ఇంకఁ జెప్పవలసినదేమి? దానికదియే సాటి. ముజ్జగంబులయందును దానికి నీడు కాఁదగిన దొక్కటియుఁ గానరాదు అతిప్రయత్నమున దాని నాతఁడు నిర్మించెను. దానియద్భుతము వర్ణనాతీతము సకలము రత్ననిర్మితము. ఎట్టివారు దానింగాంచినఁ బ్రమాదంపడక పోరు. ఒక్కతావున జలాశయములుండు. వానిని గనుఁగొన వీలులేనట్లు రత్నకాంతు లందుఁ బ్రసరించు: అది స్థలమే యనుకొందురు. వేఱొక్కతావున జలాశయములేదు అందు వ్యాపించిన రత్నకాంతులవలన జలము చలించుచున్నట్లగపడు. ఇట్టివెన్నియో విచిత్రశిల్పము లందుఁగలవు. దాని నిర్మించునప్పు డాతఁడు చూపినచమత్కృతిని వేయినోళ్లం బొగడినను జాలదు. సకలతరువరంబుల భాసిల్లువనము లందుగోచరించు. ఆతరువుల ఫలంబులు వ్రేలాడుచుండు. ఆసభను బదునాలుగు నెలలు శ్రద్ధాపరతంత్రుఁడై నిర్మించెను. సిద్ధము కాఁగా *ఎనిమిది వేలు సంఖ్యగల రాక్షసులు మయు నానతి దానిం దలలందాల్చి మోచుకొనివచ్చిరి. దానిని ధర్మరాజున కొసంగి గదాయుధమును భీమున కిచ్చెను. దేవదత్తనామకశంఖమును విజయున కొసంగెను. ధర్మరాజాతనిశిల్పనైపుణ్యమునకుఁ గృతజ్ఞతకు సంతోషించి విశేషవిధుల సత్కరించెను. మయుఁ డాపాండవు

---

* సభామష్టౌ సహస్రాణి కింకరానామ రాక్షసాః, అంతరిక్షచరా ఘోరా మహాకాయా మహాబలాః, రక్తాక్షాః పింగళాక్షాశ్చ శుక్తికర్ణాః ప్రహారిణః. అని మూలము.

లవలన సెలవంది తననివాసమునకుం బోయెను. ధర్మరాజు సోదర బంధుమిత్రయుతుండై ధౌమ్యాది భూసురగ్రామణు లాశీర్వదింప దైవజ్ఞలలామ ప్రోక్తశుభముహూర్తమున సభాప్రవేశ మహోత్సవమును సాగించెను.

మహావిభూతిమై నాసభాప్రవేశము చేసిన ధర్మరాజును సేవించి రాజులెల్లఁ గానికలిచ్చి శరణాగతులైరి. ఈఘట్టమున శ్రీమహాభారతమునందుఁ బెక్కండ్రు రాజులపేరులు చెప్పఁబడినవి. ఆశ్లోకముల సారముంగైకొని వాగనుశాసనుండగు నన్నయభట్టారకుఁడు,

"మ. మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనివచ్చియిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుఁ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోద
[యున్"

అని వ్రాసి తనసర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను. ఈపద్యరత్నమునే పరీక్షార్థ మంపిరనియుఁ జెప్పుదురు. అట్టి మహేంద్రాతీతవైభవమున నుండుయుధిష్ఠిరుని దర్శింప మార్కండేయాదిమహర్షు లరుదెంచిరి. వారిం బూజించి వారి యాశిషములంబడసి ధన్యుఁడై వా రుపన్యసించుకథల నాలకించుచుండెను. అత్తఱి దేవతావితతి పురికొలుప నారదముని పర్వతపారిజాత రైవతసుముఖులను మునులంగూడి ధర్మరాజు కడ కరుదెంచి విధిసత్కృతుండై ధర్మజునకు సకలరాజనీతుల బోధించి యాసభావిభవముం గాంచి యచ్చెరువంది యిట్లు భాషించెను. రాజేంద్రా! ఈసభ ప్రపంచమునఁ గ్రొత్తది. మున్నె

న్నఁడు నేలోకంబునఁగాని యున్నదిలేదు. దేవేంద్రునిసభం జూచితిని. యమసభం గాంచితి. వరుణసభం దిలకించితి. కుబేర సభ విలోకించితిని. బ్రహ్మసభల నవలోకించితిని. కాని యీసభ కవియన్నియు శతాంశమునకును బోలవు. అని వినుతించిన ధర్మరాజాసభల మహిమములనడుగ వానినన్నింటిని దెలియం జెప్పి హరిశ్చంద్రుమహిమము నెఱింగించి మఱియు నారద ముని ధర్మనందనా! రాజలోకంబుతో వైవస్వతసభనుండు మీ తండ్రి పాండుమహారాజు నీకెఱింగింపుమని తెల్పినవాక్కుల నాలకింపుమని యిట్లు చెప్పెను.

"రాజులు రాజసూయ మనుయాగ మొనరించిన నింద్ర లోకంబున సకలవాంఛలు ఫలింప హరిశ్చంద్రునివలె నుందురు. కావున మునీంద్రా! నాయాశయంబుగా నీవు మర్త్యలోక మునకుంబోయి ధర్మమూర్తి యగుధర్మరాజుతో రాజసూయ మును జేయుమని చెప్పుము. నాకొడుకు లేవురును దేవతా ప్రసాదసంజనితులు. అందుఁ బెద్దకొడుకు ధర్మరాజు రాజసూయ ముం జేయనోపును. తమ్ముల బాహుబలమువలన సకలరాజుల నోడించును. సార్వభౌముఁ డగును. నామాటను సార్థకముచేసి నచో నాపితృవర్గంబుతో నమరలోకంబునకుం బోవనోపుదును" అని మీతండ్రి చెప్పెను. ఈపలుకు లెఱింగింపఁ గోరియే వచ్చి తిని. న్యాయమురీతి రాజసూయ మొనరింపుము. దాన నీపితరు లెల్ల దేవలోకమున కరిగి మహేంద్రపూజితు లగుదురు. వారి యాశిషంబున నీవు వర్ధిల్లుదువు. సర్వధర్మంబులయందుఁ బితృ వాక్యపాలనం బుత్తమోత్తమధర్మము. దిగ్విజయముచేసి దాన నార్జించినవిత్తంబుల బ్రాహ్మణులం దనిపి చాతుర్వర్ణంబుల

రక్షించి రాజ్యంబు సర్వోత్కృష్టత వెలయింపుము. సార్వభౌముఁడవు కమ్ము. మఱియొక్క విషయంబుఁ జెప్పక యూరకుండ రాదు. *రాజసూయంబున ననేకవిఘ్నములు కలుగుచుండు. బ్రహ్మరక్షస్సులు లోనగుభూతంబు లద్దానిని సాగకయుండఁ జేయుఁబూను. కాని యదియే నిర్విఘ్నముగా సాగెనేని నిఖిల ప్రజాప్రళయకారణం బగుసంగరం బగును. ఏదియైనను దానికి సాటియజ్ఞం బీలోకంబున లేదు. కావునఁ జక్క నాలోచించి యేది క్షేమకరమని తోఁచునో దానిం జేయుమని నారదుఁడు తనదారిం బోయెను.

ధర్మరాజు రాజసూయ మొనరింప నుత్సుకము కలవాఁడై సోదరులను ధౌమ్యాదిమహర్షులను జూచి యిట్లు పలికెను. పితృవచనమును సార్థకముచేయుట సుతులకు విధి. జన్మఫలమన నదియేకదా. పితృలోకమున నున్నగురువృలకు దీనం బ్రియం బగునఁట. కాలాంతరమున సంగరమగునఁట. దానిం జూచి కొందము. నాకుఁ దండ్రికి హితమాచరించుకోర్కి కలదు. దానఁ బ్రజానాశము గలుగునుగదా యన్నసంశయము కలదు. ఏమిచేయను దోఁపక నామనస్సు చలించుచున్నది. నావిని ధౌమ్య ప్రభృతులు రాజవల్లభా! రాజసూయ మొనరింపుము. సోదరుల సహాయమున నీకొనరింపరానికార్య మొక్కండును లేదు.

---

*బహువిఘ్నశ్చ నృపతే క్రతురేష స్మృతో మహాన్. ఛిద్రాణ్యత్ర హి వాంఛంతి యజ్ఞఘ్నా బ్రహ్మరాక్షసాః, యుద్ధంచ క్షత్రశమనం పృథివీ క్షయకారణమ్. ౩౦. కించిదేవ నిమిత్తంచ భవత్యత్ర క్షయావహమ్, ఏతత్సంచింత్య రాజేంద్ర యత్క్షేమం తత్సమాచర. ౩౧. సభాపర్వము. ౧౩. అధ్యా.

రాజుల నోడించి సర్వసంపదలు చేకొనఁ గాలము చెంతకువచ్చె డిని. మానవనాథులింకొరులుదీనిం జేయఁజాలరు. సమర్థుఁడవయ్యు నీవు దానిమానుట న్యాయముకాదు అనిరి. భీమాదులగునను జులు తగుభంగిఁ బ్రోత్సహించిరి. వారిమాటల నంగీకరించి దానినిజేయ సమకట్టి ధర్మరాజిమహాయజ్ఞము నిర్విఘ్నముగా సాగింప శ్రీకృష్ణుండుతప్ప నింకొకండు లేఁడని నిశ్చయించి రథంబు ద్వారవతికిం బంపి శ్రీహరిరాకకు వేచియుండెను.

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట.

శ్రీహరియు ధర్మజునుద్యోగంబు మదిఁ దట్టగా రథము గాంచినంతనే పయనమై కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థ పురంబునకుంబోయి ధర్మరాజుం గాంచి సత్కృతుండై కుశలం బడిగి వారికామోదముం గూర్చెను. ధర్మజుఁడామహానీయుని రాక కానంద ముప్పొంగఁగా నిట్లు ప్రార్థించెను. ఈఘట్టమున మూలము.

"శ్లో. యస్మిన్ సర్వం సంభవతి యశ్చ సర్వత్ర పూజ్యతే,
యశ్చ సర్వేశ్వరో రాజా రాజసూయం స విందతి."

మహాత్మా! సర్వకర్తవై సర్వపూజ్యుఁడవై సర్వేశ్వరుఁ డవై నెగడునీకు రాజసూయవిధాన మెఱుంగనగును. మాబోం ట్లకు శక్యమే. ఐన నావాంఛితంబు నెఱింగించెదను. నాతండ్రి పాండురాజు నారదమునివలన నా కీరాజసూయమును జేయ నాజ్ఞాపించెను. నాయందట్టిసామర్థ్యము కలదని యెఱింగియో ఘంచెనో యెఱుంగఁజాలను. ధౌమ్యాదులు నన్నుఁ బ్రోత్స హించిరి. ఒడంబడితిని. మహాత్మా! సర్వకార్యనిర్వాహణము

నీభారము. కావునఁ జక్కఁగా నాలోచించి పనుపుము. నీయా నతిమెయిఁ బ్రవర్తిల్లువాఁడను. సర్వమునకు నిన్నే నమ్ముకొని యున్నవాఁడను. అని సవినయముగాఁ బ్రార్థింపఁగా శ్రీహరి తనయవతారఫల మాసన్నము కానున్నదని యోజించి యి ట్లుత్తరము చెప్పెను. రాజా! సర్వసుగుణభూషితుఁడవు. మహా శూరులగు ననుజులుగలవాఁడవు. సర్వనీతిజ్ఞుఁడవు. కావున నీవే యీ రాజసూయయాగము నొనర్ప నర్హుఁడవు. పూర్వము పరశురాముం డవార్యపరాక్రమంబున ధాత్రియంతయుం దిరిగి క్షత్రియవంశంబుల నిర్మూలించెను. నాటంగోలె నైలవంశంబు నిక్ష్వాకువంశంబుననునీ రెండువంశములుతప్పనన్నియుఁగృత్రిమ క్షత్రియవంశంబులే యయ్యె. విమలక్షత్రియవంశంబులు లేవు. * ఈ రెండువంశంబులు నూటిపై నొకవంశంబులుగ విస్తరిల్లెను. యయాతి భోజవంశంబులనుండి పదునాలుగువంశము లుప్ప తిల్లెను. ఇట్టిక్షత్రియులనెల్ల జయించి జరాసంధుఁడున్నవాఁడు. వానిశక్తి యసమానతం గాంచియున్నది. ఇంతియకాక యా జరాసంధునిఁ జేదిరాజు తనసకలబలములతోడ సేనాధిపతియై కొలుచుచుండును. మఱియు నాతనికి నూయాశీలురగు హంస డిభకులనువారలు మిత్రులుగలరు. కౌశికచిత్రసేనులను మాఁబు పేరులతో మహాసేనాసమన్వితులై యాతనికి బాసటగా

---

*ఏిలవంశ్యాశ్చ యే రాజం స్తథైవేక్ష్వాకవో నృపాః, తాని చైకశతం విద్ధి కులాని భరతర్షభ. ౫. యయాతేస్త్వేవ భోజానాం విస్తరో గుణతో మహాన్, భజతేద్య మహారాజ విస్తరం స చతుర్దిశమ్. ౬. సభాపర్వము. ౧౪ అధ్యా.

నుందురు. మఱియు వరుణునంతటిబలశాలి పశ్చిమదిగ్భాగవిభా శ్వరుఁడు భగదత్తుఁడు పాండురాజసఖుం డగుటంజేసి నీకు మన స్సున మిత్రుండయ్యును భయంబున జరాసంధుని పక్షమువాఁ డయి చేయునదిలేక వాక్కర్మంబులఁ దద్ధితంబుగాఁ బనిచేయు చుండును. మఱియుఁ బెక్కండ్రు రాజు లాతనికిఁ దోడ్పడు చుండువారు. మహాపాపాత్ముఁ డగుకంసుని నే వధించుటంజేసి తత్పత్నులు తనపుత్రికలగుట నాపై నీసుపూని మధురానగరం బును బెక్కుసారులు ముట్టడించెను. యదువృష్ణిభోజాంధకులు వానిచేఁ బలుబాము లనుభవించిరి. హంసడిభకు లెట్లో మృతు లైరి. వారు చావఁగా నాతఁడు మరలిపోయెను. మేము నాతని వలనిబాధల ననుభవింపఁజాలక ద్వారవతిం జేరితిమి. ఆతఁ డెంద ఱినో రాజులనుబట్టి కట్టి పీడించుచున్నాఁడు. వానిదురంత ములు చెప్పనలవికావు. వానింజంపక రాజసూయ మారంభింప వలనుపడదు. నీరాజ్యము సుస్థితింగాంచదు. రాజా! సకలసుగుణ ములు గలిగి మహాబలపరాక్రమసమగ్రులగుసోదరులు మాట ప్రకారము వర్తింపనుండ నీవింక ననుమానించెదవేల? అనిపలు కఁగా విని భీమసేనుండు నర్జునుండు నాజరాసంధు నశ్రమంబునం బొలియింతుమని పలికిరి. వారిమాటలు విని శ్రీహరి మరల రాజేంద్రా! భీమార్జునులపలుకు లుత్తమములు. వాని ననుసరిం పుము. నీకు లగ్గగుననియె. ఇట్లందఱు నొక్కపలుకఁగా విని ధర్మ రాజు శ్రీకృష్ణునితో నిట్లు ప్రశ్నించెను.

ఇట్టి యత్యద్భుతశక్తి యాజరాసంధున కెట్లు వచ్చెను? ఆతనిజన్మవృత్తాంత మెఱుంగఁగోరెద. అది విననఁగాని నామ నస్సు దిటవునొందదు. మహాత్మా! ఎఱింగింపుమా యని ప్రార్థిం

చెను. హరి తదభిప్రాయమెఱింగి యాతనిశంక తొలఁగింపనెంచి రాజా! వినుమని యిట్లు చెప్పెను. బృహద్రథుఁడను రాజు మగధ దేశాధిపతి విశేషబలయుతుండుగానుండి పరులనోడించుచుఁ గాశిరాజు తనుజాతల నమడపిల్లలను బెండ్లియాడి వారివలన సంతానంబుఁ బడయఁజాలక సకలవ్రతముల నాచరించెను. కాని ఫలము గలుగదయ్యెను. దాన నిర్వేదంబుఁ గొంది వనంబున కరిగి యందొకచోఁ జక్కనిమామిడిచెట్టు క్రిందఁ దపంబుచేయుఁ గౌతముని గాక్షీవతుఁ డనువానిం గాంచెను. అతిభక్తి వానిం గొల్చుచుండెను. కొంతకాలమునకు నాముని సంతోషించి వాంఛితం బొసంగెదను. వేఁడుమా యనిన నారాజు మహాముని! సర్వసంపదలు గలవు. కాని సంతానము గలుగదయ్యెను. కాన దాని ననుగ్రహింపుమా యని ముకుళితకరుండై వేఁడఁగా నాముని ధ్యానస్తిమితలోచనుండై యుండెను. అత్తరుణమున నాసహకారభూరుహామునుండి ఫలమొకండు పవనవిధూతమై యాముని తొడపైఁ బడియెను. దానింగైకొని యభిమంత్రించి రాజున కొసంగి దీని నీపత్నులకిమ్ము. సంతానంబు గలుగును పొమ్మన దానిం బరిగ్రహించి తననగరంబునకువచ్చి యిర్వురు భార్యలకు సమముగాఁ బంచియిచ్చెను. వారు వానిం దిని గర్భంబులం దాల్చిరి. ఒక్కనాఁడు వారిద్దఱు నొక్కలగ్నమందే ప్రసవించిరి. ఒక్క కన్ను ఒక్క చెవియు నిట్లవయవములు సగముగాఁగల యొక శిశువు జనించెను. ఆశిశుశకలమును జూచి వారు వెఱచి దీని నెట్లు రాజునకుం జూపుదుమని సంశయించి లజ్జవెంపున నెవ్వ రెఱుంగకయుండ వెలుపలం బాఱవైచి రండని దాదులకుం జెప్పిరి. వా రాశిశుశకలములం గొనిపోయి యొక్కచోఁ బాఱ

వైచి వచ్చిరి. అందున్న యొక్క రాక్షసి జరయను పేరుగలది బలి యని భ్రమించి వచ్చి యాతురంబున నా రెండు శకలంబుల నదిమి పట్టుకొనఁగా నవి రెండును జేరి యొక్క బాలకుఁ డయ్యెను. ఆశి శువు దానికెంతయు భారమై మహాబలశాలి కావున భీతిత గల్గించుచు నేడ్చెను. ఆధ్వనివిని యంతిపురమునఁ గలవారెల్లం బరుగెత్తివచ్చి యాబాలకు నెత్తికొనిరి. ఆసందడి రాజు తెలి సికొనివచ్చి రొట్టనిపిడికిలిని మోమునఁ బెట్టుకొని యేడ్చుచున్న మహాకాయు నాశిశువుం గాంచి కరంబు సంతసించెను అంని నా రాక్షసి కామరూపిణి గావున మానవకాంతారూపమును దాల్చి యారాజుతో రాజా! నే నీచదుకమున నుండు రాక్షసిని. చిరకాలమునుండి యిందున్న దానను. నాపేరు జరయని. నీకు మేలుచేయఁగోరుచుందును. అది నేఁటికి సమకూరెను. నీయిద్ద ఱుభార్యలకుఁ గలిగినశకలములను దాదులు తెచ్చి యిచ్చోఁ బాఱవైచిరి. నేను వానిం గూడఁబెట్టితి. వెంటనే శిశువై నా కెత్తికొన శక్యముకానంత బలశాలియయ్యెను వీనింగొనుమనిన నారాజు నాకొక్క మునివరుండు సంతానం బనుగ్రహించెను. నీవిపు డద్దాని నొసంగితివి. నీవు రాక్షసివి కావు. నాకులము నుద్ధరింప దయచేసిన పుణ్యదేవతవు. అని దాని నతిప్రీతిభక్తులం బూజించెను. జరయనురాక్షసిచే శకలములు రెండును సంధిం పఁబడినవాఁడు గావున జరాసంధుం డనంబడునని నామకరణంబు చేసెను. ఆశిశువు దినదినప్రవర్ధమానుఁడై పెరుగుచుండఁగా నడవిలో వరమిచ్చినయాచండకౌశికుం డొకనాఁ డచ్చటి కేతెం చిన రాజు తన్ముని నతిప్రీతి గారవించి పూజించి యుచితాసనా సీనుం జేసి కొడుకుం జూపెను. ముని రాజా! జరయనురక్కసి

నీకు మహోపకారము చేయుట యోగనిష్ఠ నెఱింగినాఁడను. * ఈకుమారుఁడు షణ్ముఖునివలె మహాశక్తిసంపన్నుఁడు. శివ భక్తుండగు. ఎంతబలవంతులైనను బగతురు వీని దాఁకి యోర్వఁ జాలక పాఱిపోదురు. వీఁడెల్లరాజుల నోడించునని ముని తన యిచ్చ నరిగెను. అంత నాకొడుకునకుఁ బ్రాయమురాఁగా బృహద్రథుం డాతనికి రాజ్యమిచ్చి తాను దపోవనంబున కరిగెను.

ఆజరాసంధుఁడు కొందఱరాజులం జేర్చుకొని మాఱు లేని విక్రమంబు నీశ్వరానుగ్రహంబునం బడసియున్నవాఁడు. వాని నితరులోడింపఁజాలరు. కాని మల్లయుద్ధమున మనభీముఁడు వాని నోర్చును. ధర్మనందనా! విజయుదివ్యాస్త్రబలము, భీముని బాహుబలము నానీతిబలము సాయముగనుండ నీకుఁ బడయరాని దేదియుండును? శంక నొందకుము. పవనతనయుఁడు వాని నక్రమంబున నోర్చును. అని నొక్కి పలికిన శ్రీకృష్ణుని భీమార్జునులఁ గాంచి సంతుష్టాంతరంగుఁడై శ్రీవాసుదేవా! నీసాయముగలుగ మాకు సాధింపరానిపని యెద్ది? నాకేల శంక యుండును? తప్పక రాజులెల్లరు బంధముక్తులగుదురు. రాజ సూయయాగము సాగును. నాకుఁ బుణ్యము విఖ్యాతియుఁ గల్గును. అని పలికి తనకు మ్రొక్కిన భీమార్జునులను నాశీర్వదించి కార్యసిద్ధి యయ్యెడుమని పనుప శ్రీకృష్ణసహితులై యాసోదరు లిద్దఱు ప్రయాణమైరి. వారు ముగ్గురు పెక్కునదులు నదఱ

---

* ఉవాచ మాగధం రాజన్ ప్రహృష్టేనాంతరాత్మనా. ౮. సర్వమే తన్మయా జ్ఞాతం రాజన్ దివ్యేన చక్షుషా. అని మూలము. సభాపర్వము- ౧౯. అధ్యా.

బులు పర్వతములు దాఁటి మగధదేశంబుఁ జొచ్చి గోరథంబను పర్వతము నెక్కిరి. దానినుండి యాగిరివ్రజపురమును గాంచిరి. అది శత్రుదుర్భేద్యముగా నుండెను. ప్రాకారపంక్తులు దానిం జుట్టుకొని పరులకుఁజూడ శక్యముగానియట్లుండెను. శృంగారముగా నుండునగరములలో నది యగ్రగణ్యమై యుండెను. దానినిం జూచుచున్న భీమార్జునులం గని నారాయణుండు గోరథము ఋషభము వైహారము ఋషిగిరి చైత్యకాద్రియను నీయైదుపర్వతము లీపురవరమునకు సంరక్షకములు. ఈపర్వతపంక్తిచే రక్షింపఁబడుటచేతనే దీనికి గిరివ్రజమను నామము గల్గెను. ఈమాగధుల నెవ్వరును జయింపఁజాలరు. అని పలికి ద్వారమునుండి నగరము ప్రవేశింపనొల్లక చైత్యకగిరిశృంగంబునకుంబోయి యందున్నమూఁడుభేరులం జూపి పూర్వమున నుండు మాగధులు మానుషాదంబను ఋషంబును జంపి దానిచర్మంబున నీమూఁడుభేరుల నిర్మించిరి. శత్రువు లెవ్వరేని యీపురంబు చొచ్చునపు డివి తమంతన మ్రోయును. ఆమునివర మిట్టిది. అనుడు భీమార్జునులు బాహుబలంబున నాభేరులమూఁడింటి నశ్రమంబున ధ్వంసముచేసిరి. ఆద్వారముననే నగరముం జొచ్చిరి. అందు మాలాకారునిండ్లకు, గంధనిర్మాతృగేహంబులకుం బోయి బలాత్కారవిధిని వానిని గైకొనిరి. వానిందాల్చిరి. గంధపుఁబూఁతల మేనులఁ గైచేసిరి. నగరంబునంబోయిపోయి రాజమందిరము గాంచిరి. అందు నిరంతరము బ్రాహ్మణులు నిరాతంకముగఁ బ్రవేశింతురు. కావున వారింగూడి యాసౌధము నాలమందను మృగేంద్రములు ప్రవేశించునట్లు ప్రవేశించిరి.

జరాసంధుఁడు నిరంతర మతిథులగు ద్విజులఁ బూజించువాఁడు. * అర్ధరాత్రమైనను దనయింటి కతిథులు వచ్చినారని విన్న నెదురేగి పిలుచుకొనిపోయి పూజించువాఁడు. ఈవార్త లోకమునందంతట వ్యాపించియుండెను. ఆమర్యాద ననుసరించియే వీరిని దోడ్కొనిపోయెను. మధుపర్క మీయఁబూనెను. వీరు దానిం బ్రతిగ్రహింపనొల్లక గర్వముఁ జూపిరి. ఆవిధ మెఱింగి యాజరాసంధుఁడు మీరు స్నాతకులైయునఁ బూవులు చందనము బలిమిమై గ్రహింపఁదగునా. చైత్యకాద్రితటమును భేదించి దొంగతనమున నగరమును జొరఁదగునా. అంతియ కాక నాయిచ్చుమధుపర్కంబేల కైకొనకయున్నవారు? కావున మీరు వేషధారులగుదురు. వేషంబున బ్రాహ్మణులరే కాని యవయవసన్నివేశంబుల క్షత్రియులని తోఁచెడిని. తెలుపుఁడీ యని యడిగిన, నారాయణుం డాజరాసంధున కిట్లు బదులు చెప్పెను. బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులు స్నాతకులగుదురు. వారియందు మేము క్షత్రియజాతిస్నాతకులమని యెఱుంగుము. †మిత్రగృహంబును ద్వారముననే చొరవలయును. శత్రుగృహమును ద్వారమునఁ జొరరాదు. ఇది ప్రాక్తనాచారము. దాని ననుసరించితిమి ‡ గంధమునందుఁ బుష్పదామమునందు శ్రీదేవి

---

* తతోఽర్ధరాత్రే సంప్రాప్తే యాతో యత్రస్థితాః ద్విజాః, తస్య హ్యేతద్వ్రతం రాజన్ బభూవ భువి విశ్రుతం. స్నాతకాన్ బ్రాహ్మణాన్ ప్రాప్తాన్ శ్రుత్వా స సమితింజయః. ౩౭. అప్యర్ధరాత్రే నృపతిః ప్రత్యుద్గచ్ఛతి భారత. అని మూలము. సభా. ౨౧. అధ్యాయము.

†అద్వారేణ రిపోర్గేహం ద్వారేణ సుహృదోగృహాన్, ప్రవిశంతి నరాధీరా ద్వారాణ్యేతాని ధర్మతః. ౫౬. సభా. ౨౧. అధ్యా.

‡పుష్పవత్సు ధ్రువా శ్రీశ్చ పుష్పవంతస్తతో వయమ్. అనిమూలము.

నివసించును. కావున వానిం దాల్చితిమి. క్షత్రియులు ప్రార్థించి పుచ్చుకొనరు. కావునఁ బౌరుషక్రియనాశ్రయించి వాని గ్రహించితిమి. నీవలన మాకొకకార్యము కలదు. కావున నీయిచ్చు మధుపర్కము లోనగు వానిని గ్రహింపకున్నారము.

అనుమాటలు విని జరాసంధుఁడు మీకు నేను గాని, నాకు మీరుగాని యహితము చేసినది లేదు. కావున నేను మీకు నెట్లు శత్రువునైతిని. నిరపరాధిని. గుణయుక్తుఁడనై పూజ గావింపవచ్చితిని. దేవతలకు భూదేవతలకు సర్వదా భక్తిసేయు వాఁడను. వారిని బూజించుచుండు వాఁడను. క్షత్రియకులాచారములవదలని వాఁడను. అనిన జరాసంధునకు బదులిడఁదలంచి శ్రీవారి యిట్లుపలికెను రాజా! ఉత్తమక్షత్రియపథమునందుఁ బ్రవర్తిల్లువాఁడనంటివే. సాధువులగు రాజులు నీవలెఁ గ్రూరాత్ములై రాజులఁ జెఱఁబెట్టి పశువులను జేసి పశుపతియగు శంకరుని బూజించువారు గలరా. దీనికంటె మహాక్రూరకార్యమేది? దీనిచే జనులకప్రియుండవు కాక ప్రియుఁడ వెట్లగుదువు? నిర్దయుండై తనజాతివారి నెవఁడు వధించునో వానికంటెఁ బాపాత్ముఁడు లేదని పెద్దలుపల్కుదురు. నీవంటివారి నుపేక్షింపరాదని తలంచి యెల్లరను విశేషించి సాధువులను రక్షింపఁబూని నిన్ను శిక్షింప వచ్చితిమి. నాకంటె నధికుండొక్కండు కలఁడే యని పలుకకుము. ఈ పాండవులు నీమద మడఁగింతురు. అని పలుక జరాసంధుఁడు నటలూడఁదీయ రోషించు కుంజరాంతకుంబోలె మహాక్రోధకలుషితాంతరంగుఁడై శ్రీకృష్ణున కిట్లు పలికెను. అయ్యా! పరాక్రమమున శత్రువుల నోంచుట పాపమా. నేనెప్పుడును బరాక్రమధనుఁడను. దేవార్థము తెచ్చిన యీరాజుల నేనేల విడు

తును? నాశ_క్తి నీవెఱుఁగుదువుకదా. కృష్ణా! సైన్యములతోఁగాని మీమువ్వురతోఁగాని, మీలోనిరువ్వురతోఁగాని,యొక్కనితోగాని పోరాడుదును. మీ రెట్టియాయుధములంగొని పోరాడఁ దలంతురో తెలుపుఁడు. అనిన హరి యొకనితోఁ బలువురు మార్కొనిపోరుట . న్యాయముకాదు. మేమందఱ మధికబాహుబలములు గలవారమే. ఇట్టి మాలో నొక్కనిం గోరుకొనుము. మల్లయుద్ధమున వాఁడు నిన్నోంచును. ఆమాటలు విని యాబృహద్రథకుమారుఁడు వాయుతనయుఁడగు భీమునింగాంచి వీఁడు నాకుఁ దగియున్నవాఁడని కోరెను. అంత నాజరాసంధుఁడు తనకొడుకునకు సహదేవుఁడనువానికి నభిషేకముజేసి రాజ్య మప్పగించి పురోహితులు స్వ_స్త్యయన కర్మము నడపఁగా మల్లయుద్ధమునకుఁ బూనెను.

## జరాసంధుఁడు మృతినొందుట.

కా_ర్తికశుక్లప్రథమదినంబున నాభీమజరాసంధులు మల్లయుద్ధమున కారంభించిరి. అదిమొదలు త్రయోదశివఱకు యుద్ధముచేసిరి. ఆనాఁడు పోరాడుచుండఁగా నాఁడుగెలుపోటములు లేకుండెను. చతుర్దశినాఁటిరాత్రియందు జరాసంధుని హీనబలుంగా నెఱింగి కృష్ణుఁడు భీమసేనునితో మారుతాత్మజా ప్రతివీరుఁడు హీనబలుండయ్యెను. సకలరాజన్యహింసకుండగు వీనిని బొలియించి నీసామర్థ్యము మాకు నెఱింగింపుమని హెచ్చరింపఁగా భీముఁడు తనతండ్రియగువాయుదేవుందలంచి యతనికరుణ ననంతబలము గలుగ నాజరాసంధు నెత్తి త్రిప్పి భూమిపై వీచివైచి సకలావయవములనుండి శోణితధారలు ప్రవహింపఁ జేసెను. వాఁడు మృతినందెను. ఆకళేబరంబును

ద్వారంబునఁ బడ విసరివైచెను. మాగధులందఱు హరిశరణు చొచ్చిరి. వారికభయదానమిచ్చి కృష్ణుఁడు బంధింపఁబడినరాజుల నెల్ల విడిపించి రత్నరాసులు సహదేవుఁడు కానుకలీయ గ్రహించి వాని నొడఁబుమా యని యభయదానమున నలరించి రథము తెమ్మని పంచెను. ఆరథము పూర్వము తారకాసురసంగ్రామమునం దింద్రుఁ డెక్కి జయించెను. దానిని వసువసురాజు నింద్రునివలనఁ బడసెను. వసువునుండి బృహద్రథుఁడు సంపాదించెను. అది జరాసంధునకు సంక్రమించెను. దానినే శ్రీకృష్ణుఁడు తెమ్మని యాజ్ఞాపించి భీమవిజయులతో దానినెక్కి గరుడునిం దలంచి యతండు సాక్షాత్కరింప సారథ్యముచేయుమని యాన తిచ్చి యాతనిసారథ్యమున క్షణమాత్రమున నింద్రప్రస్థపురము చేరెను. జరాసంధునివధ కెల్లవారును సంతుష్టులై యిఁక ధర్మజు రాజ్యము రామరాజ్యమువలె నుండునని యానందించిరి. ఇంద్రప్రస్థపురంబున కరుదెంచి జరాసంధు నశ్రమంబునం జంపిన భీమసేనుంజూచి యేగుచుండిరి. అంత శ్రీకృష్ణునిచే విడిపింపఁ బడిన రాజులెల్లరు ధర్మరాజుంగాంచ నేతెంచిన నతండు వారి నుచితరీతి గారవించి పంపెను. శ్రీకృష్ణుఁడిట్టు లీకార్యము నిర్వహించి ధర్మరాజు వీడ్కొని ద్వారవతికిం బోయెను.

ఆర్యమహాశయులారా! జరాసంధునివధించినకథను బఠించితిరి. ఇందేమేని విశేషములుండునా యని పరిశీలింతము. ఇందుఁ బ్రధానములుగా రెండుమూఁడువిషయములు గలవు. వాని నాలకింపుఁడు. జరాసంధుఁడు పదునేడుసారులు మధురను ముట్టడించెను. సకలసేనలం బోఁగొట్టుకొనిపోయెను. బలరాముఁ డెన్నిపర్యాయములో నాతనిం జంపఁ బ్రయత్నించి

వానిం బట్టుకొనఁగా నాకాశవాణియు శ్రీకృష్ణుఁడును వలదని వారించిరి. ఏల? ఆజరాసంధునిజంపువాఁడు వేఱొకఁ డున్న వాఁడు. వీనిం జంపందగుకర్మము చేసినవాఁడుండఁగా నెంతబల శాలియైన నవతారపురుషుఁడైనను బలరాముఁడు వధింపఁ జాలఁడు. అట్లువధించిన భగవచ్ఛాసనము మార్చినవాఁడగును. కావుననే శ్రీహరి యెన్నియిడుమలనైన నోర్చుకొని కాలము నకు వేచియుండెను. తాఁ జెంతనుండినఁగాని భీముఁడు వధింపఁ జాలఁడని తోఁచినందున నాతనిం బిలుచుకొనివచ్చి చంపిం చెను. భగవంతున కిది యశక్యకార్యమా యన్నఁ గాదుగాని తనసిద్ధాంతమునే తాను మీఱఁడు. మీఱిన నెల్లవారును మీఱఁజూతురు. కాఁబట్టియే కర్మము బలవత్తరమన్న న్యాయ మును దృష్టాంతపూర్వకముగాఁ జూపఁబూనెను. జరాసంధుఁడు తనకర్మముచేతనే చంపఁబడియెను. కాని నిమిత్తభూతుఁడు భీముఁడు కావలయును. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని పలికెను. కావున నుపకారాపకారములులోకమున నెవ్వరికిఁ గాని యితరులమూలమునఁ గలుగవు. స్వస్వకర్మానుసారమే కలుగును. కాని యొకఁడు నిమిత్తమాత్రముగఁ గనఁబడు చుండు. భగవంతుఁడు చూచుచుండును. కావున సర్వసాక్షి యన్న పేరు భగవంతునకుం గల్గెను.

నారదముని పిలువనిపేరింటముగ వచ్చి పాండురాజు పలికినపలుకులుగాఁ గొన్ని తెలిపి రాజసూయముచేయ ధర్మ రాజును బ్రోత్సహించి తనపై భారములేకుండుటకుఁ బెక్కు విఘ్నములు గలుగుననియుఁ బెక్కుమంది రాక్షసు లాయజ్ఞమును జెఱుపనెంతురనియుఁ బిమ్మటఁ బ్రజాక్షయకరమగు యుద్ధము

పొగుననియుఁ జెప్పిపోయెను. ఇట్టికష్టములు కలుగునని తోఁచి
నను గర్మము పురికొలుప ధర్మరా జందుల కంగీకరించెను.
ఇందుఁ గర్తృత్వ మెవ్వరికిని లేదు. కర్మమునకుం గలదని
యూహింపుఁడు. జరాసంధునియుత్పత్తి యీకాలపువారి
కాశ్చర్యమును గొలుపక పోదు. ఇట్టివి పుక్కిటిపురాణములు
గాని సత్యములు కావనువారును బెక్కుమంది గలరు.
పాపము ! సృష్టిచమత్కృతి వారికిం దెలియదు. పరమే
శ్వరసామర్థ్యము వా రెఱుంగఁజాలరు. కూపకూర్మములవలెఁ
దాము చూచినదే సృష్టియని తమ రెఱింగినదే ప్రపంచమని వా
రూహింతురు. ఒక్కయోషధిని వ్రేలాడఁజేసిన నది చిగిరించి
యాకుల వెలువరించి తీఁగను సాగించును. వేఱొక్కయోషధి
యట్లొనర్చినఁ జచ్చును. దానిస్వభావమనుట తెలివితక్కువయే.
భగవంతుఁ డద్దాని నట్లుకల్పించుట కెన్నియో కారణము లుండు
ను. అవి మనకుఁ దెలియవు. తెలిసినట్లు నటించిన లాభమేమి?
ఏపదార్థ మేరీతిగానైనను సృజించునేర్పు భగవంతునకుం గల
దు. భగవచ్ఛక్తి నెఱింగినవార లిట్టు లచ్చెరువొందరు. బ్రహ్మ
రక్షస్సులు సర్వదా బలిని గోరుచుండును. వానికిఁ దృప్తిచేయక
యున్న నవి మనుష్యుల భక్షించును. అడవియందు దివ్యరూప
మున నలరుకాంత లుందురు. దర్శనమాత్రమున మనుజులు
పొలియుదురు. వారి నవ్వి భక్షించును. ఇట్టి సృష్టిరహస్యములు
మనపూర్వు లెఱింగియే యుండిరి. ఈకాలమున నట్టియోగ్యత
యనఁగాఁ దపశ్చర్య నశించినది. యోగనిష్ఠ నామమాత్రావశిష్ట
మైనది. కావున దివ్యజ్ఞానము పుస్తకములయందే యగపడుచు
న్నది. ఉపన్యాసవేదాంత మెక్కువ యైనది. తదనుభవము గగన

కుసుమ మైనది. కావున నన్నియు నిప్పటివారికి విచిత్రములే. అసంగతములే. అసంభవ ప్రాయములే. ఏమిచేయవచ్చును? ఎట్లు నమ్మించవచ్చు? ఎట్లు వారి కివి సుసంగతములని కారణములు తెలుపవచ్చు? ఇపుడు ఆముష్మికచర్చ యంధకారస్వల్పవస్తు గవేషణమువలె నున్నది. దీపము కావలయునని తోఁచుటలేదు. వెదకుద మనువారే మిక్కిలిగా నున్నారు. ముందేది దారియని యెఱుంగఁ గలవారు కానరారు. ఇంకనైనఁ దపోనిష్ఠ నారంభింపఁడు. యోగాభ్యాసమునకు మొదలిడుఁడు. ఇవి రెండును లేనినాఁడు దక్కినవన్నియుఁ బనికిరావు. మనశ్శక్తి చేకూరదు. అది లేకున్న నేకార్యము ఫలింపదు.

ప్రకృతము సకలప్రాణికోటులు సంగరమున మృత్యు వక్త్రబిలమును జొరఁబూనియున్నవి. ఇతరుల ప్రోత్సాహ మక్కఱలేదు. తమంతకు తామే పయనమై పెండ్లికిఁ బోవునట్లు మృత్యువుచెంతకు నడచుచున్నవి వానిని రక్షింప నెవ్వనికిఁ దరము? వాని నాప్రయత్నమునుండి మానిపింప నెవ్వఁడు శక్తుఁడు? శ్రీహరి తదనుగుణాలాపప్రయత్నములను జేయుచున్నాఁడు. సర్వమును జూచుచున్నాఁడు. స్వస్వకర్మనిహతులై ప్రాణులు యమునిచెంత కేగుచున్నవారు. కావున భారతసంగరమును జక్క నెఱుంగఁదగినది. పరమేశ్వరువిచిత్రచరిత్రము స్మరింపఁదగినది. స్మరించినంతన చాలదు. పరిశీలింపఁ దగినది. పరిశీలించినంతన చాలదు. యోగనిరతి దానితత్త్వ మెఱుంగఁదగినది. బ్రహ్మానందమునకన్న నీయానందమే మిన్నయనవలయు. ఇన్నియు సాగుచుండ నన్నింటికిఁ గారణభూతుఁడై సర్వేశ్వరుఁ డేమియు నెఱుంగనట్లు నటించు చున్నవాఁడు. ఆమహాత్మునితో నిరంత

రము మెలఁగుచుండువారలే తత్ప్రభావమును మఱచుచుండ నిఁక నెఱుంగువా రెవరు? ఊరక తన్నామమును స్మరించుచు మహాత్మా కాపాడుమా యని వేఁడుటకంటె మనము చేయఁ దగినకార్య మింకొక్కటి లేదని తెలుప సాహసించుచున్నాఁడను. ఇంకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

## ధర్మరాజు రాజసూయము చేయుట.

*రాజులు ధర్మరాజసత్కృతులై తమతమ నివాసములకుం బోవఁగా హరి ద్వారవతికిం జనఁగా ధర్మరాజుననుమతి ననుజులు రాజసూయయాగాంగముగ దిగ్విజయయాత్రకుం బ్రయాణమైరి. అర్జునుఁ డుత్తరదిశకుం బోయెను. భీముఁడు తూర్పుదెస జయింప నరిగెను. సహదేవుఁడు దక్షిణభాగము జయింపఁ బయనము సాగించెను. నకులుఁడు పడమరదేశమును జయింప వెడలెను. ఈనలుగురు నిర్విఘ్నముగా విజయయాత్ర సాగించిరి. మార్కొన్నరాజులతోఁ బోరి యోడించిరి. కానిక లర్పించినవారిజోలి పోవకుండిరి. ఇట్లీదిగ్విజయయాత్రయం దపరిమితరత్నలాభము గలిగెను. గజాశ్వరత్నము లసంఖ్యాకములుగా లభించెను. ఈ రెండింటికి మించి విజయలక్ష్మి చేకూరెను. ధర్మరాజు ప్రఖ్యాతికి మించిన విఖ్యాతి యెందును లేకుండెను. ఇంద్రప్రస్థనగరవిఖ్యాతి దిగ్దిక్కుల నలంకరించెను. విశాలవీథులు గలయాపురము రథగజఘోటకములచేఁ గ్రిక్కి

---

* ఈకథ శ్రీ మహాభారతము సభాపర్వమున నిరువదేనవ యధ్యాయము మొదలు కొన్నియధ్యాయములనుండి సంగ్రహింపఁబడినది. శ్రీ భాగవతము ౧౦ స్కం. ౭౪ అధ్యాయమునుండియుం నీకథ సంగ్రహింపఁబడిన దనియుం దెలియఁగ నగు.

రిసియుండెను. కోశాగారములు రత్నగేహములయ్యెను. ఆ కాలమున సువర్ణరజతములు నిర్మాల్యములయ్యెను. నవరత్నములకే యించుక విలువగలదు. ఇట్లు నలుగురుసోదరులు మహార్ఘవస్తువులం దెచ్చి నగరమున నింపిరి. ఎందునుగాని యోటమిగల్గెనన్నమాట వినరాకయుండెను. స్వర్గమున నారదాదిమహర్షులు ధర్మజునీతిని దత్సోదరులపరాక్రమములను బొగడఁజొచ్చిరి.

అంత ధర్మరాజు రాజసూయయాగమునకు వలయు సంభారముల నన్నింటిని గూర్ప నాజ్ఞాపింప నియోగులట్లే కూర్చిరి. ఇంచుకంతయుఁ గొదువలేకయుండ నన్నిపదార్థములు సిద్ధము చేయఁబడియెను. ఋత్విక్సముదాయము చేరెను. మహర్షులాయాగమునఁ బ్రాయశ్చిత్త మనునది కలుగకయుండఁ జూచుచుండ నాదృతివహించిరి. వ్యాసాదు లాయాగంబును జూచుచుండ సంప్రార్థితులైరి. సదస్యులుగ నుండువారును మహర్షులే. ఆయాగమునకు నానాదేశములనుండి రాజు లాహూతులై సపత్నీపుత్రబాంధవపరిజనముగా నరుదెంచిరి. వారివారి కనురూపములగు గృహములు సిద్ధము చేయఁబడియెను. దేవతలు సిద్ధులు సాధ్యులు నాయాగమును జూడ నేతెంచిరి. ఈయాగ మెందులకో యెవ్వరెఱుంగరు. దేవతలు స్వకార్యార్థమని యెఱుంగుదురు. శ్రీహరి యొక్కఁడే యంతయు నెఱుంగును. మహర్షులలో వ్యాసాదు లెఱుంగుదురు కాని యెవ్వరును దీని నిట్టిచెట్టులు గలుగునని ధర్మరాజునకుం దెల్పువారుగాని తెల్పంబూనువారుకాని లేకుండిరి. ఏల? భగవంతుఁడందఱను మాయచే నాచ్ఛాదించెను. తనయవతారమునకు ఫలాంగ మీరాజసూయమేకదా. ఇట్టు లింద్రప్రస్థపురమున యజ్ఞసంభారములు

సిద్ధములు కాఁగా శ్రీహరి ద్వారకానగరమునుండి బంధువ్రాతముం గూడి యరుదెంచెను. ధర్మజప్రముఖు లామహాత్మున కెదురుగాఁ బోయి దోడుకొనివచ్చి యుచితసౌధమున విడియించిరి. తదాజ్ఞప్రకారము మెలఁగఁ బ్రయత్నించిరి. ఏక్షణమున నామహాత్ముఁ డేమి యాజ్ఞాపించునో యని సోదరులందఱు వేచియుండిరి. ఆమహాత్ముఁ డాయాయి కాలముల నాయాయిపనులఁ జక్కఁగా నెఱవేఱఁ జేయుచుఁ దన కార్యమును సాగింపఁ దలంచుచుండెను. ఎవ్వరెవ్వ రేయే కార్యములను జేయవలయునో యనువిషయము సిద్ధాంతితమయ్యెను. వా రాయా కార్యముల యందప్రమత్తులై యుండిరి. ఆయాగమునం దెవ్వరికిఁగాని యేవిధమునందును గొఱంత యనునది కలుగఁగూడదని ధర్మరాజునాశయ మైయుండెను. తదనుగుణముగాఁ బ్రవర్తింప సోదరులు తక్కుంగల పరిజనులును బద్ధాదరులై యుండిరి. భగవంతుఁ డన్నింటిని గాంచుచు నిర్విఘ్నముగా దానిని సాగింపఁ బూనియుండెను. ఇంకఁ గొదువ యేల కల్గును? దుర్యోధనాదులు నాయజ్ఞమున కాహూతులై యేతెంచిరి. అందఱును సోదరులే కదా. వారును భీమాదులతోడఁ గలిసి సర్వకార్యములను జక్కఁగ నెఱవేర్ప సంసిద్ధులై యుండిరి.

శాస్త్రోక్తపద్ధతి యజ్ఞమండపము సంసిద్ధ మయ్యెను. ధౌమ్యాదులు విధి నించుకంతయు నతిక్రమింపక సాగింప నడుములు కట్టుకొని యుండిరి. విరాట్ద్రుపదులు శిశుపాల గాంధారనాయకులు భగదత్తుండును శక సాల్వ బృహద్బల చంద్రసేనసముద్రసేన కుంతిభోజ పౌండ్రకవాసుదేవులును వసుదేవబలదేవప్రద్యుమ్న శూరసేనులును దక్కుంగలయదువృష్ణి

భోజాంధకులును ప్రధానులుగా నుండిరి. నాలుగు సంద్రముల నడుమ నున్నరాజు లెల్లరు వచ్చిరి. తమనగరముల నున్నయట్లే వారలెల్ల విడిదుల నుండిరి. ఆపద్ధతి యెందు నేకాలమందును గన్నది విన్నదియు లేదని యెల్లరంగీకరించిరి. భీష్మద్రోణద్రౌణి కృపాచార్యులు ధృతరాష్ట్రవిదురసోమదత్తకర్ణులు భూరిశ్రవః ప్రభృతులు ధర్మరాజసత్కృతులై కార్యనిర్వాహణమునందాదృతిం గాంచిరి. * వారిని దర్శించి ధర్మరాజు వినయమున దోసిలొగ్గి

ఆ. "మీాయనుగ్రహమునఁ జేయంగఁ గడఁగితి
నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ
దీనినందఱును సమానంబుగాఁ బూని
పెంపు మెఱసి నిర్వహింపవలయు." (నన్నయభట్టు.)

అని ప్రార్థించెను. వారెల్ల నాయుధిష్ఠిరునియాదృతికి వినయాదిసద్గుణసంపత్తికిఁ గడునలరి యట్లే చేయుచుండిరి. అందుఁ గృపాచార్యుఁడు హిరణ్యరజతరత్నదక్షిణాదానవిషయములయందు నియోగింపఁబడియె. కృతాకృతపరిజ్ఞానంబునందు భీష్మద్రోణులు నియమితులయిరి. సకలవస్తువుల వ్యయించుకార్యమున విదురుఁడును, నానాదేశసమాగతరాజన్య

* పితామహం గురుం చైవ ప్రత్యుద్గమ్య యుధిష్ఠిరః, అభివాద్య తతో రాజన్నిదం వచన మబ్రవీత్. ౧. భీష్మం ద్రోణం కృపం ద్రౌణిం దుర్యోధన వివింశతీ, అస్మిన్ యజ్ఞే భవంతో మా మనుగృహ్ణంతు సర్వశః. ౨. ఇదం వస్సుమహాచ్చైవ యది హాస్తి ధనం మమ, ప్రణయంతు భవంతో మాం యథేష్ట మభిమంత్రితాః. ౩. సభాపర్వము. ౩౫ అధ్యాయము.

ప్రదత్తోపాయనపరిగ్రహణంబున దుర్యోధనుఁడును, భక్ష్యభోజ్యాదిపదార్థవినియోగంబున దుశ్శాసనుండు నియోగింపఁబడిరి. ఆయజ్ఞమందిరమున బ్రహ్మతేజము క్షత్రియతేజము రత్నతేజమునను నీమూఁడును దమతమ యోగ్యతలను దెలుపఁజాలియుండెను. ఇంచుకేని ప్రాయశ్చిత్తము కలుగక సాగుచుండెను. వేదనాదము దివమునావరించెను. ఆశిర్వదన నాదము దిక్కులం జెవుడ్పడంజేసెను. వాద్యనినదము నగరము నావరించెను. జనుల వాక్యమహానాద మెద్దానినవ్యక్తముగ నొనర్చెను. ఇట్టు లా రాజసూయయాగము సక్రమముగా సాగెను. అగ్నిముఖమున దేవతలు సంతృప్తులయిరి. దక్షిణలచే యాజకులు పరితృప్తినొందిరి. విహితమర్యాదాదులను, యథేష్టాన్నదానమునను దిదృక్షువులు సంతృప్తులైరి. తృప్తినొందనివా రందుఁ గానరారు. ఈ విధముగా నామహాయజ్ఞము సాంగముగా సాగెను.

## సభాపూజ.

యాగోత్తమము సాంగముగా సవిధిగా సాంతము కాఁగా నెల్లరు నొక్కచో సభ చేసిరి. ఆసభ దేవసభను మించియుండెను. సభాపూజ సేయుసమయ మరుదెంచెను. అర్ఘ్యమందుంచిరి. *నారదుం డాసభాంగణమున నాసీనుఁడయి యున్న పరాత్పరుని పరమేశ్వరుని నారాయణుని ధ్యానించి భూభారహరణార్థము యదువంశంబున నవతరించుట లోనగుకథలం

* భాగవతమునందు సహదేవుఁడు కృష్ణుని దొలుతఁ బూజింపవలయు నని పల్కఁగా నందఱు సమ్మతించినట్లు గలదు. భారతమున భీష్ముఁడుచెప్పినట్లును సహదేవుఁ డాయర్ఘ్యమును దెచ్చినట్లున్నది. భేద మింతియే యని యెఱుంగ వలయును.

దలంచెను. ఈఘట్టమున మూలగ్రంథములయం దిట్లున్నది.

శ్లో. "ఇతి నారాయణశ్శంభుర్భగవాన్ జగతః ప్రభుః,
ఆదిశ్యవిబుధాన్ సర్వాన జాయత యదుక్షయే. ౯
సహదేవ స్తథాబ్రవీత్. (సభాపర్వము 36 అధ్యా.)
అర్హతి హ్యచ్యుతశ్శ్రేష్ఠ్యం భగవాన్ సాత్వతాంపతిః,
ఏష వై దేవతాస్సర్వా దేశకాలధనాదయః. ౨౦
యదాత్మకమిదం విశ్వం క్రతవశ్చ యదాత్మకాః,
అగ్నిరాహుతయో మంత్రాస్సాంఖ్యం యోగశ్చ యత్పరః.
ఏకఏవాద్వితీయోఽసౌ వై తదాత్మ్యమిదం జగత్,
ఆత్మనాత్మాశ్రయస్సభ్యాస్సృజత్యవతి హంత్యజః. ౨౨
వివిధానీహ కర్మాణి జనయన్ యదపేక్షయా,
ఈహతే యదయం సర్వశ్శ్రేయోధర్మాదిలక్షణమ్. ౨౩
తస్మాత్కృష్ణాయ మహతే దీయతాం పరమార్హణం,
ఏవం చేత్సర్వభూతానామాత్మనశ్చార్హణం భవేత్. ౨౪
సర్వభూతాత్మభూతాయ కృష్ణాయానన్యదర్శినే,
దేయం దాంతాయ పూర్ణాయ దత్తస్యానంత్యమిచ్ఛతా.
ఇత్యుక్త్వా సహదేవో భూ త్తూష్ణీం కృష్ణానుభావవిత్,
తచ్ఛ్రుత్వా తుష్టువుస్సర్వే సాధుసాధ్వితి సత్తమాః." ౨౯
(శ్రీభాగవతము. ౧౦ స్కం. ౭౪ అధ్యా.)

సహదేవుఁ డంతట నాపూజాపాత్రముందెచ్చి సభలో నునిచెను. సకలలోకపూజ్యుఁడు, సర్వదేవాదిదేవుఁడు, సర్వకర్త, సర్వరక్షకుఁడునని వేనవేలువిధంబులఁ బొగడఁదగిన శ్రీమన్నారాయణుం బూజింప నన్నిలోకములు పూజింపఁబడినట్లే

యగునని పలికెను. ఎల్లవారు నామాటల కానందించిరి. ఈభాగమున మహాకవిపోతన

ఉ. "కాలము దేశముం గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్త
యుఁ జగజ్జాలము దైవముఁ గురువుఁ సాంఖ్యము మంత్ర
ము నగ్నియాహుతుల్, వేళలు విప్రులుఁ జననవృద్ధిల
యంబుల హేతుభూతముల్, లీలలు దానయై తగ వెలిం
గెడునెక్కటి తేజ మీశుఁడుఁ.

చ. ఇతఁడె యితండు కన్నులొకయించుక మోడ్చిన నీచరాచర
స్థితభువనంబు లన్నియు నశించు నితం డవి విచ్చి చూచినఁ,
వితతము లై జనించుఁ బ్రభవిష్ణుఁడువిష్ణుఁడునైనయట్టియీ
క్రతుఫలదుండు గాకొరుఁడొకం డెటులర్హుఁడుశిష్టపూజకున్.

ఉ. ఈపురుషోత్తముఁ జగదధీశు ననంతుని సర్వశక్తుఁ జి,
ద్రూపకు నగ్రపూజఁ బరితోషితుఁ జేయ సమస్తలోక
ముల్, వే పరితుష్టిఁ బొందుఁ బృథివీవర కావున నీవు
కృష్ణునిఁ, శ్రీపతిఁ బూజచేయు మెడ సేయక మాటలు
వేయునేటికిఁ."

అనివ్రాసి తన యపారచమత్కృతిని దెలిపెను. అంత ధర్మరాజు డోలాందోళితమానసుండయ్యెను. అనేకు లిందున్నారు. ఎవ్వరిభావ మెట్లుండునో భగవంతుఁడని మనము పూజించినను బంధుత్వాభిమానమున నిట్లు చేసెనని యందురేమో వృద్ధు లెవ్వరైన నిమ్మాట మఱొకపర్యాయముచెప్పిన బాగుండునే యని యూహించుచుండెను. అంత సభలో నొక్కఁడేని నోరుకదల్పక యుండెను. అవిధమెఱింగి సకలవేదార్థరహస్య తత్త్వవేత్తయగు భీష్ముఁడు ధర్మరాజుశంకం బాపందలంచి

యిట్లనియె. రాజా సభాముఖమునఁ బూజ్యులు కొందఱని శాస్త్రములు తెలుపుచున్నవి. స్నాతకుఁడు, ఋత్విజుఁడు, గురువు, ఇష్టుఁడు (సర్వసుజనేష్టుఁడు) రాజు, సంయమీంద్రుఁడు అను నీయార్వురు పూజ్యులు. వీరిలో నన్నిగుణముల నెవ్వఁడు పెద్దయో వానింబూజింపుము. అనిన విని ధర్మరాజు గాంగేయుం గాంచి మహాత్మా! అట్టివాని నీవే యొఱింగింపుమా యని ప్రార్థించెను. భీష్ముఁడానందమంది భగవంతుని ధ్యానించుచుఁ గరయుగంబుమోడ్చి రాజా ! వినుము.

సీ. "రోదసీకుహరంబు ♦ రుచిరాంశుతతిఁజేసి
యర్కుండు వెలిఁగించు ♦ నట్టు లమృత
సందోహనిష్యంద♦ చంద్రికఁజేసి శీ
తాంశుఁ డానందించు♦నట్టు సకల
జనులకుఁ దనదైన ♦ సదమలద్యుతిఁజేసి
తనరంగఁ దేజంబుఁ ♦ దనుపుఁ దాన
చేయుచు నున్నస ♦ త్సేవ్యుండు పుండరీ
కాక్షుండు కృష్ణుఁ డ♦నాదినిధనుఁ

ఆ. డబ్జనాభుఁ డుండ ♦ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలరె ♦ యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు ♦ నచ్యుతుఁ బూజింపు
మధిప! యదియ చూవె ♦ యజ్ఞఫలము."

అని భగవన్మహిమమును దెలియఁజెప్పి యాశ్రీకృష్ణుం బూజింపక వేఱొకనిఁ బూజింపఁ దలంపనేల యని యుచ్చైస్స్వరంబునఁ బల్కెను.

ఆపలుకు లాకర్ణించి యాసభలోనున్నవా రెవ్వరును బదులుచెప్పకుండుటేగాక తమయానందమును దెలిపిరి. అంత సహదేవుఁడు తెచ్చియునిచియున్న యర్ఘ్యంబు సర్వోత్తముం డగు శ్రీకృష్ణున కొసంగి ధర్మజుండు కృతకృత్యుఁ డయ్యెను. శ్రీకృష్ణుఁడు దానిం గైకొనుచుఁ దనకర్తవ్య మెద్ది యని యాలోచించెను. సుదర్శనంబును బిలుచుసమయ మింకఁ గొలఁది నిమేషములలో నున్నదని తలంచెను. ఇంతలోఁ దనదుష్కర్మము పురికొలుపఁగా నాసభామధ్యంబుననున్న శిశుపాలుఁడు దానిం గాంచి యోర్వఁజాలక యందఱు వినుచుండ శ్రీకృష్ణుం గాంచి యుపాలంభించుభావము స్పష్టముగాఁ దేటపడఁగా నాక్షేపించుస్వభావముకలవాఁడు గావున నిట్లు పలికెను. ధర్మనందనా! ఈసభామండపమున భూపాలకవరేణ్యు లెందఱో యున్నవారు. సదాచారసంపదగల భూదివిజులున్నవారు. గంగాపుత్రునిదుర్బుద్ధిని గైకొని నీచప్రవర్తకుఁడు వార్ష్ణేయుఁడు నగుకృష్ణుని బూజించితివి. దీన నీయవివేకము తెల్లమయ్యెను. రాజా! ఇంచుక యోజింపుము. దాశార్హుఁడు పూజార్హుఁడగునా? అని భీష్ముని నందఱకుం జూపుచు లోకమున ధర్మతత్త్వ మెఱుంగుట శక్యముగానిపని. ధర్మతత్త్వ మెఱుంగని యీధర్మరాజును మిత్రునివలె నేమో పలికి నమ్మించి వాసుదేవుని బూజింపుమనియె. ఈకృష్ణుఁడు జడుఁడు. భీష్ముఁడు ధర్మము లేమిరియెఱుంగును? అవివేకుఁడు. వృద్ధులగువారు దీనింగాంచి చింతాసాగరమున మునుంగరా. ఈయాదవుఁడు నీకుం గూర్చుచుట్టమయేని ద్రవ్యమొసఁగుము. మఱియు నేమికోరిన నొసంగుము. అంతియకాని పవిత్రతమభూసురులును, నిర్మలవిఖ్యాతింగాంచిన భూపా

లకులునుండునిండుసభలో శాస్త్రసమ్మతమయి శిష్టజనార్హమయి యలరు నీమర్యాదకుఁ దగనియీతని నర్చించుట న్యాయమా? ధర్మనందనా! ముదుసలియని పూజించితా వసుదేవుఁడున్న వాఁడుకదా. ఋత్విజుండని పూజించితి నందువా వేదవ్యాసుఁడుండఁడా. ఆచార్యుఁడు గాన వినయముమీఱ గారవించితి నందువేని ద్రోణాచార్యుఁడు కృపాచార్యుఁడు లేరా భూనాయకుఁడుకూడఁ బూజ్యుఁడని యెంచి యర్చించితినందువేమో యాదవులు రాజకోటిలో నెన్నఁదగువా రగుదురా? పూజార్హులగువా రెందఱో యిందుండఁగాఁ గృష్ణు నేమని పూజించితివి? గాంగేయునిపలుకుల నాలకించి కడుంగడు మూర్ఖుఁడవైతివి. ఇంతకుముందుఁ బురుషవిశేషుఁడని, యుత్తముఁడని రాజపంక్తిఁ బూజ్యుఁడని విఖ్యాతిఁగంటివి. ఇందులకే నీయాగమునుజూడ నిందఱురాజులు మర్యాదకుఁ గొఱంతయుండదని యేతెంచిరి. ఇట్టివారినందఱ నీవిధంబునఁ దిరస్కరించుట నీకుఁ బాడిగాదు సుమీ! యమనందనా! నీవెఱుఁగక యొకవేళ నిచ్చినను సభాముఖమున నిట్టిదానిఁగొనుట నాకు న్యాయముకాదని గోవిందుఁడు పరిగ్రహింపకయుండవలసినది. దొరకినదే చాలునని యతఁడంగీకరించెను. పేడికి వివాహముచేసినట్లు బధిరునకు సంగీతము జాత్యంధునకు సుందరరూపదర్శనము నెట్లుచితములుగావో యీయర్ఘ్యశ్రీ మీగోవిందున కుచితముకాదు. ఈఘట్టమున శ్రీమద్భాగవతమునందు

శ్లో. "తపోవిద్యావ్రతపరాన్ జ్ఞానవిధ్వస్తకల్మషాన్,
పరమర్షీన్ బ్రహ్మనిష్ఠాన్ లోకపాలైశ్చ పూజితాన్. ౩౮
సదసస్పతీ నతిక్రమ్య గోపోయం కులపాంసనః,

యథా కాకః పురోడాశం సపర్యాం కథ మర్హతి. 3౫
వర్ణాశ్రమకులాపేతః సర్వధర్మబహిష్కృతః,
స్వైరవర్తీ గుణైర్హీనస్సపర్యాం కథ మర్హతి. 3౬
యయాతినైషాం హి కులం శప్తం సద్భిర్బహిష్కృతమ్,
వృథాపానరతం శశ్వత్సపర్యాం కథ మర్హతి. 3౭
బ్రహ్మర్షిసేవితాన్ దేశాన్ హిత్వైతే బ్రహ్మవర్చసం
సముద్రం దుర్గమాశ్రిత్య బాధంతే దస్యవః ప్రజాః. 3౮
ఏవమాదీన్యభద్రాణి బభాషే నష్టమంగళః,
నోవాచ కించిద్భగవాన్ యథా సింహశ్శివారుతమ్." 3౯

—ఈవిషయము మహాకవిపోతన

సీ. "గురుదేవశూన్యుండు కులగోత్రరహితుండు
తలిదండ్రు లెవ్వారొ తడవఁగాన
మప్పులఁ బొరలెడు నాదిమధ్యావసా
నంబులం దరయ మానంబు లేదుఁ
బహురూపి యై పెక్కుభంగుల వర్తించు
వావివర్తనములు వరుస లేవు
పరికింప విగతసంబంధుఁడు తలపోయ
మానిమిత్తంబున మానినయ్యెఁ
తే. బరఁగ మున్ను యయాతిశాపమునఁ జేసి
వాసి కెక్కద యీయదువంశ మెల్ల
బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు
బ్రహ్మఋషిసేవ్యుఁ డగునె గోపాలకుండు.
క. జారుఁడు జన్మావధియును
జోరుఁడు మువ్వేకలాఁడు సుమహితపూజా

చార క్రియలకు నర్హుండై
వారక యితండనుచు నశుభకవాక్యస్ఫూర్తిన్."

అని వ్రాసి తనభక్తిపారవశ్యమును వెల్లడించిరి. మూలమునందుం గలవిశేషార్థము లిందు స్వచ్ఛముగాం గానంబడియెడు. ఓర్వలేనితనమున నోడలు తెలియక ప్రేలుచున్న శిశుపాలునినోట భగవంతుండేగాని మానవమాత్రుండు కాం డన్నయర్థముగలమాటలు వెడలునా యని ప్రశ్నింతురేమో. ఈప్రశ్నమంత మంచిదిగాదు. ఏలనంగా, జయవిజయలు శాపగ్రస్తులై మూండుజన్మములయందు శ్రీహరితో ద్వేషించి ముక్తినొందునట్లు పురాణములు చెప్పుచున్నవి. ఇది మూండవజన్మము. క్షణకాలమున నీపాడుజన్మము పోవనున్నది. వైకుంఠమున కరిగి భగవత్సేవజేయుకాలము ముహూర్తమాత్రముగ నున్నది. అట్టిసమయమున భావిశుభ మనుపమానమై రాంబ్రతీక్షించుచున్నపుడు ముక్తికాంతాకటాక్షపాతముననైన నీపాటిమంచిమాటలు రాకమానునా యనునదియే సమాధానము. ఆకస్మికముగా నాశబ్దములు దొరలంగూడదా యన్నదానికి నిదియే సమాధాన మనవలయు.

*ఇట్లాశిశుపాలుండు పలికి యిట్టి యమర్యాదగలచోట నుండరాదని సభవదలిపోయెను. తత్పరిజనులాతని వెంబడించిపోయిరి. ఎల్లరకు సన్మానముచేయునిష్టము గలవాండు కావున ధర్మరాజు శిశుపాలుని వెనుకనె పోయి సాంత్వనోక్తులనాతని నిలుపుచు నార్యా! మీవంటిసద్గుణోత్తరులకు వాక్పా

* నేదం యుక్తం మహీపాల యాదృశం వై త్వముక్తవాన్, అధర్మశ్చ పరో రాజన్ పారుష్యంచ నిరర్థకమ్. సభా ౩౭ అధ్యా. ౨ శ్లో.

రుష్యము పనికిరాదు. అది యతిభయంకరము. విషముకంటెను దుర్గుణముకలది. కావున దానిని వదలుము. కృష్ణుఁడన సామాన్యుఁడుకాఁడు. తొలునొలుతఁబుట్టిన బ్రహ్మపుట్టుట కితఁడే కారణము. సకలవేదవేదాంతము లీమహాత్మునే ప్రశంసించుచున్నవి. లోకములకాది యీతఁడే. సకలలోకపూజ్యుఁడు. ఈవిషయము నెఱింగియే కురుపితామహుఁడు శ్రీకృష్ణుఁడే పూజార్హుఁడని తెల్పెను. ఇది యుక్తము కాదనవచ్చునా? శిశుపాలా! నీవు కడుం జిన్నవాఁడవు. పరమార్థ మెఱుంగఁజాలవు. అజ్ఞాననాశకుఁడగుకృష్ణుని భీష్ముఁ డెఱింగిన ట్లితరు లెఱుంగరనుట నిక్కము. పెద్దలచరితములు విచిత్రములుసుమీ! సకలలోకగురువనిసద్గుణోత్తరుఁడని నీకంటె వృద్ధులగురాజులెల్లఁ గృష్ణునిం బొగడిరి. ఆమాటను గాదనం దగునా. అని పెక్కుభంగుల నాశిశుపాలుని శాంతచిత్తునిగాఁ జేయుచుండు ధర్మరాజుం గాంచి భీష్ముం డాగ్రహంబున యుధిష్ఠిరా! దుర్నయముగలవాఁడీశిశుపాలుఁడు. మూర్ఖుఁడు. ఇట్టివాని నేల ప్రార్థించెదవు? ధర్మస్వరూపం బెఱుంగ నిట్టివానికి శక్యమా? అనిపలికి యంతతో నూరకుండక శిశుపాలునింగాంచి శిశుపాలా! అవినీతబుద్ధివై శ్రీహరి కీపాటియర్ఘ్య మయోగ్యమంటివికదా. నీవు మూర్ఖుఁడవు. నీకొఱకై పలుకవలసివచ్చినది. ఈసభలో నున్నవారెల్ల నీహరికరుణచే ముక్తులుగావలయును. తద్విజితులే యని నమ్ముము. మఱియొకభంగిఁ జెప్పవలనుపడునా? లోకమున నుత్తమజ్ఞానవృద్ధుఁడై యున్నచో బాలుఁడయ్యును వాఁడే బ్రాహ్మణులలోఁబూజ్యుఁడు. అమితవిక్రమసమృద్ధిచే క్షత్రియుఁడు బాలుఁడయ్యును బూజ్యుఁడే. ఈ రెండుకారణములంబట్టి శ్రీహరియే

యీయార్ఘ్యమునకు నర్హుఁడు. అంతియకాదు. సకలజగదాధా రుఁడు. త్రిలోకపూజ్యుఁడుసుమీ! ఇంతకంటె వృద్ధులు పెక్కు మందికలరని యెఱుంగకపోలేదు. బుద్ధివిశేష మెవ్వరికింగలదో యతఁడే పూజ్యుఁడని హరిం బూజించితిమి. ఎవ్వనిఁ బూజింప ముజ్జగములు సంతృప్తినందునో యట్టిశ్రీకృష్ణుని బూజించితిమి. ఎవ్వనిఁ బూజింప నితరు లతృప్తినొందుదురో యట్టి వానిం బూజింపరాదని శాస్త్రమర్యాద. అని పెక్కునీతులు పలికి భీష్ముఁ డూరకుండునంతలో సహదేవుఁడు లేచి *సభాపూజ్యుఁ డీశ్రీహ రియే యని యీయార్ఘ్యము పెద్దలుచెప్పినట్లే యిచ్చితిమి. ఎవ్వరే నిది యసంగతమని పలుకుదురో వారిశిరంబులపై నాయీచరణము నునిచెదను. అని పలుకఁగా నందఱురాజులు భీతులై యూరకుండిరి. అంబరమునుండి శ్రీమురారిపైఁ బుష్ప వృష్టి గురిసెను. జయము జయమని నాదములు వినంబడి యెను. నారదుఁడు చెలరేఁగి యాడసాగెను.

అత్తఱి శిశుపాలునసుమతంబునఁ దత్సేనానాయకుఁ డగు సునీంధుఁడు మహోత్తరరోషంబున రాజులనెల్ల నొక్క పక్షంబునంజేర్చి యుద్ధసన్నాహ మొనరించెను. చతురంగబల ములుకదలెను. మహోత్తరసంగ్రామసూచనలు పొడకట్టెను. ఆమ హాక్షోభము నెఱింగి ధర్మరాజు భయము సంభ్రమము మనంబు నంబిరిగొన భీష్ముంగాంచి గాంగేయా! రాజులందఱు యుద్ధసన్న

* కేశవం కేశిహంతార మప్రమేయపరాక్రమమ్, పూజ్యమానం మయా యో వః కృష్ణం న సహతే నృపః. ౨. సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదం నిహితం పదం; ఏవముక్తే మయా సమ్యగుత్తరం ప్రబ్రవీతు సః. 3౯ అధ్యా.

ద్ధులయిరి. యజ్ఞాంతమున నిట్టి సంక్షోభము కలుగరాదు. ఎట్టు లేని దీని నివారింపుమా యని ప్రార్థించిన విని భీష్ముండు యుధిష్ఠిరా! నీయజ్ఞమునకు విఘ్నమొదవు నేమో యని సంశయింపకుము. ఆపనిచేయ నెవ్వరికే నశక్యము. యజ్ఞపురుషుఁడగు శ్రీకృష్ణుఁడే దీనిని గాపాడుచుండఁ గొఱంత యేల కలుగును? యుద్ధసన్నాహ మొనరించువారు శిశుపాలపక్షపాతులు. వీరెల్ల శ్రీహరి యించుక యాగ్రహించి చూచిన భస్మరాసులే యగుదురు. శునకములు మదపుటేనుఁగును గాంచి మొఱఁగిన నేమి లాభము ! అని భీష్ముఁడు పలికినపలుకులు కర్ణశూలములైననివిని సహింపనోపక శిశుపాలుం డిట్లుపలికెను. ముదుసలియు వెఱ్ఱివాఁడునగు నీగంగాపుత్త్రుఁ డీయాదవుని భగవంతుఁడు సాక్షాద్విష్ణువే యని కొనియాడెను. ధర్మతత్త్వములు పాండవులును దానునుదప్ప నితరు లెఱుంగరఁట! ఔరా ! మంచిమాటలచే నెల్లరాజుల నవమానించెను. గాంగేయా! ధర్మరాజు నిన్నుఁ జేపట్టి గౌరవమును బోఁగొట్టుకొనెను. రాజులకెల్ల భయము కలిగించితివి. నీకంటె దురాత్మకులుగలరా. రాజశేఖరు లిందున్న వారెల్ల నంతపిఱికిపందలా. కృష్ణుని మహాత్ముఁడని నిరూపించుటకు నీవుచెప్పునుదాహరణములు చూడఁగా నవ్వువచ్చెడిని.

పూతనను జంపుట యొకటి. ప్రాణములేని శకటంబును బడఁద్రోయు టొక్కటి. మద్దిచెట్లను గూల్చుట యొకఁడు. చిన్నపుట్టయంతపర్వతమునెత్తుట యొక్కండు. దానిక్రింద నేడుదినములుంటయు నింక నొక్కటి. వృషభమును వధించుట మఱియు నొకఁడు. ఇవి కృష్ణునిబీరమ్ములని పొగడుచున్న నీనాలుక యీ పాపమునకు ఫలముగా నూఱువ్రయ్యలైనఁగాని యీపాపము

పోవదు. నేను వీనం గొన్నిరియెఱుంగుదు. ఇంతవాఁడు కాఁబట్టియే యీయర్ఘ్యమునకు యోగ్యుఁడయ్యెను. స్త్రీలను గోబ్రాహ్మణుల, నన్నము పెట్టువారిని వధియించుట మహాపాతకంబని పెద్దలు చెప్పుదురు. అం దీగోవిందుఁడు స్త్రీగోవులవధియించెను. నీ వంతకంటెఁ బుణ్యాత్ముఁడవు. కాఁబట్టియే యర్ఘ్యయోగ్యుఁడు హరి యని యుపదేశించితివి. అన్యునింగోరిన యంబను హరించి తెచ్చితివి. కాని ధర్మము నెఱింగిన నీతమ్ముఁడు విచిత్రవీర్యుఁడు దాని వదలిపెట్టెను. జనులు నిందించునట్టి యనపత్యత యనుదోషము నీయందుండఁగా నీవు ధర్మము చెప్పుటయు దాని నీయుధిష్ఠిరుఁ డాలకించుటయు నెంతబాగున్నది? జరాసంధుఁడు మాఱ్కొని పోరాడుచుండఁగా నాతని యాటోపంబు నోర్వఁజాలక పదునేడుమాఱు లీముకుందుఁడు పాఱిపోవ లేదా. అట్టిబ్రాహ్మణభక్తుని జరాసంధుని విప్రవేషంబున భీమార్జునులఁ దోడుగాఁదీసికొని వధియించె. ఇవియేకదా యీగోపాలబాలకుని పరాక్రమములు. ఇట్టిపౌరుషములను భట్టుంబోలి యేలపొగడెదవు? నీ కంతగాఁ బొగడవలయునని యూహగల్గినఁ గర్ణశల్యులాదియైన శూరాగ్రణులుగలరుకదా. వారిం బొగడుచుండుమా. ప్రొద్దుపోవును. అన్యకీర్తనంబు నన్యనిందయు నాత్మస్తుతియు నను నీమొదలగునవి గంగాపుత్రా! యార్యవృత్తములు కావందురు. అని యింకను బలుకనుండఁగా వానిని విని సహింపక భీమసేనుండు రౌద్రాకారుండై యుద్ధోన్ముఖుండయ్యెను. శిశుపాలనిర్మూలనాభిలప్రయత్నము చేయుచుండఁగా నాభీముని వారించి భీష్ముం డిట్లనియె.

ఆర్యా! ఈదురాత్మకుఁడు చేదివంశంబున దమఘోషుండనువానికి సాత్వతికిం దనయుండై పుట్టెను. పుట్టుకతోడనే చతుర్భుజములు లలాటనయనము చూపట్టెను. గాసభరవంబున నేడ్చుచుండఁగా నీతనిజననీజనకులు భయము విస్మయము మనంబులఁ బెనంగొననుండఁగా నొక్కయశరీరభూతం బిట్లుపలికెను. * రాజా! భయంపడకుము. వీని నోరు లేశస్త్రమునను జంపనోపరు. వీనింజక్కఁగాఁ బాలింపుము. ఈతనిమృత్యువొక్కఁడు పుట్టియున్నవాఁడు. అనఁగా రాజు భార్యంగాంచి యామహాభూతంబు మరల దీని నామూలముగా నాసంశయము తొలఁగం బలుకుంగాక యనిరెు. అంత నాభూతంబు మరల నిట్లనిరెు. ఎవ్వఁడు తనతొడపై వీనిఁ గూర్చుండఁబెట్టుకొనఁగాఁ బైరెండుచేతు లడంగునో మూఁడవకన్ను నడంగునో యాతఁ డీతనిం జంపును. అని యాభూతం బంతర్హితంబయ్యెను. అవ్వేల నాజననీజనకులు చూడవచ్చినవారిచేతి కాశిశువు నిచ్చుచుండిరి. ఒక్కనాఁడు రామకృష్ణులు తమమేనత్తను వికృతబాలకుని జూడఁబోయిరి. సాత్వతి సంతోషించి తొలుత బలదేవునిచేతి

---

*చింతాసమ్మూఢహృదయం వాగువాచాశరీరిణీ. ౩. ఏషతే నృపతే పుత్ర శ్శ్రీమాన్ జాతో బలాధికః, తస్మా దస్మా న్న భేత్తవ్య మవ్యగ్రః పాహి వై శిశుం. ౪. న చ వై తస్య మృత్యు ర్వై నకాలః ప్రత్యుపస్థితః, మృత్యుర్హంతాస్యశస్త్రేణ సచోత్పన్నో నరాధిప. ౫. అంతర్భూతం తతోభూత మువాచేదం పునర్వచః. ౬. యస్యోత్సంగే గృహీతస్య భుజావభ్యధికావుభౌ, పతిష్యతిక్షితితలే పంచశీర్షావివోరగౌ. ౭. తృతీయమేతద్బాలస్య లలాటస్థం తు లోచనమ్, నిమజ్జిష్యతియం దృష్ట్వా సోఽస్యమృత్యుర్భవిష్యతి-౭౪. అధ్యాయము.

కాశిశువునిచ్చెను. ఆవల నారాయణునిచేతి కిచ్చెను. కృష్ణ మూర్తి యాశిశువు నెత్తికొనఁగా నెల్లరుంజూచుచుండఁ బై బాహువులు రెండును మూఁడవకన్ను నడంగెను. దాని కాసా త్వతి యద్భుతంబంది యశరీరివాక్యాలం దలంచి తనకొడుకునకు శ్రీకృష్ణునివలన మృత్యువని తలంచి మహాత్మా! నాకుమారుఁడు దుష్పథముచ నీకపకారమొనరించినను క్షమింపవలయును. శతా పరాధములు క్షమింపుము. అని ప్రార్థించిన మురారి యందు లకు సమ్మతించెను. కాన శతాపరాధములు నిండునంతకు వీఁ డవధ్యుఁడు. కృష్ణుఁడు వీనిం జంపువాఁడు. ఆకారణమున నూర కున్నవాఁడఁగాని లేకయున్న నామార్గణములకు వీని నాహుతి చేయకుందునా.

అని వీరిట్లు మాడలాడుచుండ శిశుపాలుండు కాలము తన్నుం ద్వరపెట్టుచుండఁగా శ్రీకృష్ణున కభిముఖుండై గోపాల బాలకా! సమ్మానార్హుఁడుకాని నిన్ను సమ్మానార్హుండని ముదు సలికౌరవుఁడు పురికొల్పఁగాఁ బాండవులు పూజించిరి. ఈపాం డవులు భీష్ముఁడు నీవు నాతో మార్కొని రణమొనర్పుఁడు.అని గర్వించి పలికినపలుకులు విని శ్రీహరి యెల్లరువిన నిట్లుపలికెను. కొంతకాలముక్రిందట మేమెల్లఁ బ్రాగ్జ్యోతిషంబుననుండు భగ దత్తునిపై యుద్ధమునకుం బోయియుండఁగా బాలవృద్ధులు భీతి ల్లఁగా ద్వారకానగరమును గాల్చెను. మఱొక్కతఱి భోజ రాజులు భార్యలతోఁగూడి రైవతకాచలంబునఁ గ్రీడాసక్తులై ప్రమత్తులైయుండఁగా వారల నీతిమాలి వధించెను. వసుదేవుఁ డొనరించునశ్వమేధమునకుఁ బ్రధానభూత మనందగుహాయము నపహరించి విఘ్నముచేకూర్చెను. పాపనిశ్చయుఁడై ప్రభు

భార్యను దనకు భార్యగా సంగ్రహించెను. ఇంతియకాక వానిగ్రా పాపరాధంబులు పెక్కులు చేసెను. మాయత్త నన్ను విశేషించి ప్రార్థించుటంజేసి యీపాపాత్మకుం డొనరించునపరాధశతంబు సైరించితిని. ఇప్పుడు మీయందఱువినుచుండ నాపై నకారణ విరోధంబు సాధించుచున్నవాఁడుకదా. అని పలుకుచుండ శిశుపాలుండు వాక్పారుష్యము మిక్కుటంబుగఁ దోఁపఁ గృష్ణున కిట్లు బదులుచెప్పెను. గోపాలా! నీయనుకంపయు నీయాగ్రహము నింకఁజాలును. మొదటినుండి దుర్గుణప్రియుఁ డవు. తొలుత నాకిచ్చిన కన్యకను రుక్మిణిని గ్రహించి నీవిట్లు పలుకుచున్నవాఁడవా. ఇంచుకంతయు లజ్జలేదా. అని మఱియు బహుభంగుల శ్రీహరిం దిరస్కరించి మాటలాడుచు నింకను దని విసనమి నేమేమో పలుకఁ బూనుచుండెను. ఆయహాహాలకుం దగినభాషణము లాశిశుపాలుని వక్త్రబిలమునుండి నిర్గమించు నంతలో భగవంతుఁడు చక్రమును స్మరించెను. అది సన్నిహిత మయ్యెను. శ్రీహరి రాజేంద్రులారా! శతాపరాధములు క్షమించి తిని. ఇంక వీని క్షమించుట లోకాపకారమగును. *కావున నిపుడే వధించెద ననునంతలో శ్రీహరిభావమెఱిఁగి యాసుదర్శన మా శిశుపాలునికంఠమునకు దేహమునకుఁ గలసంబంధమును వదలిం చెను. ఎల్లరాజులుచూచుచుండ నాతనిదేహమునుండి యొకతే

---

*అధునా వధయిష్యామి పశ్యతాం సర్వమహీక్షితామ్, ఏవముక్త్వా యదుశ్రేష్ఠశ్చేదిరాజస్య తత్క్షణాత్. ౨౧. వ్యపాహరచ్ఛిరః క్రుద్ధశ్చక్రేణామిత్రకర్షణః, స పపాత మహాబాహుర్వజ్రాహత ఇవాచలః. ౨౨. తతశ్చేదిపతేర్దేహాత్తేజోఽగ్ర్యం దదృశుర్నృపాః, ఉత్పతంతం మహారాజ గగనాదివ భాస్కరం. ౨౩. సభా. ౪౫ అధ్యా

జము శ్రీకృష్ణునిలోఁ బ్రవేశించెను. మింటనుండి దేవతలు జయజయనినాదము లొనరించిరి సభ్యులెల్లఁ బరాత్పరునిమహిమమును గొనియాడిరి.

అంతట హరి శిశుపాలుని సంస్కరింపంబంచెను. వాని కొడుకును జేది రాజ్యమునకుఁ బట్టభద్రు నొనరించెను. యాగము నిర్విఘ్నముగను నిరుపద్రవముగను నెఱవేఱెను. నానాగతులగు రాజన్యు లాయుధిష్ఠిరుచే ననుజ్ఞాతులై శ్రీకృష్ణనను ఘతింగొని మర్యాదలొంది తమతమనగరంబుల కేగిరి. భగవంతుఁడు ద్వారవతికింబోవఁ బయనమయ్యెను. ధర్మరాజు పరమేశ్వరు నింకనుం గొన్నిదినము లుండవలయునని ప్రార్థింపఁజాలక యెట్టకేలకు సమ్మతించి ద్వారవతి నుండియును మమ్మిటనున్నయట్లే రక్షింపుమా యని ప్రార్థించెను. గోపాలమూర్తి సుస్మితాననుండై యామాటలకు సమ్మతించి ధర్మరాజు భీతింబాపి తక్కినపాండవులకుఁ జెప్పఁదగుమాటలుపలికి సపత్నులయెడ నెచ్చరిక కలిగియుండుఁడీ యని బోధించి తద్రక్షణమునఁ దానాదృతింబూనియేయుందునని విశ్వాసము పుట్టం బలికి స్యందనము నెక్కి బలరామాదులంగూడి ద్వారవతి కరిగెను. పాండవులు హరిగమనమునకు నిర్వేదమునొందియుఁ దదుక్తులను శిరసావహించి యింద్రప్రస్థపురంబున సుఖంబుండి భగవద్దర్శనమునఁ దర్పరపడుచుండిరి.

మహాశయులారా! రాజసూయమహాయాగము శ్రీకృష్ణావతారతత్త్వమునకు సంబంధముగలదియా యని ప్రశ్నింపక దీనిసారము నాలకింపుఁడు. ఈ రెండింటికింగల సంబంధమే

యత్యుత్తమము. ఈయాగముసాగకున్న భగవత్సేవంగోరి పెక్కు లక్షలవత్సరములు శ్రమంపడుచున్న ప్రాణిద్వయము భూలోకమున నింకను గొంతకాలము నివసింపవలసివచ్చును. అది యుత్తమముగాదు. యమలోకమునుండి పాండురాజు నారదముని మూలమున వార్తనంపునట్లు చేసినదియు భగవంతుఁడే. దాని వలన నెన్నికష్టములు రానున్నను వానిని లెక్కపెట్టక రాజసూయమునసాగించునట్లువా ధర్మరాజునకుఁ బుట్టింపఁజేసినదియు దానికి సోదరులు ధౌమ్యాదులు ప్రోత్సాహకులగునట్లు చేసినదియు నాపరాత్పరుఁడే. కావున నన్నియుఁ "దుచ"లు తప్పక యుండసాగినవి. ఈకథ కర్మము బలవత్తమమైనదని సిద్ధాంతముచేయుచున్నది. కర్మమునఁగాఁ బరబ్రహ్మమేకదా. భగవత్సంకల్పమురవంతయైనఁ దప్పకయుండ నెఱవేఱునన్న సిద్ధాంతమునే మన నీకథబోధించును. జరాసంధుని శ్రీహరి రాత్రికాలమునఁ బోయి యుద్ధమున కీయకొల్పనేల యన్నప్రశ్నమునకుఁ గారణము దత్తమనియే భావింపవలయును. ఇంక శిశుపాలవధప్రస్తావమున నాలుగుమాటలు వ్రాయవలయును.

శిశుపాలుఁడు జయవిజయులలో నొక్కఁడు. ఇది మూఁడవజన్మము. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు తొలిజన్మమనియు, రావణ కుంభకర్ణులు రెండవజన్మమనియు, శిశుపాలదంతవక్త్రులు మూఁడవజన్మమనియు దీనితో వీరికి శాపవిముక్తయయి భగవత్సేవాలాభము కలుగుననియుఁ బ్రమాణముకలదు. శిశుపాలునకు శాపముక్తి కాలము సమీపించెను. ఇంకను క్షణమైన నాతనిం గష్టపెట్టరాదని భగవంతునియూహ. వానిమడియించుటకుఁ గారణ మక్కఱలేదుగాని లోకాపవాదము రాకుండఁ

జేయవలయు ననియుఁ, దన కార్య మితరులకు నుదాహరణము కావలయు ననియుఁ బరమేశ్వరు నుద్దేశము. కావున దానికిఁ దగినట్లు సభాపూజా విధానవిషయ మొక్కఁడు ప్రస్తావమునకు వచ్చునట్లుచేసెను. అందు భీష్ముని ధర్మరాజు ప్రశ్నించుటయు నతఁడు సభాపూజార్హుల నిర్ణయించుటయు నందుఁ గొందఱం జేర్కొని సర్వపూజ్యుఁడు శ్రీకృష్ణుఁడే యని నిర్ణయించుటయు జరగెను. సహదేవుఁ డాయర్ఘ్యమును దెచ్చి యీయ ధర్మ రాజు శ్రీహరిని బూజించెను. ఇంతలో శిశుపాలుని కాలము సమీపించెను. ఆకాలమే యాతని మఱింత పురికొలుపఁగా వాఁడు శాపకాలనియమము ననుసరించి యాక్షేపించెను. కాని ముక్తి చెంతనున్నది. కావున "వర్ణాశ్రమ కులములకుఁ దొలఁగినవాఁడను" మొదలగు పరమేశ్వరార్థ బోధకశబ్దములే దైవికముగాదొరలెను. లోకమును మెప్పించుతలంపున శ్రీహరి యాతని యపరాధము లెన్ని తనయోర్పుం దెలిపి సుదర్శన మును స్మరింప నది యాతనికి వైకుంఠలోక ప్రాప్తిని జేకూర్చెను. ఆశిశుపాలుని తేజస్సు భగవంతునందుం గలిసెను. ఆతేజము శిశుపాలుని తనువునుండి నిర్గమించుట శ్రీహరిం జేరి యా. మహనీయునియందు లీనమగుటయు నెల్లరాజులు చూచిరి. ఎల్ల రాజులకు దృగ్గోచరమై యాతేజ స్సామహాపురుషునియందుఁ గలిసెనని దానిభావము.ఎల యట్లు గనంబడియె? అన్నప్రశ్నము రావచ్చును. ఏజీవునకుఁగాని మరణానంతరము లోకమున నప కీర్తి యుండరాదు. అట్టి యపకీర్తియున్నచో నాతనికి నుత్తమ లోక ప్రాప్తిలేదని యార్యులభావము. 'మరణాంతాని వైరాణి' అన్నదికూడ నార్యసమ్మతమే. శిశుపాలుని తేజస్సు భగవం

తునందుఁజేరుట ప్రత్యక్షముగానిచో నాతఁడు దుష్టాత్ముఁడను భావ మెవ్వరికి మార్పునొందదు. తద్దర్శనానంతర మా భావము మార్పునొంది పుణ్యపూరుషుఁడే. కావున భగవంతుని యం దైక్యమొందెను. అనుభావము వారికిం గలుగకమానదు. దాన నాతనియుత్తమ లోకముల కేబాధయు నుండదు. భగవంతుఁడు తనభక్తులను కాపాడుటకు సర్వప్రకారములఁ బ్రయత్నించును. జయవిజయులకు శాపప్రాప్త్యనంతరము భగవంతునివరము నిట్టిదియే. నాతోవిరోధించిన మూఁడుజన్మములలో నాసేవచేయు భాగ్యము లభించునని. చిరకాలమున కోర్వఁజాలక విరోధులమైనను మూఁడుజన్మములకుఁ దమసాన్నిధ్యము గలుగుఁగదా యనియే వా రానందించిరి. అందుల కిది సుసమయము. కావుననే సర్వేశ్వరుఁడు సుదర్శనమును దలంచెను. అది వారిభవిష్య ద్భాగ్యమునకు సుదర్శనమే యయ్యెను. కావున శ్రీహరి సభలో నొకఁ డాక్షేపించినంతమాత్రమున మాఁగొ-నకయున్న వానిని జంపనగునా యన్నప్రశ్నమున కవకాశ మీచోట లేదు. అది కటాక్షరూపముగాని క్రోధరూపము గాదు. సర్వసముఁడుకదా భగవంతుఁడు. పుణ్యమునందును బాపమునందును సమఫల ప్రదాతయని భావము. అనఁగాఁ బుణ్యాత్ములయందుఁ బక్షపాతముగాని పాపాత్ములయం దాగ్రహముగాని లేదు. ఆగ్రహము చూపినట్లు తోఁచినను ఫలపరిణామమున నది వారికి శ్రేయస్సుగానే పరిణమించును. పాపాత్ములను గ్రమముగా నుద్ధరించి పుణ్యాత్ములనుగా నొనరించుటే భగవంతుని భావమని దీనిసారము. శిశుపాలునిపై నెట్టి యనుగ్రహముకలదో దానిని గనఁబఱచుటయందు భగవంతుఁ డెట్టి

చమత్కృతిం జూపెనో చక్కఁగాఁ బరికించినఁగాని బోధపడదు. ఈశిశుపాల వధకథ భగవంతుని మహిమమును సర్వతోముఖ ముల మనకుఁ దెల్పుచున్నది. భగవంతునితో విరోధించినను ముక్తిగలదు. చక్రవర్తుల నాశ్రయించిన నదిదొరకదు. కావున మనుజుల నాశ్రయింపక పరాత్పరుని దృఢభక్తిమెయి నాశ్రయించిన సకలాపదలను దొలఁగించి తన పాదారవింద సంసేవనము నొసంగెను. ఆకరుణయే ముక్తి దాయకమని నమ్మ వలయును. ఇంకఁ దర్వాతి భగవత్కథల నాలకింపుఁడు.

## సాల్వుఁడు శివప్రసాదంబునొంది ద్వారకపై దండెత్తుట.

* రాజసూయ యాగము పూర్తికాఁగానే కొంతకాల మందుండి పాండవులకు నభయదాన మొసంగి ద్వారకాపురి కరిగి శ్రీహరి కొలఁదిదినములు సుఖముగానున్నట్లు నటించెను. కాని యేదిన మెవరికి విముక్తి ప్రసాదింప వలయునా యని తలపోయుచునే యుండెను. రుక్మిణీ వివాహకాలమున శిశు పాలునకు సాయపడ నరుదెంచినవారిలో సాల్వుఁ డొక్కఁడని యీవఱకే తెలిపియుంటిని. ఆసాల్వున కీలోకమున నుండు కాలము పూర్తికావచ్చెను. కావుననే శిశుపాలునకు నావివాహ మునఁ బరాభవము కలుగుటయు, జరాసంధాదు లాతనిమూల మున నవమతినొంది చనుటయు, నందు సాల్వుఁడుం గూడఁ జేరి యుండుటయు సాగఁగా నందఱు తమతమ పురముల కరిగిరి. కాని సాంబున కాయవమానము మహార్తిని గల్పించెను. దాన

*ఈకథ శ్రీభాగవతము దశమస్కంధము డెబ్బదియాఱవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

నాతఁడు శ్రీకృష్ణుని జయింప నిచ్ఛగలవాఁడయ్యెను. శిశుపాలు డింతకంటె నవమానితుఁడు కాఁగాఁ దత్సహాయుఁడగు వీని కింత యాగ్రహమేల యని యూహించిన నాతనికర్మ మాతనిం బురికొల్పు చున్నదని యెఱుంగక తప్పదు. శిశుపాలుఁ డప్పౌ డూరకుండెను. సాల్వుఁడు మాత్రము హరిని బరాభవింపఁబూనెను. అది తపశ్శక్తిచేఁగాని శక్యముకాదని వానికిం దోఁచెను శంకరు నారాధించి తద్వరమునఁ దానజేయుఁడై హరిపై దండెత్తి జయించి లోకప్రసిద్ధిని గాంచవలయునని యాతనియూహ. దాన వానిమనస్సు మాత్సర్యము నివసింపఁ దావొసంగెను. మాత్సర్య మగ్నిశిఖలమించినది. దానిస్పర్శమున నాతఁడు నిలువ లేకపోయెను. యాదవు లీభూలోకమున నుండఁగూడ దన్న తలంపు గలిగెను. ఆయాదవముగా జగమును జేయుదునుగాక యని యతఁడు సంకల్పించు కొనియెను. ఇంతకన్న దురాగ్రహముకలదా. వాఁ డీరీతినొనరింతునని శపథములు పల్కెను.

* త్వరగాఁ గదలిపోయి యొకరమ్యస్థలమున సమాహితచిత్తుఁడై శంకరు నుద్దేశించి తపం బొనరించెను. శీఘ్రఫలప్రదాతయుఁ ద్వరగా సంతోషించు వాఁడునయ్యు నుమాపతి శ్రీకృష్ణద్వేషి యగుసాల్వునకు వరమీయ రాదనియు నిచ్చువరము ఫలింపకయుండఁ జేయవలయుననియుఁ దలంచి యూరకకుండెను. సంవత్సరముగడచెను. సాల్వుఁడు ప్రతిదినము భూమిధూళి పిడికెడు మాత్ర మాహారముగాఁ గొని యదియు నొక

*సంవత్సరాంతే భగవానాశుతోష ఉమాపతిః ౮. శ్లో. అని మూలము. శ్రీకృష్ణవిద్విషి సాల్వే వరస్య వైఫల్యం మన్యమానోనశీఘ్రం ప్రాదురభూత్. అని వ్యాఖ్య.

పూటమాత్రమే కొనుచు ఘోరనియతిం బూని తపము సాగిం చుచుండెను. తపస్సనఁగా నుపవాసనమనియు, నదియాకర్షణ ప్రయోగమని యెఱుంగవలయు ననియు, నది యెట్టివానినైన నాకర్షింపక విడువదనియు, ఎంతకాలమునకుఁ బ్రత్యక్షముకా కుండిన వాని నియతి దృఢతరము కాదని యెఱుంగవలయునని యు, పెక్కుపర్యాయములు వ్రాసినను మరల నిటవ్రాయ సాహ సించితిని. ఆమంత్రము భగవన్నిర్మితమే. సర్వేశ్వరుఁ డింతమా త్రమాకర్షణ ప్రయోగమును మీఱఁజాలఁడా యన్న నది స్వోక్తివ్యాఘాత మగునుగాన మనుజులవలె భగవంతుఁ డట్టి యపకీర్తికిఁ బాల్పడఁడని యెఱుంగ వలయును. వాఁడిట్లు నిష్ఠ మెయిఁ దపమొనరింపఁగా నెట్టకేలకు నీశ్వరుఁడు సంవత్సరాంత మున సదాశివుఁడు ప్రత్యక్షమై శరణాగతునకు వరమీయఁ గోరి యడుగుమా వరమీయ వచ్చితినని హెచ్చరించెను. సాల్వుఁ డాశంకరునకు సాష్టాంగ నమస్కారముచేసి *దేవదాన వగంధర్వోరగ గరక్షోమానవులకు భేదింప శక్యముగాక యిచ్ఛా నుసార మరిగెడు వాహనము నాకుం బ్రసాదింపుమా యని ప్రార్థించెను. శంకరుఁ డట్లేయగుంగాక యని పలికి మయుం బిలచి యతఁడుకోరినట్లే నిర్మింపుమని తా నంతర్ధానమందెను.

మయుఁ డీశ్వరాజ్ఞం దలందాల్చి కామగంబు నత్యంత విస్తృతంబునుగా సౌభమను నామధేయముగలదానిని లోహ మయముగా నిర్మించి సాల్వున కొసంగి తనయిచ్చం బోయెను.

---

*దేవాసుర మనుష్యాణాం గంధర్వోరగ రక్షసాం, అభేద్యం కామ గం వవ్రే సయానం వృష్ణిభీషణమ్. తథేతి గిరిశాదిష్టో మయఃపరపురంజయః, పురం నిర్మాయ సాల్వాయ ప్రాదాత్సౌభ మయస్మయం. ౭. అని మూలము.

సాల్వుఁ డద్దానిం బరమానందంబునఁ బరిగ్రహించి దానినె క్కెను. అయ్యది తమస్సాంద్రమగుట నితరులకునెఱుంగరాదు. ఎవ్వరుగాని దాని నడంపఁజాలరు. కావునదాని నధిష్ఠించి కొంత కాలమయినను దానిపైనుండి సుఖమనుభవించు ప్రాప్తముకూడ వానికిలేదు; కావున నహంకారమున శ్రీహరిని జయింపఁబూని సేనాసమేతముగా ద్వారవతిపై కరిగి నిరోధించెను. వనముల నుపవనముల మఱియుఁ బ్రాకారాదుల నన్నింటిని బాడుగావిం చెను. సకలబాధలు గల్గించెను. అంతంబోక యంబరమున దాని నిలువంబంచి శిలావృష్టిఁ గురియించెను. దాన నందఱు పీడితు లైరి. దైన్యమొంది శ్రీహరీ! యిదెక్కడి పీడకలిగెను? దీని నెట్లు భరింతుము? అని పరమేశ్వరుం బ్రార్థించిరి. శరణు శర ణని వేఁడిరి. ఆవిధ మెఱింగి ప్రద్యుమ్నుఁడు సకలాస్త్రపాణియై యెల్లరకు నభయమొసంగి స్త్రీబాలవృద్ధులభీతిని బాపి యుద్ధము నకు బయలువెడలెను. ప్రద్యుమ్నుఁడు రథారూఢుఁడై మీన కేతన మలరఁ బ్రయాణమయ్యెను. ఆతనిబలములు వెనుకొని యెను. గదుఁడు భానువింద సాత్యకిప్రభృతులు సకలశస్త్రా స్త్రయుత రథారూఢులై నడచిరి. ప్రద్యుమ్నరథంబు మించి సాత్యకి ప్రభృతులు సాల్వునిసేనల మార్కొనిరి. పోరు ఘోర మయ్యెను. అది సంకులసమరముగాఁ బరిణమించెను. సాల్వుఁ డాసంగరమును గాంచి మాయంబన్ని యాదవసేనల నేలకుం దెచ్చెను. ఆవిధమెఱింగి ప్రద్యుమ్నుఁ డాతనిమాయాబలంబు నెల్లమాయంజేయుచు నితాంతవేగంబున బాణంబులం బ్రయో గించి యాతనిసేనలఁ ఖరిమార్చుచుండెను. వెండియుఁ నిరువదేను బాణముల నారింగూర్చి యాకర్ణాంతముగలాగి సాల్వునిసేనాధి

పతి నొప్పించెను. సాల్వు నొక్కబాణంబున నొవ్వనేసెను. ఆతని సారథుల నందఱిఁ బదిపదిబాణముల నొప్పించెను. వాహనముల మూఁడు మూఁడంబకముల నొంచెను. ఆప్రద్యుమ్నుని మహా కార్యమును గాంచి యుభయసైనికులు పొగడిరి.

సాల్వునివిమాన మత్తరుణమున నొకప్పుడు బహురూప ములుగను, ఒక్కప్పు డొక్కరూపముగను గనంబడుచు శత్రు వులకు నూహింపజాల నట్లుండెను. ఒక్కతఱి నది భూమిపైనుం డును. మఱొకప్పు డది యాకసంబునం గనంబడు. మఱొక్క సమయమునఁ బర్వతశిఖరమున వెలయు. ఇంక నొక్కపుడు జల ములం దోఁచును. అలాతచక్రమువలె నాయానము నిలుకడ లేక యలరుచుండెను. ఎందెందు నాసౌభరము మెలఁగునో యందందు సాల్వుఁడు బాణవర్షము కురియించుచు సైనికుల నొప్పించుచుండెను. ఆబాణము లగ్నిశిఖోపమానములై యాశీ విషములభంగి భీతిని గల్పించుచుఁ బరఁగి పరులఁ బొలియించు చుండు. ఇట్లు సాల్వుఁడు తత్సైనికులు శరవర్షములం దమ్ముఁ బీడించుచున్నను యదువృష్ణి భోజాంధకులు తమతమ రణరంగ మునువదలి పాఱిపోవక భీతినొందక ధీరులై పోరాడుచుండిరి. అంత సాల్వుని మంత్రియగు ద్యుమంతుఁడు ప్రద్యుమ్నునిచే మున్ను నొచ్చియున్నవాఁడు గావున నుద్ధతుఁడై గదం ద్రిప్పి యాతని నొప్పించెను. ఆవ్రేటున నాతనివక్షస్థలము బ్రద్దలు కాఁగా నాతఁడు సోలెను. ఆత్తఱి దారుకపుత్త్రుఁడగు నాతనిసా రథి రణాంగణమునుండి యాతనిం దొలంగం దోలుకొనిపోయి యాపదనుండి కాపాడెను. ముహూర్తమాత్రమున నతనికి విస్మృతి తప్పఁగా సారథిం గాంచి సూతా ? రణాంగణము

నుండి నన్నుఁ దొలఁగించుట తగినపని కాదు. ఇట్టి యసంగత కృత్యము నేలచేసితివి? యదువంశమునఁ బుట్టినవాఁ డెప్పుడేని రణాంగణమునుండి వెడలిపోయినట్లు వింటివా? షండభావము గల నీచేఁ దొలఁగింపఁబడిన నిర్భాగ్యుఁడనగు నేనుదక్క నింకె వ్వఁడే నీవలె కుండినట్లువింటివా? నాతండ్రులగు రామకేశవు లను గలిసికొనినపు డేమని మాటలాడుదును? యుద్ధధర్మమును విడనాడితివా వత్సా యనివారు ప్రశ్నించిన నేఁజెప్పఁదగినదేమి? నాసోదరపత్నులీవార్త నాలకించి నవ్వుచు స్పష్టముగా నన్నుం జూచియే నిందింతురు ? వీరా! నీవేల యుద్ధరంగమున షండతం బూనితివన నేనేమని బదులిడుదును ? ఆయుష్మంతుఁడా! యుద్ధధర్మముల నెఱింగియే యిట్లొనర్చితిని. సారథి యాపత్తు నందున్న రథికుని గాపాడవలయును. అట్లే రథికుఁడును గష్ట ముల పాలగుసూతుని గాపాడవలయును. అనునీయుద్ధధర్మము నెఱింగియే నిన్నీరణభూమినుండి తొలఁగించితిని. పరుఁడు నిన్ను గదచే నొప్పింప నీవు మూర్ఛిల్లితివి. ఇట్టి నిన్నుఁ గాపాడుట నాకృత్యము. ఇదియే రణనియమములయందుఁ బ్రధానమని యెఱింగియే యిట్టులొనర్చితిని.

* అని సారథిపలుక నేమియు వాని నాక్షేపింపఁజాలక యాచమించి సన్నద్ధుఁడై కార్ముకమును సారించుచు సారథీ! నన్నునొంచిన ద్యుమంతునిచెంతకు నరదముసాగింపుమా యని ప్రద్యుమ్నుఁడు హెచ్చరించెను. అప్పు డాద్యుమంతుఁడు తన సైన్యముల నుఱుమాడుచుండెను. అట్టి తనపగతుని, మార్కొని

*ఇది డెబ్బదియేడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. గ్రంథ నామ మద్దియే.

ప్రద్యుమ్నుఁ డెనిమిదినారాచముల నొప్పించెను. నాల్గు బాణములగుఱ్ఱములను, ఒక్కబాణమున సారథిని, రెండుబాణముల ధనుఃకేతువులఁ గూలనేయుచు వాడిబాణమున నొక్కంట వాని శిరమును దెగనేసెను అత్తఱినే గద సాత్యకిసాంబాదులు చెలరేఁగి సాల్వునిబలములను నానాశరములం బరఁగించి వారి కంధరములు ఛేదించిరి. వారిదేహములు కంఠములవెంట సాగర జలములంబడియెను. సాల్వునిసేనల బాణములచే యాదవ సైనికులును మడసిరి. ఇట్లుగా నాయుద్ధము తుములము నుల్బణముగా నిరువదియొక్కదినములు సాగెను.

ఆసమయమున శ్రీకృష్ణుఁడు రాజసూయయాగమును జూడఁబోయి దానిని బూర్తినొందించి యాదవులనెల్లం బంపి తా నందు గొన్నిదినములుండెను. కురువృద్ధుల యనుమతినొంది ద్వారకాపురమునకుం బ్రయాణముచేయఁబూని శకునము లతిఘోరములుగాఁ గానరాఁగాఁ ద్వరపడి ద్వారవతి కరిగెను. దారుకా! నే నిటబంధుమిత్రసంయుతింగోరియుండఁగా శిశుపాల పక్షీయులు పురమును ధ్వంసముచేసియుందురు. అనుచు ద్వారవతిచెంతకరిగి సాల్వునివిమానమును యుద్ధమగుచుంటయుం గాంచి దారుకా! త్వరగా సాల్వునిచెంతకు రథమునుదోలుము. త్వరపడి యుద్ధ మొనరింపవలయు. సాల్వుఁడు మాయావిశారదుఁడు. అనిపలుకుచుండ దారుకుఁడు సత్వరమే యారథమును దోలెను. యుద్ధరంగమున కరుదెంచుగరుడధ్వజమును దొలుత నందఱుం గాంచిరి. హతప్రాయబలేశ్వరుఁ డగుసాల్వుఁ డాకృష్ణునిం గాంచి భయంకరనాదముగలశక్తిని దారుకుపైఁ బ్రయోగించెను. అంబరమునుండి మహోల్కవలె వచ్చుచు భీకరనాద

మున దిక్కులఁ బ్రతిధ్వనింపఁజేయు నాశక్తిని గాంచి శ్రీకృష్ణుడు నడుమనే దాని శతధా ఛేదించెను. సాల్వునిబదాఱుబాణముల నొప్పించి యాకసమున విహరించు నాసౌభమును సూర్యరశ్ములం దెగడు బాణముల నొప్పించెను. సాల్వుఁడు నాగ్రహించి శౌరిసవ్యబాహువును దీవ్రనారాచమున నొప్పింపఁ దచ్చాపమాహస్తమునుండి క్రిందఁబడియెను. ఆకృత్య మత్యద్భుతముగాఁ గనంబడెను. ఆరణమును గాంచు భూతములన్నియు హాహాకారములు చేయుచు నిదేమి యాశ్చర్యమని చూడసాగెను. సాల్వుఁడు భయంకరసింహనాద మొనరించి జనార్దనుం గాంచి యిట్లుపలికెను. మూర్ఖుఁడా! నామిత్రుని భార్య నపహరించితివి. సభలో నాసఖునిం జంపితివి. ఆనిన్ను నిశితశరములఁ బునరావృత్తిశూన్యమగుపదమునకుం బంపెదను. చక్కనై నిలువుము. అని ప్రల్లదములాడెను.

శ్రీహరి యానీచుఁ డాడుబీరముల విని మందమతీ! వృథావికత్థనములాడెదవు. అంతకుఁడు చెంతనుండుటం దెలిసికొనఁజాలకున్నాఁడవు. శూరులు పౌరుషమును బ్రదర్శింతురుగాని బహుభాషణములు పలుకరు. అని పలుకుచుఁ దీవ్రవేగముగల గదచే నాతనిజత్రుదేశమును లక్షించి నొంచెను. దానవాఁడు రక్తమును గ్రక్కెను. సాల్వుఁ డంతలో నదృశ్యుఁడయ్యెను; మఱియొక్కక్షణమున నొకదూత యరుదెంచి శ్రీకృష్ణునకు నమస్కరించి స్వామీ! వసుదేవుని సాల్వుఁడు చెఱఁగొనిపోయె నని దేవకీదేవి మీకెఱింగింపుమనియె. అనిపల్కి యూరకుండెను. ఆప్రియవాక్యము నాలకించి మానుషప్రకృతి నొంది విమనస్కుఁడై తండ్రిపైఁ గలప్రీతిచే నిట్లుపల్కెను.

ఏమిది ! బలరాము నెట్టు లోడించి నాతండ్రిని సాల్వుఁడు కొనిపోయెను ? బలవత్తరము విధియనుట కీయుదాహృతి యొక్కటియే చాలును. అని చింతించుచునంతలో సౌభవిమానము తోఁచెను. అందుండి సాల్వుఁడు వసుదేవునివంటివ్యక్తిని గొని వచ్చి కృష్ణా ! నీవెవ్వనికై జీవించియున్నాఁడవో యావసుదేవునిం దెచ్చితిని. మూర్ఖుఁడా! నీవు చూచుచుండ నీతనిం బొలియించెద. శక్తుఁడవేఁ గాపాడుమా. అని ప్రల్లదములాడుచు వాఁడు మాయావిగావునఁ గృతకవసుదేవునిఖడ్గమునఁ దలదెగునట్లు ఛేదించి సౌభము వియన్మార్గముపోఁగాఁ దా నదృశ్యుఁడయ్యెను. ముహూర్తకాలము శ్రీహరిదుఃఖించుచుండి తనవారు తెలుపఁగాఁ దెలివొంది యది మయప్రతిపాదితమాయగా నెఱింగెను. అంతలో దూతయు శిరస్సు నదృశ్యము లయ్యెను. అది స్వప్నముగా భావించి యంబరముననున్న సౌభమును జూచెను. అంతలోఁ గొందఱు మహర్షులరుదెంచి విమోహసాగరమగ్నుండగు జనార్దనుం గాంచి మహాత్మా! సర్వబ్రహ్మాండములయందు సంసారసముధికదుఃఖము లంబడుచు దాని దరిఁగానక పరితపించువేళ నిన్ను స్మరించి వానిఁ దరింతురు. అట్టిమహానుభావుండవు దివ్యరూపుఁడవునగు నీవు దుఃఖము లొందుటన విడంబనము కదా. అని వినుతించి వా రదృశ్యులైరి. అంత హరి ప్రకృతి విడనాడి నిర్మలాంతరంగుఁడై యనూనతీవ్రాంబకముల నంబరమునుగప్పి యాసాల్వునిమౌళిరత్నమును గోదండమును గవచమును ఛేదించెను. అంతట మానసకృష్ణమూర్తి గదనుద్రిప్పి వైవగా నాసౌభము చూర్ణమై సాగరజలంబులం గలిసిపోయెను.

దాన సాల్వుఁడు విగతతేజస్కుఁడయ్యెఁ బోలివాని పరాక్రమంబున గదాపాణియై యేతెంచినహరి యాతనికరమును క్షణమాత్రమునఁ ద్రుంచి చక్రమున నాతనిం బొలియించెను. అంత నాతనిబలముల హరిబలములు నిశ్శేషంబు గావించెను.

ఆర్యమహాశయులారా! ఈకథయందొక్క విశేషము గలదు. దానినిమాత్రమే వ్రాసెద. మచ్చరముగలసాల్వుఁడు శివకేశవులకు భేదములేదని యెఱుంగక శివు నాశ్రయించెను. శీఘ్రసిద్ధిప్రదాతయయ్యు నాపరశివుఁ డొక్కసంవత్సరముదనుక ప్రత్యక్షము గాకయుండెను. శ్రీకృష్ణద్వేషికదా వీఁడన్న భావము చేతనే యని 'నాశు తోష ఉమాపతిః' అనుచోఁ దెలిపినటులే యెఱుంగవలయు. తుదకు వానివరమును దీర్ప దానవశిల్పియగు మయుని నియోగించెను. సాల్వుఁడు వరమడుగునపుడు దేవ దానవ రాక్షస గంధర్వోరగ మానవులకు నభేద్యంబగుదానిని వాహనము నిమ్మనియె. దాని నలవరించి యిమ్మని మయున కాజ్ఞాపించెను. అట్టివిమానమును హరి నాశనముచేసి వానిం జంపెను. కనుక శివునిశక్తి యలంతి యని కొందఱు మహాత్ము లాక్షేపింతురు. కాని యయ్యది విశేషముగాఁ బొరపాటు. ఏలయనఁగా హరివంశమున. ౭౮ అధ్యాయమున

శ్లో. "యథా మైనాకమాశ్రిత్య తపస్త్వమకరోః ప్రభో,
తథా మమ వరం కృష్ణ సంస్మృత్య స్థైర్యమాప్నుహి. ౩౭
అవధ్యస్త్వ మజేయశ్చ మత్తశ్శూరతర స్తథా,
భవితాసీత్యవోచం యత్తత్తథా న తదన్యథా." ౩౮

అని శంకరుఁడు శ్రీకృష్ణునకు వరమొసంగెను. ఆవరదానము వ్యర్థము కాదుకదా. కావుననే శంకరువరము కృష్ణుని బాధింపఁ జాలకపోయెను. ఈవ్యక్తులకు రెండింటి కభేదముగదా.

మఱియు శ్రీకృష్ణుఁడు సాల్వునిచే వ్రేటుపడి తనకోదండమును జాఱవిడుచుట శివుని వరమును మన్నించుటకే యని యెఱుంగఁదగు. సాల్వుఁడు మాయచే వసుదేవునిం గల్పించి బంధించినఁ గాంచి హరి దుఃఖించుట శివునివరమున నించుక సాల్వుఁ డానందింపనీ యనియేకాని సర్వజ్ఞున కీపాటిమాయ తెలియకపోలేదనియుఁ దెలియందగును. రామావతారమున నాగపాశబద్ధుఁడు కాలేదా. అవియన్నియు నాయామంత్రప్రభావములను మన్నించుటకే యని తెలిసికొనవలయునేకాని వాని శక్తి భగవంతునిమించెనని తలంచు టజ్ఞానముననే యనుట నిశ్చితము. ఇఁకఁ దర్వాతికథల నాలకింపుఁడు.

## దంతవక్త్రుని హరి పొలియించుట.

*సాల్వుఁడు లోనగువా రాఁయుద్ధమున విశ్రాంతిని బుచ్చుకొనఁగా వారందఱు తనకు మిత్రులు గావునఁ బారలౌకిక క్రియ లవ్వారి కొనరించి దంతవక్త్రుఁడు మిగుల భయంకరాకారముంబూని గద కేలందాల్చి రభసమున నరుదెంచి హరి నొక్కపెట్టునఁ బొలియింతునని యూహించుచు వచ్చుచుండఁగాఁ గాంచి శ్రీహరి రథము నవలీల వదలి గదాపాణియై విరోధి కెదురుగం బోయెను. వాఁ డట్టహాసంబు గావించుచు

* ఈకథయుం శ్రీభాగవతము ౧౦ స్కం॥ డెబ్బదియెనిమిదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగందగు.

గదను ద్రిప్పుచుఁ గృష్ణా! నీవు నాయదృష్టవశంబున నేతెంచితివి. నాదృష్టిపథమునఁ బడితివి. మిత్రద్రోహివి. కావున మాతులేయుండవని విడువఁజనదు. వజ్రకల్పమగు నీగదాప్రహారమున వధించెదను. దాన మిత్రులఋణమునుండి విముక్తుఁడ నగుదును. బంధురూపుఁ డగుపగం జంపిన నౌషధముచే దేహగతమగు వ్యాధిని దొలఁగించుకొన్నట్లుగ నుండునుగదా. అని పలుకుచు నాగదాయుధమును గిరగిరం ద్రిప్పి బిట్టు గొట్టెను. ఆగదాఘాతమున కించుకంతయు నాహరి చలింపఁడయ్యెను. వెంటనే కౌమోదకియును తనగదను ద్రిప్పి తలపగులునట్లు వైవఁగా వాఁడద్దానిస్పర్శమున నోట నల్లం గ్రక్కుచు గిరగిరం దిరిగి క్రిందఁబడి తన్నుకొనుచుఁ బ్రాణములం బాసెను. *ఆతనితనువునుండి సూక్ష్మమగు తేజస్సొకండు వెడలివచ్చి శ్రీకృష్ణుని యందుఁ గలిసెను. చూచువా రీయద్భుత మేమని యూహింపఁ జాలరైరి. ఆతనిసోదరుం డగ్రజునిపాటు గాంచి విదూరథుం డను తదనుజుండు కరవాలహస్తుఁడై చర్మము వేఱొకచేతం బూని హరిపై కురుకు దేరఁగా హరి తనసుదర్శనము నాతని పయికిం బంపెను. అది వానిశిరస్సుమాత్రము గ్రహించి కళేబరమును ద్యజించెను.

ఇట్లు శ్రీహరి శిశుపాలసాల్వదంతవక్త్రవిదూరథాదులం బొలియించి సమరాంగణమునుండి మరలెను. దేవదుందుభులు మ్రోసెను. పుష్పవృష్టి గురియించి దేవతలు హరి వినుతించిరి.

---

* తతస్సాత్త్వతమంజ్యోతిః కృష్ణమావిశదద్భుతమ్, పశ్యతాం సర్వభూతానాం యథా చైద్యపతేర్నృప. అని మూలము.

అచ్చర లాడిపాడి శ్రీహరిని సేవించిరి. అంత నాపరాత్పరుండు ద్వారకానగరంబుం బ్రవేశించి పౌరుల కానందమును గల్పించి నిజసౌధంబుం బ్రవేశించి భార్యామణుల కింతింతయనరాని సంతసమును గల్పించి తన్నాశ్రయించినవారికెల్ల భీతింబాపి యభయదానం బొసంగి సుఖంబుండెను. జయవిజయులశాపములు దంతవక్త్రునిమృతితోఁ దొలఁగెను. వారెప్పటియట్ల వైకుంఠమున ద్వారమున నిలిచి భగవంతుని సేవించుకార్యమున నప్రమత్తులై యుండఁగలరు. ఎవ్వారేని భగవంతుని దెలిసియుండె, తెలియకయుండె సేవించినను, అచిరకాలముననో చిరకాలముననో తత్సేవాఫలము నొందఁగలరు. విధిమంతముగా నొనరించు పూజాదికము సత్ఫలము నిచ్చును. అవిధిగా దాని నొనరించినను ఫలశూన్యము కాదుగాని పూర్ణఫలము నొసంగఁజాలదు. కాని విధిమంతమగు నర్చనాదికము చేయునవకాశమును గల్పించును. దాన నాతఁ డప్పనిని జక్కఁగ నెఱవేర్పఁజాలును. దానిచే భగవత్కరుణకుఁ బాత్రుఁడగును. అదియే ముక్తిసోపానముల నెక్కింపఁజాలును. కావున భగవన్నామస్మరణపూజనధ్యానాదులు విధిగనొండె, అవిధిగనొండె. ప్రతిమానవుఁడు నోపినకొలఁదిని శ్రీకృష్ణపరమేశ్వరు నమ్మి యథాశక్తి భజింపవలయును. అంతమాత్రముననే యాపరమేశ్వరుఁడు తృప్తినొందును. అందును గలికాలమున నెంతయల్పకాలము సేవించినను భగవంతుఁ డంతమాత్రమున ననంతానందసాగరమున నోలలాడును. ఏవిధమునఁగాని కలికాలమునభక్తిలేశముకూడ నుండుట కష్టమగుట నిట్టి యిక్కట్టుకాలమున నూటి కొకప్రాణియైనఁ

గృష్ణాయని తలంచిన నాపరమేశ్వరుఁడు సుప్రసన్నుఁడగుననుట నిక్కము. అట్టిభక్తుని పరిపాలింప సర్వదా సంసిద్ధుఁడై

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అన్నతనప్రతిజ్ఞను నెఱవేర్ప నడుముకట్టుకొని యుండు ననుట సత్యము. కావున నట్టిభగవంతుని సేవింపవలయును. అదియేతరణోపాయము. అదియే దీనమందారసురభూజము. ఇఁక నీప్రకరణమును సమాప్తినొందించుచుఁ బరమేశ్వరస్తుతిని వ్రాసెదను. దానిని బఠింపుఁడు.

శ్లో. "యావన్న మే నరదశా దశమీ దృశోఽపి
రంధ్రాదుదేతి తిమరీకృతసర్వభావా,
లావణ్యకేళిభవనం తవ తావదేతు
లక్ష్మ్యాస్సముత్క్వణితవేణుముఖేందుబింబమ్. ౩౮

శ్లో. అమూన్యధన్యాని దినాంతరాణి
హరే త్వదాలోకనమంతరేణ,
అనాథబంధో కరుణైకసింధో
హాహంత హాహంత కథం నయామి. ౪౧

శ్లో. అగ్రే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీ
మన్యాసు దిక్ష్వపి విలోచనమేవ సాక్షీ,
హాహంత హస్తమథ దూరమహో కిమేత
దాసీత్కిశోరమయమంబ జగత్త్రయం మే. ౬౦

శ్లో. చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనమ్,
అధరం మధురం వదనం లలితం
చపలం చరితన్ను కదానుభవే." ౬౧

(శ్రీకృష్ణకర్ణామృతము, ౧ ఆశ్వాసము.)

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బరమేశ్వరత్వప్రదర్శనమను
తొమ్మిదవప్రకరణము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1928.